వశతఁ గృశించుతండ్రిఁ బితృవత్సల కానఁగ రాఁగదయ్య యీ
ర్వి శమదమాదిసద్గుణగరిష్ఠత నీసరి గారు మానవుల౯. 107

క. భీకర మమితవినష్టశ్రీకరము గరీంద్రహస్తశీకర మురుద
ర్వీకరము గాననము ఫ్రుత్రాకరము మృగాకరము భరము చరియింప౯. 108

వ. మఱియును. 109

లయగ్రాహి.

ఘూకము సముచ్ఛ్రితమధూకము భయంకరశమీకము మహాద్రుపదనేకము జలన్ని
ర్మోకము సమావృతవనౌకము ప్రభూతరుతకాకము ద్వీపివ్రజసమీకము గరీంద్రో
ద్రేకము మహాద్విపదనీకము భుజంగయుతలోకముఁ బ్రచంక్రమణకోకము విరహ్యా
లోకమురుకాననము నోకముగఁ జేసి యిటు శోకముల ముంచి జనలోకము గృశింప౯.

సీ. కటకటా కంటకోత్కటకుశోత్కరములు, పాదలు మవ్వంపుఁబూఁబోదలె నీకు
నుష్ణకరోష్ణకరోచ్ఛాదితాశ్మము, లబ్జపైన పఱుపులే పట్టి నీకు
ననువొంద మంగళహారతు లొసఁగెదు, గోతులే కోఁతులు కుఱ్ఱ నీకు
దుష్టచేష్టాప్రతికృష్టాశరుల కోడిగములు నిద్రపుటూడిగములె నీకుఁ

గీ. బాయఁడు తోలంగుఁడని బరాబరులు సేయు, బంట్లై కడుదుండగపు టెల్గుబంట్లు నీకు
డంబుమీఱిన మణిఖచితంబు లైన, గృహములే నిండితపుగొండగుహలు నీకు. 111

క. వినుతగుణ నీకుఁ దశవేశ్మనివాసముఁ గూర్చెఁ గడు నసాధ్యము గలదే
విను శర్కర మెసఁగిననోటను చేదు భుజింపఁజేయు టక్కటవిధికి౯. 112

సీ. ఘనశివాలాపము ల్విని సంతసిలు నీవు, ఘనశివాలాపము ల్వినియె దింక
మావుల నెక్కి క్రుమ్మరు నీవు పండ్లకై, మావుల నెక్కి క్రుమ్మరియె దింక
గోపురంబులనీడఁ గూడియుండెడి నీవు, గోపురంబులనీడఁ గూడె దింక
స్వర్ణోటజంబులఁ జరియింపఁ దగు నీవు, పర్ణోటజముల పాల్పడియె దింక

గీ. నాకులమొకించుకయు లేక రాకుమారు, లెలమి సేవింపఁ బెంపు వహించు నీవు
నాకు లాగిరాల భయదప్రచారవార, మలమికొనఁ గంపము వహింతు వనపు యింక

ఉ. నీముఖచంద్రమండలవినిర్గతసుస్మితకౌముదీరుచి
స్తోమము నీమృదూక్తిపరిశుద్ధతయున్ భవదంగకస్ఫుర
చ్ఛామలిమం ద్వితీయజలజాతవిలోచనసౌష్ఠవంబు శ్రీ
రామగుణంబు గొన్న మునిరాజియు మోహము నొందకుండునే. 114

క. వాత్సల్యమహిత నిను సాంవత్సరికులు దొల్లి చక్రవర్తి వగుదు నా
నత్సముని వై చతుర్దశవత్సరములు నడవిఁ దిరుగవలసెనె నీకున్. 115

క. అన్న సుమిత్రానుత మీ, యున్న ధరిత్రీసుతాసహాయత వనమం
దున్నయపు డేమఱక కొలు,వ న్నిరిగెదవు ధైర్యవంతుఁడ వగుటన్. 116

వ. అనిపలికి కోడలిం జేర్కొని. 117

క. రాలచ్చి విడచి యేడుకు, జాలవజీయుండు గ్రాల జాలనునిప్పు
ట్లాలను విహరింపను జవ,రాలా నీ వేమి పేదరాలవె చెపుమా. 118

వ అని మఱియుం బరిభ్రమితాంతరంగుం డగునమ్మహీకాంతుండు. 119

ఉ. వేగము గాఁగ నేఁగురఘువీరుని తేరగపాటు లేమిఁ జిం
తాగళితాంతరంగగతిఁ దద్రథకేతనదీప్తిఁ గాంచుఁ ద
చ్చీఁ గనరామి వేదనను జెంది తదుద్ధతధూళిఁ గన్గొను
న్రాగము మీఱఁ దద్రథపరాగము గానక వంతఁ జేడ్పడున్. 120

గీ. మఱియుఁ బెక్కుగతుల నమ్మనుజనాథుఁ, డగ్రభార్యావరసతీసహాయుఁ డగుచుఁ
జిత్తమున నుత్తలము గడుఁ గ్రొత్తసేయ, నుల్లముడుకఁ బ్రలాపించుచుండునంత

మ. ఉడుగుం డేటికిఁ బౌరులార వనవాసోద్యోగమంచుం గడు
న్నుడువ న్మానక వెంబడింపఁగ సుమంత్రుం డెంతయు న్స్వాంతఁ బెం
పడరం జయ్యనఁ దేరు దోల రఘువంశ్యస్వామి శ్రీరాముఁ డ
ప్పు డరణ్యంబున కేగె సానుజుఁడు భూపుత్త్రీసమేతంబుగన్. 122

చ. చను నెడ సౌరభంబు వెదచల్లఁగఁ జల్లనిగాలి తమ్మెదు
ర్కొనఁ గొనలేనిహర్షమునకు న్నిలయం బగుదాని మీనపా
కనిబిడపుండరీకజలకాకబలాకసమీకచంచరీ
కనినదకోకకోకనదకమ్రతగం బగుదాని నెంతయున్. 123

ఉ. పావనచారుజీవనశుభం బగుదాని సమస్తజంతుసం
జీవన మైనదాని మునిసేవిత మైనతటంబుదాని రా
జీవనటన్మధువ్రతవిశేషరుతాకవితోల్లసద్ద్రువీ
చీవృత మైనదాని సరసీమణి నుత్తమసాతరంగిణిన్. 124

వ. కనుంగొని తత్తీరలతాకుంజపుంజంబు లనుజునకుం జూపుచు రాముండు వెండియును.

సీ. అవలోకనము సేయు కువలయానందంబు, లీవనతమసానదీవనములు
చూడు ప్రవాళసంశోభితంబులు దగు, నీవనతమసానదీవనములు
గనుఁగొను మెంతయుఁ గమలామనోజ్ఞము, లీవనతమసానదీవనములు
నుదతి వీక్షింపుము సుస్వాదుఫలదంబు, లీవనతమసానదీవనములు

గీ. కుసుమమృదుగాత్రి విపులసారసహితములు, తెలియు మీవనతమసానదీవనమ్ము
లనుచుఁ గాంతకుఁ దెల్పుచు నచట విశ్రమించెఁ బౌరసుమంత్రసౌమిత్రు లలర.

వ. అంత.

ఆ. కాంతతోడ భయద కాంతారమున నిజాన్వయుఁడు తిరుగఁ జూడ వచ్చునెట్టు
లని యద్భుతుఁడయ్యె నవఁ గ్రుంకెఁ బద్మినీకాంతుఁ డంశుమాలి కాంతిమాలి.

క. అట్టియెడఁ దమమనంబుల, ముట్టిన శోకాంధకారమునకు మెఱుంగు
ల్వెట్టి తమ మడరఁ జీకటి, చెట్టులక్రియఁ దోఁచెఁ దరువిశేషములెల్లన్. 129

వ. ఇట్లు నిశాసమయంబగుటయుఁ గృత్యంబులు దీర్చి తత్తరంగిణీపయఃపానంబుం
బరమానందంబు నొందుచు లక్ష్మణసంకల్పితం బగుపర్ణపర్యంకంబున [illegible]
ప్రియాసహితుండై సుఖనిద్రితుం డయ్యె సుమంత్రుండును దక్కిన పౌరలో[illegible]
దృణపాషాణపర్ణ నిజబాహుదండంబులు శయనోపధానంబులుగా శయనించి యు
న్నంత నంతరాత్రంబున నరేంద్రుండు మేల్కని సీతాలక్ష్మణసుమంత్రుల ప్రబో
ధించి వారలతో రహస్యవచనంబుల నిట్లనియె. 130

చ. మనము సమస్తపౌరజనమాన్యులమై యడవి న్వసించిన
న్ఘనమున నొందు గాఁగ ననుమానము నొందెదుఁ గైక గాన ని
వ్వనమున నీరి డించి వెనువంచన నేగుద మొందుచోటు కీ
జనులు నయోధ్య కేగుదురు సత్వరులై మనచొప్పెఱుంగమిన్. 131

వ. అని తనమనోనిశ్చయంబు వారల కెఱింగించి యప్పుడు. 132

క. దీర్ఘాధ్వరులు పౌరులు, గాఢతరసుషుప్తి నున్నకాలమున రథా
రూఢుం డయి రాఘవుండు ని, గూఢస్థితి నేగె నంతఁ గొంతతడిలోన్. 133

చ. తొగరగు తోఁడు దమ్ములకుఁ దోడు నివంబులఁ దోలువాఁడుఁ గొ
దొగలకు సూడు జక్కవలదోయికి నెంతయుపింతనెయ్యపుం
బగ లొనరించువాఁడు గదుఁ బచ్చనితేజులవాఁడు వేడుకం
బగ లొనరించువాఁడుఁ గనుపట్టెను తూరుపుమెట్టుపట్టునన్. 134

చ. పురజను లంత మేలుకని భూతనయాపతి లక్ష్మణాగ్రజుం
డరిదముతో సుమంత్రయుతుఁడై తమ వంచనఁ బాసిపోవుటం
బురపురఁ బొక్కి పంక్తిరథపుత్త్రుఁ డయోధ్యకుఁ బోయెనంచు నేఁ
బురమున కేగుదెంచిరి ప్రభూతఘనార్తరవంబు లిచ్చుచున్. 135

క. విపరీతస్థితి మెలఁగక, నపగతరోషుఁ డయి ప్రజల నందఱఁ బ్రజలా
గృపఁ బ్రోచినక్రియఁ గాచిననృపతిం బాయంగనేర్తురెట్లు జనంబుల్. 136

ఆ. ఇట్లు వచ్చి మిహిరహీనాంబరమువోలె, రామరహిత మగుపురంబు సొచ్చి
యేమిసేయు దింక నెవ్వరు మనకని, క్రన్నుచు వగచుచుండి రంత నచట. 137

మ. నిజమాయాపిహితాంతరంగులగుచు న్నిద్రాసమాసక్తిఁ బౌ
రజనంబుల్ శయనించియున్నతఱి శ్రీరాముండు గోత్రాసుతా
నుజసంయుక్తముగా రథస్థుఁడయి మాన్యుండౌ సుమంత్రుండు వా
యుజవస్ఫూర్తి హయంబులం దఱుమ నయ్యుగ్రాటవిం బోవుచున్. 138

ఉ. అంతట నంతమంతునుదయంబున సంతమసం బదృశ్యమై
సంతస మావహింప నృపచంద్రుఁడు రాముఁడు చారుసౌరభా
త్యంతలతాంతకాంతగహనాంతరదంతురితాళిపాళికా
క్రాంతసరస్సరోజనికరంబులు చూచుచు నేగి ముందటన్. 139

మ. అవలోకంబులకుం బ్రియం బెసఁగు గోష్ఠాభీరపల్లీస్ఫుర
న్నవవల్లీగిరిపక్కణంబులు నరణ్యంబుల్ గనుంగొంచు సీ
త విలోకింపుము నీవటంచు విలసత్కంజాతసంజాతమో
దవతిన్ స్వేదవతిం గనుంగొనియె నత్కాంతం బనంతంబుగన్. 140

క. కని తత్స్రవంతి సత్తీరనిరూఢలతాలతాంతరమణీయతకు
న్మనమునఁ బొంగుచు నటఁ గడ, చని సరయువు దాఁటి రామచంద్రుం డవలన్.

వ. అభంగరంగత్తరంగాధారం బగుగంగాతీరంబున విఖండితదుష్టమృగాస్పక్కణం
బగు నొక్కపక్కణంబు గనుంగొని తత్సమీపంబునకుం జని. 142

క. బహునియమాయాసవహు, న్మహుస్మహుద్గతముదశ్రుముక్తానివహుం
గుహుఁ గని రచ్చోస్థిక్రమ, గుహు సద్గుణగణగుహు రఘుప్రవరు లాగిన్. 143

వ. ఇట్లు కనుంగొని రయ్యవసరంబున. 144

చ. రభసముతో నిషాదపతి రాము నెదుర్కొని సద్వినీతిభ
క్తిభరితమానసుం డగుచుఁ దియ్యనిమాటల నాదరించి త్వ
చ్ఛుభతరదర్శనంబున విశుద్ధమనస్కుఁడ నైతి నంచు నీ
తభయుఁ డెసంగ నర్ఘ్యసహితం బగుపాద్య మొసంగి వేడుకన్. 145

క. నీపదశౌచజలమునకు, నాపదలం బాపుహరజటాంతరపదసం
దీపితవర్తన యైనను, రాపగకును వేఱు గలదె యని తజ్జలమున్. 146

వ. శిరంబునం జల్లికొని వెండియు. 147

చ. గుహుండు నమస్కరించి నృపకుంజర కుంజరకుంజరమ్య మీ
గహానమునం బ్రియానుజులఁ గైకొని యిట్లు చరింపఁగా మహా

మహాత్ముఁడవు నీకుఁ జన్నె గుణమండన నావుడు వానికి రఘూ
ద్వహుఁడు నిజప్రవృత్తి విదితంబుగఁ దెల్పి సంతసించుచున్. 148

తే. రామచంద్రున కాతఁ డా రాత్రి మధుర, వివిధ పనసఫలముల విందొనర్చి
వరధనుర్ధరుఁ డగు సోదరుఁడు గొలువ, నధికకృప సీతతో నట నధివసించి. 149

క. గుహుఁడును సుమంత్రుఁడును దను, బహువిధములఁ గొలువఁ బర్ణపర్యంకమున
వ్రాలి నిదుర జెంది రాముఁడు, మిహిరోదయమునకు మున్న మేల్కని సరగన్. 150

వ. సమయసముచితకృత్యంబులు నిర్వర్తించి నిజసేవాపరతంత్రు సుమంత్రుం గనుంగొని.

క. సముచితము గాదు రథయానము మాకిటమీఁదఁ గావున మరల సాకే
తమునకుఁ గొని చనుమీ యరదము నీ వనుటయు నతఁడు దప్తహృదయుఁ డై.

చ. అటువిని మిన్ను మ్రడించి పురి కారడి శూన్యరథంబుతోడ నే
నెటువలెఁ బోవువాఁడ సుమతీ యని పజ్క్తిరఘుండు సాదరో
త్కటవ్యాపదంబుతో నడుగఁగఁ దత్పతి కేమని తెల్పువాఁడ నీ
కిటుగలెనాడ ధర్మమగునే విడనాడకు మిందఁ దయుండెదన్. 153

చ. అనవుడు రాఘవుండు భవదగ్రసుతుండు సతీసహోదరు
ల్దనుఁ గొలువంగ నెంతయు ముదంబున నిప్పురిఁబోలెఁ గాననం
బున నొకయింతవింతయును బొందని డెందముతోడ నున్నవాఁ
డని వినిపించి మజ్జనకునార్తి హరింపఁగ నీవు పోవనా. 154

గీ. అనిన నేమియు ననుటకు ననువులేమి, నాటు సుమంత్రుఁడు శ్రీరాము నపుడు వీడు
కొని యయోధ్యకు నేగ నెక్కొనినచింత, రథముతోడ విఫలుఁడౌ రథముతోడ.

వ. తదనంతరంబున. 156

మ. విలసద్వేషులు వీతదోషులు జగద్విద్వేషవిద్వేషు ల
చ్చలసంతోషవిశేషభూషితమనీషాశ్లేషు లానందభా
షులు నిర్దోషులు ముఖ్యసత్త్వగుణమంజూషు ల్జిగీషు ల్విశే
షులు సంతోషులు రామలక్ష్మణులు సంస్తుత్యాభిలాషు ల్గనన్. 157

వ. చని చని. 158

మ. ఘనసౌగంధికగంధవాహచలితక్ష్మాభృల్లతావాలము
న్వినుతాభంగతరంగశీకరసమావిర్భూతశైత్యోల్లస
న్మునిసంకల్పితపర్ణవేశ్మసవిధామోదైణశార్దూలముం
గని రస్తోకవిశాలము న్మహితగంగాప్రాదినీకూలమున్. 159

క. కని జనకసుతాయుతుఁడై, చని మధుకరమధురనినదసంభృతవికచా
బ్జనటన్మరాళసితగరుదనుపమధౌతపరిధాన యై తగు దానిన్. 160

క. ఖ్యాత మగు దాని గంగా,ఖ్యాతం బగు దానిఁ గుముదఘనకమలాసం
ఖ్యాత మగు దాని జనసౌ,ఖ్యాతతశీతలజలప్రియం బగు దానిన్. 161

సీ. తలఁచినయంతమాత్రన జగజ్జనముల, కానందసంధాయి యైనదాని
బ్రహ్మహత్యాదిపాపంబులనైన భస్మంబు గావించెడు మహిమదాని
హరజటాస్థలినుండి యవతరించినదాని, రమణీయబహుళతీరముల దాని
సగరవంశజులకుఁ బుణ్యగతి కల్పించుదానిఁ, బరమపవిత్ర నాఁ బరఁగుదాని
గీ. సర్వతోముఖ యనుట నిజంబు గాఁగ, నలినకులసమావృతము లగునంబుజంబు
లలరఁ బసుఁగునడి మించు నలికములుఁ, జొప్పుగులికెడు జాహ్నవి నొనరఁగాంచి.

వ. తత్ప్రవిధవిధవిశేషంబులకు సంతోషంబు నొందుచున్న యవసరంబున రాముం
గనుంగొని లక్ష్మణుండు. 163

క. గంగాసరసి నిలం గని, యంగజశరకుముదభంగ యై సుడివడఁ జ
ల్లం గడఁగిరి శిశిరతకై, భృంగీకాంతలు పరాగరేణువు లనిశమ్. 164

క. నిజభావంబునఁ బొంగి మనుజనాయకుఁ డపుడు లక్ష్మణున కిట్లనియెం
ద్రిజగత్పావని యీనది, కుజనుల కీచెంత నిలువఁ గొఱగాదు సుమీ. 165

వ. అని మఱియు ననేకవిధంబుల నన్నదీమచర్చికఁ జర్చింపుచుం జనకసుతాలక్ష్మణ
సహితుండై రఘునాయకుండు గుహుండు నావికుండుగా నోడ యెక్కి సితగరుద్ధ
రుత్పంథనంబు గాంచి బంధురకమలకైరవసుగంధం బాస్వాదించి తుంగతరంగఘట్టన
నించుక పొడమి శీతలశీకరంబుల యాతఁగొని మందమందగమనంబున నెదురొ్క
ను మరుత్కిశోరస్పర్శనంబున మోదంబు నొందుచుం దవనూతనతనూవిలసనంబు
నిశాంతిరస్ఫురదాప్రిజీవలోకనదీక్షణంబుల నిరీక్షించియుం దనివిసనక తను వెల్ల నయ
నంబులు గావించికొన్నవనువుగం గండుగండకంబుపిండులమండిత యగు భాగీరథి
మ త్తరించి పంచుటాకులను తోకలు వటిచి కేకికేకారవవ్యాజంబునం బిల్చుచున్న
యవ్వలియొడ్డునం దరణిడిగి కొమ్మలను కొమ్మలు ముమ్మరమ్ముగం గ్రుమ్మరించు
సుమమ్ములను నాచారలాజమ్ములను సమ్మతించుచు గుహునిం బహుమానపూర్వకం
బుగా వీడుకొని ఛాయామూలంబులునుఁ బిచ్ఛళలాటుకంబులునుం బత్రపత్త్రంబు
లును ముఖకోరకంబులునుం గలిగి జంగమకింశుకంబు లనం గగనంబునం బారుచు నై
పాలుకుకనికరంబుల నాలోకించుచు విశీర్ణజీర్ణపర్ణంబుల నించుకించుక గనుపించు
పాషాణంబులకును ఫలకలు వెట్టుకొని నిదురించు కొండచిలువలకును విభేదంబు

పరిశోధించుచు గుసుమితానేకానోకహషండంబు దవదవసమావృతస్థలంబు గా
శంకించుచు మొట్టమొదళులం బుట్టలు దిట్టలుగ దొట్టినం బట్టుపుట్టంబులు చుట్ట
గట్టికొన్నట్టు గన్పట్టు ఓరుజెట్టులతిట్టలకడ నిలువక దుస్తరంబు లగుకంటకప్రస్త
రంబులవలనను జాయసౌరభలతాంతలతావితానంబులవలనను భయంకర పుండ
రీక భల్లూక సమీకంబులవలనను సారకృష్ణసారకికోరవారభసలకిసలవిసంబులవల
నను మనోభిరామభీమంబగు గహనకదధ్వగమనపరిశ్రాంత యగునిజకాంత నుద్దే
శించి లక్ష్మణుం గనుంగొని. 166

చ. అడవి భయంకరోరగసమావృత మెంతయు సంకటంబు న
య్యెడ విహరింపఁజాలవు చుమీ వలదంచుఁ గడు న్వచించు నా
నుడి విన కిందు వచ్చి యాతన శ్రమపాల్పడి కంది కుందె వె
న్నడివిధి యేఁచ నేరికయినం దలమే దలఁగంపలంపఁగన్. 167

క. నడికెతుఁ జిత్తముతో నెన్నఁ డెఱుంగనిపుట్టి యడవినడుమం ద్వరతో
నడువం జాలదు జానకి, నడు మల్పము గుచభరం బనల్పం బగుటన్. 168

క. ఫుల్లాబ్జనేత్రపదముల, నల్లికొనినతీవ లొప్పె నతివమృదుతనూ
వల్లికి నోడి కడుం బ్రణ,మిల్లి పదద్వయముపట్టి మిడికెను కరణిన్. 169

వ. అని పల్కి మఱియు నమ్మహారణ్యమార్గంబునం జనుచవసరంబున. 170

సీ. క్రోడవిదారితక్షోణితలముఁ గనుంగొన్న నిషాదులు దున్నిరనుచు
శల్యకప్రఖనితస్థలములు గనుఁగొన్న, మునులు దుంపలు త్రవ్వికొనిరటంచు
ద్విరదనిపాతితోర్వీజము ల్గనుఁగొన్న, నురుఫలభారత నొరగెననుచుఁ
బొదలనిద్రించుబెబ్బులులశరీరంబు, లరసిన బర్హిబర్హంబులనుచుఁ
గీ. గలభములఁ గన్నఁ బెనుగండశిలలటంచు, గుహలు గనుఁగొనఁ దపసులగృహములనుచు
నెఱుఁగకుండ వచించుఁ దా నెఱిఁగె నేని, సీత భయమందు ననియెడుచింతకతన.

వ. తదనంతరంబున నయ్యన్నదమ్ములు. 172

క. ఘనకలుషపిశాచనుదర్శనము సుదర్శన మనం బ్రశస్తమగు సుద
ర్శనతీర్థముఁ గని యచ్చట, ననఘులు నివసన మొనర్చి రారేయిం దగన్. 173

వ. మఱునాఁ డరుణోదయంబునం గృతకాల్యకరణీయులై సీతాసమేతంబుగా నయ్యు
సహోదరులు ధనుర్బాణంబులు సహాయంబులుగా నాఁడు మూఁడుయోజనంబు
లరిగి. 174

క. పటువిమవస్థలభయదా, వటముఖపురసాలతాలవటముఖతరుసం
కటమగు నటవిం జని యా, త్కటము నల ప్రయాగవటముఁ గని దాశరథుల్. 175

ఉ. భూజనవంద్యుఁ దాపసవిభుం జతురాననసన్నిభుం భర
ద్వాజుని సంశ్రితాంగణవివర్ధితకల్పమహీజు నిందిత
వ్యాజుని ధిక్కృతేంద్రియమహారిసమాజుని భాస్కరోల్లస
త్తేజునిఁ గాంచి చేరఁ జనుదెంచి నతించి నమస్కరించినన్. 176

శా. వారి న్సాదరబుద్ధిమీఱఁగ భరద్వాజుండు మన్నించి త
ద్ఘోరారణ్యపటుప్రవర్తనకు హేతుత్వంబు నిత్యాత్మబో
ధారమ్యంబు దనంతటం గని సమాధానార్ఘ్యపాద్యాదిస
త్కారంబు ల్పచరించి మూలఫలశాకంబుల్ సమర్పించుడున్. 177

క. అవియున్నియు నవియున్నయు, లవిరళసంతోషు లగుచు నందికొని మనో
జ్ఞవచోరచనలఁ గడు న, య్యవనీసురవర్యుఁ బొగడి యమ్మాత్మప్రతతిన్. 178

క. తలఁగడలుఁ గాఁగఁ దమకరతలములు గావించి యొండొరుతలపు లుడిగి పెం
దలమగు దలకృతశయ్యాతలముల నిదురించి రొక్కతలమున వొగడన్. 179

వ. అంత. 180

క. మిహికానికాయ ముడుపుచు, మిహిరోదయ ముదయశిఖరి మెఱయ మునిస్వా
మిహితాదేశంబున నమ్మహితాత్మకు లరిగి యరిగి మార్గములోనన్. 181

చ. కని రలచిత్రకూటము నగాధరఝరోభయపార్శ్వరోధరూ
ఢనిబిడవల్లరీపటునటన్మధులిణ్మృదుగానభాసమా
ననవలతావితాన లలనాకృతిచారుతరోపగూహనో
జ్జనితనిరంతరప్రమదసద్విటపవ్రజచిత్రకూటమున్. 182

గీ. కాంచి యట పర్ణశాల నిర్మించి చిత్రకూటకూటమహోత్కటకటనికటగు
హాగ్రవిహారకిన్నరీహారితరసు, గాననిస్వానసమ్యగాకర్ణు లగుచు. 183

చ. వలసినకందమూలరసవత్ఫలపుష్పరసప్రవాళము
ల్వాలఁ బుగ సంగ్రహించి మహిపుత్రి కొసంగుచు దుష్టదంష్ట్రిలం
బులులను దుర్వృకంబులను బొబ్బమెకంబులఁ బింగదృష్టులం
బులుగులఁ దోలుచు న్ముదముఁ బొందుచు నందు వసించియున్నెడన్. 184

క. రఘుతనయుఁ డొక్కదినమునఁ, మహితనయానయముఁ గాంచి మోకళివపువు
స్వహియించి నిజనిశాంతస్థమాతిఁ గుచాంతరముఁ జీరెఁ గాముకవృత్తిన్. 185

సీ. జీవితేశ్వరి నిటు చిరజీవి సేయు, ఢండగఁబులు రావవిభుఁడు చూచి
కనలి మంత్రించి యొక యిషీకంబు వైవ, నది భయంకరతరశర మగుచు నిగిడె. 18

శా. మంటల్ మండుచు విస్ఫులింగములు వోడ్మం దక్కలంబంబు వె
న్వెంటం గొంటు శరణ్యశూన్య మగుచు న్విభ్రాంతహృద్గ్రంథి యై
మింటం బర్వులువాఱుచుం గహనవల్మీకంబులం డాగుచు
న్మంటిం జేరుచు నొచ్చె నిట్లు శ్రమక్రమ్మం గాకి యేకాకి యై. 187

క. దిక్కులు పదియును గ్రుమ్మరి, దిక్కెవ్వరు లేక రామదేవునిపదము
ల్దిక్కనుచుఁ దలఁచి యాతని,దిక్కు మొగం బరుచు నేకదృష్టి మరలుచున్. 188

క. ప్రేమను నిట్లు లలంచిన, వాయసముం గాంచి దీనవరదుఁడు రాముం
డాయెడఁ ద్వన్నయనము మృత్సాయకమున కొసఁగు మిది ప్రశాంత మగునన్.

గీ. నెమ్మనమ్మున వాఙ్మమ్ము గ్రమ్మికొన ఘృనమ్ముగానమ్మునకు నయన మొసంగి
యత్యరిష్టంబు నొందుచు వరిగె వయ్యరిష్ట మప్పు డరిష్టంబు రిష్టముగను. 190

వ. తదనంతరంబున. 191

క. చతురశ్రవదారుణమహా,ర్యక్షహాయవిపక్షయక్షరక్షోగణదు
ర్వ్రక్షశరవృక్షబుక్షత,రక్షుక్షుభిత మగునయ్యరణ్యక్షోణిన్. 192

వ. సీతారామలక్ష్మణులు నివసించి రంత నక్కడ. 193

ఉ. దైన్యరసాశ్రయాననుఁ డధైర్యుఁడు నైనసుమంత్రుఁ డెంతయున్
శూన్యరథంబుఁ గొంచుఁ బురిఁజొచ్చిన వచ్చినవాఁడు లోకస
న్మాన్యుఁడు రామచంద్రుఁ డని నాగరికు ల్గనుఁ జుట్టుముట్టి రా
జన్యునిలేమిఁ గాంచి సవిషాదము నొందుచుఁ దన్నుదూఱుచున్.

క. వగపున రామునివార్త లడిగినం బ్రత్యుత్తరము లుడిగి తేయ వడిం
డిగి చెక్కులు గన్నీటఁగ,డిగి పౌరజనరాజుఁ గని కడిందియులంతన్. 195

చ. దశరథమేదినీరమణ తావకపుత్త్రులు రామలక్ష్మణు
ల్విశదమనస్కులై విపినవీథి ధరాతనుజాసహాయులై
కుశలత నున్నవారు నృపకుంజర వారు వనంబునం జతు
ర్దశసమయాబ్దముల్ త్రుటివిధంబునఁ బుత్తురు వత్తు రొప్పుగన్. 196

వ. వారిం దలంచి విషాదంబు నొందం బనిలేదు. సుఖంబున నున్నవారని పల్కి వెండియు.

క. అవనీశ వినుము పదినాల్గవది యైనయేటికడపల న్నిజముగ ని
న్నవలోకించెద మనుచున్, భవదీయతనూజు లనినపల్కులు వింటే. 198

చ. అనవుడు గుండె జల్లుమన నన్నరనాయకుఁ డగ్రపుత్త్రుఁ జే
రొక్కని తరుణీసహోదరులఁ గూడి వనంబు మనంబునన్ ఘనం

బనితలపోసి తండ్రి మృతుఁ డయ్యెడు నాదెసనైన శోక వే
దనని చింత సేయవుగదా తగదా దయ దానవాంతకా. 199

క. విను తనయ మునివినుతనయా, నినుఁ గనుభాగ్యంబ కాని నిరతము నుదగ
న్నినుఁ గనుభాగ్యము నోచను, మునుఁ గను పాతైతి దుఃఖమున మునుఁగంగన్.

చ. నను విడనాడ నీకుఁ దగునా తగు నాదగునా ర్తి దీర్ప నే
యనువునసైన విన్ము తనయా తనయా తనయాత్మజన్ము చే
త నణఁచుదండ్రి నేరుప సదాపసదాపసదాసకోటుల
న్వనిగనబోదు వీవు. సుమనస్సుమనస్సుమన ర్తనాళివై. 201

వ. అని మఱియు ననేకవిధంబులం బలవించి వెండియు రామలక్ష్మణులం దలంచి.

చ. నిముసము తాళఁజాలఁగలనే కలనేనియుఁ గానరాయ దై
న్యమున వనిం జరింపనవునా నవునానను లొచుఁ గన్నదో
యిసుద మొనర్పకున్న మెయి నేమెయి నేధరియింతుఁ బ్రాణమో
కమలదళాక్షులార మిముఁ గన్గొను కందయ రాదు నామదిన్. 203

క. పాపాత్ముఁడు నిష్కారణుఁడు, గాపురుషుఁడు ననుచు నగుమొగంబులు నాకుం
జూపర చూపఱు, నాపదలకు నోర్చి యడవి కరుగం జనునే. 204

వ. తదనంతరంబునం గోడలిం దలంచి. 205

క. తరణికరతప్త మగువన, ధరణి న్నడువంగలేక తాపము మిగులం
దరుణీ తరునీడలఁ గా, తరునింతియుఁబోలె మెలఁగెదవె విధిచెయిదిన్. 206

వ. అని పలవించి వెండియు. 207

ఉ. డాయనురా రిదేమిచెప్రడా యనుఁ గానమె కాలు మీకుఁ దో
డా యను నొంట్లు మీకుఁ బురుడా యను నావెతఁ దీర్చువాఁడు లేఁ
డా యను రామ నీకయిన నక్కట్టికం బొకయింత లేదు నా
డా యనుఁ దమ్ముఁ డాయను మహాటవి కేగితె పుత్రుఁడా యటన్. 208

క. అని మఱియుఁ బెక్కుభంగులఁ, దనయులఁ గోడలిఁ దలంచి దశరథుఁ డతిశో
కనిమగ్నుఁ డైనఁ గనుఁగొని, యనియెం గౌసల్య శోకసామగ్ర్యమునన్. 209

ఉ. నీకు విచారమేల ధరణీవర మేలతలంచి నాఁడ వ
క్కైకమనంబు నొచ్చ మనుఁ గన్గొన నీవిపు డిందువచ్చుట
న్నీకు విచార మీకరణి నీరుగఁ జేసెఁ గులంబు నెల్ల నా
హా! కరుణంబు దక్కి భవదగ్రసుతుం బెడబాయుటర్హమే. 210

చ. కలలోఁ దోఁచుసమస్తవస్తువులు నిక్కంబంచు భావించు మూ
క్కలువందంబున రాజ్యభోగములు వేర్కన్నమ్మి నా పుత్రుఁ డీ
కలుగం ధర్మమె పుణ్యకర్మమె దురాత్మా యీఁగఁ గాగాసి న
క్కలపాల్పేసినచందమయ్యె భవదాజ్ఞాగౌరవం బిట్టిదన్. 211

వ. అను నప్పలుకులు ములుకుఁ గ్రియుం జెవినాటుట యు నప్పారమి తోఁడు. 212

క. నాకడఁ బుత్రులు మెలఁగమి, నా కడలు విశేష మగును నాత్రికొనియె నా
హా కమలపత్రనేత్ర మ, హాకష్టం పుత్రశోక మన మును వినవే. 213

ఉ. ఆనగుమోముసొంపు మెఱుఁగారెడు చెక్కులపెంపు గొప్పఁడా
లూనినమోవియింపు మధువొల్కెడు పల్కులతెంపు దీనసం
తానముపైఁ దలంపు సుఖదంబులుగా నిటులేవగింపు మ
త్సూనుని యందుఁ గాని మఱి చూడఁగ నెయ్యెడనైనఁ గల్గునే. 214

క. ఓరుగువ యనుశ్వసనము, నా మేన వసి ప జేయు నాకవళమగు
ప్రాణద్రోహికిఁ బ్రాణము,తో మనఁగా నెట్లువచ్చుఁ దోయజవదనా. 215

గీ. హృదయము గలంగి నాముఖ మిపుడు జొచ్చె, శయ్యదలపోయఁ గానంపశయ్యయయ్యె
గాయ మగ్గిఁబోఁగల్చినకరణి యయ్యె, నింతి బలవంత మగు పెనువంతకతన. 216

చ. అదియటులుండె విన్మ జలజానన నాఁచిననాఁడు వేఁటకై
యదురితహేతుఘోరమృగయావ్యసనగ్రసనాత్మకుండనై
సదమలచారుతీరతమసానది చెంత నెసంగు కానసం
బు దరిసి యొక్కరుండ నతమోనివహాంబునమందు దలంకకన్. 417

ఉ. అంబుజపత్రనేత్ర శరభాదిమృగంబుల వేఁటలాడు కా
లంబున మాటుగాచెక జలంబులకై యొకబాలకుండు వే
గంబున వచ్చి కుండ నుదకంబులు ముంపఁగ శబ్దభేదిబా
ణంబునఁ దద్రణంబుఁ గరిఘాణం బని కూలనేసితిన్. 218

క. కటకట తలిదండ్రుల నక్కట నిడికొని మోచి తెచ్చి కడునంధుల కు
త్కటముగ నోడవిఁ దృషఁ దీర్పుట కచ్చోటు కరుగుదెంచు చోఁ ప్రేలెడుఁగన్

వ. ఇట్లు వచ్చి మద్బాణవినిహతుం డగు మునిసుతుండు. 220

గీ. బాణహతి నిప్పు వెడలుప్రాణములకు, వగవఁ గన్నులు గానక వార్ధకదశ
నున్న మీదగుపుత్రశోకోపహతిని, దలఁచి పొక్కెద నోతలిదండ్రులార. 221

క. అని వగచుచుఁ గూలినఁ దన్మనుజధ్వని కెంతయు న్మనం బదరఁగ నేఁ
జని కాంచితిఁ దత్తటమ్మున, మునిసుతు మద్బాణనిహతు మోహవిరహితున్. 222

వ. కని శీతలజలంబులం దన్నయనముఖప్రక్షాళనంబు గావించుటయు. 223

చ. ననుఁ గనువిచ్చి చూచి నరనాథ యెఱుంగమిఁ దప్పుచేసితి
వ్వని మదిలో గ్రహించినఁ గృపారహితాత్మకులై రయంబున
న్నినుఁ బొలియ న్మదీయజననీజనకుల్ శపియింతు రిప్డు నే
ర్పునఁ జని నీవు దెప్పుము తపోమహితవ్రతులైనవారలన్. 224

వ. అని యిట్లు. 225

క. తనతలిదండ్రుల సంప్రార్థన మొనరింపు మని చెప్పి తత్తనయుఁడు వేఁ
దనవు విడచి చనియెఁ బురాతనజన్మకృతంబు లెట్లు తప్పింపనగున్. 226

వ. అంత. 227

క. వమ్మగు నానుభవమ్ము ధృవ మ్మను చెనుచింతతో జవమ్మున మద్భా
వమ్మున నుఱుకుచు శిశుకళత్రమ్ముఁ గొనిపోవఁ బదగనమ్ము విని వెసన్. 228

క. అమ్మరివృద్ధులు సుతుఁ డని, నెమ్మనములఁ దలఁచి పుత్ర నీవిటుఁ దడయం
గ్రమ్మిన వగ పెల్లున మీ, యమ్మయు నేనును భయంబు నందితిమిగదా. 229

చ. కడుముదుసళ్ళమై కనులఁ గానని వారము నైనమమ్ము ని
య్యడవిని డించి వమ్మ తనయా సలిలార్థము వోయి యెంతయు
న్నడుమగలేని వారల వనంబున నొక్కటడించి వచ్చితో
దడయఁగరాదటంచును మనంబు చలింపక ధైర్యమొందెనే. 2?0

క. మాకన్నులు గర్ణంబులు, మాకరచరణములు బుత్త్రి మాప్రాణంబు
ల్మాకుఁ గలసమస్తము నీ,వేకద నీవిట్లు మసలుదే నడురేయిన్. 231

ఉ. పాపఁడ రూపవాపుమని పల్కిన నుల్కి దయాత్ములార మీ
పాపఁడఁ గాను పాపినగు పఙ్క్తిరథుండను పేరి తుచ్ఛగో
త్రాపతిఁ బుండ దుష్టమృగయావ్యసనోగ్రుఁడ దగ్ధుఁ జేయుఁడీ
శాపకరాగ్ని నీదృశదశాపరిలబ్ధికి మీర లర్హులే. 232

క. తమతమపూర్వకృతము లు, త్తమతములకు మాన వెట్లు చమకులకుఁ గుఱ
తమసానదియొద్దన సం,తమసంబున వేఁటలాడ తటి మీసుతుఁ జూచెన్. 2?8

గీ. దృఢనియములార మీతృష దీర్చుటకును, గటికిచీఁకటి నెక్కటి నిటుకువచ్చి
యల్లనల్లన సంతస మగ్గలింప, నొనసి కలశంబు నీరిలో ముంచుటయును. 234

క. బుడబుడ యను చప్పుడు చప్పుడు వెడలిన సామజ మనుబుద్ధిం గరుణం
బుడిగి శరముఁ దొడిగి పడ, నడుమడి చేసితిని నిముతి గడువ వ్యళమే. 235

చ. అని యిడె మీకుమారశవ మారయఁ డే నపరాధి నంచుఁ దె
ల్పిన వదనంబు లెత్తి విలపించుచు హా సుత పల్కుమంచుఁ బు
త్రునిమృతదేహ మంటికొని తోఁచెడుశోకభరంబుపేర్మిఁ జ
చ్చిన క్రియ మూర్ఛనొందిరి కృశించి సధైర్యమున స్మ్రవ్రతుల్. 236

ఉ. ఎచ్చటికైన నోసికొని యేగెడునట్టికుమారుఁ డొక్కఁడుం
జచ్చిన నట్టి వార్ధకదశ న్నయనంబులు లేనివారికిన్
హెచ్చదె శోక మాక్రియ మహింబడి కొండొకమూర్ఛ దేఱిన
న్మెచ్చక క్రోధశోకములు మిక్కుటమై తము హెచ్చరింపఁగన్. 237

వ. నన్నుం గనుంగొని 238

క. అపరాధరహితు మత్సుతుఁ, గృప యింతయు లేక నిట్లు గీటడఁచితి వి
య్యపరాధంబునకు న్నిను, న్నపగతజీవునిఁగఁ జేయు టర్హమ యైనన్. 239

ఉ. కానమిఁ దప్పుచేసితివి కాన మితం బగుశాపవహ్నికి
న్మానవనాథ యర్హుఁడవు మానవనాథుల నేచుపాపము
ల్లానినొనర్పఁ గాని యహహా! నినుఁ జూడఁగరాదు పుత్త్రశో
కానలతప్తులే వినుము కానలఁ దాపసు లైనసాధువుల్. 240

క. అని కనలి పుత్త్రశోక, మ్మున మృత్యువుఁ జెందు మనుచుఁ బొల్పుఱఁ శపిం
చి నితాంతపుత్త్రవిరహ, మ్మునఁ జచ్చిరి వృద్ధమునియు మునిమానినియున్. 241

వ. ఇట్లు శపించుటయు. 242

చ. అవికలవార్ధిచంద్రు లగునాత్మజు లుద్భవ మొందు దింతెచా
లు విధి దయాత్మఁ డంచు మదిలో ముదమందుచు నుంటిఁ గాని పు
త్రవిరహ మారిఁ గూర్చునని తత్సమయంబునఁ దోఁపదయ్యె నిం
తవిషమమంచుఁ దోఁచినఁ బదంపడి ప్రాణము లొడ్డి వీడనే. 241

వ. అని తనకుఁ బూర్వంబునం గలమునిశాపంబు తెఱంగెఱింగించి, 244

క. రామాభిరామ భార్గవ, రామమహామదవిరామ రవివంశమహో
ద్దామ సుగుణధామా శ్రీ, రామా రామా యటంచుఁ బ్రాణము వీడెన్. 245

క. వసుధేశున కసుతత ని, ట్లసుతతి వెడలుటయుఁ దన్నిరాలాపత గాం
చి కుదంతి కోసలాత్మజ, యుఁ సుమిత్రయు నిద్ర గాఁగ నూహించి కడన్. 246

గీ. తామఁ బుత్త్రిలఁ గోడలిఁ దలఁచి తలఁచి, నిండ వేదనఁ గుత్తుక లెండ వెడ్చి
యుల్లములు దల్లడించుచునుండె నపుడు, వెడవెడ నుషఃపిన్నొందిరి నేడ్కడక్కి. 247

వ. అంత. 248

మ. కరవారంబులఁ బద్మినీరమణి కుత్కంఠంబు దీపింపఁ బె
స్వైరవారం గదుఁ గౌఁగిలించికొని పృథ్వీధ్వాంతవిచ్ఛేదమై
పురివారిం దగ మేలుకొల్పికొనుచుం బూషోదయం బైననా
ధరవారింభక వైరిమాగధసుతాకౌసల్య లొక్కుమ్మడిన్. 249

వ. ఇట్లు మహారోదనంబు గావించుచు. 250

ఉ. అంగవికార మారయుచు నంగన లంతిభయాంతరంగ లై
పొంగెదు పుత్రశోకమున భూమివిభుండు శరీరవాయువి
స్సంగతి నిట్లు దేవపరివన్నివసత్వముఁ గాంచె దిక్కు మా
కుం గలదే యటంచు నృపకుంజరువైఁ బడి యార్తనాదలై. 251

చ. ఇటు విను మొక్కవింత విపులేశ్వరపుత్రవియోగశోక ము
త్కటమగుడున్ శరీరమునఁ బాల్పవు ప్రాణము లీవు మేము మి
క్కుటమగు పుత్రశోకమునఁ గూరిమి భర్తృవియోగ మొందియుం
బటుగతి నున్న వారలము పాపము రూపములొందెనో యనన్. 252

క. వసుధాసుధాశనులు గొల్వఁగ సుధర్మసభానివాసి వరవిబుధపనీ
వసుధారణకిం గదా, నసరుద్రుఁడవై తి విట్టు లాశ్చర్యముగన్. 253

వ. అని మఱియుం బెక్కుభంగుల విలపించి రందుఁ గౌసల్య. 254

సీ. జననాథ నినుఁ బరుసంబులు పలికిన, ఫల మిప్పు డనుభవింపఁగఁ గలసెఁ
గఱివనిగ్గాతపృథ్వీసూతంబునఁ దపించు, జననకుఁ గొఱవిమోఁడీవిధమునఁ
బుత్రవియోగతఁ బొవయుచునుండఁగ, భర్తృవియోగసంప్రాప్త మయ్యె
వనవాసమున కేగుతనయునిఁ గాంచిన, మందభాగ్య నటంచు మదిజనించుఁ

ఆ. గోపమో మదీయ పాపవిశేషమో, యెట్టినోముఫలమొ యే నెఱుంగ
వాగుణంబుఁ బిన్న నాఁటనుండియు నెఱింగియును బలుక వేమి కృపవలిర్ప. 255

వ. అని మఱియుం బరిచారికాసహస్రంబులుం దానునుం బలవించు నెలుంగులు నింగి ముట్టె నయ్యవసరంబున. 256

ఆ. పుత్రుఁ గుఱిచి భూమివిభుండు లోకాంతరగవాసి యగుట విని సుకాసినీత్వ
హాని కోర్వలేక నడలుచుఁ జనుదెంచె, భరితదురితజాత భరతమాత. 257

ఉ. నెవ్వగ నిట్లువచ్చి ధరణీపతిఁ గాంచి మనంబు నొవ్వఁగా
నెవ్వరు దన్ను దూఱిన సహించి విలాసము సేయఁ జొచ్చెనా
జవ్వని హా దినేంద్రకులసాగరచంద్రమహేంద్రతుల్య నీ
కివ్విధి నవ్విధాత లిఖియించెనె పాపపుఁజావుజావఁగన్. 258

ఉ. కోరినకోర్కు లెల్ల నొసఁగూర్చెద విప్రుకు మాటలాడఁగాఁ
గోరిన నూరకున్కి నృపకుంజర ధర్మము గాదు కైక పా
పోయచరిత్రి గానఁ గృప యుల్లమునం జనియింప దా పుత్రులో
వారలతోడ నైన గరువంబుగఁ బల్కకయుండఁ జెల్లునే. 259

వ. అని యిట్లనేకవిధవిలాపంబుల నారాజశవంబుఁ గౌఁగిలించుకొని దుఃఖించు
చున్న యవసరంబున. 260

క. విప్రప్రతిమానుఁడు విప్రప్రభుఁ డప్రతిహతప్రభావుఁడు ప్రతిమ
త్నప్రముదవనానలుఁడు యాత్మప్రదప్రియుఁ డరుంధతీప్రియుఁ డంతన్. 261

ఉ. కాలవిధిజ్ఞత న్హృదయకంప మొకింతయు లేమిఁ బెక్కుచం
దాలఁ బరిభ్రమించు నృపదారలఁ గాంచి కుమంతు వల్కు ని
క్లైబ విలాపము ల్సలుప నిన్నరనాథున కీక్రియంబునం
గా వశంబు నొంద మును గల్గినకర్మఫలంబు దప్పునే. 262

గీ. జన్మము లనేకము లొనర్చి సత్సుతులను, గన్నవాఁ డురుకాలము మన్నవాఁడు
నహితరాజన్యసైన్యవనాగ్ని హోత్రి, దవునె యీతనిమృతికి నింతవిలపింప 263

క. నగవరుఁ డేలవగ చెదరు వగచిన మృతు లైనవారు వత్తురె యనుచుం
దగుసంభాషణముల నృపమగువల నూరార్చి బోధమహితుఁడు మఱియున్. 264

గీ. తనయు లిర్వురు లేమి నిద్ధాత్రిపుడు, దహనకర్మము నడుపుట ధర్మమగుట
భరతశత్రుఘ్నులనుఁ బిలువంగ నిపుడ, బంపవలయును జాంఘికప్రవరభటుల. 265

వ. అని పలికి సచివస్వజనానుమతంబు వడసి దశరథుకళేబరంబుఁ దైలపక్వంబుగ సుగు
ప్తంబునుం గావించి. 266

సీ. పటుజవసత్త్వసంపన్నుల భటులఁ గన్గొని వసిష్ఠుం డిట్టులని చెప్పె మీరు
కృతమతి కేకయక్షితిపతిపురి నున్న, భరతశత్రుఘ్నులఁ భరితయశులఁ
గాంచి మి మ్మొక్కమహాకార్యంబు గల్గి తోడ్కొని రం డటంచు మీకులగురుండు
మముఁ బంపె నని వానిమాట యూసతి నొంది, వారును మీరును వడిగ నిటకుఁ

గీ. గదలిరం డనిపలుక నాక్షణమ యవ్వసిష్ఠునకు మ్రొక్కి వీడ్కొని చేరఁజనిరి
సప్తరాత్రంబులకు సుదక్షప్రధాని, రమణమగు దానిఁ గేకయరాజధాని. 267

క. ఈకరణి నేగి లోపలి,శోకము వెలిఁ దోఁపనీక సుయశోధను న
క్కేకయభూపతిఁ గని మఱి, కైకాసుతుసోదర యుతుఁ గని నతులగుచున్. 268

క. చెడుకలలు గాంచి చింతిం,చెడు భరతుఁడు వారిముఖకుశేశయములఁ దోఁ
చెడు దైన్యముఁ గనుఁగొని నొ,చ్చెడుచిత్తముతోడ మిగులఁ జిడిముడిపడుచున్. 269

వ. ఉన్నంత నబ్భటపుంగవులు 270

ఉ. హృదయవికారము ల్దెలియనీయక వాతనిఁ గాంచి గూఢగా
ద్గదిక నెలుంగు లొప్ప నెపడఁగా ధరణీశతనూజ మీగురుం
డు దహనతేజుఁ డార్యుఁడు గడు న్వెసఁ దోడ్కొని రండు శాత్రవో
న్మదహృతిచారుకీర్తిపరిణాహారతుష్కరతు న్నసోదరున్. 271

క. అని చెప్పి వారు పని యిడి, యని చెప్పం దవ్వనిష్ఠుఁ దనివవి భయం
బున రాముని కెవ్వా రెగ్గొనరించిరో తండ్రి యెట్టులుండెనో యనుచున్. 272

ఉ. మేను వడంక సోదరసమేతుఁడు కేకయరాజపుత్త్రికా
సూనుఁడు దివ్యనూజనకచోపరిశోభితకీర్తిసూనుఁ డా
స్థానము సొచ్చి మామఁ గని తద్విధమంతయుఁ దెల్పి బంధుసం
తానము సంభ్రమింప విశదస్థితి నిట్లనియె న్భయంబునన్. 273

క. నామనవి నాలకింపుము, నామనము గలంగె నీక్షణంబ యయోధ్యా
నామనగరి కేగక తగు, నా మనవాడలను జూడ నరిగెద ననఘా. 274

క. అని తనమామ యుధాజిజ్జనపాయకు వీడుకొని లసద్వైభవను
స్త్రీకాయ మాతఁ డోసఁగినఁ, గొని భరతుం డనుజుఁ గూడికొని పరయముగన్. 2 5

క. సముచితపరివారసమేతముగా సాకేతరాజధానికిఁ బురుషో
త్తముఁ డబ్జాతుఁడు సనియె, భ్రమితహృదయుఁ డగుచు వేగిరపుబయనములన్ 276

వ. ఇట్లు చని. 277

గీ. రమణి లేనిగృహము సంబరమణి లేని, యాహము శూన్యము నిస్తేజ మైనభంగి
నన్నపురి గాంచి విప్రలక్షణ్ణహృదయుఁ, డగుచు నిట్లని తలపోసె నాత్మలోన. 278

చ. తనపతి లేని మానినివిధంబునఁ జాలనమంగళంబునొం
దినయది యిప్పురంబు గడు దీనమనస్కులు పౌరు లెవ్వరిం
గనినను మేలువల్కరు రఘుం బగు వేదనినాద మింతయు
న్వినఁబడ దేమియొక్కొ పృథివీపతి మేనుఁ దొలంగనేమొకో. 279

వ. అని వితర్కించుచుం జని చని. 280

శా. సత్రాసస్థితి నార్త్రి మూర్తినిధరించంబోలు నా నొప్పి ధై
ర్యత్రాతావశహృత్ప్రవృత్తి యయి దైన్యస్తోమసంస్థాయి యై
శత్రుఘ్నుం డగులక్ష్మణానుజుఁడు పశ్చాద్భాగసంవర్తిగా
మాత్రాగారముఁ జేరఁబోయి భరతక్ష్మాపాలుఁ డత్యాతృతిన్. 281

ఉ. కేకయరాజనందన కకృత్రిమభంగి నమస్కరించి య
క్కేకయరాజుసేమ మెఱిఁగించి యొకించుక తాల్మి లేమి న
శ్శోకకర మూర్తి శాకరము గాఁ గత మేమి పురంబు నామదిన్
శోకము సేయఁజొచ్చెఁ గలచొప్పు సమస్త మెఱుంగఁ జెప్పుమా. 282

క. వనమున భయసంభ్రమములు, బెనఁగొన నిట్లడుగుచున్న ప్రియనందను మో
మునఁ జూడ్కి నిలిపి కేకయ, తనూజ యిట్లనియెఁ గాఢధైర్యస్ఫూర్తిన్. 283

ఉ. మీ జనకుండు దొల్లి నను మెచ్చి వరద్వితయం బొసంగెఁ బు
త్రా జటులాని యగ్రవనితాసుతుఁ డబ్దచతుర్దశంబు న
వ్యాజము నస్థితి న్వనవిహార మొనర్పఁగ నీవు సర్వధా
త్రీజనమాన్యత న్వసుమతీపరిపాలన మాచరింపఁగన్. 284

క. అగ్రసతీసుతు విభవో, దగ్రునిఁ గావింప నాత్మఁ దలఁచు దురాశా
ప్రగ్రహనిబద్ధబుద్ధిన్, బాగ్రణి నడిగితిని యోగ్యము సుసమయమునన్. 285

క. ఏ నర్థించిన వరయుగ, మీ నసమర్థుఁడయి మానవేంద్రుఁడు మౌనం
బూనినఁ దదాజ్ఞ నెఱపఁ, బూనినచె రాముఁ డడవిపాలవులఁ దిరుగన్. 286

చ. తన ప్రియపుత్త్రుఁ డగ్రవనితాభవుఁ డాత్మసతీసహోదరుం
డెనుకొన బ్రహ్మచర్యమునివృత్తము లూని చతుర్దశాబ్దము
ల్వని నివసింపఁబోయిన భవజ్జనకుం డిటుఁ దద్వియోగసం
జనితపృథువ్యథాభ్యధికసన్నమనుఁడై మృతినొందెఁ గావునన్. 287

క. విక్రమసమృద్ధి ధరణీ, చక్రావన మాచరింప జనకుని పిత్ర్యలో
కక్రియ లుపక్రమింప శ, శక్రతునిభతేజ నీవుఁ దగుదువు లనినన్. 288

వ. భరతుండు మహింబడి మూర్ఛిల్లి కొండొకవడి కించుక తెలిసి. 289

క. రాముని సద్గుణవితతుఁ, గ్రాముని లోకత్రయాభిరాముని నాత్మా
రాముని వనములఁ దిరుగఁగ, నేమని పొమ్మంటి బుద్ధిహీనతఁ దల్లీ. 290

క. క్షితిపతిఁ జంపితివి వన, క్షితి కంపితి సుతుని రాక్షసివి గాక యనిం
దితకేకయాన్వవాయో, దిత యగుదతి కింతదుర్మతిత్వము గలదే. 291

శా. చేతోజాతసమాను రాము వనవాసిం జేయు దుశ్చింత త్వ
చ్చేతోజాత మొ రాక్షసీకులితదాసీశిక్షితమో కాక వా
క్షేత్రాప్రేరితమో మదీయసుయశోనిర్వాపణాయాతమో
మాతా మత్పితృమృత్యుహేతు విది సామాన్యంబు గా దారయన్. 292

సీ. నను రాజ్యకాంక్షిఁగాఁ దనమనంబున నవ్వసిష్ఠుఁడు గనునూహ సేయునొక్కొ
యతివ సీగర్భమున్ దావిర్భవించుట, కకట నాపూర్వజన్మకృత మొక్కొ
మద్దులుగులుక్క రామునిముఖాంభోజంబుఁ, గనుఁగొన నాకింకఁ గలుగదొక్కొ
మాత నీకపటంబు మనమున నిడికొని, కౌసల్య నన్నుఁగని కనలునొక్కొ
ఆ. యొక్కయడుగు నడువ నోపని జానకి, యెట్లు లడవి సంచరించునొక్కొ
జనులు భరతుఁ డమితసౌజన్యనిధి యని, పొగడుదురు లింక నెన్నఁడొక్కొ. 293

వ. అని పలికి కినుకవొడమి. 294

ఆ. నిన్నుఁ జూడరాదు నీతోడ భాషింపరాదు నిన్నుఁ జంపరాదు నాకు
నిచట నుండరా దహీనపాపమతీ యంటంచు వెడలి భరతుఁ డనుజుఁగూడి. 29

వ. అత్యంతచింతాక్రాంతాంతఃకరణుండై దీనమనస్కు లగు కౌసల్యాసుమిత్రాదేవుల కడ
కుం జని నమస్కరించి కన్నీరుమున్నీరుగా నేడ్చుచున్నం గనుంగొని. 296

క. చిత్తంబుల నుత్తలములు, క్రొత్తలుగుడు నత్తఱిణులు గొడుకుల దుఃఖా
యత్తులఁ నెత్తి పదంపడి మొత్తంబుఁ జేసి శోకమొగి నభమద్రువన్. 297

వ. మఱియు ననేకవిధంబులఁ బలవించునెడఁ గౌసల్య. 298

చ. భరతుఁడ రాముఁ డుగ్రవనవాసము సేయఁగఁ బోయె సద్యశో
భరతుఁడు రాజముఖ్యుఁడు భవజ్జనకుం డమరత్వ మొందె దు
ర్భరతరపుత్రశోకమునఁ బట్టణ మౌనె యరాజకంబు సం
భరితమనఃప్రమోది నిరపాయితఁ దాల్పుము పూజ్యరాజ్యమున్. 299

వ. అనుటయు సహింపక. 300

చ. చేతనప్రాజ్ఞుఁడై పురుషసత్తముఁ డబ్జగతుండు వెచ్చనూ
ర్చి కినుకఁ దిక్కి విన్నతగఁ జెప్పిన నామది రాజ్యవాంఛతే
మికి ఘనసాధభూతములు మిత్రశశాంకులు సాక్షులీవెఱుం
గకిటుల నొవ్వఁబల్కి దనుకంపఁ దలంపవు కోసలాత్మజా. 301

క. అన నితఁడు రామభక్తుఁ, డనూనపుణ్యాత్ముఁ డిమ్మహాత్ముఁడు భరతుం
డనిన యది తథ్య మనుమఁ గ్రగనవాణి వచించెఁ దగ సకలజనులు వినన్. 302

వ. ఇట్లు వచించుటయు నెల్లజనంబులు నచ్చెరువునొంది భరతుం బ్రశంసించి రంత. 303

క. భరతుని గాఢానంతత్వరతం గౌసల్య మెడలు వట్టుకొని విశే
షరవంబున నేడ్చెం దత్పరిచారిక లధికశోకభరమున నేడ్వన్. 304

వ. తదనంతరంబున భరతుం డనుజసహితుండై తైలద్రోణి నిమ్ముగా సంగ్రహించియున్న

ధనఘృతమధుక్షీరసౌరభపదార్థచయంబులు గూర్చి తండ్రికిం
దనరంగ నగ్ని యిచ్చె విదితంబుగ నబ్జహితుండు సద్విధిన్. 316

వ. ఇట్లు పితృమేధంబు యథావిధిక్రియాకలాపంబుగా నిర్వర్తించి. 317

క. భూదానంబులు గోకన్యాదానంబులును గోసహస్రంబులు ను
ర్వీదేవతలకుఁ గడునే, కాదశదివసంబునందు ఘనుఁ డతఁ డొసఁగెన్. 318

వ. మఱియు నద్దశరథున కమరలోకనివాసప్రాప్తికరంబులుం దమకు నశుచిత్వనిరాస
కంబులు నగు క్రియాకలాపంబు లెన్నియేని నడపి సమస్తజనంబులన్ భోజనదానంబు
నం దృప్తులం గావించి సుహృద్బాంధవామాత్యబ్రాహ్మణపౌరజనపదనికరపరి
వృతుం డగుభరతుం గనుంగొని యరుంధతీప్రాణవల్లభుం డిట్లనియె 319

ఆ. సమయరతుఁడు రామచంద్రుఁ డిచ్చట లేమిఁ, బూజ్యరాజ్యభరముఁ బూన మిక్కి
గుశలయంబు వేడ్కఁ గూరునే రాజు లే,కున్న భరత నూన్యతోక్తినిరత. 320

వ. అనుటయు సవిషాదమనస్కుండై. 321

క. నీ వఖిలము నెఱిఁగియు న, న్నీ విధమున ననుట యెల్ల నే నెఱుఁగుదు మ
ద్భావము సమస్తజనసం,భావితముగ నిప్పు డెఱుక పఱుతుఁ గాదే. 322

మ. ఫలమూలాశనుఁడై కుశాసనుఁడునై పర్ణోటజావాసియై
బలవద్దైవవశాసనుం డయి మహాపాషాణపర్యంకవ
ల్కలచేలాన్వితుఁడై మదగ్రజుఁడు జల్కానం దపంబూన ను
జ్జ్వలభోగాస్పదపట్టణంబునను నిల్వన్నాకు సద్ధర్మమే. 323

చ. పలుకులు వేయు నేల మహిపాలన మే నొనరింపఁజాల నె
న్నలుకులమీఁదఁ బోలెఁ బదము ల్దగ నిల్పవు నేల నామనం
బులుకుచుఁ దత్తరించెడు ద్విజోత్తమ యిప్పుడ పోయి మేనఁ గ్రొం
బులకలు గ్రమ్మ శౌరి రఘుపుంగవుఁ జూడక యుండ నేర్తునే. 324

క. అవనీరక్షణకై రాఘవునిం బ్రార్థింతు నతఁడు గాదను నేని
ప్రవిమలాచార్య మహా,గవనీవిహరణము నాకుఁ గర్తవ్యమగున్. 325

చ. అని తనవిశ్చయంబుఁ దగ నందఱకున్ వినిపించి వారలె
ల్లనుఁ దనుఁ జుట్టిరా నపుడు లక్ష్మణపూర్వజుఁ దవ్వశిష్ఠుఁడుం
జననులు మువ్వురు న్సచివసత్తములు న్హితులు న్మహోరథే
భనిఖిలసద్భటోద్భటజనప్రబలాశ్వములు న్వెనుంబడన్. 326

వ. సహోదరుండై యయోధ్యాపురంబు వెలువడి వేగిరంపు బయనంబులం జని చని. 327

ఉ. సాధునికాయసేవ్యుఁ డమసాధుని గాయము వొంగఁ గాంచి త
ద్రోధవిభాస్వదాతపనిరోధవిశాలరసాలభూరుహ
త్స్నేహము వేడ్కఁ గూర్చ నృపశేఖరుఁ డా భరతుండు మానసీ
వ్యాధినిరాసకంబులు పదంబులఁ గొనియాడి మ్రొక్కుచున్. 328

క. అన్నది సద్భక్తి సుధీయన్నది నటఁ గడచి భరతుఁ డతిరయమునఁ దా
నన్నదికకు గుహుతోఁ దా, నన్నది మదినూది నడచె ననుజసహితుఁడై. 329

వ. ఇవ్విధంబునం జని యెడనెడ వినోదంబులగు నదీనదంబులు తుంగంబులగు గిరిశృంగంబులు విశాలంబులగు సాలంబులు నాలోకించుచు సరయూగంగాసంగంబు నుత్తరించి గంగాతీరంబునకుం జని యందు. 330

ఉత్సాహవృత్తము.

సాధునీతిఁ గనియె రాజపుత్త్రయుండు సత్త్రతా, సాధునీనిద ఘనఘనచ్ఛాళితాత్మవాదుని
వ్యాఘనిష్ఠు. దీనరక్షసాధుసిద్ధసన్మనీ, సాధుసంఘయున్ గుహాంబ్లి పావనిర్వ్యపానుతిన్.

వ. ఇట్లు గాంచుటయు నగ్గుహుం డాదరపూర్వకంబుగా భరతున కిట్లనియె. 332

క. ఇలు వెలువరించి రాముని, కలిమిం గొని యంత నిలువక కలుషమతివై
బలిమిపోయి నతనిఁ దలపడఁ, దలఁచి యరిగెదొ త్రిల్లు రుత్సితంపుఁ దలఁపున్. 333

చ. అన నతఁ డోనిషాద వినుమట్లుల గాదు మదగ్రజన్ము న
జ్జనకసుతాసమేతు నృపసత్తము రాముని లక్ష్మణున్ జగ
జ్జనుతకీర్తి నైన ద్విపదసాధ్య కయోధ్యకుఁ దోడితే ముదం
బున నిటుపోక నీకగునె పోకడమాలినపల్కు వల్కఁగన్. 334

చ. అనుటయు సంతసించి యతఁ డాతనికి న్విహితార్ఘ్యపాద్యము
ల్లనుపడఁగా నొసంగఁ దగుభంగిగ గంగఁ దరంగిణీమణిం
బొనరఁగ నుత్తరించి గుహుఁ బో విడిచి విరించికృత్యమై
వ్వరికి నలంఘనీయ మనివార్యము నందుఁ దలంచుచు న్వెసన్. 335

వ. భరద్వాజాశ్రమంబునకుం జని. 336

క. అమ్మునిపతికి నమస్కార, మ్మొనరించుటయును నాదరమ్మున నిటు రా
రమ్మని భరతునికరముఁ గరమ్మున గీలించి ముని కరమ్మురురక్తిన్. 337

క. మనమున నేఁ దక్కయము నీ, జనకుఁడు స్మృతినొందె విధివశమ్మున నిటు రా
మునిఁ గానఁ బోవు టెంతయు, ననుకూలం బయిన కార్య మని సెలవొసఁగన్. 338

క. నలనొప్ప రాముఁ డరిగిన, వలను భరద్వాజమౌనివలనఁ దెలిసి య
వ్వలఁ జనియె భరతుఁ డెంతయు, వలనుదగుల్వాడిన పులుఁగుమలె నతిభయుఁడై. 339

వ. ఇట్లరిగి విచిత్రకూటం బగుచిత్రకూటంబు సమీపంబునకుం జనునవసరమున 340

ఉ. ఎప్పుడు రామచంద్రుముఖ మేర్పడఁ జూతుము కన్నులార ని
కెప్పుడు రామభాషణము లింపుగ విందుము వీనులారఁ దా
నెప్పు డయోధ్యకు న్మనల నేలఁగవచ్చు మిత్రులార యం
చప్పుడు వేడ్కఁ బౌరజను లారనిరావము లుప్పతిల్లఁగన్. 341

క. పలికెను పలుకులు తురగ,మ్ముల హేషలు మత్తనాగములబృంహితము
ల్గలసి బలిసి యుక్కోసఁ, గఁ శకునంబులకు భీతి గలిగించుటయున్. 342

క. తద్రవముం బక్షిమృగో,పద్రవము న్లక్ష్మణుండు పరికించి యెదు
గ్రద్రుమము నెక్కి కనియెన్, భద్రంబుగ వచ్చుచున్న భరతునిసేనన్. 343

వ. కని ససంభ్రముండై రాముం గనుంగొని. 344

క. రామ వినుము భరతుఁ డేఁటికి, కో మనకడ కిపుడు వచ్చుచున్నాఁ డనిన
న్సౌమిత్రి మనలఁ దోడ్కొని, పో మనమునఁ దలఁచి రాక బుద్ధి నెఱుఁగుమీ. 345

వ. అనిపలికె నయ్యవసరక్షణంబున. 346

చ. సరభసవృత్తి మోముల విచారము వేడ్కయుఁ దోఁప నేగి య
బ్భరతుఁడుఁ దత్సహోదరుఁడు బ్రీతిగఁ గాంచిరి మానవేంద్రుని
న్నిరతశమాశ్రితైణఫణినిర్వ్యసనోగ్రమహోఖగేంద్రునిం
బరమపవిత్రితాపసకృపాగసస్రాంద్రుని రామచంద్రునిన్. 347

వ. ఇవ్విధంబున సందర్శించి. 348

క. పొరిఁబొరిఁ బులకాంకురములు, శరీరమునఁ గ్రమ్మ దేర సరి మొక్కిరి స
త్కారచరణలలాటంబు లుదరములు భుజములును భూమితలమునఁ బొరయన్. 349

మ. అటు తన్మ్రొక్కినముద్దుతమ్ముల సమ్యగ్భక్తిపాత్రమ్ములం
బటువార్గంబున రామచంద్రుఁ డవనీపశ్రేష్ఠుఁ డాసక్తిఁ గౌఁ
గిట నాశీర్వచనాళిపూర్వకముగాఁ గీలించియుం బేర్చు మ
త్కటు వశాచుండఁ దదీయమస్తకము లాఘ్రాణించి భావించియున్. 350

క. తనకరములఁ దమ్ములమృదు,తనువులు నిమిరియు నతం డతనుమోదమునం
దనియఁడు రాముఁడు ఘనచం,దనచర్చలు గావె సహజదర్శనము లిలన్. 351

వ. అయ్యవసరంబున. 352

క. భూమ్యాత్మజకును ఫణిపతి,సౌమ్యుం డగులక్ష్మణునకు సముచితముగ స
త్కామ్యత మ్రొక్కెను రామ,స్వామ్యనుజుఁడు లక్ష్మణానుజన్మసహితుఁడై. 353

క. అనుజప్రియాసహితుండై, మనుజప్రవరుండు దవంబుమగ్నాత్ముండై
జనకునకుఁ దిలోదకవిధు, లొనరిచి కృతకృత్యుఁ డగుచు నుటజము సేరెన్. 364

ఆ. ఇట్లు వచ్చి రాముఁ డెరియుమనంబున, ననుజవరులఁ బట్టికొన మహేశు
గాకునవాతి వారిలె నాకునవాతిఁ గూలు, నగమునట్లు భ్రుణ్యనగమునందు. 365

వ. ఇవ్విధంబునం బితృమరణశోకవ్యాకులితమానసుం డైన రామచంద్రుఁ భరతుం దూ
ఱార్చుచున్న యవసరంబున గురుండు కౌసల్యా కైకా సుమిత్రలం దోడ్కొనివచ్చి
సముచితంబుగాఁ దత్సమాగమంబు నడపుటయు రాముండు సీతాలక్ష్మణసహి
తుండై కన్నీరులఁ దదంఘ్రిపుష్కరంబులఁ బడుటయు నక్కాంత లక్కొడు
కులం గోడలం దీవించుచు నక్కునం గదియించి వెక్కి వెక్కి యెక్కుగుక్క ది
క్కులుపిక్కటిల్ల నేడ్చిరి మఱియును. 366

ఉ. ఎల్లజనంబులు న్వీరుగ నీల్గినపట్టెక్కెడు దలంచుచుం
దల్లితో రుసద్గుణవితానము నప్పుడు పేరుకొంచు నా
తల్లులుమువ్వురు న్సుతులు దారుణశోకభరంబు నొంది వెం
దల్లడమంది యేడ్చినవిధం బది యెచ్చటనైనఁ గల్గునే. 367

క. తత్రత్యకాంతలు కోసలపుత్రియుఁ గైకయును మగధపుత్రియు నంతోఁ
బుత్రులఁ ధైర్యము ధాత్రీపుత్రీదైన్యంబు గాంచి పొగిలిరి మిగులన్. 368

వ. అప్పుడు. 369

ఉ. నాథుఁ డోపోలి కేగినజనప్రభు మామఁ దలఁచి చింతతో
నాకులపాలికాతిలక యైనధరాసుత యేడ్చె నేడ్వఁగా
నాకులపాటుఁ జెందెఁ గుసుమాక్షులఁ బుష్పరసాళి లొల్కుచు
న్స్త్రీకులు తద్విలాప మసమానము గాదె వదిం దలంపఁగన్. 370

వ. తదనంతరంబున వసిష్ఠభరతప్రయత్నంబునం గొంతవడికిం గౌసల్యానందనుండు దె
లివి నొందుటయుం దక్కినవారు నుపశమిల్లి రంతఁ బౌరజానపదబ్రాహ్మణగురు
బంధుభృత్యామాత్యప్రియానుజప్రియాసముపేతుండై పవిత్రసమస్థలసుఖాసీనుండై
రాముం డుచితవచనంబుల నానందంబు గావించుచు నుండి కొండొకసేపునకు భ
రతు నాననంబునం బ్రసాదమహితం బగుమాడ్కి నిగిడించి పితృనిర్దిష్టదిష్టం బిష్టం
బుగ వనంబునం గడపి పురంబునకే మగుడివచ్చువంతకుం గరుణ గలిగి ప్రజాపరిపా
లనం బొనర్ప నయోధ్యకరుగు మన్న యని సప్రేమసాదరబహుళంబుగా నాడు
టయు నతండు విషాదంబు నొంది యున్నం గనుంగొని. 371

ఉ. భూతలనాథనాథ రఘుపుంగవ క్రోధము దక్కి నన్ను నీ
శీతలదృష్టిఁ జూచుచు వచించెద రాజ్యభరంబు సర్వము
న్నాతలఁ బెట్టఁజూచెదవు నాతలఁ బట్టులు గాదు నీవు ధా
త్రీతల మేలఁ గావలవదే జగమెల్ల నుతించుచుండఁగన్. 372

క. ఇనవంశ్యోదయంబునఁ జక్రినిఁ గాయము రాజు కరుణఁ గని కువలయముం
జనవర పాలింపుము జగ్యున రాజ్యము సేయుమాంటె నరుదె మ్మనఘా. 373

గీ. కేకయాత్మజ నడపిన కృత్రిమంబు, నించుకయు నెంచకుము భవద్ధృదయమందు
సత్యసంగ్రామమూర్తి వీ వఖిలభూభృదగ్రమ్ము శిరోయింప రమ్మ్ము వరమ్ము నిమ్ము. 374

క. వర్ణత్వాద్యాశ్రమములు, వర్ణాశ్రమధర్మములును వసుమరుజనదు
ర్వర్ణసువర్ణము లగుఁగు, నిర్ణిత్తుఁ డగు రాజు లేని వసుమతిలోనన్. 375

ఉ. కావున నాదుప్రార్థనముఁ గైకొని నీవు జగజ్జనంబులం
గావు నరాళిసత్కరుణఁ గాచినధర్మపుకో సమానముల్
గావు నరేంద్రధర్మములు కారుణికత్వధురీణ సేవనా
గా వనభూమి నీకుఁ దిరుగం దగునే మది నుంద నీక్రియన్. 376

శా. క్షోణీభారము నిర్వహింప నహితక్షోభంబుఁ గావింప న
క్షీణానందము భూజనాళి కొసఁగ శ్రీరామ రమ్మావన
క్షోణి న్నిల్చెద దాను పొమ్మనుచు నాకు న్నీవు దెల్పంగ మ
త్ప్రాణంబు ల్విడువందలంచితి సుమీ ప్రాణోపవేశంబునన్. 377

క. చాల వ్యగపున వనమున, నేల నివాసంబు నేల నేల నరి మ్మేఁ
జాల భూపాలనకు నీ, పాలన వసియించు తో వగన్నపాలకమాళీ. 378

వ. అనుటయు రాముండు మందస్మితసుందరవదనారవిందుండై. 379

ఉ. తమ్ముఁడ వెఱ్ఱివాఁడవు గదా తెలిసె న్భవదీయధైర్య మే
నిమ్మెయి రాజ్యపాలనకు నియ్యకొనందగుఁ దండ్రిపంపు భా
వమ్మున నిల్పి కానల నవశ్యము గ్రిమ్మతి వత్తు నీవు హా
ర్షమ్మున నాచరింపుము ప్రజాపరిపాలన మప్రమాదివై 380

క. మనబోటివార జనకుని, పనుపున వర్తింపకునికి పాడియె గుణమం
డన నీ వెఱుఁగవె ధర్మపు, నను గావింపకుము రాజనందన యింకన్. 381

క. పితృభక్తి నేమఱక దైవతపూజాపరుఁడ వగుచు వసుమతిఁ యులరన్
ధృతిమంతుఁడవై వత్సర, చతుర్దశము బ్రోవుమీ ప్రజలఁ బ్రజలక్రియన్. 382

చ. అనుటయు నేమియుం దిరుగ నాడక యబ్బరతుండు రామచం
ద్రి నిఖిలభూధరంబు సుకరంబుగఁ దాల్చుట యెంత నాకుఁ ద
ప్పనిపనియేని నీచరణపాదుక లానతి యిమ్ము తన్ముఖం
బున నృపరాజ్యతంత్రము ప్రమోదమునన్ వెలయింతు నేర్పునన్. 383

క. అని తనుఁ బ్రార్థించెడు తమ్మునికిం బాదుక లొసంగి మోదంబున రా
మనరేంద్రుఁడు కౌఁగిట నిడికొని సంభావించె నతఁడుఁ గుతుకము నొందన్. 384

గీ. భరతశత్రుఘ్ను లంత సంభరితసత్త్వహర్షమగ్నాంగు లగుచుఁ దదంఘ్రియుగము
మస్తకంబులు సోఁక నమస్కరించి, యపుడు వీడ్కొని రతని ననంతరమున. 385

వ. శ్రీరాముండు దమదెస కుమ్మలించు నమ్మువ్వురమ్మలకుం దాపోపశోషణంబు లగు
భాషణంబుల నానందంబు నొందించి మ్రొక్కి వీడ్కొల్పి పౌరబ్రాహ్మణభృత్యా
మాత్యజనంబులకు ననుగ్రహప్రణామాదరసంభావనాపూర్వకంబుగా సెలవొసంగి
వసిష్ఠానుజ్ఞాతుండై సీతాలక్ష్మణసమేతుండై మగిడి పర్ణశాలకుం జనుటయు. 386

గీ. పాదుకలు భద్రకుంభికుంభస్థలమునఁ, బాదుకొల్పి ముదంబున భరతయతులు
భరతశత్రుఘ్ను లుభయపార్శ్వముల విమల, చామరచ్ఛత్రములు పట్టి చనిరి సరగ.

వ. ఇవ్విధంబున సమస్తబంధుజనపరిజనగురుపరివృతుండై చిత్రకూటంబు విడిచి భర
ద్వాజాశ్రమంబుఁ గడచి గంగాతీరంబునకు నరిగి రట్టియెడ. 388

క. తత్కూలలతాసాలస, ముత్కరకలికాసురభిసముత్కటసుమసం
పత్కలిత మగుచుఁ దమ కు, త్కృత్యోత్కలికమరుత్కిశోర ముత్సాహింపన్. 389

క. దర్శనమాత్రమున నఘా, పర్శన మొసరించు జాలు తన్నద్యుదక
స్పర్శనగంగాపావ, స్పర్శనమునఁ బ్రీతులైన సమయమునందున్. 390

గీ. ఎదురువచ్చిన గుహునకు నిష్ట మెసఁగఁ, దాము పోయినకార్యమంతయును వినిచి
యతనిచేత సహాయత నపుడు దాఁటి, రంగముగ వేఁగఁ దుంగతరంగగంగ. 391

వ. ఇట్లు సమస్తజనసమేతులై గంగానదీసముత్తరణం బాచరించి గుహుండు వనుప ను
చితపయనంబులం జని తమసాప్రవాహంబుం గడచి సాకేతసామీప్యంబునకుం జని. 392

క. పల్లవిరియు తల్లడమునఁ, దల్లుల నం గనిరి యయోధ్యాపురమూలబలం
బెల్లను గాఁ పురిచి మదం, బొల్లమి నప్పురముఁ జొరక యుచితంపుమెయిన్. 393

క. స్వాగ్రిమము నజ్జ్వలత్స్వగ్రామము వదలి కను యశఃపుంజంబుల్
దిగ్రామల గప్పఁగ నందిగ్రామమున వసించి నిష్ఠాపరులై. 394

వ. ఉచితపరివారసమేతులై యుండి రంత నబ్బరతుండు. 395

చ. సుఖమున ధారుణీజనులు సొంపు వహింప లసన్మఖక్రియో
న్ముఖమున ధారుణీసురసమూహము పెంపు వహింప బాదుగా
ముఖమున రాజ్యకృత్యము ప్రమోదమున న్నడపంగ రాజధ
ర్మఖని యన న్వసించె మతిమంతుఁడు రాముని రాక వార్చుచున్. 396

వ. ఇట్లయోధ్యాపురసమీపంబున నొక్క యలంతిపల్లియ నుచితవర్తనంబుల నుండె నని చెప్పి ప్రమదాతిరేకంబున. 397

శా. త్రైతేయప్రకటాటవీదహన భక్తత్రాణపారీణ సు
జ్ఞాతానాగతవర్తమాన గతిదిక్పట్రక్రియాసన్నుత
ఖ్యాతాఖ్యాతకృపారసప్రసరవిశాలాక్షి సంభావితా
జ్ఞాతావాస మునీంద్రమానసనివాసా పీతవాసాంచితా. 398

క. పంకజలోచన మునిజనపంకవిమోచన విశేషభాసుర శ్రీవ
త్సాంకకరుణాంబుసేచన, పంకజభవకామినీపరిభావితవచనా. 399

మత్తకోకిల. పాలితాఖిలలోకనాయక భక్తసౌఖ్యవిధాయకా
కాలభీకరసాంపరాయక కాలకాలనుతాయకా
కాలనీరదకామనీయక కాయజిత్సునసాయకా
శీలయుక్తఫలప్రదాయక శీలవేంకటనాయకా. 400

గద్య. ఇది శ్రీసూర్యనారాయణ పదాబ్జధ్యాన పరాయణ భూమధైర్యవినయ
రామనార్యతనయ పండితసేవాసముచ్చయ క్రొత్తపల్లి లచ్చయ ప్రణీతం
బైన దాశరథివిలాసం బను మహాప్రబంధంబునందు

తృతీయాశ్వాసము.



శుభమస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీశారదాంబాయైనమోనమః

# దాశరథివిలాసము.

## చతుర్థాశ్వాసము.



కాంతావరముఖరా

శ్రీకాంతరమహితపుష్పవాటీకృతపీఠా

నాకావాసా సహాసన

హాకరివాగ్యతు వేంకటాద్ర్యధ్యక్షా. 1

వ. దేవా తదనంతరకథావిధానం బవధరింపు మట్లు భరతుండు ధర్మనిరతుండై నందిగ్రామంబున నివసించెనని చెప్పి యప్పుట్టపుట్టువుఁదపసి వెండియు నిట్లనియె. 2

ఉ. తమ్మునిఁ గాంచి రాముఁడు సుధారసతుల్యము లైనవాక్కు కా

యమ్ముల నిట్లు వల్కె మన మవ్వనమంబున కేగ కీశకా

లమ్మగు పర్ణవేశ్మమున లక్ష్మణ నిల్చితిమే కదా సమీ

పమ్మగు టాత్మ నెంచి మనపజ్జకు వచ్చుచు నుండు గ్రమ్మికన్. 3

క. వచ్చెదమఁ బోవుచు నున్న, న్వచ్చును విఘ్నంబు విపినవాసంబున కే

నచ్చుపదం బెల్పితి నిఁక, నిచ్చో నుండక జన దవలి కేగి యొప్పన్. 4

వ. అని పలికి సీతాలక్ష్మణసమేతుండై చిత్రకూటంబు వదలి చని ముందట. 5

సీ. ఘనలతాతన్వులు కౌఁగిలించికొన మి, న్నంటియుండెడు విటపావలియును

పాషాణకంటకబహుళంబు లై ఘోరభయంకరము లైన వర్త్మములును

జీర్ణపర్ణములలోఁ జిటచిటధ్వనులతోఁ, గునుకుఁబర్వెడు వాలుగోధికలును

తరుకోటరాంతరస్థఫణిఫణామణివ్రాతఘృణు లుల్కాజాతములును

గీ. సామజవ్యాఘ్రభల్లూకశరభములును, గలిగి భీకరమగు దానిఁ గనె నసురశ

రణ్యము నొక్కఁడుర్గమారణ్య మంత, సర్వజనమూర్తి రామరాజన్యమూర్తి. 6

వ. ఇట్లు కనుంగొని. 7

శా. వన్యేభోగ్రలులాయసింహశరభవ్యాఘ్రాచ్ఛభల్లాదికా
ధ్వన్యాభీలమృగావలీభయదకృద్ధ్వన్యాధికాకంపితా
వన్యాత్మోద్భవసాధ్వసాపనయనవ్యాసంగుఁడై యాత్మశిం
జిన్యారావ మొనర్చె రాముఁడు పలాశిస్తోమభీషణంబుగన్. 8

వ. నిజధనుష్టంకారఘోరంబున వనమృగంబు లెవ్వియుం దమ్ముఁ జేరక పాఱునట్లుగా వించుచు వివిధఫలమధుర మధురసంబుల నవనిజయుం దృప్తిచేయుచు నయ్యాయిలతాకుంజపుంజంబులం జూపుచుం జనునవసరమ్మున లక్ష్మణుం డన్నం గనుంగొని. 9

ఉ. సారము లోననూఁదికొని చంచలభావ మొకింతలేక వి
స్తారశిఖాచ్ఛటల్ జటలచందము నొందఁగ వల్కలంబులం
జీరలుగాఁగ నాకులు విశీర్ణతనొందఁగ రామచంద్ర దు
ర్వారతపోభరం బిటు లరణ్యము నిక్రియఁ దాల్చెఁ జూచితే. 10

వ. అనుటయు మహానందంబు నొందుచుం జనిచని. 11

సీ. ఆఖుశాబకకేలిహానిసామాజి, కావర్తితపటుతరగర్తములును
వాతాయమానవ్రాతఘోరవ్యాఘ్ర, కులసమాకీర్ణనికుంజములును
మృగరిపుప్రకరగంధగజేంద్రసంఘాత, దంతురితగిరిగుహాంతరములు
భీతికృదోతువారాతతశుకశారి, కాటదంచితతరుకోటరములు
గీ. శ్యేనజాలకపోతసంశ్రితమహావి, శాలమహనీయబాలరసాలములును
గలిగి విదళితఘనపథికనియజన, తాశ్రమం బగు నొకతాపసాశ్రమంబు. 12

వ. కనుంగొని యప్పుణ్యాశ్రమంబుఁ బ్రవేశించి యందు. 13

క. అనసూయాహృదయేశ్వరు, ననసూయాహృదయకమలు నత్రిమునీంద్రుం
గని తత్పదంబులకు వం, దన మొనరించుటయు నద్భుతప్రమదమునన్. 14

క. దీవించి రాముఁగని ముని, భావం బలరార నర్ఘ్యపాద్యంబుల సం
భావించి యనంతరమున, భావభవనిభు నసుమిత్రపట్టిని మిగులన్. 15

వ. సముచితసత్కారంబుల ననగ్రప్రియుంబు గావించి రామలక్ష్మణులం బవిత్రకుశాస్తరణంబుల నాసీనులం జేసి కుశలంబడిగి తానును సముచితాసీనుండై మధురసంభాషణమ్ములం దేల్చుచున్న యవసరంబున. 16

మ. అనసూయాచరణారవిందముల కత్యంతానురాగంబుగాఁ
దనసీమంతగతోల్లసద్ఘుసృణముం దాకించి చేదోయి నొ
య్యన జోడించి నమస్కరించుటయు నయ్యాత్రేయి ధాత్రీసుతా
వనజాతాయతనేత్ర నెత్తికొనియె న్వాత్సల్యసంపూర్ణయై. 17

వ. ఇట్లాశీర్వచనపూర్వకంబుగా నెత్తికొని నిజవిశాలపర్ణశాలామధ్యంబున సుఖాసీన సజ్జానకి నుద్దేశించి. 18

చ. సుఖములరోసికాననవసుంధరనుంటిపిత్రునాజ్ఞ నేగుదెం
చి ఖరకరాతపంబునఁ గృశించెదు భర్తపిఱుందనవ్వన
న్ముఖముదలిర్పనుండెదవు ముక్తభయస్థితి వైపతివ్రతా
త్వఖనివినీవునీకుసరివత్తురె యుత్తమమత్తకాశినుల్. 19

వ. అని మఱియు ననేకవిధంబులం బొగడి. 20

గీ. అభిరామకమసుభగతాభివృద్ధి, యగు నిదిధరించువారల కని వచించి
కంబుకంఠికినంగరాగం బొసంగె, నత్తపస్విని యనురాగ మతిశయిల్ల. 21

ఉ. ఈకరణిన్మునీంద్రసతి యిచ్చినరంగగు నంగరాగమున్
బ్రాకటలీలఁదాల్చి కడుఁ బ్రార్థనసేయఁగ నామెతోడ ని
ర్భీకుఁడు రామమూర్తి దను బెండిలియైన చరిత్రమెల్ల సీ
తాకులకామినీమణి ముదంబునఁ దెల్పి యనంతరంబునన్. 22

సీ. అత్రిభార్యకు వినయంబునఁ బ్రణమిల్లి, కులసతీధర్మము లొక్కొక్క మిగుల
వినవాసచేసెద వినిపింపు మనవుడు, నయ్యవనీజాత కాదరమున
భర్తమాటకు మాఱుపల్కుట తలవాకిట మెలంగుటయుఁ బాయసము నొకర్తు
సేవించుటయును నిషిద్ధముల్భర్త కురూపియైన వారిస్వరూపిగాఁగ
గీ. మదినిరూపింపమి కడుదుర్మార్గమగు మహత్తరంబుగ నాత్మభర్తయగుట
యుత్తరఁ బదరట యశుచిరై యుత్తమిల్లుటయును గూడనికార్యము లయనినిచె
నత్తపస్విని సత్కృపాయత్తయగుచు. 23

క. భూసురపూజాదిపరా, నాసక్తకలగుటయొప్ప దనిమరియునుసా
ధ్వీసాధుచరిత్రంబులు, భూసుతకెఱిఁగించె నత్తపోహితకరణిన్. 24

గీ. అట్లుదెల్పినసీత ప్రహర్షయయ్యె, నంత శ్రీరామలక్ష్మణు లత్రిమౌని
కథితపుణ్యకథాసమాకర్ణనమున, దృప్తులై మోదవారాశిఁ దేలుచుండి. 25

ఉ. అత్రిపురాంతకప్రతిముఁ డత్రిమునీశ్వరుఁ డాదరింపనా
రాత్రివసించి వేగినఁ గరంబులు మోడ్చి తదాజ్ఞనొంది సా
మిత్రసమేతుఁ డత్రిసతి మెల్లనవీడ్కొనివచ్చియున్న భూ
పుత్రినిగూడియేగె నృపపుంగవుఁ డా రఘురాముఁ డాదటన్. 26

నయ్యవసరమ్మున లక్ష్మణుఁ డన్నం గనుంగొని. 27

చ. ఒకగణికామతల్లి సుమనోజ్జ్వలయై మృగపల్లవాళిఁబా
యక విటపోపగూహనకు నైయిదె సాఁగెను రామ చూడు మా
నొకగణికామతల్లి సుమనోజ్జ్వలయై మృగపల్లవాళిఁబా
యక విటపోపగూహనకు నైయటు సాగుట యుక్తమే మమా. 28

వ. అనిపలికి. 29

క. ఆధరణీశ్వరుఁ డనుజు స్వసోదరమునఁ గాంచి సువల నరిగి కనియెంబ
ర్ణాదుల మునివరుల నప, ర్ణాదయితోపముల నయ్యరణ్యమునందున్. 30

క. కనివారియాశ్రమములకుఁ, జనివారలొసంగు ఫలరసంబులుఁ దేనె
ల్గొని యమ్మునీశ్వరుల వీ, డ్కొని రాముఁడు దీవలల్లి కొనినవన మునన్. 31

వ. జానకీలక్ష్మణ సమేతుండై పాషాణకంటక సంస్పృశ్యంబులై పాదంబులు గందు
చుం దొట్రుపడ మందగమనంబునం జనునెడ. 32

ఉ. నిక్కి విరాధనామరజనీచరుఁ డొక్కఁడు వచ్చి జానకిం
గ్రక్కునఁ బట్టి మూఁపునఁ దగంగ వహించి విశేషరోషుఁడై
మెక్కఁగఁ గొంచుఁ బోయిన నమేయబలాఢ్యుఁడు రాముఁ డంతఁ బే
రుక్కునవాని కడ్డుపడి యుద్ధతుఁడై యనుజుండు దోడుగన్. 33

వ. ఇట్లు రామలక్ష్మణులిరువురు నెదిరించి. 34

శా. క్రోధోద్రేక మనస్కులై రఘువరుల్ ఘోరాస్త్రజాలంబుల
న్వేధింపం దనుజాధముం డతిమహావేశుండు విస్తారమా
యాధారేయుఁడు సీతడించి వెసతో వా రాముని న్లక్ష్మణు
న్సాధింపన్నమకట్టి పట్టుకొని యంసద్వంద్వమున్ జేర్చినన్. 35

ఉ. వారలఁ గాంచి సీత వగవన్ జనకాత్మజఁ గాంచి వారలు
న్వారనిదీవతంబొరయ వాఁడు రయంబునఁ బోఁదలంచు తున్
శ్రీరఘురాముఁడుం బురుషసింహుఁడు లక్ష్మణుఁడుం బలాఢ్యు నే
పారఁగఁ బాఱనీక దిమిపట్టిది కంఠము రెండుప్రక్కలన్. 36

ఆ. అదిమిపట్టి వాని నల్పసత్త్వునిఁ గనె, ఱింగి బుధులకందఱికి హితంబు
లైనవాక్యయముల నాఖులబోధించి, విశమి కమికరోష వేసలకుము. 37

చ. తులువ భయంకరాస్త్రములఁ ద్రుంచుట యెంతయు నొప్పఁగాక నీ
తులు వలుకంగ నేలయని దుర్మతి నీలచేతికిచ్చి గం
తులవు నె ఘోషపోషము దె త్రుళ్ళఁడగించెవ మంచు వానిచే
తు లవనిఁ గూల్చి యొక్క మొగిఁ దోయజమిత్రకులాబ్ధిచంద్రముల్. 38

వ. తదనంతరంబున. 39

క. కరటముఁ దెగనఱకుచు నతి, కుంఠితుఁడై వాఁడు నేలఁగూలెను వెడసో
త్కంఠులగుచు నిలుకుటికిరి, కంఠీరవముల్గిరిన్ డిగ నుఱుకకరణిన్. 40

వ. ఇట్లు లంఘించి జానకీభయంబు వాపి యుల్లసిల్లి రంత. 41

గీ. రామబాణనిహతిఁ గంధరంబు ద్రెస్సి, యక్షణము రామలక్ష్మణు లబ్బురపడ
శాపమోక్షంబుఁ గాంచి నిశాచరుండు, గర్వుఁడగుకుంభరాఖ్యగంధర్వుఁడగుచు. 42

ఉ. చెంతకు వచ్చి రామనృపశేఖరుఁ గాంచి నుతించుచున్ నిజో
దంతమునంతయుం దెలిపి తత్పతివీడ్కొని యాక్షణంబని
శ్చింతమనస్కుఁడై ఖచరసింహుఁడు వోయిన మానవేంద్రుఁడ
త్యంత సువిస్మయాత్ములగు నట్టిధరాతనజానుజాతుఁడై. 43

క. అరిగి భయంకర వనములఁ, దిరిగి తిరిగి యమితకీర్తి దిక్కృతగంగా
శరభంగుని శరభంగుని, శరభంగరహితుఁడు రామచంద్రుఁడు గనియెన్. 44

క. కని తచ్ఛరభంగపదా, బ్జనికటుకలఘుత్రితఘాల భాగుండై యు
మ్మునిపతి నతిప నతఁడ, మ్మనుజేశ్వరు నెత్తి ముకుల మన్నన యొసఁగన్. 45

వ. గాఢావరపూర్వకంబుగాఁ గౌఁగిలించికొని యనంతరంబ మొఱ్ఱిఁ కూలిచియున్న
ధరిత్రీపుత్రీ సుమిత్రాపుత్రులం దగుభంగి సంభావించి యమ్మహామహులకు నర్ఘ్య
పాద్యంబు లొసంగి మధురంబులగు గందమూలఫలంబుల నాతిథ్యంబు నడిపి సుఖో
పవిష్టుండగు శ్రీరామునం గనుంగొని శరభంగుండు. 46

చ. నను బలభేది నాకభువనంబునకుం బిలువంగవచ్చిన
న్నిను మఱు వోకనిన్నుఁ గను వేడుకనిల్చితిఁ జూడఁ గాంచితి
న్మనుజవరేణ్య నీ వలరమాపతి వార్యజనాదరుండవు
ఘనతనొసంగు నీకరుణ గాంచినవారికిఁ బ్రాప్తె సౌఖ్యముల్. 47

క. త్రిదశజగన్నివసనము జ, పదవాసంబును ద్వితీయపదదర్శనసం
పదకు సద్వృత్తుంబులె తలఁ, పదశరథతనూజభూమిపదయామూర్తీ. 48

వ. అని మఱియుం బ్రస్తుతించి.

క. అలయుదేనెల ఫలముల, నలరుల నజినోత్తరీయకాదుల నలకా
నలరుచిరములగు తలిరుల, నలరుల సద్భద్రయుడగుచు నమ్మునియొసఁగన్. 49

వ. పరితుష్టుండై యమ్మహాత్ము వీడ్కొని. 50

క. సాలంబులు వరుణరుచికి, సాలంబులఁ గీరసంతసాలంబులు వా
చాలమ్ములగు పికమ్ముల, జాలమ్ములఁ గలిగి కనుపిశాలమ్ము గనున్. 51

ఫలితారుణప్రవాళలతాకదంబమై, స్తోకమై హారికులాకారమగుచు
వరభూరిఫేనమై యమృతచంద్రకిరణాభ, కూలమై మహితవిశాల మగుచు
పవమానీయగండక మదజలమాత్రమై, ధూమమై రాజీవధామమగుచు
వరరాశికెనయగు వనరాశిఁ గనుఁగొని, రాఘవుండనుజ గోత్రాసుతాస
మేతుఁడై చని సద్గుణోపేతుఁ గనియె, నయ్యరణ్యాంతరంబున నధికనిష్ఠఁ
దపము సేయుచు మహాత్ము శాంత విమలాత్ము, దీక్షుకరకోటిధాముఁ సుతీక్ష్ణనాము. 52
కాంచి యాతని మన్నన్గాంచి సన్న, తెంచి యవ్వాని యాజ్ఞ వహించి మించి
తన్నుఁ బ్రార్థించు మునుల యుత్తమతపోవ, నంబులకు జూడఁబోయె నయ్యంబుమీఱ
అరిగి ప్రియాసహితుండగు నారాఘవుండు. 54
మునికుమారులకుఁ గమ్మని ఫలంబులు దెచ్చి, యొసఁగి లాలించుచు నొక్కచోట
పారికాంక్షులతపోధన వాంతికంబుల, నుటజముల్ గట్టుచు నొక్కచోట
వాచంయమికథిత వరపుణ్యకరకథ, లూఁకొని యలరుచు నొక్కచోటఁ
దాపసులకు నుపద్రవములు గావించు, రక్కసులను ద్రుంచు చొక్కచోట
ఋషివరేణ్యుల కజినోత్తరీయకాను, లొసఁగి దీవనలను గొంచు నొక్కచోట
గొప్పమునిమన్నలను గొంచు నొక్కచోట, రాముఁడు చరించెను గుణాభిరతుఁడు మతియు
మునిజనసుహితవర్తన, ముఁ గొన్నిదినంబులచట మోదించుచు రా
మనరేంద్రుఁడు వారలవీడ్కొని తగుగతి నుందకర్ణి ఘోరతపంబున్. 56
కావించు నగస్త్యాశ్రమసమీపంబున కరుగునవసరమున. 57
సితపీతకాంతులఁ జెన్నొందిపథికుల, కతిమాత్రకామోద మావహింప
శోకపై కాశ్రయ శాఖానిరంతర,చ్ఛాయమై వలపులు సందడింప
వ్రణశిఖాకర్బుర మేచక కేకాళి, నీలపింఛంబయి నెమ్మినింప
నిజసోల్లాసిత ద్విజారవంబయి, యింపుమీఱుచు వ్యాప రాము
వామపార్శ్వంబునను సుమావళులనేలు, బాలసహకారషండంబు పజ్జకేగఁ
గాంతమాయూరవరవాటకంబుఁ గాంచుఁ, గొమ్మపండులుగోయ నక్కొన్నయుండు.
వ. ఇవ్విధంబున మోదంబునొందుచు, శ్రమంబునఁ గుందుచు, తలంకుచు వడంకుచు వెడ
వెడ నడగిను పురమిపట్టి గనుఁగొని రాముండు. 59
క. యాసను ఖతయవిసరమా, యాసము రానేల వలువ దడవికనుచుఁ జా
యాసము చితముగ మున్నద, యాసమధికవృత్తిఁ దెల్ప నది వినవుకటా! 60
క. లాయమ్ములు రిపుజనవిపు, లాయమ్ములు సంతతవిపులాయమ్ములు వా
లాయమ్ములు మనకిపుడు లు, లాయమ్ములు భయదఖరములాయములయ్యెన్. 61

క. కాంతారమ్ముల నురుతర, కాంతారమ్ములఁ జరింపఁగా నోపుదె స
త్కాంతారమ్ముల నలికెను, కాంతా రమ్మనుచు విభుఁడు గౌఁగిటఁ జేర్చెన్. 62

వ. ఇట్లు బహువిధోపలాలనంబుల నలరింపుచుం జనునంత నయ్యన్నదమ్ములు దుర్గమారణ్య మార్గంబుల నప్రమాదులై చని చని యొక్కనాఁడు. 63

ఉ. తాపసు లగ్రవంశవనరాశిసుధాకరు లెంతయేని సం
త్రాసము సర్గవంశవనరాశిసుధాకరమైన కోన ధా
త్రీసుతఁగూడి చొచ్చి విహరించిరి రాముఁడు లక్ష్మణుండు న
బ్జాసనకృత్య మేరితర మౌను గడంగి తొలంగఁ బెట్టఁగన్. 64

వ. అది మఱియును బ్రసిద్ధాశ్వత్థప్రవృద్ధ కపిత్థవటాశోక దాడిమీతరు సంభృతంబును పారిజాతకామ్రక శ్లేష్మాతకపిండీతవిభీతక కేతకీభల్లాతకీ జంబూ జంబీరౌదుంబర నింబ భూనింబకదంబ కదంబ భూమిజంబు కావ్యడంబక కాకోదుంబరి కాంబుజ భూమిజంబు కాముఖానోకహ సంకులంబును శితిసారక హయమారక కుమారక కలికారక వనమయూరక సాల రసాల తమాల కృతమాల తూల తాలహింతాల నారికేలభండీలాంకోలమద్దాలనక్తమాల సాలవిశాలంబునుం గలిగి త్రివిష్టపంబు విధంబున రంభాసురభ్యైరావత మందారేంద్ర సురసానృతాన్వితంబై పృథ్వీ ధరాక్రమంబున కుంభీస్యందనవీరతగుధనుర్బాణాంచితంబయి నభోమార్గంబు చందంబునఁ దరణివసుమనోహరంబయి యధోభువనంబుకైవడి ననంతాశ్రయంబయి సత్యలోకంబు ప్రకారంబునఁ బ్రహ్మణ్యశారదా గాయత్రీసముపేతంబయి జటీసమూహంబువలెనుఁ జటీకౌశిక శాండిల్యలోమశ కపిలానుకూలంబయి కైలాసంబు పోలిక పాశుపత హైమవతీ శివాధికంబయి, బలిసద్మంబునను వుర, కితవపలాశ రాక్షసీ సంయుతంబయి యభయాధికంబయ్యును గుఱ్ఱా లగ్గభయానకంబయి ఋక్షపున్నాగ మయూరారిష్ట వ్యాఘ్రనఖ సమన్వితంబయ్యును ఋక్ష పున్నాగమయూరారిష్ట వ్యాఘ్రనఖ సమన్వితంబయి నాగవల్లీలవలీలతా బహుసుతాత్రివృతా ద్రాక్షాదిలతా బహులతాభిరామంబయి యొప్పునయ్యరణ్యంబునం దట్లు ప్రవేశించి పెంటుల నెదుటఁ బెట్టికొని మెట్టుకొట్టుకొనలం బులులువిప్పి యాడునట్టి నట్టువపిట్టతిట్టలం గాంచి హర్షోత్కర్షంబునొందుచు నొక్కొక్కపట్టునం బుట్టల నిక్కినిక్కి దిక్కులు మాచు గాథేరంబులంబట్టికొన నుంకించు శబరశాబకులం జుట్టికొని ప్రోవులై పోవు సారమేయంబులకు దూరంబుగాఁ దొలంగుచు, బండి గురివిందతీవచప్పరంబులనీడలం బండి విశ్రమించుచుం బండివకంటకఫలంబు లుపయోగించుచు, స్కంధాగ్రంబునను మున్నొగసి తదనంతరంబున న్నిసువులకు నిజలాంగూలదండంబు

లూఁతలుగానోసంగి యెక్కించుకొని శాఖాగ్రంబులం దుముకు శాఖామృగంబుల
సహాయం బపేక్షించుచు, నకులంబులు లేలిహానకులంబుల విదళించు నేర్పునకుం
బొంగుచు, భుజంగసమాలింగితమ్ములగు ద్రుమమ్ముల కొమ్మలు భుజంగాలింగితలగు
కొమ్మలంబోల్పఁ బట్టగు ప్రదేశంబులం దిరుగుచు, ననేకవిధ మార్జాలజాలంబుల
నాలోకించుచు, సారంగంబులగు కృష్ణసారంబులవారంబు లీరంబులం బాయు సార
వంబు లాలించి, ఘోర క్రూర మృగంబులుగా శంకించి పరికించుచు, కమలాకర
తీర మహీరుహాగ్రశకున నిపతితంబులగు ఫలంబులు జలంబుల బుడుంగు బుడుంగు
మనుచుం బడుచప్పుళ్ళు మెప్పొదవ నాలకించుచు, నుత్తుంగంబులగు పర్వతశృంగం
బులనుండి వెలువడి జలజలం బ్రవహించు సెలయేళ్ళననుకరించు పూఁదేనె వాఁకల
సమీపంబుల నిలుచుచు, వింతలగు కమ్మతావులు వెదచల్లు కపురంపుటనంటి బోది
యల నారసికొనిపోవుచు, రేపకడం మేల్కాని యెరలువెట్టి పిల్లల నెఱకల నిడికొని
యొదిఁగి నిదురించు కారుకోడిపిట్టలం బిట్టులికించుచు, సర్వవృశ్చికంబులకు వెఱ
వక వెరవున వెలుతురుకై వత్తి నోటంగఱచి పట్టికొని యల్పవిశాలంబులగు గిరిబి
లంబులం దూఱి చని యందు నిదురించు సేదుపందులం గడకాళ్ళు పట్టికొని వెనుక
కీడ్చికొనివచ్చు నిషాదుల సాహసంబున కచ్చెరువునొందుచుఁ బథమ్మునఁ దమ్మం
గాంచి భయమ్ము గ్రమ్మికొన రయమ్మునం బారుటై పాఱు శశకాది క్షుద్రజంతుని
కరమ్ముఁ గరమ్ముఁగ నికరమ్మునం బోవిడుచుచు, మృగయాపరిక్షిప్తపిపాసార్త పృష
త్కంబులు మనుఁబోతులం గుచ్చికొని యుచ్చి చనిన వేగంబునం గాఁడినవాడిన
జోకలగు మావిమోకల నాలోకించి యానులంబు నొందుచు మఱియుం గొన్ని సంక
టస్థలంబులం బాదంబులం దీవలల్లికొనినం బోఁజాలక మిట్టిమిట్టిపడు కణుతుల
సమీపంబునకుం బోయి బంధమోక్షంబు గావించుచు నశ్రమంబులగు తాపసాశ్ర
మంబుల చెంతం గాసారంబుల తీరంబులం బర్ణశాలలు విశాలంబులుగా నిర్మించికొని
వసించుచు, వల్మీకబిలంబులు వెలువడి దీర్ఘజిహ్వాపల్లవంబులు సాఁచి చిఱుచీమ
లం జవిచూచుచు నలుకువొడమినం జుట్టచుట్టికొని వెలికింజిప్పల ప్రోవుగనప్పట్టఁ
గొంతవడికి భయంబుదీఱిన నెప్పటియట్లతిరుగ నారంభించు నాలువల నాలోకించు
చు, వివిధమధుర ఫలపలంబుల నాఁకలిఁ బుచ్చుచుఁ, బువురాల్చిన తరుమండంబు
తారకారహితంబగు నాకాశంబు చందంబుగా వితర్కించుచుఁ గంఠీరవంబులకుంతి
తోత్కంఠం గుంభికుంభస్థలంబులు వగులించిన నందలి క్రొమ్ముత్తియంబులు
రాలుటగా నెఱుంగక బదరీఫలభ్రమ దట్టంబులగు పత్రపుట్టికలం బెట్టుచు, విటపాగ్రం
బుల నమాంసమ్ములగు నెమ్ములు గనుంగొని చిఱుతపులు లల్పమృగంబులం బట్టి

యుచటఁ బెట్టికొని భక్షించుటగా నూహించుచుఁ దరుశిఖరములాయపరినిక్షిప్త నిజాండ గ్రసనోద్ధతకృష్ణసర్ప సమాలోకన జనిత మహాశోకరోష వేగ పరిభ్రమిత పక్షికులార్త నాదంబులకుం గనికరించుచు, మచ్చికలచ్చుపడం బెచ్చుపెఱిగి పచ్చికపట్టులకువచ్చి మెచ్చివిచ్చలవిడి మేయుచున్న సారంగంబుల చరణాంగంబు లధిష్ఠించి తత్ఖుర స్పర్శనంబున నీరందికెగయు శలభవిసరంబుల సరభసంబునం బట్టికొని మ్రింగి క్రమ్మఱ నెప్పటియట్ల తేళ్ళ మూఁకలం బాదంబులు మోపి యుల్లసిల్లు భర వ్యాజంబుల నభివీక్షించుచు, నిలువెల్లం జలిచీమలు గఱచి పట్టినం గాళ్ళఁజాలక తరులతాగుల్మంబులు సొల్వడం గొట్టికొను మెట్టపొట్టపింజరుల యుపద్రవంబులు దప్పించికొని పోవుచు నార్ద్రప్రదేశంబుల విహరించియుం బుప్పరసంబులు పుక్కిళులంబట్టియు వచ్చుచుంబోవుచున్న జంటీఁగల వెనువెంటం దప్పకచని [illegible]దపటులని ష్కుహామ్ములగు ననోకహమ్ములం గనుంగొని తన్నిమిత్త సమాయాతభల్లుక వ్రాతంబులందోలి తద్గర్భమ్ములఁ గరమ్ముఁ జొనుపుటకుఁ గరమ్ము నిఱుకటమ్మైవశమ్ముగాకున్నం గొనగోళ్ళనవియించి కాఱుమధుధారలం దోయిళులంబట్టి క్రోలియుండనిని సనకటాత్తినెటియలం జేతులు వడిపి మధుకోశంబులు దీసియొసంగినం బొట్లంబులు గట్టునెడ నెఱుంగక చిన్నిపూఁదేనె పోరలం బురువుల తుట్టెలని పాఱవైచు చిన్నవారలంజూచి నగుచు మరల నేరించు చెంచునాయకుల వింతమాటలకు సంతోసంబునొందుచు ఫణిఫణామణి తోరణ విశాలసాలసౌధాంతర జ్యోతిరింగణ దీపికాదీపితమృదుగుళుచ్ఛ సుమలతాకాయమానమధ్యప్రదేశ మకరందపరిక్షాళిత శిలాతిలాసీనభిల్లపల్లవాధరీ వినోదమధుర వేణునాదంబులకుఁ గరంగుచు నిజకాంతు సంతానంబుల గుల్మాంతరమ్ములు నిరంతరమ్ములుగాఁ గర్పటాకారంబున నేర్చిన నల్లి దానిం దగుల్కొని చిక్కిన కీటకంబుల దంశంబు లుపదంశంబులుగా భక్షించు నూర్ణనాభంబుల యాలోచనంబులకుఁ దలయూఁచుచు మేఁకల సందడిం జెదరిపోయిన సమయంబునఁ బొంచిచని క్రోల్పులులు సలుఁగులంబట్టికొని పాఱునెడ నిజశాబకంబు లొనరించు నార్తరిందెలుపు ఘీంకారంబు లాలించి గ్రక్కునం గలసికొని వ్యాఘ్రంబులని గ్రహించి పిల్లగుమింగఁ బికొని పొదల సందిసంబులం బొదలుచు ఘుర్ఘురధ్వానంబులం బుడమి వ్రక్కలించుకొని యొక్కట ప్రోవుగా నిదురఁ జొక్కియున్న స్తబ్ధరోమంబులం దెలుపుచు శుష్కవంశాన్యోన్య సంఘట్టనోద్భూత ప్రభూతవనహుతాశనజ్వాలాకలాపంబునకు సహాయంబైన మధ్యాహ్నసమయోష్ణ కిరణోష్ణాసహిష్ణువులై మడ్డుఁజడి పొరలు సైరిభంబుల నిధంబులుగా నభివీక్షించుచు, మృతమృగకళేబర దుర్గంధ గర్తపర్న ధూర్తమృగ ధూర్తసమాఘాతంబులకు

రోయుచు, చమరీమృగ వాలవ్యజనవీజనోజ్జనిత మరుచ్చలల్లతాలతాంతడోలికా సంస్థితంబులగు మిళిందబృందఝుంకారంబులకు వినోదంబు నొందుచు, శశశావకంబులు వెనుకొనం గనుకనింబాఱి యుబ్బారిం దోలంగఁ దమ్మొంజేరిన రురువారంబులం గటాక్షించి తద్విరోధంబులగు జంతువుల నదలించుచు, మనోహరవిపరీత భయానకంబులకుఁ దానకంబులగు ఖగమృగస్వనంబు లాకర్ణించుచు, నిరోధిత తరణికిరణ ప్రసరణతరులతాశిఖర పరిపక్వఫలప్రతిబింబిత తారకాకోరక ప్రకరంబునుంబోని ఫణిఫణామణిప్రభాపటల ధగద్ధగితంబున కచ్చెరువందుచు, వనేందిరాకిసలయహస్తపరిభ్రస్త ముక్తాఫలక్రమాభివీక్షిత బాలతృణాంకురాగ్రమాలికా ప్రతిభాసిత హిమానీ బిందుసందోహంబుఁ గొనియాడుచు నిండారం బండిన దొండపండులదండం దండిగఁ జెక్కిన జిగురుం గండెలం దండోపతండంబులుగా బెండువడి పడిన పీలిపిట్టలం బట్టికొని మెచ్చువచ్చు కుచ్చులం బుచ్చుకొను శకుంతాంతకుల చెంతకుం బోవుచు దివాచర నిశాచర మృగపక్షి ప్రచరణంబువలనను గమల కైరవ వికసనోన్మీలనంబు వలనను ప్రభాకరోదయ కలాస్తమయ కాలనిరూపణంబు గావించుచు మెట్టయుడుతపిల్లలంబట్టి విడుచుచు శార్దూలంబులం దోలుచు తరక్షువుల శిక్షించుచు శరభంబుల సరిపెట్టుచు గవయంబులం గడతేర్చుచుఁ గణుఁజులకుం దొలంగుచు వాఁడిగల ముండ్లుగాఁడినం దూఁగాడుచు నన్యోన్యవైర సంశోషణంబు లగు సంభాషణంబులాడుచు వర్షాతపహిమానీ నివారణంబుగా గుజ్జుమావులపజ్జకుం బోవుచు గుసుమవిసరంబు లేఱుచు నీరంబులం దూఱుచుఁ గొంతదూరంబు చనిచని యొక్కనాఁడొక్క పుణ్యాశ్రమంబుఁ గనుంగొని యందు. 65

మ. భవనారణ్యభవప్రతీతు సుగుణభ్రాజిష్ణు వింధ్యారిదు
ర్భవనాగారిఖగాధిపున్నియమిసంభావ్యప్రభావాధ్యునిన్
భువనారాధ్యుని మాత్రవచ్ఛలికితాంభోరాశి నక్కుంభసం
భవనాముం జగదేకవంద్యఘనులోపాముద్రప్రాణేశ్వరున్.

క. కని మ్రొక్కి సీతారాముని గ్రక్కునఁ గుఱిచ్చియెత్తి మునిమక్కువనె
క్కొన నక్కున నక్కునఁ గదియ, నును జెక్కులు నొక్క కడుమనోమోదమునన్. 67

ఉ. అంబుజమిత్రగోత్రకలశాంబుధిసోముని రాముని బ్రమో
దంబునఁ గన్న పుత్త్రునివిధంబున నెంతయు నాదరమ్ముమీఱా
పంబు వహించెనోయనఁ గృపన్మునిదేల్చి సుఖాసనార్ఘ్యపా
ద్యంబుల నిష్టవాక్ప్రనిచయమ్ముల నిట్లలరించి వెండియున్. 68

క. లక్ష్మణుఁగృతలక్షణుఘన, లక్ష్మణుమన్నించి తనకులసతిననిచెనా
లక్ష్మీసమానయగుజన, కక్ష్మాధీశసుతఁ బూజఁ గావింపంగన్. 69

వ. నియోగించి రామలక్ష్మణుల నుచితాసనసమాసీనులం గావించి మధురవచనరచనల
నలరించి రాముం గనుంగొని. 70

ఉ. కాయమువొంగనిన్నుఁ బొడఁగాంచితి ధన్యుఁడనైతి నాదినా
రాయణమూర్తివీవు మునిరక్షణకై యిటులుద్భవించినా
వాయనసీతనూజభవదంగనపంకరుహాక్షిలక్ష్మినూ
నీయనుజుండు లక్ష్మణుఁడు నిక్కము శేషఫణీంద్రుఁ డారయన్. 71

చ. త్రిదశపపద్దశాప్త్యతిగుణించి విరించి స్మరించినన్ ధరి
త్రిదశరథోర్వరావరసతీత్రయమందుఁ జతుర్విరాకృతు
ల్మదమునఁదాల్చి పుట్టితివమోఘమువిష్ణుఁడవీవు తావక
ప్రదరనిపాతితంబులగు రాక్షససైన్యములొక్క వ్రేల్మిడిన్. 72

వ. అని యభినందించి మఱియుం బుణ్యకథావిశేషంబు లుపన్యసించుచు నిట్లుండనగ
స్త్యుండొక్కనాఁడు రఘుపుంగవుంగనుంగొని నీవింక నిందుండవలవదు గౌతమీతటం
బున నుత్కృష్టంబగు పంచవటంబుగలదచట నుటజంబునిర్మించికొని జానకీలక్ష్మణ
సమేతుండవై యప్రమాదంబున నుండునదియని చెప్పి రాఘవున కమోఘశిలీముఖంబు
లొసంగి యాదరాతిశయంబున. 73

క. హస్త్యయుతతరునినరుణగ, భస్త్యన్వయవరుని రామభద్రునిఁ గరుణ
న్స్వస్త్యధికంబగునటుల నగస్త్యుఁడు దీవించెఁ గౌతుకం బలరారన్. 74

వ. దీవించినం బరమానందంబునొంది రామచంద్రుండు మునిచంద్రుం గనుంగొని. 75

క. వింధ్యమునణఁచితి బలపరి, పంథ్యభ్యర్థితుఁడవగుచుఁ బాణితలమునం
గంధ్యుదకమ్ముం ద్రావితి, వంధ్యతపోవిభవపొగడ వశమే నిన్నున్. 76

వ. అనియిట్లు ప్రత్యభినందనపూర్వకంబుగా వీడ్కొని. 77

క. సాలసురసాలపనసత, మాలవకుళపూగనక్తమాలసదమిసీ
తాలమగువనంబున సీ, తాలక్ష్మణసహితుఁడై ముదంబున నరిగెన్. 78

గీ. ఇవ్విధంబున నరిగి మదేభసింహ, శరభశార్దూలభల్లూకసైరిభతతి
గలిగి కాకఘూకారవాక్రాంతమగుమ హావనంబుల విహరించు నవసరమున. 79

సీ. వటముఖతరుశిఖాచ్ఛటలు గనుంగొని, యుఃక్రూరసర్పంబు లేయటంచు
గుమ్ముఁబర్వులువాఱు క్రోడంబులను గనుఁగొని యిభగజములొకోయటంచు

వావిరి మెఱఁగు శిఖావలంబులఁ గని, యివి పెనుభూతంబులే యటంచు
వీచికాసదృశవరీచికల్గనుఁగొని, యివి దీర్ఘదీర్ఘికలే యటంచుఁ
గీ. దరళద్రాక్షాదివల్లీవితానసంచ, యల్లలితపీథమ్మిల్ల భిల్లపల్ల
వాధరులఁ గాంచి మునికన్నెలాయటంచు నడుగునడుగున్గకుఁ దన్నుఁ బొడమిజాత.
వ. వెండియు. 81
చ. వికచసరోజగంధి పృథివీసుత రాముని కేలుపట్టి కం
టకతరుదుష్టసత్త్వనికటంబు బిచ్చుటంజరియింప నేలయొం
డొకభయశూన్యమై చనుడ కొయ్యన నేగుట యుక్తయంచు నా
రసధరపత్త్రికఁ జూపుఁగనుఁ రమ్యములంచుఁ దలంచి ముగ్ధయై. 82
వ. ఇట్లు చెలంగక పల్కు జానకిం గనుంగొని కొండొకవిషాదంబు గదిరిన మ్మొగంబునం
దోఁపనీక మఱుమాటల నిట్లనియె. 83
క. కాలవశతనివురించిన, గాలవశతములను వేడ్కఁగనుఁగొను వైదే
హీలతలువోలిచె వైదేహీలలితలతాంగి చూడు మింపొందంగన్. 84

ఉత్సాహ.
కొమ్మకొమ్మటంచు నేర్చి కొమ్మకొమ్మపంతులుం
గుమ్మరించు రుచులమించు కొండచఱుల జున్నులు
న్నెమ్మి మీఱ నెమ్మగులుకు నెమ్మిపురుల కన్నులు
న్నమ్మతిగ నొసంగు రామచంద్రుఁ డవ్వనంబునన్. 85
వ. ఇట్లొసంగుచు వనవాసం బనాయాసంబగు నట్లు సేయుచున్న యన్నం గనుంగొని
లక్ష్మణుండు తనమనంబున. 86
సీ. స్యందనంబు శతాంగమయ్యె భూజానికి, జయ్యెకుఁ బున్నాగ మయ్యెఁ బొన్న
జగతీశునకు నుటజంబు భవనమయ్యె, నవనీపతికిఁ జూర్ణమయ్యె రజము
అధిపవరాళికి మావు లశ్వరత్నములయ్యెఁ, బాట్లయ్యె నృపునకు భల్లుకమ్ము
లధిపతికి చందంబులయ్యెఁ బత్త్రింబులు, దరులయ్యె నిగమములు న్నరవరునకు
గీ. భద్రకలశంబులయ్యెఁ గుంభములు ప్రభున, కఖిలజనమాన్యునకు గోతులయ్యెఁ గపులు
ధరణికలవంతమైన విధాత్రకృత్య, మెవ్విధంబునఁ దలఁగుదు రెట్టివారు 87
క. మేలగు వీణారవముల, మేలుకనెడు రామవిభుఁడు మృదువిగ్రహుఁడై
కాలమున నృగాలంబుల, యూళల మేలుకొనఁ జొచ్చె నుగ్రాటవులన్. 88
వ. అని వగచి, జానకిం గనుంగొని. 89

గీ. కఠినపాషాణకంటకాక్రాంత మిద్ది, నాతియుఁ సంచరింపఁగా నకట యెట్టు
లోర్చె మెత్తని మెత్తల నోర్వదరుణ,కిసలయనిభంబు జనకజాంఘ్రియుగ్మంబు. 90

క. ధాత కిదితగునె కితవను,ధాతయువసుధాతలములఁ దపిలిచరింప
న్నీక కటువ్రాసె మిగులన్, బాతకిరై సీత నేమిఫలమగుఁ దనకున్. 91

క. అని ఘనదుఃఖంబున మునిఁగిన మనముం ద్రిప్పికొని యకృత్రిమభక్తిం
దనుగొలిచి గానరేంద్రుఁడు, జనకసుతాసహితుఁ డగుచుఁ జనిచని యంతన్. 92

క. ఆఁకటువీస్థలమున సీతాయువతిప్రియుఁడు భక్షితక్రూరఫణి
స్నాయువు జటాయువున్, ఖగాయుధహృతఖలనిశాచరాయువుఁ గనియెన్. 93

వ. కనుంగొని. 94

క. చెక్కసపుఁదుక్కఁదునియలఁ, ముక్కలుగావింపఁజాలు ముక్కు నెవరికిం
జిక్కనిదిక్కనిచక్కని, రెక్కలుఁగల యిప్పులుంగు నేఁ డెవఁడొకో. 95

మ. అని చర్చించుచుఁ దత్సమీపమున కయ్యార్కాన్వయాధ్యక్షుఁ డా
య్యాఁకఁ జేరంజని యాతఁ డాత్మవిధమాద్యంతంబునుం దెల్పి ప్రే
క్కి నతుల్సేసిన దీవనల్వెలుఁగఁ బక్షిశ్రేష్ఠుఁ డీడ్కొల్పి చ
య్యన ధాత్రీకన్యానుజుల్ వోవఁగడ నత్యంతానుమోదంబునన్. 96

వ. వృక్షలతాకుంజపుంజంబులం జెలంగు పక్షుల నీక్షించుచుం జనిచని. 97

క. ధీమంతుఁడు రాముఁ డనుజస,తీయుతుఁ డటఁ గనియెఁ బరమధృతియుతమునిపా
థేయము శశకనకులగా,ధేయముఁ బంపావటసమభిధేయము నెదుటన్. 98

వ. కనుంగొని లక్ష్మణుం గనుంగొని. 99

మ. తపసుల్సేసెడు సంయమీంద్రులకు శీతచ్ఛాయలం గూర్చునా
తపముల్సంవారణం బొనర్చుఫలసంతానంబులం గూర్చుఁ బా
దపముల్లూవితె ధర్మమెల్లను వనస్థంబయ్యె నిచ్చోఁ బరం
తపముఖ్యం బగుఁ గొన్ని వాసరము లుద్యల్లీల వర్తింతమే. 100

వ. అని మఱియును. 101

క. తమ్మునిఁ గనుఁగొని నాచి,త్తమ్మధిక ప్రమదసంయుతమ్మయ్యెఁ బవి
త్రమ్ముగ నొనరింపుము పత్త్రమ్ముల నొకభవనమిచట రమ్యము గాఁగన్. 102

సీ. అనుటయు నకుటిలుం డాకుటిల్లొనరించి, చూపిన నెంతయుఁ జోద్యమంది
యుచితవిశాలంబు నుజ్జ్వలత్పత్త్రల,తాకల్పితంబు నాతపతుషార
వర్షభయాపేతవాసంబు సమతలం,బగుటకు మోదించి యాదరమునఁ
దమ్ముని గాఢరాగమ్మునఁ గౌఁగిటఁ, లాలించి తత్కౌశలతకు మెచ్చి

గీ. సీతతోఁ గూడ నందు వసించెఁ దత్స, మీపమున నొక్కచోట సౌమిత్రి యుల్ల
మల్లసిల్లుచునుండ నలోపితుజంబుఁ, గట్టికొని యుండె రామభూకాంతుఁ డలర. 103

వ. ఇవ్విధంబున నివసించి సమస్తోపచారంబులు లక్ష్మణుండొనరింప సుఖంబుండి సమయ సమంబులు పండ్రెండుఁ గడపి యల్పావశిష్టంబగు నత్త్రయోదశవత్సరంబునం దొక్క నాఁడు. 104

మ. ధరణీనందనకున్ఫలంబులు సుమిత్రానందనా తెమ్ము పా
మ్మగయుం బారఁగ రమ్మటంచుఁ బనుప నొమ్మదంబు న్లక్ష్మణుం
డు రహింబూవులుఁ గాయలాకులును బండ్లుంగోయ నకాండనాం
తరసీమన్విహరించుచుండ నతివిస్తారాద్భుతాపాదియై. 105

క. క్రతుభుగ్రిపునాశమును, గ్రతనసితోద్వేల మొక్క కరవాల మవ
క్రతరంబై తోఁచె శత,క్రతుమాయాకలితమగుచు గగనతలమునన్. 106

వ. అంతరిక్షంబునం బఱతెంచి సమక్షంబున నిలిచిన యలక్షితకార్ముకంబు నభివీక్షించి లక్ష్మణుండు దక్షిణహస్తంబునం బరిగ్రహించి తత్తీక్ష్ణపరీక్షార్థంబు గానప్పుడ.

క. ధారాధరనిభములగు మ్మహీరుహముల నఱక మానులేతెంచి ధరి
త్రీరమణపుత్త్రి భయదసి,ధారాదళితములు సేయఁదగునే తరులన్. 108

వ. అనిపలికి వారించి యమ్మును లా రాజనందను నుద్దేశించి. 109

మ. ఫలసంఘంబులు లేవు రావు ఖగము ల్పత్త్రంబులన్ భక్షణా
ర్హలసత్కాంతులు గావు కావున మహావ్యాళ్యాళికిన్ రావు బూ
వులగుత్తుల్గరావు మాత్రమునఁ దావు ల్లేవు రాజేంద్రనీ
వు లసద్బాహుబలుండవై వ్వృధసఁ బోవుం గున్మితూటాడుమీ. 110

చ. అనవుడు రాజనందనుఁ డహర్పతితేజుఁడు లక్ష్మణుండు చ
య్యనఁ దను హెచ్చరించెడు మహాత్ములకు న్ముదమొప్ప వాళవ
ర్ధన మొనరించి యందు రథిప్రవిలిప్తకపోలునిం గృపా
ణనిహతసత్కపాలుని ఘనవ్రతశీలుని దైత్యబాలునిన్. 111

క. కని మునిపుత్త్రుఁ జంపితి, నని భయకంపితశరీరుఁడై కడు వేగం
జని తన యన్నం గనుఁగొని, వినిపించెం దనదు సర్వవృత్తాంతంబున్. 112

వ. వెండియు. 113

క. నరవర యెఱుఁగక గుల్మాంతరితుండై తపము సేయు తాపసవంశో
త్తరు నొకబాలకు భయదస్ఫురితాహతుఁ జేసినాఁడఁ జుమ్మని పలుకన్. 114

ఉ. విన్ము సహోదరా దనుజవీరులఁ జంపి మునీంద్రరక్షసే
యన్మనమింపు వచ్చి దురితాత్ములఁ జంపక యిట్లు సాధువృ
త్తి న్మునియై సమాధిరతి న్మద మొందుచునున్న మానిబా
లు న్మెడ ద్రెవ్వనేసి కడు లోపితకర్ములమైతి మక్కటా. 115

వ. అని యనేకవిధంబుల ననుజసహితుండై విచారంబు నొందుచున్న యన్నరేంద్రచంద్రు సమీపంబునకు మునీంద్రు లరుగుదెంచి భవదనుజభుజాసిధారాదళితమస్తకుం డగు నతండు దనుజుండు వీనిం దునుమాడుట యనఘంబని యతనికి మనస్తాపోపశమనంబు లగు వాక్యంబులు దగుభంగి నుపన్యసించి యనంతరంబ సౌమిత్రిం జేరఁ జని యిద్దురాత్ముండు విద్యుజ్జిహ్వుండను రావణసహోదరి యగు శూర్పణఖ యం దుద్భవించినవాఁడని తదీయజన్మప్రకారంబుఁ దేటపడం బలికి మఱియును.

ఉ. జంబుకుమారుఁ జంపితి నిజంబు కుమారక దీన నీకు దో
సంబు తలంచిచూడ యవసంబును లేదు మదంబునొందు మా
త్రింబడనేల యీతని వధించితినంచుఁ దదీయవృత్తి స
ర్వంబును నీకెఱుంగఁగ ధ్రువంబుగ నిప్పుడు విన్నవింపమే. 117

క. అనిన మిషము సేయఁగఁ దన, జనకునిఁ జంపిన విరోధి సమయింపఁగ ని
ట్లొనరించెను తప మితనిం, దునుమాడిన దీన నీకు దోసము గలదే 118

వ. అదియునుం గాక మదీయప్రేరితుండవై యొనరించుటం జేసి పాపంబునకు సంశయింపం బని గలదే యని వాచంయమిప్రకరంబు నిజాశ్రమంబులకుం జనియె నిట్లు మహామునిప్రబోధితులై రామలక్ష్మణులు నిర్విచారులై యుండి రంత నొక్కదినంబున.

క. శూర్పణఖ వచ్చి యటు పరిమార్పఁబడిన కొడుకుఁ జూచి యాఱనిపగ త
న్నేర్పఁగ గద్గదాన మ్రుదువ, వాద్పులు బొబ్బలు సెలంగ నాక్రందించెన్. 120

వ. ఇట్లరణ్యరోదనంబు సేయుచు మృతుండగు సుతుం దలఁచి. 121

శా. తండ్రిం జంపినవానిఁ జంపుటకు నుద్యుక్తిష్ఠ నిచ్చో గడు
న్రౌద్రంబైన తపంబు సేయు నిను నేవీరుండు హింసించెనో
తండ్రీ నామది శోకమాఱునె మహాదౌష్ట్యంబు సంధిల్లఁ బె
క్కండ్రం జంపక యుంచు నుద్వృత్తవక్త్రపోల్లసద్దంష్ట్రియై. 122

ఉ. మానులఁ గాంచి నాసుతు నమానుష తేజు వధించినట్టి దు
ర్మానిని జూపకున్న మిము ద్రుంచఁగ మోఁదెద నన్నవారల
మ్మానినిఁ గాంచి భీతియుతమానసులై తగ నిట్లు పల్కి ర
మ్మా నిజమాలికిం దు మొక మర్త్యవరేణ్యుఁడు ద్రుంచె నావుకున్. 123

ఉ. అంగన వానిఁబట్టి పరిమార్పఁదలంచి కడంగి ఘోర కా
లాంగనవోలె రోయుచు మహాటవి నొక్కెడఁ గాంచె సాధ్వి నా
త్మాంగనఁ గూడి సోదర సహాయమునం దగురీతిఁ బర్ణశా
లాంగన మొప్పఁ జేయు మహితాత్ముని రాముని గీర్తికాముని౯. 124

వ. ఇట్లు గాంచి. 125

ఉ. వామతరోల్లసద్దశనవారవిభాచపలాంశుజాలము౯
శ్యామలవర్ణముం బటుదయారసవృష్టియుఁ గల్గి కానలో
నీ మెయినున్న వాఁడు ఘనుఁడీతఁడు సంశయమింత లేదు నా
కీ మహనీయతేజు నెడ నెంతయు నగ్గలమయ్యెఁ గామము౯. 126

వ. అని మఱియు నతనిం దనివిసనక కనుంగొని. 127

సీ. ఇతని మోమరవింద మితని కన్నులయుంద, మిందీవరంబుల పొందుఁ దెగడు
నితని కటులు తిన్నె లితని మాటలు చిన్నె, లలసుధాధారానయంబుఁ దెగడు
నితని పొక్కిలి బావి యితని చెక్కులు తీవి, యలదర్పణముల సోయగముఁ దెగడు
నితని మోవి పగడం బితని కంఠము డంబు, కంబుమానిత సుందరంబుఁ దెగడు
గీ. నితని హస్తము లస్తము లితని వెడఁద, యురమయూర మిమ్మహాత్ము పొందొప్పఁ గాంచి
యెలమి నొందని జన్మంబు వృథయటంచుఁ, జేరఁ జనుదెంచె రాక్షసస్త్రీ రయమున.

క. మునివర్యులకు నోర్మిహాము, జరియింపఁగఁ జేయు రామచంద్రుంగని కా
మినిదోషాచరి మోహించిన దనుటకు ధరణి నేమి చిత్రము తలఁపఁగ౯. 129

క. కని రిపువంశ్యులు జేరం, జనుదెంచెడు దానిఁ గుసుమసాయకబాణ
ప్రనిహతమనోబ్జజనఖం, డన పటుతరతీక్ష్ణశూర్పణఖ శూర్పణఖ౯. 130

వ. అయ్యవసరంబున లక్ష్మణుండు నీ వెవ్వరిదాన విచ్చలనికిఁ గాఁ బ్రయోజనంబు నీకుం
గలుగ దేమి దశరథరాజనందనుల మిర్వురంబును విహారార్థంబు చనుదెంచితి మెడ
గలిగి పొమ్మనుడు నతని నాదరింపక యన్నిశాచరి రామచంద్రుం గనుంగొని. 131

ఉ. ఆతతకీర్తి పూర్వవిబుధాధిప శేఖరుఁడైన రావణా
ఖ్యాతునితోడఁబుట్టువ నకంపికచిత్తముల స్త్వవశసం
జాతను నిన్నుఁ గాంచి సుమసాయకసాయకపీడితాంగనై
తీతను వేలరాదు వసుధేశ్వర నిన్ను వరింపనుండఁగ౯. 132

వ. అదియునుంగాక వినుమేను గామరూప ననేకవిధ సుందరాకారంబులు వహించి
ప్రీతుఁ జేయను కలసి చోటికి సిన్నెత్తికొని పోవను నేర్తు మదీయ నామధేయంబు

శూర్పణఖ నన్నుం గలసి భవత్ప్రియానుజప్రియాసహాయుం బపేక్షింపక కామోప
భోగంబు లనుభవింపు మని పల్కిన నవ్వుచు నతం డారక్కసిం గనుంగొని. 133

క. కుమతీ చంపక విడిచినఁ, బ్రమదంబునఁ బొంగి చనక ప్రత్యక్షులఁ గూ
టమిఁ గోరెదు నాతో రాకుమటన్నం జంక నెత్తికొనుమను భంగిన్. 134

క. అని పలుకునంత దానిం, గనితద్వికృతాకృతియును ఖరనిస్వనముం
దన కద్భుతమగుటకు ధరాతనయ నగియె నగినఁ గ్రోధతామ్రాననయై. 135

ఉ. ఆదనుజాంగనాధము ధరాత్మజఁ గన్గొని నిన్ను మ్రింగినం
గాదనువారు లేరు నను గర్వముఁ దక్కుమటంచుడాసి వ్యా
ద్ఛేదకవాక్యసంతతులు ప్రేలిన రాముఁడు కర్ణనాసికా
చ్ఛేదన మాచరింపుమనఁ జెచ్చెరలక్ష్మణుఁ డట్లొనర్చినన్. 136

క. ముక్కుఁ జెవులుఁ దెగిపోవుడు, నుక్కఱిరక్కసులు వెగడనురురవమున నా
టుక్కరి మిక్కిలియేడ్చుచు, నిక్కరణి న్నేయధర్మవే మాకనుచున్. 137

ఉ. వాలమ్రొక్కినం గినియు వాయుభుగంగనభంగి నింగి వా
తూలరయంబునం బఱచి దుర్మతి యప్పిశితాశి యన్న పే
రోలగమున్నచోట రుధిరోద్గమవైకృతకర్ణనాసికా
మూలము లెత్తియు న్నలుప ముందఱ వ్రాలెఁ గరంబు దీనతన్. 138

వ. వ్రాలి మహారోదనంబు సేయుచు నన్నం గనుంగొని. 139

ఉ ఒక్కనరుండు దారయు సహోదరుఁడుం దనుఁగొల్వ రాజసం
బెక్క వనక్షితిం దిరుగ నెక్కడివారలు వీరటంచు నే
నక్కడ కేగి వారివిధ మారయఁగోరినఁ గర్ణయుగ్మము
న్ముక్కును గోసి చేనిడిరి మోసముగాఁగ ఖరాసురాగ్రణీ. 139

శా. నాసాకర్ణవిహీననైతినని చింతం బొంద నింతేనియు
న్నీసామర్థ్యము లెక్కసేయక స్మయాంధీభూతులై కావను
ల్లాసాధిక్యతనున్నవారని గడున్లజ్జింతు నన్నీచులం
బ్రాసాసిక్షురికాదిసాధనముల న్భంగింపు మెభ్యంగకున్. 141

ఉ. వారనికిన్న నిష్టపరివారపలాశసమన్వితుండవై
వారణహస్తసన్నిభభవద్భుజవిక్రమమెక్క సేగి య
వ్వారని సేయఁజాలక జవంబఱిపాఱినఁ బాఱనీక వే
వారలఁ జంపకున్న మనవారలకుం గడుఁ గీడు మీఁదటన్. 142

చ. విను మను నవ్వె వారి వెనువెంటఁ వచ్చెను కాంత దానిచే
తనయిటులయ్యె నాదు వికృతత్వము గావున నన్నుఁ గూర్చి య
మ్మనుజుల తేజమేని సురమర్దన దానిగుఱించి యింక ని
ర్దనుజులగోత్రమేనిఁ గడు దగ్ధము సేన్ని జమింత తెల్పితిన్. 143

చ. అనుటయు దండతాడితమహాహిగతిన్ ఖరుఁ డల్లిసోదరిం
గనుఁగొని చింతదక్కు మిదె కానన మున్నఖిలేచ్ఛభంగి న
మ్మనుజులఁ గాల్చి ప్రత్తు ననుమానము దక్కుము చూడు మస్మదీ
యనిబిడకోపము త్తవివిధాద్భుతబాణము లెట్లు సేయునో. 144

వ. అని ప్రగల్భవచనంబులాడి. 145

చ. అతనినిభోగ్రవాక్యనిచయంబులఁ జెంగట నున్న దూషణ
త్రిశిరులఁ గాంచి వేగఁ బఱతెండు బలంబులఁ గూర్చి సత్కృపా
ణశరముఖాహవోపకరణంబులు దెండనినం గడంగి య
ప్పిశితభుగీశ్వరుల్ గడలు బీఁటలువాఱఁగ నార్చుచుం గడున్. 146

వ. సమరసన్నాహ సముత్సాహంబునం బొలిచి నిలిచినం గాంచి, 147

క. స్వస్థసురేంద్రవధూగృభస్థాభ్రకకోటి మిగుల బద్దలు గాఁగం
బ్రస్థానభేరి చెలఁగ జనస్థానము వెడలి ఖరుఁడు నడిచెఁ గలంకిన్. 148

క. ఖరుఁడు నిశాచరకులశేఖరుఁడు ఖరుండిట్టి వ్యాఘ్రమువ ఖరకరవంశో
త్తరు ధామమ్ముజనవుహా; త్తరు రాముం దొడరనరిగెఁ దత్తఱపడుచున్. 149

వ. అమ్మహీపాలుం డనుజన్మునాలోకించి. 150

మ. అవనీభాగము సంచలింపఁగ భటాహంపూర్వికారావసై
ధవహేషారవ మత్తసింధుర మహోద్యద్బృంహితధ్వానమే
ఘనిధూతాతతగంధవాహకపతాకస్యందనాభీల నే
మినిరావంబులు మించె నెక్కువఁగ సౌమిత్రీ కనుంగొంటి వే. 151

చ. అదియును గాక భూమిరజ మడ్డెస మిక్కుటమయ్యె నెన్నరో
కదన మొనర్ప రాక్షసనికాయములోఁ జనుదెంచునట్లుగా
మదిఁగనవచ్చె నాఖలుల మాఱ్కొని కండలు చెక్కువైతు నీ
వదినను గాచి యుండు మొకవైపున భద్రము గాఁగఁ బుత్త్రికా. 152

క. కుసుమశరవిద్ధయగు ర్నాక్షసి జానకి ప్రమింగఁబోవ సముయింప నప్పే
క్షుసలిపి వికృతాకృతిఁజేసి సారిదివిషువంగ నింతఁ జేసె న్సహజా. 153

ఉ. కావున సంశయింపఁ బనిగాదు ధరాసుత భీతినొందు సై
న్యావలిఁ గాంచి యట్లుకుటు నద్రిగుహాన్నివసింపఁజేసి య
చ్చోఁ విశిఖాసనాస్త్రపరిశోభితహస్తుఁడవై ముదంబున
న్నావలియుండు మేను సురకంటకులం బరిమార్చునంతకున్. 154

వ. అని సీతారత్నంబునకు లక్ష్మణుం బదిలపఱచి. 155

మ. కలభాలోకనచారుచంక్రమణవక్త్రశ్రీవనస్ఫూర్తిభూ
తలయాద్ధత్యమహాట్టమూర్తి క్రియ రౌద్ర ప్రస్ఫురన్మూర్తియై
విలునమ్ముల్గొనిలీలఁ దాల్చి కనె నవ్వీరుండు రాముండు ని
శ్చలనైశాచరమాన్యము న్నదను వాంఛాశూన్యము న్సైన్యమున్. 156

వ. అంత నబ్బలంబులు గంతుమిగిలి. 157

ఉ. చేరఁగవచ్చి శూర్పణఖ చెప్పినవీరుఁ డితండెయంచుఁ గ
న్నారఁగఁజూచి లేశము భయంబునలంపక యుద్ధక్రోధమే
పారఁగఁ జుట్టుముట్టిన మహాబలుఁ డాతఁడు గన్నుదోయి కెం
పారఁగ నబ్బలాటవి బయల్పడఁజేయుఁ దలంచి యుగ్రుఁడై. 158

శా. మధ్యాహ్నోష్ణసహస్రభాను క్రియ రామక్ష్మాధినాథుండు వా
ర్ధిధ్వానముతోఁ జయానిసర మర్వీభాగము న్నిండి సా
న్నిధ్యాఘాతము గాఁగనుంగొని మహోన్నిద్రస్ఫురన్మూర్తియై
పథ్యాహీనము గాఁగ నించెనిషువు ల్ప్రాబలీఢపాదస్థుఁడై 159

శా. శ్లాఘాలంఘ్యపురశ్ఛవేద్ధరుచి సత్సౌదామినీజాలమున్
జ్యాఘాతస్తనితంబు దీర్ఘవిలసచ్చాపైంద్రచాపంబు న
వ్యాఘాతాంబకవృష్టియుం గలుగు రామాభ్రంబు రక్తప్రవా
హౌఘంబు ల్గలిగించె భూతవితతు ల్హర్షింప సైన్యాటవిన్. 160

వ. వెండియు రఘువరుండు కోపోద్దీపితుండై. 161

ఉ. కొందఱఁ గుత్తుకల్దునిమి కొందఱఁ జెక్కులు చెక్కి కొందఱం
గొందలమందఁజేసి పటికొందఱ మేనులు సించి కొందఱం
జిందఱవందలై పఱవఁ జేసి విశేషరయంబు పేర్మి న
య్యందఱఁ గూలనేసె నరుణాన్వయుఁ డందఱ కన్నిరూపులై. 162

ఉ. ఒక్కెడ నేనుఁగుల్పదియు నొక్కెడ నశ్వము లుక్కడంగు వే
ఱొక్కెడఁ గేతువుల్వియుగు నొక్కెడఁ గాలుబలంబుగూలు నిం

నొక్కెడ రథ్యములున్నలుఁగు నొక్కెడ వ్రాలు శతాంగపఙ్క్తి దా
నొక్కెడ రాముఁ డెవ్విధినొకో తొలఁగించెను బాణకోటులన్. 163

క. అని తను నుఱలగ్గింపఁగ, ననితరసామాన్యవిక్రమాధికుఁడై రా
మనరేంద్రుఁ డివ్విధంబున, ఘనతరశస్త్రహతి రిపుల గాసియొనర్పన్. 164

ఉ. జన్యమునేయఁజాలక నిశాచరసైన్యము దైన్యమంది రా
జన్యుని దేఱిచూడక వెసం బఱవన్ ఖరుఁ డడ్డమేగి యి
ట్లన్యశరణ్యశూన్యులక్రియం జుణుఁగందగ దేనుగల్గ మే
దిన్యధినాథుఁ గూల్తునని త్రిప్పె నిశాచరకోటిఁ గ్రమ్మఱన్. 165

ఉ. క్రమ్మినవిక్రమమ్మున సగర్వుని శాత్రవుఁ జుట్టుముట్టి వా
లమ్ములు గ్రుమ్మరింతు సకలంకమనస్కుఁడనౌచు నంచు సై
న్యమ్ములఁ గ్రమ్మరించి ఖరనాముఁడు రాము నెదిర్చి తత్సమ
త్కమ్మున నిల్చియిట్లనియెఁ గన్నుల నెఱ్ఱఁదనంబు తోఁపఁగన్. 166

ఉ. మక్కువ నిన్నుఁ జూడఁగ సమక్షముఁ జేసిన మత్సహోదరి
న్మక్కువ గర్ణము ల్చిదిమి మోసమొనర్చితి వంతఁబోక నీ
య్రుక్కడిమాఁకఁ ద్రుంచి కడు మోదమునొందెదు నీవు నీవ పే
రుక్కును దేజముంగల మహోద్ధతుఁడైన నరేంద్రుచాడ్పునన్. 167

వ. అని పలికి మఱియు. 168

క. స్వేచ్ఛావిహారపరుఁడ వి, శాచ్ఛాదితయశుఁడఁ జూడు మఱిమునిఁ జేతు
న్మచ్ఛితశరముల నీ కంఠచ్ఛేదము ఖరుఁ డన స్వేడఁగ నను వినవే. 169

వ. అనిన విని రామచంద్రుండు మందస్మితసుందరముఖారవిందుండై యద్దనుజాధమున కని.

క. తను దాన పొగడికొను టొప్పని పని యని యార్యజనులు పలుకుదు రిపుడీ
పని సేయక మాటలచే, తన జరగఁ దలఁచి తివ్విధంబుఁ దెలిసితిన్. 171

వ. అదియునుంగాక. 172

ఉ. భీరుల ముందఁ జెట్టికొని బింకములాడెదు వెన్క నఖ్యమేఁ
గోరిన నస్మదీయకటు ఘోరతరాద్భుతమార్గణాగ్ని కిం
బోరననొల్క నీరుధిరపూరము నాజ్యముగా ఘటించి వెం
పారెదు ప్రాణవాయువుల నాహుతులీయ మి ధార్మికత్వమే. 173

చ. అన ఖరుఁ డల్గి దూషణుఁడు నత్త్రిశిరుండును దోడుగా నరేం
ద్రుని బటుబాణజాలముతో నెదిరించిన రామభద్రుఁడుం

జనుపడి వానితోడఁ దలపడ్డఁ గరంబును బోరు ఘోరమ
య్యెను గులపర్వతాళి నవియించెడు కార్ముకభీకరార్భటిన్. 174

వ. అట్టియెడ. 175

సీ. నక్తంచరధనుర్విముక్తనారాచపరంపరాసారంబు రాఘవాద్రి
ముంచిమించినఁ బెనుమంచుఁదుంపురుల నణంచు నగ్రాంశుచందమున నుగ్ర
మూర్తియై రాముఁ డమోఘశిలీముఖ, వ్యాపారమున వానితూపులడఁచి
నిశితబాణంబు లన్ని శిచరపతిమేన, గ్రుచ్చిన నొచ్చి ఖరుండు బీరు
గీ. వోని తాల్మి నరేంద్రునిపై ననేక,పరశుపట్టిసముద్గరప్రాసముసల
శూలకరవాలపటుభిండిపాలవితతి, విసర నదుమన నఱికె యవ్వీరవరుఁడు. 176

క. కేతనము విఱిచి తురగ, వ్రాతంబులఁ గూల్చి యర్కవంశ్యుఁడు వెసఁ ద
త్సూతుఁ దునుమ విరథుండగు, నాతని కెడసొచ్చె దూషణాఖ్యుఁడు గడిమిన్. 177

వ. అన్నకుం దలకడచి కోపాటోపంబున. 178

చ. రయ మధికంబుగాఁ జని విరాధవిరోధి నెదిర్చి ఘోరదు
ర్జయపథవర్తులైన త్రిశిరప్రముఖు ల్దగు తోడుగా మహా
భయదరణంబు సేయఁ గని పార్థివుఁడుం గడుఁ బోరుచుండ నొ
క్కయరద మెక్కి వచ్చి విశిఖంబుల ముంచె ఖరుండు రామునిన్. 179

ఉ. దూషణము ల్సెలంగ ఖరదూషణముఖ్యులు వెల్లురేఁగి యు
ప్పూషసువంశ్యునిం దొడరి పోరుటఁ గాంచి బలంబు లెల్ల సం
తోషము నొందిరొక్కెడ మొగిఁ దోఁచినఁ గోపము నొంది రాక్షస
ద్వేషణుఁ డాతఁ డప్డు పరివేషగతుండగు భానుచాడ్పునన్. 180

వ. మండలీకృతకోదండుండై. 181

క. తుంగమదవుసాచ్చిన మాతంగవిభునిబోలి రామధరణీశ్వరుఁ డు
ప్పొంగుచుఁ జెచ్చెరఁ దత్సేనాంగంబుల రూపుమాపి యలుక మలఁగమిన్. 182

సీ. శుష్కవంశాటవీశోభంబు గావింప, సమకొన్న వహ్నితానని భంగిఁ
బృథుబుభుక్షాపరిపీడితంబయి మృగవ్రజము గన్గొనిన సివంగిభంగిఁ
గన్నులఁ గప్పిన గవిసెనల్వీడి గువ్వపదువుఁ జూచిన పెనుపత్రిభంగి
సంవర్తసమయప్రజానాశ మొనరింప, వర్తించు నాసమవర్తిభంగి
గీ. వెఱసి దైత్యకోటిని క్కటక్కఖండ, కాండకాండాహతులఁ ద్రుంచుచుండఁ జూడ
భానుకులవార్ధిపు ప్రభ నఁ గాంచి, యొక్కరొక్కఁడె దిక్కాంద్ర హరాగ్రుఁడగుచు.

ఉ. కేవలశాలుఁడో యనఁగఁ గేలఁ గృపాణము గ్రాలఁగాఁ బృథు
గ్రీవము మీఁదికెత్తికొని కేకలు వేయుచుఁ దాఁకినం బృథు
గ్రీవుని ఫాలభాగమున శ్రీరఘురాముఁడు నించె నుజ్జ్వల
త్పావకసన్నిభంబులగు బాణము లాతఁడుఁ గూలె నేలకున్. 184

గీ. ఇవ్విధమునఁ బృథుగ్రీవు నేపడంచి, యాజ్ఞశత్రుని బరిమార్చి యంతఁబోక
శ్యేనగామిని దునుమాడి వానితోడి, వారల ననేకదైత్యుల నీరుచేసి. 185

వ. అవష్టంభవిజృంభితుండగు రాముని సహింపక. 186

ఉ. ఎక్కడఁబోదు నాయెదుర నీవని దూషణుఁ డారఘూత్తముం
గ్రక్కునఁ దాఁకి తీక్ష్ణవిశిఖంబులు నాటిన వానినన్నిటిం
జెక్కలు సేసి రాజకులసింహుఁడు రంహుఁడు మేను వెంచి తా
నక్కఱినాత్మ విల్లువిమి యాతనిఁగూల్చె రథంబు మున్నుగన్. 187

క. దూషణుఁడు పడుటఁ గనుఁగొని, శేషించిన దైత్యబలము చెదరిపఱచిన
రోషావేశంబున న, ద్దోషాచరుల న్మరల్చి దుర్గమలీలన్. 188

క. అశనినిభబాణవిద్యా, కుశలుండగు రామవిభుని గోపమున నిరం
కుశవృత్తి నడచి యప్పుడు, త్రిశృంగగిరివోలెఁ దాఁకెఁ ద్రిశిరుం డంతన్. 189

వ. ఇట్లు తలపడి. 190

మ. ఖరుఁ డానందము నొందఁ భూతచయమాకంపింప నారాజశే
ఖరుఁ డాయంజని యస్మదుద్ధతి నెఱుంగం జాల వారాజశే
ఖరుఁ డాజి న్ననుమార్కొన న్వెఱచు శక్యంబౌనె నీకింక మ
త్ఖరనారాచపరంపరాప్రణిపాతిం గష్టంబు వచ్చుం గటా. 191

వ. అనిపలికి. 192

గీ. పీఁకమెయిఁ దాఁకి మాయ లనేకములు ఘటించి నదు లబ్ధిఁ జేరి నశించుభంగి
మాయ లాతనిఁ జేరక మాయమైనఁ, గ్రోధమానసుఁడై రక్షసాధముండు. 193

ఆ. కనలి కనకపుంఖకనదంబకంబులఁ, రఘుము మెఱయనైవ రాఘవుండు
వాని నడుమఁ దునిమి వానివకుమునఁ గ్రొవ్వాఁడిశరము లేయ వాఁడు గనలి. 194

క. ఈడంబోక పెనఁగిన, వాఁడిమగఁడు రామవిభుఁడు వాలికతూపుం
గాఁడఁగ నేయ నతఁడు తూఁగాడుచు నిలఁగూలె దూషణాంతకుఁ డార్వన్. 195

వ. త్రిశిరుఁడు గళితశిరుండైనం గాంచి తక్కిన రక్కసిమూఁక లొక్కమొగిం జుట్టుము
ట్టుటయు. 196

క. కార్చిచ్చు పేర్చినిబిరీ, సార్చుల వన మేర్చుపగిది సద్దనుజులఁ బో
కార్చి యనంతరమునఁ గృప, గూర్చిన మది ఖరునిఁ గాంచి క్రూరరహితుఁడై. 197

చ. చెలియలి ముక్కు వోయె నను సిగ్గున కోర్వనివాఁడ విష్ణు త
మ్ముల తల లూడఁ గాంచితిని మోసమగుం దురహంక్రియాభిమా
నుల కిటు సైన్యహీనుని నిశం గనుఁగొన్నఁ గరంబు జాలివు
ట్టె లఘుత కోర్చి యీ చలము డింపుము నీ బ్రదుకేను గోరితిన్. 198

క. పలుకంగ వమ్ముఁ బలికిన, పలుకులు సెల్లింప నెట్టి ప్రాజ్ఞుకైనం
దలమే చలమేటికి నీ, తలమీఁదను వచ్చెఁ జావు దప్పఁ దొలఁగినన్. 199

వ. అనినం గనలుగదుర ఖరుండు. 200

క. నిను నస్మదీయబాణ, ప్రణిహతుఁ గావింపకున్నఁ బ్రజలు ననుఖరుం
డని వెఱతురె నను బరిమార్చిన దైవము నీవె కావె సిద్ధము జగతిన్. 201

గీ. అని పలుచనాడి నిజరథ మధిక చిత్ర, గతులను జరింప రాము సప్రతిహత ప్ర
భావు మార్కొని ఖరుఁ డిషుప్రకరముల ది, గంతరముఁ గప్పె యార్చె బ్రహ్మాండమద్రువ

ఉ. ఆర్చిన రామచంద్రుఁడు దయామహితాత్ముఁడయ్యు వీనిఁ బో
కార్చినఁ గాని కాదని దురాత్ముఁడ వైచెదు బాణకోటిఁ జ
ల్లార్చి నరాద నిన్నుఁ గని యక్కటికంబు జనించి యిట్టులా
రార్చినఁ గాన విజ్ఞుఁడు మహాత్ముల పల్కులు లెక్కసేయునే. 203

చ. అని విలుఁ ద్రుంచినం గనలి యాఖరుఁ డొండొకచాప మెత్తిన
న్మనుజవరుండు వెండి తునుమాడిన నన్యశరాసనంబు న
ద్దనుజుఁడు దాల్ప రాముఁడు పదంపడి దానిని ద్రుంచి వానితా
ల్చిన విశిఖాసనంబు లవలీల నరేంద్రుఁడు రూపుమాపుడున్. 204

ఉ. అన్యధనుర్లలామము రయంబునఁ బూని ఖరాసురుండు రా
జన్యుని పేరురమ్మునఁ బ్రమత్కరమ్ములు దూర్చి సిగ్గఱం
దైన్యము నొందఁ జేసెదను దారుణకర్ముఁడ నే నటన్న న
మ్మాన్యుఁడు రాముఁ డుగ్రతరమార్గణవారము నించె మేనునన్. 205

వ. వెండియు. 206

క. మాయావి ఖరుఁడు బహువిధ, మాయలు గావింప దైత్యమాయాఘ్నులస
త్సాయకములు గఱపుచు రఘు, నాయకుఁ డాతని శరాసనంబు నఱికినన్. 207

క. మండిపడి శక్తి వైచిన, ఖండించిన రాముఁ గాంచి ఘనభయదగదా
దండము వైచి నఱకను, ద్దండుఁ డతఁ డొండువిల్లు ధరియించు నెడన్. 208

క. వెన్నెలయనఁగను వగు నతికి, వెన్నెలవగుఁ గప్పుఁగొప్పు గేల్గవయొప్పుం
దిన్నెలఁ దెగడు పిఱుఁదులు న,న్నెలఁతక యొప్పుఁగాక యన్యుల కగునే. 240

సీ. కవ రాత్రులందు జక్కవలఁ బాపినయట్లు, పసిఁడికి దావిఁ గూర్చిన యవసడి
పవలు వికసనముఁ దోవఁ గోఁదిదిసంతు, చివురుల నివురంగఁ జేసినసడి
నెల నొకతీరుగా నిలువనీయనిరవ్వ, లే దూండ్ల నసటుఁ గూల్చినకో అంత
వెన్నెలఁ జుక్కల వెలుఁగనీని దగడా, రినుకతిన్నెల నెగయించురోయి

గీ. పాపికొనఁబోలుఁ నిఁతికుబ్బలను మేనుఁ, గన్నవరుఁ గేలుదోయిఁ జొక్కంప్రమోము
భుజములును గోరులును నిద్దపుంబిఱుఁదులుఁ, దనొనగ్గఁగఁ జాలి నెత్తమ్మి మాలి.

క. శయమా పరిస్ఫుటకుశేశయమా లసదలికులాతిశయమా సుబిలే
శయమా జిత నాభిజలా, శయమా సతి కీనుతేమి సరి సంశయమా. 242

వ. అని యివ్విధంబున సీతాసతిసౌందర్యంబు సంక్షేపరూపంబున. 243

క. నీచచరిత యగు నాఁజి,నీచరి తెల్పుటయుఁ దగవిని మన మలరఁగా
నాచెఁ ద్రిక్కసుండా, లోచనఁ గావించెఁ బద్మలోచనఁ బట్టన్. 244

గీ. రమణిఁ దేనిట్టు లూహించి రాముఁ డలఘు,రాదులన రాదులను బట్టి కానసుక్కు
డంచె ననుమాట నిజహృదయంబుఁ గలఁప, గపటమానసుఁ డగుదశకంఠుఁ డంత

క. ఏచినవిరహానలమునఁ, దోఁచక నొక్కరుఁడ వెడలి త్రోచినతాల్మి
స్న వనొంబుజుఁ డకుమా, రీచుం దనపూర్వమంత్రి బుభుభయదకరున్. 246

వ. చూచి వనోభీష్టంబు తెఱఁగు సమస్తంబు నెఱిఁగించి లోకవిద్రావణుం డగు
రావణుం డిట్లనియె. 247

ఉ. కొంచక మాయలేడి వయి గొబ్బున రాముని లక్ష్మణుం దోలం
గించుము పర్ణశాలకు నొకించుక దూరము నంతలోనఁ బె
న్వంచన రామదేవిఁ గొనివచ్చెద మెచ్చెద నీప్రతాప మ
గ్గించెద నెల్లకాలము సఖిత్వనిధీ యటుసేయు మింపునన్. 248

చ. అనవుడు దీని కియ్యకొన కడ్డముపల్కినఁ బ్రాణగొడ్డపుం
బని యగు నీచేత నొడఁబడ్డ నరేంద్రునిదొడ్డవారసం
బునిగుడు మీఁదబడ్డ శరము స్మడిఁబడ్డశరంబు వోవునే
యని యడిఁకడ్డపల్గ్రియ నాతని కిట్లనియె న్నయంబునన్. 249

ఉ. దీపము గాంచి మిఁగఁబడి తెంచి నశించినపుర్వుభంగి ను
ద్దీపితవిక్రమాఢ్యుని సతీహరణంబునఁ జావువచ్చుఁ గా

దీపని రాఘవేంద్రునిపయి న్మన మేగుట మీాలు క్రొవ్వి దా
మేపున నేటిగట్టుపయి కెక్కినయట్లుగ దా తలంపఁగన్. 250

ఆ. చిన్ననాఁ డతండు నన్నలుంగున నెత్తి, నూఱుయోజనములు వాఱ దవ్వ
జలధివిసరివైవ వెలలితిఁ జావక, నతనిదివ్యలీల లద్భుతములు. 251

క. శైశవమున నతఁడు ధనుః, కౌశలి కాకుండియును విఖండనఁ జేసెం
గౌశికునాజ్ఞ సుబాహు, గౌశికనిర్గత్య తాటక న్మరు గాఁగన్. 252

క. అని రామునిబల మెఱిఁగి ,చిన నాతఁడు విశిక కినుకఁ జెందుట మదిలోఁ
గని మారీచుఁడు శ్రీరామునిచేఁ జచ్చుటయ పరమమోక్షం బనుచున్. 253

ఉ. క్రూరుఁడు తాటకాత్మజుఁడు కోమలకైతవకృష్ణసారసా
కారత నెంతయు న్నొప్పుగఁ దనరె స్వేలిచుక్కలచాలుచే
ధారుణిసంచరింపఁగ సుధాసిధిలాంఛనమైనయిట్టి త
చ్చారుసుధాసుబిందువిలసద్వపువొప్పఁగ వచ్చెనోయనన్. 254

క. అంగము బంగారముఁ గన్నుంగవ పృథునీలతరమణులుఁ బాదవగున
చ్ఛృంగములుఁ గుఱుచవాలము, నుంగల్గి కురంగమై మనోవేగమునన్. 255

ఉ. రాముఁడు లక్ష్మణుండును ధరాసుతయుం దలిరాకుటింటఁ జే
తోముద మొప్ప నుండి తదదూరమునం బరిఫుల్లమల్లికా
క్రామితగుల్మమధ్యలతికాపృథుభాసితపుష్పడోలికా
ప్రాయుతనీలభాకలితబంభరనాదము లాలకించుచున్. 256

క. ఉన్నయెడ వారుమువ్వురు, నున్నయెడకు నేగి జిహ్వ యుద్ధ్రుగునో కా
కున్నో యని చూచుగతి నన, లన్నాలుక సాఁచి తినుచు లంఘన మొప్పన్. 257

వ. కురంగంబు కుఱంగటమెలంగుటఁ గనుంగొని కురంగలోచనయగుసీతాంగన రాముని
కరాంగుళిఁ బట్టికొని. 258

చ. కనుఁగొను మింతచక్కనిమృగంబు జనించుట యద్భుతంబు నా
మనమున దీనిఁ బెంచుటకు మక్కువ మిక్కుటమయ్యెఁ బట్టితె
మ్మనవుడుఁ దత్పరిగ్రహసమాహితవ గ్రహుఁడై కడంగె రా
మనరవరేణ్యుఁ డంగనలమాటలకుం బతు లుత్సహింపరే. 259

వ. ఉత్సహించి సౌమిత్రి నాలోకించి. 260

క. ఈ వచ్చెకుసారంగము, నేవిధమున నైనఁ బట్టి యిచ్చటికు న్నే
వేవచ్చెదునంతదనుక, మీావదినెను గాచియుండుమి నీవనుచున్. 261

చ. కపటమృగాకృతిం జనులఁ గాఱియవెట్టఁ దలంచి మానవా
ధిప దనుజాధమాధములు త్రిమ్మరుచుందురు కాననంబుల
న్నృపగతనీతు లావిధము వాఁడ యితం డిది మాయలేడి, కా
దిపుడు చన న్భ్రమాత్తమ మదీయవచస్సరణిం గ్రహింపుమా. 262

వ. అని పలికి వెండియు. 263

క. ఈకసుగతి నీవ సుమతి, వీ కెఱుఁగని దొకటిగలుగునే మారీచుం
డీవచ్చెడు రాజీవా, బీ వచ్చెడుగు వెనువెంట నేగందగునే. 264

క. హితమతి నీగతి నతిమా, నితదివ్యజ్ఞానబోధనిధి లక్ష్మణుఁడం
చితముగఁ దెలిపిన మాయా, వృతుఁడా రాఘవుఁడు సర్వవిదుఁ డిట్లనియెన్. 265

క. ఇది నిక్కపుసారంగపుఁ, గొదమ యయిన వేగఁ బట్టికొని వచ్చెదఁ గా
కది మాయలేడియేనిం, జదరఁబుల దానియురము వ్రక్కలుసేతున్. 266

క. వదలక భక్తిమెయి న్నీ, వదె నను గాచికొనియుండు వాతాయువుఁ దె
చ్చెదనని యటజఁ బున దన, ముదిత నసిచి రాఘవుం డమోఘాంబకుఁడై. 267

ఉ. ఆజిరమాటకుం డన జుఁ డంబకము న్ధరియించి పర్ణశా
లాజిరవర్తి గాఁగఁ దనయంగము పొంగ నరేంద్రుఁ డేగ ఘో
రాజినయోనిఁ బట్టుటకు నట్టియెడం గగనంబు మాసె ఘో
రాజి నయో నిశాచరులయన్వయ మీగతి మాయనోయనన్. 268

క. వడియు నగదశ్వసనముల, కెఱవక నట్లేగి ప్రధవనృపభుఁడు గనియెం
దెఱకకు మఱుపియఁబుగ, మెఱయుచు కిహరించునట్టిమృగముఁ సరగన్. 269

వ. అవలోకించి. 270

క. ఇంచుకయు సద్దు సేయక, వంచనకాయంబుతోడ వసుధేశుఁడు దాఁ
బొంచి చని పట్టఁబోఁ గుప్పించియెగసి మాయలేడి బెదరినకరణిన్. 271

చ. ముఖ మెగయించిచూచుఁ దృణముం దగమూర్కొను మస్తకంబు గోఁ
కు ఖురపుటంబులం బ్రధునికుంజముల న్వడిఁ దాటి డాఁగు నా
సుఖ న మొప్పఁజేయుఁ బలుగొమ్మల నిట్టటుఁ గొట్టుఁ బొట్టితోఁ
క ఖురకరాగ్రయుండు సరగం దనుఁబట్టఁదలంచి వెంబడిన్. 272

చ. రవికులవార్ధిచంద్రుఁడు కురంగముఁ బట్టఁగ నెద్దిన న్ననో
జవముఁ బుట్టలుం బొదలు జంగునఁ దాఁటుచుఁ బాఱు లేడియుం
దివిలి దూప వృక్షసవిశంబుల రాముఁడు దేరినిల్చినం
జవమతి నట్లు నాలుకను సాఁచి వగర్చుచు నిల్చె నిట్టియున్. 273

క. సారంగధరుఁడు మున్నిటు, సారంగము వెనుదవిలినచందంబున నా
సారంగసదృశదృష్టిన్, సారంగము వెనుక రామచంద్రుఁ డరుగుచున్. 274

చ. శిరమున మేనునన్ నలుచిక్కఁగఁ జేర్చికొను న్నతాగ్రపాం
తరములఁ బొంచి పొంచినను దారికి నడ్డమువోయి దట్టపుం
దరువులమాటునన్ నిలుచుఁ దత్పరతం దృణముష్టిఁ జూపు భూ
వరకులనాథుఁ డాహరిణవర్యముఁ బట్టు నుపాయశాలియై. 275

వ. అయ్యవసరంబున. 276

గీ. తృణము గఱచుట చంచలదృష్టి గనుట, భయము నొందుట వెన్నిచ్చి పాఱుటయును
జూడఁగా నప్పు డమ్మాయలేడి సమర,భారమున కోడి పాఱెడిపందవోలె. 277

వ. మఱియును. 278

సీ. దాఁటుచోఁ బూర్వపాదద్వంద్వ మొక్కెడఁ, గదియించు టంజలిక్రమముగాఁగ
లలిఁబాఱుచో ఖురంబులు నెఱియలఁ బడి, మ్రొగ్గుట యొప్పగు మ్రొక్కుగాఁగ
నురుతరశ్రమమున నుసుగక వెడలు ని,ద్రాఘోషకంబు పాద్యంబుగాఁగఁ
దినునెడ రాలినతృణలేశ మతిపవిత్ర మ్మగుదర్భాసనమ్ముగాఁగఁ

గీ. జేరి యెదురేగు టాత్మోపహారముగను, రామ నొప్పించె మాయాకురంగ మపుడు
పరమపురుషుఁడు హరిసమర్పణముగాఁగ, ముక్తిఁ గోరి యొసంగెడు మునియుఁబోలె.

వ. వెండియు నక్కురంగశాబకం బగంబులనక నగంబులనక రయంబునం బాఱుచు మా
యావిగాన రామునిపై శరవర్గంబుఁ గురిసెడుదానిం బోలె జరమఖురపుటా
గ్రంబుల ధరణీపరాగంబు మీటుచు రాక్షసవంశక్షయం బగునుత్పాతంబునుం
బోలె మిన్ముట్టి కెగసిపడుచు మృత్యుముఖగహ్వరంబునం జొరంబాఱుకరణి గుహా
ముఖంబులం దూఱుచు బ్రాణాత్యయావసరంబునంబోలె భ్రమించుచుఁ బూరుషుని
సంపదయుంబోలెఁ దనంతఁ దోఁచి యదృశ్యం బగుచు దరిద్రునిఁబోలె దీనా
ననంబుఁ జూపుచు సమీరంబుపగిది నలక్షితవేగంబై గరుడనిభంబునఁ గర్బురాం
గభాసురంబై యాపురుషునికడువునం గుటిలమార్గగామియై నరకంబున కోర్వనిదా
నిఁబోలె నసిపత్రవనంబులకుఁ దొలంగుచు ఘోరదుర్గమారణ్యమార్గంబున బహుదూ
రంబుగా నెలయించికొని చనుటయు రాఘవుండు నిజాంతర్గతంబున. 280

క. తమ్ముఁ డిదిమాయలేడి మున్నమ్మన నమ్మఁదగ దన వినకవచ్చితి మో
సమ్మయ్యె దీని నుగ్రత,గమ్మనఁ గూల్తు నని భయదరంహస్తరుఁడై. 281

ఉ. తూణములోనిబాణ మతితూర్ణముగాఁ గొని నారిఁగూర్చి య
క్షీణమదంబునన్ నృపతిసింహుఁడు రాముఁడు తూఱనేసె ని

స్త్రాణము దుర్విషాణము విరాజితశోణము సత్కృసాలయా
ఘ్రాణము ఘూసఖాణ మఘకర్మధురీణముఁ గైతవైణమున్. 282

వ. తచ్ఛరం బురంబు నాటుటయు. 283

చ. స్మయరహితుండు నిర్దళితసత్త్వుఁడు నై తనతొంటిరూపు వి
స్మయముగఁ దాల్చి రాక్షసుఁడు చచ్చె నెడన్ వెస లక్ష్మణా హతో
స్మి యనుచుఁ బేరెలుంగున వచించి ముఖంబున నెత్తుఁ గ్రోల్కన
వ్యయుఁ డగు రామబాణహతి నాతఁడు ప్రాణము వీడె ధన్యుఁడై. 284

క. ఇవ్విధమున మారీచుని, క్రొవ్వుచెఱచి యులుక్కుచును రఘుప్రవరుఁడు వెం
దవ్వరు దెంచితి నని వెస, నవ్వనముం బాసి వచ్చె నంతటిలోనన్. 285

మ. అనుజా లక్ష్మణ చేరరావె యనుదీనాలాప ఘోరాముఁ డా
డిచ్చందంబునఁ దాటకాత్మజుఁడు నూటింబల్కు టాలించి హా
యని ధాత్రీసుత వెచ్చనూర్చి వెనదైన్యం బాకృతిం దాల్చనో
యన సౌమిత్రిముఖంబుఁ గాంచి యిటురమ్మా యంచు భీతాత్మయై. 286

క. ఓయన్న సుమిత్రాసుత, మీయన్న వనంబులోన మిగిలినవగ రా
వో యన్నఁ బలుక వేమిటికో యన్నఁడు లేనిభీతిఁ గూరె మనంబున్. 287

గీ. అసురవరులును సురలుఁ దన్నాఁగి రేని, భయముఁ జెందనిశూరుఁ డిప్పగిదిఁ దమ్మఁ
డా యనుచుఁ జే(బిల్చెను డాయఁబోఁగ, దయ్య తడ వేలనయ్య ప్రణ్యముగ దయ్య.

ఉ. అంజలిసేతు రాముని రయంబున నిప్పుడ కూడఁబోయి నా
సెంజెలి దీర్పుమంచు ధరణీసుత వేఁడిన లక్ష్మణుండు బ
ద్ధాంజలియై తదీయచరణంబుల మస్తము మోపి యేల భీ
తిం జలనంబునొందఁగ సతీముఖుఁ డుమ సూల్లసత్పదా. 289

క. లలన పదునాల్గుభువన, మ్ములభారము మీఁదఁబడిన మోయవలఁతి త
ద్బల మీవు నే నెఱుంగమె, చలింపవల దింక రామచంద్రునికొఱకున్. 290

క. క్రించుఁదనంబున రాముని, వంచింపం బెటిఁగి దనుజవంశాధము లూ
హించి వెడమాయలను పచరించి చెడుదు రగ్గిరడిన క్రిములవడువునన్. 291

వ. అనిపలికి మఱియును మదగ్రజుండు హరిణపరిగ్రహార్థం బరుగునవసరంబున. 292

క. వదలక భక్తిమెయి న్నిప్ప, వదినెను గాచికొనియుండు వాతాయువుఁ బ
ట్టైదవ నని యరిగెం జెప్పుచుఁ, దదీయవచనంబు లెట్లు దాఁటుదుఁ జెప్రమా. 293

చ. అనవుడు రామచంద్రుఁడు మహాపద నొంది సహోదరా రయ
మ్మునఁ జనుదెమ్మటంచుఁ గడుఁ బొక్కుచుఁ జీరిన నంతఁబోక న

న్ననుచితమార్గవర్తను దయాపరిహీనునసహ్యుఁ గాచియు
న్నను ఫలమేమి యన్నను వెసం గఁబోవఁగదన్న మ్రొక్కెదన్. 294

క. అనుటయు నధోముఖుండగునను, ఘనచింతాక్రాంతుఁడును విగళితాశ్రుఁడు ద
త్తనిరుత్తరుండు నగునా, తని గన్గొని సీత క్రోధతామ్రాననయై. 295

మ. ఇదెమీయన్న మహార్తుఁడై పిలిచెఁ బోమిమ్మ యన్నఁ బోవేమి నీ
మదినూహింతొ కాక కాన నొగుల న్మాతోడనే తేరఁ బూ
ర్ణదయామూర్తివె యంచు నిష్ఠురము లన్యాయంబుగా లక్ష్మణు
న్సనతీరత్నము దూఱినాడె సదసద్వ్యాపృగ్లకా దుఃఖితల్. 296

వ. ఇట్లాడి దుఃఖాతిరేకంబున. 297

క. నాచిత్తము నినుబోటులకు, గోచరమే యన్నచావుఁ గోరి నను మది
న్యోచితమగు టెఱుఁగఁ జాలితి, నీచ సుమిత్రాసుత దురాత్మ నిహతవివేకా. 298

క. వాటుం బగునన్మనుటజ, వాటముకడ నిలువ నీవు వల దనవు కు న
మ్మాటలు తనహృదయంబున, కీఁటెలపోటులయి నాటు నిట్లనిపలికెన్. 299

ఉ. ఆరఘురాముఁ డాత్రిదశుఁ డక్కట యివ్వనభూగ్రగాత్మున
క్రూరము నిన్నుఁ బాసి చనఁగూడదు నా కని యొత్తిచెప్ప ని
ష్కారణనిష్ఠురోక్తుల నఘుం బనిమాడఁ పల్కి డిట్లు నీ
వారయ కన్న మత్సహృదయస్థితి రాముఁ డెఱుంగకుండునే 300

క. అని పలికి రామచంద్రుఁడు, చనినపథముఁ బట్టి చనియె సౌమిత్రియు నొ
వ్వనిహృదయంబున రావణుఁ, డనుకూలం బైన సమయ మని ముద మొదవన్. 3 1

క. అన్యాయుఁడు ఖలుఁడు విఫలి, తాన్యాయుఁడు ఘోరరూపుఁ డంతట మాయా
సన్న్యాసి యయ్యె నారా, జన్యునిసతిఁ బట్టు దుర్విచారముతోడన్. 302

గీ. ఇట్లు కర్మందియై తను వెల్లబూది, పూఁతఁ దనరార నొకజలపూర్ణకలశ
మమరధరియించి హరహరా యనుచు వచ్చి, పర్ణశాలముఁ గదుసమీపమున నిలిచి.

క. దేహిభవదుఃఖదూరుఁడ నై, దేహి భరితవినయుఁ గాంచి దేవీ భిక్షాం
దేహీ యనుడు జానకి సం, దేహింపక యెదురువోయి ధృతిదళ్కొత్తన్. 304

వ. అర్ఘ్యపాద్యంబు లొసంగి నిభృతయై యిట్లనియె. 305

ఉ. ఇంచుక విశ్రమింపుము యతీశ్వర మత్పతి వచ్చి మిమ్ముఁ బూ
జించు నతండు పొన్నెడలి జింక తటాలున నిందువచ్చి న
ర్తించిన దానిఁ బట్టికొని తెమ్మని వేడుక మీఱ నేను ప్రా
ర్థించినఁ దన్నిమిత్తమున దివ్యధనుర్ధరుఁడై సహోదరున్. 306

క. పుత్త్రసమాను సుమిత్త్రా,పుత్త్రకు నసమాను సుగుణభూషణు ఘను న
స్మత్త్రాణపరాయణుఁడై, ధాత్రీపతి కాఁపు వెట్టి దానిపిఱుందన్. 307

గీ. అరిగి తడవయ్యె హా లక్ష్మణా యటంచు, దైన్యమునఁ జీరె నాతనితమ్ము నతఁడు
నతనిఁ గనఁబోయె నుల్కుచు నడవి నొంటి, నున్న నానఁ బరివ్రాజకోత్తముండు.

వ అని చెప్పి. 309

క. కుశలంబె వసుధ నేలిన దశరథుకోడలను రామధరణిపుభార్యన్
దశదిశల విశదం బగు,యశమునఁ జెన్నొందుజనకునాత్మజ ననిన్. 310

క. అతివా నీ నాథుచరి,త్రప్రతివాక్యంబులకు నాహ్లాదము వలరె నీ
గతి వానల నెండల నీ,యతివామాంగంబు వసట కాపన యయ్యెన్. 311

చ నెలఁ బురుడించుమోము మహనీయతరం బగుచున్నదోయి వె
న్నెలవడదాఁకుదేహము నణీయతరం బగుమధ్యభాగముం
గలుగఁగఁ జేసి భాగ్యనిధి కాంత నొనర్పక నిన్నుఁ బేదకు
న్నెలఁతఁగఁ జేసె నేరునఁగ నేర్తు విధాతృఁడు దుర్విదగ్ధుఁడై. 312

క. నవనీరజగంధివి కదా, నవని రజోగంధి వగుట యన్యాయము దే
వవిలాసినీకదంబము, నవధీరణఁ జేయఁజాలునందము గలుగన్. 313

గీ. అని మఱియు నిద్దురాత్ముఁ డయ్యవనిజాత, దర్శనముఁ జేసి నీదుసౌందర్యమునకు
సర్వభువనంబు లేలెడుసార్వభౌము,పత్ని వగు టెంతయును లెస్స పద్మగంధి. 314

చ. అనుటయు వానిఁ గాంచి వినయంబు బొంకయించుక లేక సీత న
న్నుచితరీతి నీతి విడి యాడెదు దుష్టనికృష్టపద్ధతిన్
మనమున సత్కులాంగనలు మానక సన్నుతి సేతు రిట్లు వ
చ్చునె పరికించిచూడఁ బరిశుద్ధులనోట నశుద్ధవాక్యముల్. 315

క. నానాథు శౌర్య వందిత,నానాథుని కార్య నీవనాథుని గా హీ
నా నాతోఁ బల్కెదు తగు,నా నానాలోకవాశనముఁ గోరి కటా. 316

క. పితృనానతిఁ బురముఁ దృణ,ప్రతిమానముఁ గాఁ దలంచి భయదఘనవన
స్థితిఁ గోర్చెఁ గాక లోక,త్రితయము నేలంగ వలఁతి దృఢభుజశక్తిన్. 317

వ. అనిన నయ్యతివ్యాజపరివ్రాజకుం డయ్యవనిజ కిట్లనియె. 318

క. నిన్నను నీనాథుం గడు, నెన్నికొనెదు గాని నిర్జరేశ్వరుఁ జెఱసా
ల న్నిలిపి రాక్షసులచేఁ, సన్నుతిఁ గనినట్టి నన్నుఁ జర్చింప వహో. 319

ఉ. నీ విటు విన్ము సీత మహనీయుఁడు తాత పులస్త్యుఁ డప్పవి
శ్రావసుఁ డన్న యక్షపతి వానిజయించి తదీయపుష్పక

శ్రీవిభవంబు లెల్లఁ గొని జీవముతోడుతఁ బోవనిచ్చితి
రావణనాముఁడన్ భయదరాక్షసనాథుఁడ లంక నేలుదున్. 320

క. లోకములెల్ల జయించిన, లోకభయదవిక్రముఁడఁ దలోదరి భవదా
లోకమ్ములఁ జిక్కితి నను, గైకొను మిష్టోపభోగగతి వడయుటకున్. 321

వ. అని వెండియు. 322

ఉ. ప్రాయముకల్మి నింపెసఁగి రాక్షసనాథుఁడ నైన నాయభి
ప్రాయముఁ దీర్పుమా యనుచు రావణుఁ డాడిన నాఖిలుం దృణ
ప్రాయముగాఁగఁ జూచి నృపభామిని జానకి వల్కె ఛద్మవి
ప్రాయముఁ జూడ నీవు మదిఁ బట్టెనె నెమ్మనమందు కీఁతిన్. 323

ఉ. సారపుబ్రహ్మవంశమున జన్మము నొందితివంటి నీవు నా
చారపుమాట లాడుట యసంగత మేమి బలిష్ఠతన్ వృథా
నీరయిపోఁ దలంచితివి నిశ్చయ మింతకు నిన్ను నాతత
క్రూరము లాఘవోత్తమునిరోపము లిప్పుడు రూపుమాపవే. 324

గీ. రామలక్ష్మణు లిచ్చోట లేమి వెఱిగి,వచ్చుటన తెల్లమయ్యె నీవారి విజిత
విక్రమము నీమసత్కీర్తి విశదమయ్యె, నన్ను నున్న జయించితి నన్న విన్న. 325

క. చెడుగ చెడుకాలమైనన్, వెడఁగునుడుగు లాడె దిట్టు వేయేటికి నీ
వెడఁగలిగిపొమ్ము నృపుఁడే, మ్యెడనుం జయదేకమున్న యెయ్యెడకైనన్. 326

చ. అనవుడు నంగజాతతశరానలతాపవిభిన్నచిత్తుఁ డ
వ్వనజదళాక్షి వేగమ భవద్వచనామృతవృష్టిఁ దేల్పకు
న్నను మరణంబు నీకతన నాకగు నిశ్చయ మంత నన్నుఁ బో
లిన మగవార లెవ్వరును లేమిఁ గాంతలు వంత నొందఁగన్ 327

క. గోభూభుజగజగత్స్థిత,భూభృత్కుచలెల్ల వలసి పొందుదురు నను
గోభూభూరిద్రోహుఁడ, నీభాగ్యము గాదె పొలఁతి నిన్ను వలచితిన్. 328

ఉ. ఎక్కడి రాముఁ డింక నతఁ డెక్కడ కెక్కడ వచ్చుఁ గానలో
నెక్కడ వోయెనో యనుజుఁ డెక్కడ వోయెనొ రాక్షసాలిచే
నెక్కడఁ ద్రుంచెనో మృగము లెక్కడ మ్రింగెనొ వానిమీఁద నీ
కెక్కడి ప్రేమ రమ్ము మన మేలుద మిద్ధఱను త్రయంబునన్. 329

సీ. అప్సరోవనితల నవధీరణము సేయు, రాక్షసాంగనలు హారతు లొసంగఁ
క్రీడాభవనకుడ్యకీలితవిమలనిశ్చలదీప్తిమణిదీపికలు వెలుఁగ

ఘనశైత్యకారకఘనసారమిశ్రిత,స్పృఘులచందనచర్చ హృదయ మలర
నత్యంతవివిధమనోహ్లాదకల్పిత, పరిమళాగరుసుధూపములు మలయ
గీ. మెచ్చి బలమున నేఁ జెఱదెచ్చితిట్టి, ఖచరకాంతలు తనునాడికములు సేయ
బాల కైలాసమును శమీపత్రముగను, జేసి యాడెనుదశకంఠుఁ జేరఁదగదె. 330
వ. అనిపలికి యాక్షణంబ. 331
క. శశధరముఖ ఘనఖబర్హిస్మృఖ,శరత్ప్రేక్షణల బంధసాలుల నిడున
తృటవీక్షింపు మనుము విం,శతికరములు దశశిరములు సమబాకృతియున్. 332
గీ. మెఱయు నూఁదలు గలపత్త్రితెఱఁగుఁ దోఁప, నెదురనిల్చిన జానకి హృదయ మదర
శేమిసేయుదు నిటకు మాయామృగంబ,దేల చనఁదెంచెఁ బొమ్మంటి నేల విభుని.
వ. అని తలంచి నిరుడుభయాతిరేకంబున. 334
క. ధరణీసుత ధర్షింబడి, పరమం బగుమూర్ఛ మునుఁగఁ బట్టుకొని నిజో
ద్ధగ్ధంబున నిడికొని సుశ్వాసుఁడై రావణుఁడు పోవఁ దదవసరమునన్. 335
ఉ. ఇంచుక తేఱిమాడి మొగమెత్తి దిశల్పరికించి తన్నునా
క్రంచుకభీతి లేక కొనియేగెడు రాక్షసనాయకుం బ్రతీ
క్షించి కరంబు బెగ్గడిలి చిత్తము తత్తఱమంద సీత దుః
ఖించెఁ దదీయశోక మెఱిఁగింపఁగ బ్రహ్మకునైనఁ దీఱునే. 336
వ. దుఃఖించుచుఁ దనమనంబున. 337
క. పుణ్యవతిననుఁదిమాట లగణ్యములు గణింపనైతిఁ గల్గునె ఘోరా
రణ్యమున నింక నాకు శ, రణ్యమనుచుఁ జింతమిగుల రామునిఁ దలఁచుచున్. 338
క. క్రోధాత్ముండై తొల్లివి,రాధుం డెత్తికొనిపోవ రక్షించితి త
ద్బాధయుడిపి యిప్పుడు రఘు,నాథ కృపఁ బ్రోవ విదేమి నను జెఱఁ దలఁగన్. 339
ఉ. వే యనుజన్ముఁ గూడి రఘువీర దురాత్మకు వీనిఁ ద్రుంపరా
వే యను లక్ష్మణా కడు వివేకవిహీనత నిన్నుఁ గొన్నియ
న్యాయము లాడి తత్ఫలము నందితి నిప్పుడ యన్నఁ దోడితే
వే యను వీనిఁబట్టి పడవేయగ వేయనునేల మ్రొక్కెదన్. 340
క. రావణుఁడు నన్నుఁ జెఱఁగొని, పోవుచున్నాఁడు వీనిఁ బోకార్చి నను
గావఁగ నియ్యెడ రఘువర, వేవచ్చినఁగాక కీర్తివికలత గాదే. 341
వ. అని మఱియు ననేకవిధంబులం బలవించుచు. 342
చ. ఎక్కడఁజొత్తు నేనితెరు వెవ్వరిదిక్కిఁక నేమిబుద్ధి న
న్నిక్కృతినాత్ముఁ డెత్తికొని యేగెడు నిప్పుడ మట్టుముట్టి మ

త్రెక్కి నవీనికంఠముల నెంతయు మేదినిఁ గూలఁ దాఁచి నక్
జక్కఁగఁ బ్రోవరయ్య సురసాధ్యవియచ్చరకిన్నరోత్తముల్. 343

క. పరమపతివ్రతసీత, న్సరగునఁ గొనిపోవు రాక్షసాధముని వీనిం
దెరువున నాఁగరు మీరుం, దరుగుల్మలతాదులార దయలేమిఁ గటా. 344

సీ. దనుజుండు నను బట్టి వినువీథిఁ గొనిపోవఁ, గానరా విదియేమి గంధవాహ
వాసవు నాఁగి నింతయొనర్పఁ డనివేఁడ, మాటలాడ రిదేమి మానులార
యరసి రక్షింపుమా యమ్మ యనుచుఁ బిల్వ, తను యిట్లుతగునె వసుమతి నీకుఁ
గనలి యాతనిశిరఃకాంతార మేర్పక, తరులఁ డాఁగెద వేమి దావవహ్ని

గీ. కరుణ ననుఁ గాచుటకు నిజకాండములను, రావణుని బట్టి ముంచు గోదావరి యాన
వడిగఁ బాఱెడు నిదియేమి జడతనొందె, యనుచు బలవించు నలుదిక్కు లాలకించు.

క. అవనిజ యిట్లుపొగిలెడు, నవసరమున సంచలించె నగములు దా
మవనీజము లగుటఁ దలఁప, నవని స్సహజగుణ మెట్టులెడ విడుచునే. 346

వ. అయ్యవసరంబున. 347

మ. మనయాకారముఁ దాల్చి రాఘవుల నమ్మారీచుఁ డావంచనం
గొనిపోవన్ దనుజాధముం డిచట నీక్షోణీసుతం బట్టె నే
మని యానిందఁ దొలంగఁద్రోతు మిఁక నాహా చచ్చినంగాని పో
దనియో లేఁతలు జేరెనుం గురవకాంతంబుల్ దవాగ్నిభ్రమన్. 348

గీ. ధరణిజాక్రందనోద్గతధ్వానఘూర్ణమాన కానన మృగపక్షిమండలంబు
పఱచె నెంతయుఁ దవగారెఁ బత్త్రికంతు,మాయ శ్రీరామునకుఁ దెల్పనో యనంగ.

సీ కన్ను లెఱ్ఱఁగఁ జేసెఁ గలకంఠబృందంబు, బుసకొట్టుచును ఫణుల్ వ్యసముఁ జిలికెఁ
గటము లదర నిల్చె గంధసింధురములు, ప్లవగజాలంబులు పండ్లు గొఱికె
మొగములు జేవుఱింపఁగ శుకంబులు గూసె, నోలిఁ గపోతము ల్హుంకరించె
ఘూకము ల్గిఱగిఱఁ గ్రుడ్లు ద్రిప్పగఁ జొచ్చెఁ, గేకిసంఘంబులు కేక లిడియె

గీ. నఖిలభూతహితుం డగునట్టి రాము,వనిత బలవంతమునఁ జెఱ వట్టి గగన
వీథి వడిఁ గొనిపోయెడు వేళ దుష్టదనుజుఁ గన్గొని కినుకఁ జెందిన వనంగ. 350

వ. అంత నజ్జనకనందన. 351

ఉ. ఏ మిథిలాధినాథసుత నిద్ధయశుండగు రాముభార్యఁ బాం
డోముసలార యక్షవిహగోత్తములార ఫణీంద్రులార వే
నా మొఱ యాలకించి కులపాపకు వీనితల ల్హరించి పో
రే మహనీయులార మదధీశుఁడు మిమ్ముఁ గరంబు మెచ్చఁగన్. 352

క. అని ఘోరగృధ్ర మురవడిఁ, గొనిపోయెడుసర్వవనితకు స్వన మగుచున్
జనకజ యేడ్పుటయుం దధ్వని విని కరుణారసప్రధానుం డగుచున్. 353

క. నాకపతికి వెఱవక మై, నాకము రావణు నెదుర్ప నలిరేఁగుచుఁ దా
నాకడలి వెడలి కడువడి, నాకపథంబునను వచ్చె నని సుర లెంచన్. 354

ఉ. పాతితశాత్రవుండు సురపక్షబలుండు జటాయు వల్లసం
పాతిసహోదరుండు నృపభామిని శోకము సత్వరానుకం
పాతిశయంబునన్ విని మహాబలు రావణు నాఁగ నున్న శం
పాతతదేహదీప్తిఁ గులపాంసను దృష్టిపథంబు నాఁగఁగన్. 355

వ. అమ్మహాబలుం డడ్డపడి 356

క. కంఠీరవమధ్యను దశ, కంఠ విడువవేని నీదుకంఠములు మహో
త్కుంఠతఁ దునిమి సమవర్త్యుప, కంఠమునకు ననుతు గరళకంఠు నెయిదిన్. 357

క. అనఘుడు నతఁ డాతని కి, ట్లనుఁ బులుఁగా నన్ను గెలువనగునే నిన్నె
ట్లును జంపు దేటివగ నీ, వనుచుఁ దలపడిరిఁ బోరు ఘోరం బయ్యెన్. 358

చ. ఖగదనుజాన్వయోత్తము లప్రతిమానులు కామరూపు ల
త్యగణితసత్త్వ లూర్జితనయానయు లాశుగవేదు లగ్రప
న్నగమనజాశనుల్ మిథిలనాథసుతాప్రియతాపకారకుల్
దగినఖశాస్త్రసాధనులు దార్కొని వీఁక జటాయురావణుల్. 359

వ. ఒండొరుల నఖవిశిఖంబుల ప్రేటులాడు సమయంబున. 360

గీ. అక్షిగతుఁ డగు రాక్షసాధ్యక్షుఁ డుగ్ర, పక్షినాథనఖక్షతవక్షుఁ డయ్యె
నాక్షణంబున రాక్షసాధ్యక్షుచేతఁ, బక్షినాథుఁడు విశీర్ణపక్షుఁ డయ్యె 361

ఉ. నొచ్చియు నీడఁబోవక వనోద్ధృతి రావణుఁ గాంచి వంచనం
దెచ్చితి రాఘవేంద్రసతిన్ మగపంతము గాదు నీకుఁ బా
టచ్చరవృత్తి గాని యిఁక దక్కులు సెల్లవు మన్నఖాహతిం
జచ్చిన మేలు నీ కనుచు సాహసవృత్తిఁ గడంగి యాతనిన్. 362

గీ. వదనములు చీఱుఁ గఱచుల్ చిదుమఁ గోరు, నెనసి వడిఁ బోరు నభమున నెగసిపాఱుఁ
గ్రమ్మఱను జేరుఁ జాఁకి గాఁచి వగలఁ, గూరుఁ బలుమాఱు మీఱు ననూరుసుతుఁడు.

వ. మఱియు నద్దనుజుఁ డద్దయు నడ్డలేనికడిమిం గ్రద్దరించుచు గ్రద్దతోడఁ బెద్దయుం
బ్రొద్దు ప్రొద్దుకొలవ పాపి యుద్దియు యలర నద్దనుజుం దాఁకి పోరి పోరి పెద్దవాఁడు
గావున. 364

క. పక్షనులు దనుజకరవాలక్షతులం దెగుడుఁ గడఁక జలంబటి పడియెం
బక్షిశ్రేష్ఠుఁడు పవిభగ్నక్షోణీభృచ్ఛిఖగముకరణిన్ ధరణిన్. 365

క. సీతం గైకొని నభమునఁ, బాతకుఁ డగురక్కసుండు పఱచెడ నని దుః
ఖాతిశయంబున వ్రాలినరీతిం గూలుటయు నతివ ప్రిదిలినతాల్మిన్. 366

వ. కంఠగతప్రాణవాయు వగుజటాయువు నుద్దేశించి. 367

చ. అసురవిరోధిఁ గ్రుంచి నను నారసి ప్రోవఁదలంచి భీమవశా
సమర మొనర్చి వైరిశితసాయకభగ్నగరుద్వయుండ వై
క్రమమున నివ్విధంబున ధరంబడఁ జూడఁగనైతి నీకుఁ బు
ణ్యము నకుఁ బోవఁ బాప మెదు రయ్యెఁగదయ్య ఖగప్రభూత్తమా. 368

గీ. అసురవరుఁడును ఖలుఁడు నన్యాయుఁ డధముఁ, డైనఁ రావణునకు జయు మమరనొసఁగి
పరమపుణ్యాత్ము నిన్నిట్లు పడఁగఁజేసె, ధాత నీయెడఁ గడుఁ బక్షపాతి యగుచు

వ. అని మఱియు ననన్యశరణ్య యగు నవనీకన్య తనమనంబున. 370

చ. అరయఁ బరోపకారపరుఁ డై యితఁ డీగ్గతిఁ బుణ్యలోకసు
స్థిరుఁ డగుఁగాక యంచు వగఁ జెందుధరాసుతఁ గొంచు రావణుం
డరిగె సరిత్సరోవనమహావనపావనయోగికాశ్రమో
త్కరగిరిబరాలయాదులను దాఁటుచు లోకభయంకరాకృతిన్. 371

క. తటతట హృదయ మదర నంతట జనకజ యొక్కశైలతటమునఁ గనియెం
దిటముగ విహరించెడుమర్కటవర్యుల నివ్విధమునఁ గాంచి వెనుకగన్. 372

క. పార్థివునకు వార్తాకథనార్థం బర్థం బొసంగి యగచరులను సం
ప్రార్థన సేసెడుగతి వస్త్రార్థంబున నగలు ముడిచి యవనిన్ విడిచెన్. 373

గీ. ఎట్టకాలంబునకుఁ బుట్టినింటి కేగు, తాను మునుగొన్నసొమ్ములఁ దగఁగ నెరవు
దీర్చుగతి నొప్పె రాఘవుదేవి సుమణిఖచితభూషణములు రత్నగర్భ నిడిన. 374

క. నగమున నివ్విధమునఁ దననగలు మిగులఁ బైటచెఱఁగునను ముడిచి వడి
న్నగచరులయొద్ద విడువఁగ, నగన యనుచు మొఱయుమను ఘనధ్వనిఁ బడియెన్. 375

వ. ఇవ్విధంబున నార్తప్తయు సంతప్తయు నగుజానకీపరిక్షిప్తతప్తకాంచనమయ
భూషణంబుల నయ్యగచరశ్రేష్ఠుం డగుసప్తాశ్వనందను డాప్తులం బనిచి సుగుప్తం
బుఁ గావించె నంత. 376

సీ. మానినీఘనశిరోమణిఁ గాక రత్నకలాపకలాపము ల్పాపతితముఁ
గావించి హా నాథ కావరావే యంచు, దిగులొందుజానకివగపుఁ గాంచి

కనలి లోనుడుకుచుఁ గలఁగుచు నకూపార,తీరంబుఁ జేరి య త్రిదశవైరి
మాయావిహారి దుర్మార్గుండు రావణుఁ, డంత సన్నద్ధుఁడై యుద్భటుఁ డై
గీ. వంశవంశాటవికిఁ దెచ్చువహ్ని యనఁగ, జలధి గని భీతినొందుచు సాతనూజ
సీత నకలంకఁ గొని కడు శీఘ్రముగను, లంక సకలంకఁ జేరె నిశ్శంకుఁ డగుచు. 377

వ. లంకకుం జని జనకనందనం దనయుపవనాశోకవనమధ్యంబునం బదిలపఱిచి యద్దుష్టుం డిచ్చో ధరణీపరాగపరిచ్ఛన్నశరీర వై నవయు నేల మదీయాంతఃపురప్రవేశంబుఁ గావించి సకలోపభోగంబులం బొందు మనుటయు జగన్మాత యగుసీత యిట్లనియె. 378

మ. గతితప్పక్ రవి సంచరించినను లోకాలోక మూటాడినం
గతి శ్రీరాముఁడె నాకు సాధ్విని జగత్కల్యాణ నే నన్యసం
గతి కాసింతునె హంసి కాకము నెనం గామించునే ఘోరదు
ర్గతిపాలై చెడ నిట్టులాడెదు నిశం గాలంబు చేరం గదా. 379

వ. అనుటయు. 380

క. కను మెఱ్ఱవార మిగులం, గనలుచు రావణుఁడు వలుకుఁ గఠినత దనుజాం
గనలార వేచియుండుం, డని జానకిఁ జూపి చనియె నంతట నిచటన్. 381

క. ఒకమృగముఁ జంపి నిజకా,ర్ముకాగ్రమునఁ దగఁ దగిల్చి మోదమ్మునఁ బ
ర్ణకుటీరమునకు వచ్చెను,నకుటిలుఁ డారాముఁ డెదుర ననుజుం గనియెన్. 382

చ. కనుఁగొని గుండె జల్లుమనఁగా శుభగాననఁ గానలోన సీ
త నొకత డించివచ్చితి కదా మదదానవదానవత్కరీం
ద్రనిబిడ మిట్ట్యరణ్య మిటు రానవురా దవురా పదద్వయం
బనయము సంచలించెను సుమా లసమానసమానసస్థితి. 383

ఉ. ఈమృగశాబముం జనకజేచ్ఛకునై తగఁ బట్టితెత్తు మా
యామృగమేనిఁ గూలిచి రదంబున నిప్పుడ తత్తుఁ గానలో
నీమృగనేత్ర నేమరకు మీ వని యెంతయు నొత్తి చెప్ప నా
నామృగసంకులం బగువనంబున నొక్కతె డించి వత్తురే. 384

వ. అదియునుంగాక. 385

చ. విను మిది మాయలేడి వెనువెంటఁ జనన్వల దంచుఁ దొల్లి నీ
వనుపమబుద్ధివై తెలియ నాడితి విప్పు డరణ్యభూమి సీ
త నొకత డించివచ్చితి పదంపడి రాక్షసబాధ నొందునో
యని తలపోయవైతి వకటా వికటం బగుధాతత్రిప్పునన్. 386

వ. అనిన విని యుల్కిపడి సవినయంబుగా లక్ష్మణుం డన్న కిట్లనియె. 387

క. నీ వాడినచందంబున, నా వారిజనేత్ర సీత నారసి యుండ
న్నీ వాడినచందంబున, రావే లక్ష్మణ యటంచు రాక్షసుఁ డనిన౯. 388

ఉ. సారసనేత్ర నన్నుఁ గని చయ్యన నిన్నుఁ బొమ్మటంచు వి
స్తారకుగా ర్తయై పలుక సమ్మతి నయ్యనతోఁత రాముఁడే
వారికి లోను గాఁ డని భవద్భుజ విక్రమ మే నెఱిఁగి నీ
ప్రాణము నుంచుఁ దెల్పిన మహోగ్రదవానలతీక్ష్ణనేత్ర యై. 389

క. వినరానిమాట లాడినఁ, జని దెంచినవాఁడఁ దప్పు సైఁపు మనుడు మ
న్మనము బలము నెఱిఁగియు న,న్నిఁక నాఁడ వటంచు రాజశేఖరుఁ డనుజు౯. 390

క. పద పద పోవుద మే మా,పద వొందెనొ జనకతనయ భయమున ననుచుం
బదములు తొట్రిల దీనా,స్యుఁడై రాముఁడు నివాసక్షదమున కార్తి౯. 391

వ. నానావిధంబు లగు దుర్నిమిత్తంబులవుఁ జిత్తం బుత్తలపడ వచ్చి సోదరున కభి
ముఖుండై. 392

సీ. రాజీవనేత్ర నా రాక తా నాలించి, యెదురుగా వచ్చు నేఁ డేల రాదు
హరిణశాబకముఁ బట్టి త్వాప్తెట్టె దెచ్చితి, నా యని యుపు డేల యడుగరాదు
కొమ్మను జేరి పల్కులు నేర్చికొనుకీర, పటలంబు నేఁ డేల పాసి చనియె
నా వికసితమల్లికాభిరామం బగు, నటజంబు నేఁ డేల యొప్పు దఱిగెఁ
గీ. గలికికరచరణాద్యంగకములఁ గలుగు, శాలిభూషణశింజితం బేల వినఁగఁ
బడదు నేఁ డుగ్రరాక్షసాపహృత యయ్యె, సీత నిశ్చయ మిది సుమిత్రాతనూజ.

క. అని పలికి పర్ణశాలఁ, గని జానకి లేకయున్నఁ గడువడి హా చం
ద్రనగాధి యెందుఁ బోయితి, వని మూర్ఛాపరవశాత్ముఁడై మహిఁ బడియె౯. 394

ఆ. పడిన యన్న నెత్తి పట్టి యోర్చుచు సుమిత్రాసుతుండు వత్సుఁ దగునె యిట్లు
ధైర్యముండ రామధరణీశ వెదకుద, మివ్వనాంతరమున నింతి నందు. 395

క. అని కటకటఁబడి శ్రీరా,మునిఁ గడు నూరార్చి యంతమునమిషి వెతికె౯
జనకజనుఁ బల్లవాగ్రా,రసికటుకల్పాంతముల రామసహితుఁడై 396

సీ. ఈరీతి శోధించి యెందును గనరాక, యన్న శ్రీరాముఁ డోహో యటంచు
గొంతెత్తి పిల్చునుఁ గొమ్మ డాఁగితె యంచు, మెకములు మ్రింగెనా యని యటంచుఁ
బర్ణశాలాసమీపంబున రోయుచుఁ, బావురు గోయుంగఁ బోయె ననుచు
వనజాక్షి రోసి కన్గొనుట కష్టంబంచు, హా యేమి సేతుఁ గాంతా యటంచుఁ

గీ. గాన మనకింకఁ దోడేరు గలరటంచు, డాయరా వేమి ననుఁ దయ్యఁ డాయటంచు
బాల కారగ్గిపాలు గాఁబోలు ననుచుఁ, బాములు గ్రసించెనో యంచుఁ బలవరించు.

సీ. ఇందీవరాక్షి నన్నిందు రమ్మని పిల్చె, నని కోకిలస్వరం బాలకించు
నదె చంపకామోదహస్తశాఖం బని, వామలతాపల్లవంబు గాంచు
నదె గంధగజయానయరుణాధరం బను, నిండఁబండినదొండపండుఁ గాంచు
నదె తత్ప్రకనకాంగిహారవల్లరు లంచుఁ, గమనీయతరకోరకములఁ గాంచు
గీ. డంబు మీఱు మృగాక్షిదంతంబు లనుచు, దాడిమీస్ఫురద్బీజసంతతులు గాంచుఁ
గొమ్మ పాల్పారు చెక్కుటద్దమ్ము లనుచు, లలితసాంద్రకదళీఫలములఁ గాంచు.

వ. మఱియును. 399

చ. గజములఁ గాంచి గంధకరిగామిని యంచుఁ గలంగు మించు నం
బుజములఁ గాంచి పద్మముఖి పోయితె యంచుఁ దలంచు బంభర
వ్రజముల గాంచి భృంగచికురా యని చేర్చు వాయుజోపము
ల్కుజములఁ గాంచి పల్లవసుకోమలహస్త యటంచు వంతగన్. 400

వ. వెండియుం బ్రేయసి నుద్దేశించి. 401

క. రమ్మా యను బల్కవు మా, రమ్మా యను డాఁగు టిది వరమ్మా యను వై
రమ్మా యను వెదకుట భా, రమ్మాయెను గడు నవాదరమ్మా యనుచున్. 402

ఉ. మాయను జెందనేల చెపుమా యనుఁ బల్కవి దేమి ముద్దుగు
మ్మా యనుఁ దాళఁజాల వినుమా యను నావెత దీర్చవె పొన్నికొ
మ్మా యనుఁ గష్టమాయెను జుమా యను నాపయి నింతనిష్ఠుర
మ్మా యనుఁ బంతమా యను సమానగమా యను దైవమా యనున్. 403

క. బాల విప్రలాభ్రుకణజం, బాల నదాచరదురోజబాహ్లిక వగుచుం
బాలశశివదన వగవం, బాలయితివె ధాత మిగులఁ బాలసుఁ డగుటన్. 404

సీ. వనిత నీ వావటించిన కందమూలంబు, లనుపమానరుచిభక్ష్యములు నాకు
భక్తి నీ వొసఁగిన ఫలరసంబులు లస, దమృతోపమానంబు లతివ నాకుఁ
బటువ్రాతముగ నీవు పఱచినకుశములు, రమణీయతూలతల్పములు నాకు
నబల నీ వేటినయడవిమల్లెలు కల్ప, కప్రసూనంబులు కలికి నాకుఁ
గీ. దివిరి నామేన నీ వలందినపరాగ, మమితశీతల మగుమలయజము నాకు
రమణి నీవున్న పొదలు సౌధములు నాకు, సువిద నీతోడి గహనమయోధ్య నాకు.

వ. అని యిట్లనేకవిధవిలాపంబులు పలుకుచు వగచుచున్న యన్నం గనుంగొని
యవిరళబాష్పకణపరిపూరితనిజకపోలయుగళుండగుచు సుమిత్రాపుత్రుండు తగు
రీతి నూరార్చుచుండె నంత నయ్యన్నదమ్ములు. 406

సీ. సారసారససారసారసమధురసా,సారంబు లైన కాసారములను
అంగీకృతాభంగభృంగీసుసంగీత,సంగతరంగత్తుంగములను
సంతతాక్రాంతాప్రకాంతగాఢధ్వాంత,దంతురితాద్రిగుహాంతరముల
నాగతుండపరాగభోగిభోగాభోగ,భాగత్యుపత్యకాభోగములను
గీ. బ్రాంతరంబుల నాశ్రమోపాంతములను, గోటివిధఖచరాంగనాకూటకూట
కూటకోటుల మసలక కొమ్మ వెదకి, సీతఁ గనరామి కెంతయుఁ జింత నొంది. 407
క. ధూర్తమృగధూర్తపటుతర,గర్తంబులఁ బర్వతముల గహనంబుల న
త్యార్తు లయి వెదకి రొక్కముహూర్తంబును నున్నచోట నుండక సీతన్. 408
వ. ఇట్లు పరిశోధించి మగుడం బర్ణశాలాసమీపంబున కరుగుదెంచి యెందునుం జనక
నందన సందర్శింపనేరకున్న యవసరమ్మున రాముండు సహజన్ము నాలోకించి.
సీ. కొమ్మ యీకొమ్మఁ జేకొని నిల్చెఁగాఁబోలు, నిచట నీక్రొమ్మావి యింపు నొందెఁ
జిలుకల కిచటఁ బలుకులు నేర్పెఁగాఁబోలుఁ,జుమ్మ యీకర్ణికారమ్ము ప్రకటె
దిగులున దీని సఁగటఁ బట్టెఁగాఁబోలుఁ, నిచట నీకురవకం బిగురు లెత్తెఁ
దిలకినీతిలకంబుఁ దేఱిచూడఁగఁబోలు, నిచట నీతిలక మి మ్మైలమి గాంచె
గీ. నిచటఁ గడువేఁడినిట్టూర్పు లియ్యఁబోలు, నింతి యీసిందువార మత్యంత మమరె
నాతి యిచ్చోట వెడనవ్వు నవ్వఁబోలు, మిగులఁ బువ్వులతో నీనమేరు వొప్పె.
వ. అని పలికి. 411
క. తనకరముల నమృతం బిడి, వినుతలం బెనుచుపాలవెల్లినిసువునాఁ
జనుజనకనయనఫల మిపు, డనయముఁ గృశియించదే యినారాద్గత మై. 412
చ. కరు లుపపింగదృష్టు లురగంబులు గోకము లచ్ఛభల్లము
ల్శరభములు న్సృగాలములు సైరిభము ల్బలు లీతరక్షువు
ల్సరసిజనేత్ర నేఁచుటకు సంశయమే శుకపుండరీకబం
భరపికశారికాదు లిట మానక నీగతి నన్న నేఁచఁగన్. 418
సీ. బిసబాహు వని హంసపిండు వేధించెనో, వేధించునే మేఘసాధు వేణిఁ
గమలానన యటంచుఁ గరియూథ మేఁచెనో, యేఁచునే ఘనసింగదృష్టిమధ్యఁ
గిసపాణి యంచుఁ గోకిల లెంతయఁ బెనో, యలమునే మీఋర మాభిరామ
సువశోవలి యటంచు భ్రమరముల్ మూఁగెనో, మూఁగునే చంపక మోదదేహ
గీ. కటిఫలధరి యని శుకవ్రజ వ దెట్లు, మించి సికించెనో పసికించు నెట్లు
వాసనల నొప్పగలుగు జవాదిపూఁత, నుచు నెఱయ భ్రమ నెందు నాత్మయందు.

వ. మఱియును. 415

సీ. జనకజాతఁ గజాతసమనేత్రఁ గానరే, జంబూవిశాలభూజంబులార
మధుపరాగపరాగమృదుగంధిఁ గానరే, లలితరసాలసాలంబులార
జలదమాలతమాలసమవాలఁ గానరే, మహితమాలూరభూరుహములార
ఘనలతాంతలతాంత కమనీయఁ గానరే, పటుజటోత్కట వటకుటములార
గీ. మధురబంధూకబంధుకమ్రాధరోష్ఠిఁ, గానరే గురుకుచ మీరు కానరేఁ గు
లార యని విభ్రమాదభ్రుఁడై నరేంద్రుఁ, డచట నచ్చటఁ దిరుగుచు నడలి యడలి. 416

క. గములార వఱలుఘనవా, గములారా ఘోరపన్నగములారా సిం
గములార మృగములార న, గములారా నగములార కానరె సీతన్. 417

వ. అని యివ్విధంబున యుక్తాయుక్తవివేకవిహీనునిం బోలె దృగ్గోచరంబు లగు పదా
ర్థంబుల నెల్ల జనకనందన నడుగుచుం జని చని లక్ష్మణుం గనుంగొని. 418

క. అనుజా మనమిరువురము, న్నేను జానకియొద్ద లేనివేళఁ గుపితుఁడై
దనుజాధముఁ డొకఁడు ధరా, తనుజాతం గొనుట నిశ్చితం బూహింపన్. 419

క. జనకజ నియ్యెడఁ గాంచితి, మని తెల్పెడుభంగి భల్లుకావలి మొఱసె
న్నీను పవనిజ వెదకెడుగతి, ఘనవృక్షాగ్రములఁ గపినికరము మెఱసెన్. 420

వ. అని పలికి శోకాతిరేకంబున నొడలెఱుంగక లక్ష్మణుం గనుంగొని. 421

ఉ. ఎవ్వఁడ నేను రాముఁడ వహీనబలాఢ్యుఁడ కా నెఱుంగు దీ
వెవ్వఁడ వేమి లక్ష్మణుఁడ నేటికి వచ్చితి మిట్టికానకుం
జవ్వని సీత రోయఁటవు జానకి యెక్కడ వోయె లక్ష్మణుం
డెవ్విధినున్న వాఁ డనుచు నేడ్చుఁ బరిభ్రమితాంతరంగుఁడై. 422

చ. జనకజ నిందుఁ గాన ముటజం బిది కాదొకొ రామచంద్రుఁ డా
జనకజఁ బాసి యొక్కనిముసంబును దాళఁగఁజాలఁ డేనురా
మనరవరుండఁ గానొ యనుమానము గల్గెడు నంచుఁ గ్రమ్మఱం
జని యుటజంబున న్వెదకి జానకిఁ గానక వంత గ్రమ్మఁగన్. 423

చ. మనము వనమ్మున న్వెదకి మానిని సీతనుఁ గానకున్న నె
మ్మనము గలంగె నాకు వినుమా వినుమానిక మీఁద చిచ్చు వె
న్ను నెడమకన్ను మున్నునుఁ గనుంగొనఁజాలదు రెండునున్నఁ జ
య్యన సతి నాకుఁ జూపరు దయాపరివర్జితచిత్తవృత్తులై. 424

వ. అని విరాళిఁ బాలిమితూలిం దాళఁజాలక యాలిం దలంచి. 425

ఉ. పాంథమనోధనాపహృతిఁ బ్రాభవుఁ డైనశుకాళ్యుఁ డిప్డు పు
ష్పంధయశింజినీకలితసారబలం బగుతుంటవింట ద
ర్పాంధత నూనమార్గణచయంబుల నొడక గ్రుచ్చి నాదుహృ
ద్గ్రంధి నలంచె గావుమ సుకంఠ భవద్వచనామృతంబునన్. 426

వ. అని వగచి. 427

క. క్రమ్మఱ నిట్లను బృథుశో, కమ్మున హా జనకతనయ కడువడి నన్నుం
గ్రమ్మినతాపము దీఱునె, కమ్మనికెమ్మోవిపానక మ్మీకున్నన్. 428

వ. అని పలికి యలుక వొడమ నమ్మహీసుతాప్రియుండు. 429

క. సాధుచరిత్ర యనందగు, మైథిలి నొప్పింపకున్న మహి నిప్పుడ సం
బాధింతు నస్మదీయక్రోధోద్రేకంబు వెలయఁ గ్రూరాస్త్రములన్. 430

క. నను రాజమాత్రుఁగాఁ దలఁచిన సురగంధర్వయక్షసిద్ధాదులఁ ద్రుం
చినఁ గాని తీఱ దిదె క, న్గొను మనరామునకు లక్ష్మణుం డిట్లనియెన్. 431

గీ. అంబుజాసననిర్మితం బైన కరంబుఁ, బొలుపు నొందుజరాచరభూతకోటి
నీవు గాపాడువాఁడవు నీఱుసేయు, టుగ్రకర్మము తలపోయ ముడుకుదక్క. 432

గీ. ఏల తాలిమిఁదూల సీతాలతాంగి, నిచ్చోట నచ్చోట వెదకుద మిట్టులైన
నేను గొనివత్తు సంశయ మింతవలవ, దగ్గిలోనున్న నబ్ధిమధ్యమున నున్న. 433

వ. అని పలుకుటయు రామచంద్రుం డుపశమితపరితాపుండై క్రోశమాత్రంబు ధరణీ
కుమారిక నరయుచుం జని మార్గమధ్యంబున. 434

ఉ. ఖండితపక్షుఁ డై మిగులఁ గాఱునసృక్పరిషిక్తవక్షుఁ డై
తుండము ధాత్రి నూఁదికొని తోరపుమూర్ఛ మునింగి జేవుఱుం
గొండవిధంబునం ధరణిఁ గూలినపక్షివరేణ్యుఁ గాంచి మా
ర్తాండవరాన్వవాయకలశాంబుధిసోముఁడు రాముఁ డుగ్రుఁ డై. 435

వ. రాక్షసుం డనుతలంపున. 436

క. నీచమతి సీత నీరజ, నీచరుఁడు గ్రసించి యిట్లు నిక్కపటుక్రియం
జూచితె లక్ష్మణ మనలం, జూచి తెరువులోన నిక్కెఁడు గ్రుక్కుచుఁ బడియెన్.

క. కావునఁ గడుఘోరం బగు, నీవనమున సంచరించు నిక్కపటాత్మున్
జీవనము గొనెద వెస వి, ల్లీవ యనునంతలోన నిట్లనె నతఁడున్. 438

సీ. ఘనులార రామలక్ష్మణులార యేను రాక్షసుఁడను గాను మీజనకుఁ డగుద
శరథభూమీధవసఖుఁడ జటాయువ, న్వాఁడ రావణుఁడు దానవవిభుండు

జానకిఁ గొని యాకసంబునఁ బఱచుచో, నా పెద్దనాలాప మాలకించి
వాని నెదిర్చి దుర్వారతఁ దీకూసి, పాతంబునఁ బ్రభగ్న పక్షుఁడయ్యుఁ గ్ర
గీ. ఖండనై సీతవార్త మీకుం దెలుపఁగ, వలసి నిలిపితిఁ బ్రాణము ల్నిలువ విభుఁడ
తోఁటఁగొనఁ దనటంచుఁ దనతలఁ దోర్చికొనుచు, విహగవిభుఁ డంతఁ బ్రాణంబు
వీడుటయును. 439

ఉ. పక్షికులాబ్ధిపూర్ణహిమభానుఁడ మామఁకఁ గూర్మిమీఱ మా
పక్షము వచ్చి నీవిటులు ప్రాణము వీడితి విష్ణునిన్నుఁ బ్ర
త్యక్షముగాఁగఁ జూచి కడు నారనిశోకము మించె మానవా
ధ్యక్షుఁడు తండ్రి పక్షివరభుఁ డంతమునొందు టెఱుంగ మిక్రియన్. 440

ఉ. ఏట్రికి రాముదేవిఁ గొని యేగెదు రాక్షస నీ వటంచు మి
న్నెట్టికి నడ్డమేగిన మహీభృదధీశునిభంగి నాఁగి త
త్పాటితపక్షుఁడై వయి ప్రాణము వీడితివయ్యొ దైవ మె
చ్చోటు నదృష్టహీనుఁ గృపఁజూచినవానిక చేటు గూర్చెడిన్. 441

క. అని వగచి వగచి తగునింధనములు సొదవేర్చి పక్షినాయకుఁ బయిఁ జే
ర్చి నిబిడశోకు లగుచు దహిన్ని నొసఁగి రయ్యన్నదమ్ము లిరువురు సువిధిన్. 442

వ. తదనంతరంబున. 443

క. నరనాథులు ఖగనాథున, కఱచేతిద పుణ్యలోక మనుచుం గోదా
వరి నాడి మృగామిషమున, నురుపిండముఁ బెట్టి రొగిఁదిలోదక మొప్పన్. 444

వ. ఇట్లు జటాయువుం బుణ్యలోకచిరనివాసిం గావించి. 445

సీ. ఓషధీశ్వరుని బీయూషరసంబు ప్రార్థింపఁ బోయినభంగిఁ జీవలోక
సంబు ముట్టిన యరణ్యంబున రామలక్ష్మణులు దురంతశోకప్రభగ్న
హృద్వృత్తు లగుచు మహీసుత నరయుచుఁ, జని చని మించుక్రౌంచవతిఁ గ్రౌంచ
వతిఁ బ్రవేశించి యావలఁ దమసాందిఁ, గన్గొని తత్తీరకాననమున
గీ. నతనుబాణాతనుప్రణిహాతమనోంబుజాతయై లక్ష్మణునిఁ జెయిసాఁచి పట్టి
కొనినదాని నయోముఖిఁ గ్రూరఁ గామరూపిణి రక్కసిని వే విరూపిఁ జేసి 446

సీ. పటుదీర్ఘబాహులబ్ధప్రాణిసంఘుగ్రసనశీలి యగుకబంధుని భుజాంత
రంబునఁ జిక్కి ఘోరం బగుతద్వికృతాకార మీక్షించి యద్భుతాంత
రంగులై వానికరంబులు ఖండించి, రామలక్ష్మణు లుగ్రరాహుముఖని
ర్గతచంద్రాబ్జినీనాథులననొప్పి, రాక్షణంబున శాపమోక్షు మంది

గీ. వారలకుఁ దనవృత్తి సర్వంబు నెఱుఁగఁ, జెప్పి చేదోయి నంత మోడ్చి వినయమున
నాకబంధుఁడు దాను దివ్యపురుషుఁడు, గానఁ దనతొంటిరూపంబుఁ గలుగ నిలిచి.

క. భూపవరులార యిదె మ, చ్ఛాపవిమోక్షంబుఁ బూర్వజన్మకృతమహా
పాపవినాశము నయ్యెన్, మీపదదర్శనముకతన మిగుల వెలిఁగితిన్. 448

చ. అని వినుతించి వారు జనకాత్మజ యున్నెడ వేఁడినన్ మహీ
జనవరులార మీరలు వెసం జని మంత్రులఁగూడి ఋశ్యమూ
కనగనగంబులం దిరుగుకంజహితాత్మతనూజు వాలియ
న్వనచరనాథుసోదరు నవశ్యముఁ జూడఁగఁబోండు ధీయుతై. 449

క. ఆసుగ్రీవునితో సహ, వాసము గావింపుఁ డతఁడు వనచరుల మహో
ల్లాసమునఁ బిలువనంపి ధ, రాసుత వెదకింపఁజాలు రభసత ననుచున్. 450

క. ఈవిధమున దనునాముఁ డ, నావిలమతి నెఱుఁగఁ జెప్పి యరిగిన హరివి
శ్వావిద్భల్లుకహరిశర, భావనవనభాగమందు నరుగుచు నెమరన్. 451

ఉ. ఆశ్రమము న్లతాంతసులతాంతముఁ గూజితశౌకపైకభృం
గాశ్రయము న్రసాలపనశార్జునతిందుకనింబవారస
మ్మిశ్రము న్వ్యపేతభయమేదురగుల్మయుతంబు నొక్కపు
ణ్యాశ్రమముం గనుంగొని రహస్పతితేజులు రామలక్ష్మణుల్. 452

వ. కనుంగొని. 453

క. వెసఁ జొచ్చి యందుఁ గన్గొని, రసమానవ్రతసమాగతాయాసభరి
న్నసరిత్ప్రస్వానపిశంగసటాపటలప్రకలితకబరి న్శబరిన్. 54

క. కని తచ్ఛబరాంగన భ, క్తిని వే నర్ఘ్యాదివిహితకృత్యము లొనరిం
చిన సంతసించి నరవరు, లనవద్యులు ఘనులు దశరథాంగతనూజుల్. 455

వ. పరమపవిత్రకుశాస్తరణంబుల సుఖాసీను లైరంత. 456

చ. పొసఁగి నభక్తిఁ దచ్ఛబరి భూనుతకీర్తికి రామమూర్తికి
న్బొసఁగినకందమూలమధురోరుఫలంబులు తృప్తిదీరఁగా
మెసఁగి నరేశ్వరుండు హితమేదురవాక్ప్రకరంబు దానితో
నెసఁగ రచించుచు న్మిగుల హృన్ముద మొప్ప వసించె నయ్యెడన్. 457

చ. తనదుహితప్రవృత్తి విదితంబుగ రామునకు న్వచించి యా
త్మని వినుతించి రాఘవుపదంబుల నౌదల మోపి మ్రొక్కి వే

తనువుఁ దొఱంగి తత్క్షణమె తచ్ఛుభరాంగన వొందె సత్తపో
ధనులకు నందరానిసుపదంబులు భక్తికి యోగ్య మెక్కుడే. 458

క. తనివిసనక యీవిధి నాతనినినుతు లొనర్చి శబరి తనువుఁ దొఱఁగినం
గని యబ్బురపడుసోదరుఁ, గని యప్పుడు పలికెఁ గౌతుకస్ఫురణ మెయిన్. 459

ఉ. సూక్ష్మము భక్తియోగము విశుద్ధమనస్కులు కానిపూరుషు
ల్లక్ష్యమెసంగువారు పదిలక్షలు వెట్టిన సంతసింతు నే
లక్ష్మికి బాహ్యు లయ్యును ఫలప్రద మన్న నెఱింగి మాఁవు
ల్లక్ష్మణ భక్తి నెంగిలిఫలంబులు వెట్టిన నుల్లసిల్లుమన్. 460

గీ. అని పలికి రాముఁ డనుజసహాయుఁ డగుచు, నాశ్రమంబున కవ్వల నరిగి కాంచె
నధికతరవారికేళీసమాగతాప్స, రోవరం బగుపంపాసరోవరంబు. 461

వ. చూచి మంజులతామంజపుంజరంజితం బగు తత్తీరంబుఁ జేరం బోవు నవసరమ్మున.

చ. అరివిలయుండు లక్ష్మణుఁ డహస్పతితేజున కన్న కిట్లనున్
నరవర చూచితే మునిమృణాలముఖంబునఁ దాను గొన్న శం
బరముల సన్మరంద మనెపంబునఁ గ్రమ్మఱ నొల్కెడున్ మనో
హరతరపంకజాతనిచయంబులు ప్రత్యుపకార మొప్పదే. 463

ఉ. సారసగంధియు న్విచలశైవలవాలయు నుత్పలాక్షియుం
జారురథాంగపీవరకుచద్వయయుం గలహంసయానయు
న్సారమృణాళబాహువుఁ గుశభ్రమనాభియు నై తనర్చెడి
శ్రీరఘురామ చూడు సరసీమణి దాసరసీమణి క్రియన్. 464

క. తీరస్థితంబు లగుధాత్రీరుహములు ప్రతిఫలించెఁ దెలియము నది ను
ర్వీరమణ వనాంబుజహస్తారమణీయప్రకల్పితముకుర మొకో. 465

చ. నరవర తన్ను నాడి జనంబులపంక మధోగతంబు సే
యుఱుచిరమూర్తి యున్నది పయోరుహజాత పరాగయోగని
ర్హారిత మదద్విరేఫ మవినాధిక యాటఁ దలంపఁ జిత్రమే
యరయ గజప్రదాత యగునాతఁడు తొత్ర మొసంగకుండునే. 466

క. అని పలుక రాముఁ డానదిఁ, గనుఁగొని తన్మధ్యకమలకైరవవిచర
ద్ఘనభృంగములం గని క్రన్నన సీతావిరహఖేదనాహతమతియై. 467

వ. తమ్ముని వీక్షించి. 468

చ. వనమున రాక్షసాపహృతభార్యుఁడనై వగ నొందు నన్నుఁ గ
న్గొని తనయింతి దానవులు కోరి హరించెద రంచు భీతిచే
ననిశముఁ బెంట్రిఁ బాయదు రథాంగము చూచితివే వనాంతర
మ్మున గజపర్ణశాల ననుఁ బోలు నభాగ్యులు లేరు చూడఁగన్. 469

క. మఱుఁ గైదవళేరమున న, న్నరవడి నేసెడిని గాక యున్న న్వనసీ
వరతీరంబున నాకు, న్స్మరదశమావస్థ నిట్లు మఱుఁగఁగ నేలా. 470

మ. తగ నిన్నద్యుదకస్ఫురత్కుముదపద్మస్తోమగంధంబుఁ దీ
రగతాశోకరసాలకుందసుమసౌరభ్యంబునుం గ్రోలి యా
శుగ ముగ్రత్వము దాల్చి నాకు హృదయక్షోభంబు వెంచె న్స్మరా
శుగపంచాహతి వోలె లక్ష్మణ బుధస్తుత్యోల్లసల్లక్షణా. 471

ఆ. తాపహారియున్న దీపవనంబు సం,తాపకారి యయ్యెఁ దరుణిఁ బాసి
యున్నవాఁడ నగుట నురుభుజ నాకు సీ,తాపహారిఁ జూపు మే పడంతు. 472

వ. అని రోషావేశుండై పలుకుటయు సహోదరుండు సాంత్వనవచనంబున ననునయిం
చె నంత. 473

ఉ. శోకముఁ దక్కి రాముఁడు విశుద్ధమతిం జని కాంచెఁ బుష్పితా
శోకముఖద్రుమాగ్రపరిశోభితబర్హిశిఖండినీకులా
స్తోకముఁ గూటకోటిపరిశుద్ధనిశాపతికాంతవేదికా
నేకము సానుసంచరదహీనచమూకము ఋశ్యమూకమున్. 474

కని తదుపాంతకాంతారాంతరంబున ననుజసహితుండై రాముండు ధనుర్బాణతూ
ణంబులు సహాయంబులుగా నుండె నని చెప్పి మహానందంబున. 475

ఆశ్వాసాంతము.

మిత్రామిత్రవిభేదశూన్య బుధసన్మిత్రాఖిలామిత్ర భ
క్త్రాణైకపరాయణా నిరతవృత్రఘ్నార్చితాంఘ్రిద్వయా
పత్త్ర్యధ్యక్షమహామదయా సుహృదయాబ్జా వేంకటాఖ్యోల్లస
న్గోత్రాభృన్నిలయా సుగాహిమలయా క్రూరోగ్రయామ్యాలయా. 476

అధివ్యాధిహరణ భ,క్తాధీనాంతఃకరణకరుణచరణా
సాధుజనావనచణ భవ,పాథోనిధ్యుత్తరణ కృపాప్రాభరణా. 477

కవిరాజవిరాజితము.

సరసిరుహోదర సన్నుతపాదరజఃపరిపూతరసాతలయా
పరమకృపాకర పామరభీకర భానుసుధాకరకోటివిభా
తరుణశుభాంగ మహీహృదయంగమ తార్క్ష్యతురంగమ దీనదయా
పర మధుసూదన ప్రణుతసుధోదన భవ్యవినోద నరాదహరీ. 478

గద్య. ఇది శ్రీసూర్యనారాయణ పదాబ్జధ్యానపరాయణ భూమధైర్య
వినయ రామనార్యతనయ పండితసేవాసముచ్చయ క్రొత్తపల్లి
లచ్చయ ప్రణీతం బైన దాశరథివిలాసం బను మహా
ప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.



క. వీరలుకౌశికతారి వారలు, వీరలు మహనీయు లిట్టివీరల నోరు లె
వ్వారలు పంపఁగఁ జాలెదు, వారలు తము దామ యిటకు స్వచ్ఛందగతిన్. 7

వ. వచ్చినవార లని తలంతు నని పలికి మఱియు నిట్లనియె. 8

మ. హితవాచంయమివేషధారులుఁ గృపాదృగ్జాలురున్ క్షత్రియా
కృతు లీవీరలు వాలి నేపడఁచి కిష్కింధాధిపత్యంబు స
మ్మతి నీ కీనిరుమేను లొప్పఁగ రమామానిన్యధీశుండు స
ద్గతి నేతెంచె ననందనర్చిరి జగత్కల్యాణచారిత్రముల్. 9

ఉ. వారివిధంబు సర్వము ధ్రువంబుగ నారసి వచ్చితి వేఁడుక
న్వారికి నీకు సఖ్యము నవశ్యముఁ గూర్చెద నట్టులైన నే
వారికి లోనుగాని బలవంతుఁడ వయ్యెద వెట్టివైరులం
జీరికిఁ గొందువే ప్లవగసింహుని వాలిని గీలి నేర్పవే. 10

క. అని వారిసమీపమునకుఁ, జని మాయాభిక్షుకత్వసంభృతుఁ డగుచు
న్వనమెల్లఁ ద తనూనూత్నవిలసన మొప్పఁ జేయఁ దగియెడునిభృతిన్. 11

ఉ. చేతులు దోయిలించి కపిసింహుఁడు వాయుసుతుండు మ్రొక్కి ని
ర్భీతులు సద్వినీతులు నపేతకునీతులుఁ బూతులుం జగ
త్త్రాతలు మీరు మానులకిధంబున ఘోరవనావనీసమా
యాతులు గాఁగ నేటికి దయామతులార యెఱుంగఁ జెప్పరే. 12

వ. అని యడిగి వెండియు. 13

క. చక్రీశసదృశబాహులుఁ, జక్రధరోపములుఁ జక్రచక్రాననులుం
జక్రహితరిపుసుభుజులు సువచక్రష పేశలులు సుకటిచక్రులు మీరల్. 14

క. మహి నెవ్వారలు వీరలు, బహుసుగుణావహులు నియమిభారవహు లనా
గ్రహులు మహామహు లియ్యెడ, సహిశయనుని ద్వ్యక్కృతు లన నలరెద రనినన్. 15

ఉ. ప్రాణసతీసువార్తఁ గొని రాఁగ ధీరునిగా నెఱింగియో
స్థాణువరంబునం బరమసాధ్వికి నజనకుం దగం జగ
త్త్రాణునిచేఁ బ్రజాతుఁ డగుధార్మికుఁ డంచుఁ దలంచియో సరి
క్షీణవిచారుఁడై ముదముఁ జెందెను రాముఁడు తన్మహోక్తులన్. 16

వ. ఇట్లు సంతసించి సహోదరుం గనుంగొని. 19

క. మనవృత్తము సర్వము లక్ష్మణ యితని కెఱుంగఁ జెప్పుమా యనవుడు స
జ్జనమణి సౌమిత్రి నరేంద్రుని యానతి మిగుల నతనితో నిట్లనియెన్. 18

# పంచమాశ్వాసము.

ఉ. భానుకులాబ్ధిపూర్ణహిమభానుఁడు పఙ్క్తిరథాధిపుండు త
త్సూనుల మీఁదఁ దగ్రజుఁడు సువ్రతచర్యుఁడు రామనాముఁ డా
త్మానుజు నన్న లక్ష్మణసమాఖ్యుని గూడి కడంగి భార్యయుం
దానును వేడ్కఁ బంచవటిఁ దాత వచస్థితి నున్న యంతటన్. 19

క. ఈనుశ్లోకునిసతి సీ,తాసతి యేమఱుపుగమను దౌదవ్వుల సం
త్రాసవనస్థితి మెలఁగెడు, నాసమయమునందు రాక్షసాహ్వాశ యైఁన్. 20

క. తత్కాంతారత్నము నే,తత్కాంతారస్థలమునఁ గంను మను చరీ
జోత్కలిక వెదకి విపులా,పత్కలితుల మొక్కచోఁ గబంధు మహాంధున్. 21

క. కని వాని వానిశాపం,బును దగ్ధముగా నొనర్చి పొలుపుగ నపు డా
ధనునామునిచే సుగ్రీ,వుని విని తత్సఖ్యమున నవుం బను తెల్లన్. 22

మ. అని తన్మర్కటనాథదర్శనసమీహాబద్ధహృద్గ్రంథియై
విను మిచ్చో నివసించినాఁ డురుజగద్విఖ్యాతమూర్ధన్యమూ
ర్ధన్యనితాంతస్ఫుటదీప్తిమత్కాళికాఘాటనాత్యంతప్రశస్తాంఘ్రిప
ద్మన కీరాముని కబ్జజుం డగచరేంద్రుం గొల్వ ప్రాపించి గటా. 23

వ. అని పలికి యున్న దెసకు విన్ననై కన్నీరు మున్నీరుగా వగచుచున్న యన్నరవరుఁ
కత్తరుచరవరుం డిట్లనియె. 24

క. ఏపగిది నవార్యము లగు, నాపదలకు ద   బోగల రార్యులు శోక
స్థాపితహృద్వృత్తులకుఁ, బైపయి నాప   వోడముఁ బలముఁ దోలంగున్. 25

వ. కావునఁ సుస్థిరుండవగు మని యనునయించి   నంతరంగంబున రామలక్ష్మణులం గని 26

క. బంటు నిటు వినుఁడు శోకం, బంటునిహ్నాయములతోడ సజ్జనకసుతం
బంటు వెలఁదిమోములు దగు, పంటు వెదకి కాంచు నట్టిపని నాగిమఁశ్రీ 27

వ. అని యిట్లు. 28

క. తగఁగ నవిదులుల నవికలు, లగుఁడని లఘుకంబిడ మగు ద్విస్త ఖగం
బగువాలముఁ ద్రిప్పుదు నయ్యగచరుఁ డిట్లనియె నైజ మగుగతిఁ దెలియన్. 29

క. అంజనకుఁ బ్రభంజనునిద,యుం జననము నొందినాఁడ హనుమద్విఖ్యా
తిం జను లెన్నన్ ఖలులఁ బ్ర,భంజన మొనరించుసత్ప్రభం జనువాఁడన్. 30

క. సుగ్రీవాగ్రసచివుఁడ న,దగ్రగ్రావాగ్రవాసి నైయు మిముఁ గని భూ
పాగ్రణులు భవత్సఖ్యసు,మగ్రావాప్తి నెదఁ గోరి యతఁ డిటుకు నరున్. 31

ఉత్సాహ. పంప వచ్చి వాఁడ నతనిపం పలంఘునీయ మా
పంప దాఁటి మీర లిందు బాణతూణధారులై
తెంపునం జరింపఁ గాంచి తెంపు లేనిభీతిచేఁ
ద్రిప్పికొనియె ధైర్యవల్లిఁ దిగ్మభానుసూనుఁడున్. 32

చ. వినఁ డతఁ డన్న దప్పరిభవించి సతీవిభవంబులెల్లఁ గై
కొనెఁడు దదీయసత్తమునకుం బ్రతిసత్తము లేమి నాతనిం
జెనకఁ దలంకి యగ్గిరి వసించినవాఁ డగుట న్భరత్సహో
యనిశితఖడ్గధార నురుమాడఁదలంచె విరోధిసాలమున్. 33

క. ఘనులార యతనిమిత్రత, కనుకూలత నొందుఁ డనుచు నట్లేనిఁ దగ
న్నిను మాడఁబోవుతీర్థము, చనుదెంచినయట్లు కాదె చయ్యన మాకున్. 34

క. స్మయరహిత నీవు చని నిశ్చయముగ సుగ్రీవుతోడిసఖ్యము మాకున్
దయఁ గూర్చిన నన్యోన్యప్రియకారుల మగుదు మనఁ గపిప్రభుఁ డాత్మన్. 35

గీ. పొంగి తగుభంగి నాప్లవపుంగవులను, బూర్ణకరుణాంతరంగులఁ బూర్ణముగను
దోడుకొని ఋశ్యమూకంబుఁ దొలుతఁ గదచి, యధికసౌరభమునిలయము మలయము.

క. కని రాముని రాముని రా, మునితమ్ముని నంతనిల్పి ముదమున సుగ్రీ
వుఁ సుగ్రీవునిఁ గని యిట్లని యెన్నఁగరానిహర్షమై యిట్లనియెన్. 37

మ. రవి సన్నం దనఋశ్యమూకవసుధరప్రాంతారకాంతారవా
రవిహారస్థితు లైనరాకొమరులం బ్రావీణ్యయు న్మాలి వై
రవిధాయాగతు లంచు నెంచుచు భయభ్రాంతుండ వైతిట్లు వా
రవివంశప్రభవు ల్జగత్ప్రభువు లత్యంతప్రసన్నాత్ములున్. 38

వ. తదీయమహానుభావం బభివర్ణనీయం బని పలికి మఱియు నిట్లనియె.

క. విఖ్యాతిమీఱ నీదగు, సఖ్యాతిశయంబుఁ గోరి చనుదెంచిరి ప్ర
త్యాఖ్యాతవైరు లత్యమలాఖ్యాతులు వారిఁ బొగడ నలవియె నాకున్. 40

తే. అనుచు వారియొందంత మాద్యంత మగచ, రేంద్రునకుఁ దెల్పి వెండియు నిట్టు లనియె
నీఁదపాపఁడు వెలిచి గట్టెక్కనేల, యిపుడు నీకష్టమెల్లఁ గట్టెక్కనమను. 41

ఉ. ఆచలినట్టుపట్టి నెనరారఁ గవుంగిటఁ బట్టి చిన్నవాఁ
డాచలికంటుఁ బం డనుచు నాఁకట మ్రింగఁగఁబోయినట్టి నీ
వాచలిగట్టుఁ బిట్టువడఁ గాడఁగ మెట్టెనుఁదిట్ట విట్టివో
నాచెలి కాఁడవైతి విఁక నాకుఁ గొఱంత ఘటిల్లదొక్కఁడున్. 42

వ. అని ప్రశంసించి. 43

క. స్పష్టమతిం బురుషార్థచ, తుష్టయ మనఁదగుసచివచతుష్టయ మొప్పం
దుష్టయము భువనపూర్ణో, త్కృష్టయశు న్రాముఁ జూడఁ దివిరెనుమదితోన్. 44

క. నిటలతటసుఘటితాంజలి, పుటుఁ డై మర్కటవిభుండు పులకపటలము
ల్పటుగతి మేన నలమికొన, నటు చని రాము న్మహాత్ము ననుజాన్వితున్. 45

సీ. కని పేద పెన్నిధిఁ గనినచందంబున, నత్యంతసంతోషి యై తదీయ
చరణారవిందసంస్పర్శితనిజఫాల, భాగుఁ డై యానందబాష్పసలిల
పూరితాక్షుం డగుసౌరి సమీక్షించి, రాముండు గరుణాభిరాముఁ డగుచు
గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చికొనియె ననంతరంబున సుమిత్రానందనునకు మ్రొక్కి
గీ. యగనిమన్నన వడసె నయ్యవసరమున, రాముఁ డనుజన్ముఁగూడి తోరమగునొక్క
చోట నాసీనుఁ డయ్యె నప్పాటఁ దొక్క, వలనఁ గూర్చుండెఁ దనసచివవరు లలర.

క. తగ నెల్లవారుఁ దమఁ గొలు, వఁగఁ గొలు వలరించు రామవల్లభుఁ డపు
డయ్యగచరులు గొలువ నగమున, వగపునఁ గూర్చుండె దైవవంచన నకటా. 47

వ. అట్టున్న యవసరంబున సామీరి నుద్దేశించి రాముండు సౌరి కిట్లనియె.

క. ఈతనికతమున భవదీ, యాతతవర్తనము లెల్ల నయ్యెను మాకుం
బూతాస్మచ్చరితంబును, వీతాఘుం డితనివలన వింటివి నీవున్. 49

వ. కావున. 50

గీ. మిత్రసత్పుత్రఖండితామిత్ర నీదు, మైత్రి యునియెడుఘనయానపాత్రమునను
నిశ్చయంబుగ విపదంబునిధిఁ దరింపఁ, గోరినారము దగ నియ్యకొనుము దీని. 51

చ. అనవుడు సంతసించి తగ నట్టుల సేయుద మీరు నేము స
ఖ్యనిరతి నున్నవారము ప్రియంబునఁ బొందొడఁగూడునేనిఁ జ
క్కనగు సమస్తకార్యములుఁ గంజహితాన్వయులార వేఱ వే
యనఁ బని యేల రాల నుదకాగ్రముల న్నిలుపంగఁజాలమే. 52

వ. అని పలికి మహానందుం డై రామచంద్రుం గనుంగొని. 53

క. తనుజాతబుద్ధియై భూ, తనుజాతహరించి మూర్ఖతను జరగినయ
ద్దనుజాతతజవసైన్యా, తనుజాత మడంచి మహిసుత న్వేసఁ దెత్తున్.

క. అని సుగ్రీవుఁడు పలికిన, విని సుగ్రీవుండు రామవిభుఁ డప్పుడ యా
తనిచేఁ దనచే నిడ న్యాతనిచేఁ దనచే నిడె న్మోదం బలరారన్. 55

వ. ఇట్లన్యోన్యంబును జేతం జేయి వెట్టి సఖ్యంబు గావించి మఱియు నగ్నిసాక్షికంబుగా నర్కసాక్షినందనుతోడ సర్వసాక్షి యగు శ్రీరాముండు మిత్రత్వంబు సంఘటించె నంత. 56

క. లీనగతిం దొల్లి నీయూ, లీనగ లీనగమున రుచు లీనంగ వైచె
న్నానవిభా యని జనకసుతానిక్షిప్తాలంకృతంబులు చూపన్ 57

క. ఆపావనిమాడ్కి నపు, డాభూపాన్వయవరుండు నాభూషణముల్
త్చేపట్టి లక్ష్మణునకుం, జూపెట్టుచు రాముం డధికశోకాతురుండై. 58

వ. మహీతలంబునం బరమమూర్ఛాపరవశుండై పడి కొంతవడికిం గొండొక తెలిసి నిజచరణసమీపంబున దుఃఖాతిశయంబునం బొరలుచున్న సౌమిత్రిం గనుంగొని. 59

క. ధరణీతనయామధురాధరసంపర్కగతఘన సుధాబిందులు నా
కరయం దనరారె నీమ్ముం, గఱముత్తియములను జూడఁగా సౌమిత్రీ. 60

క. వనగజకుంభంబులం బుట్టిన సతికుచకుంభముల నటించిన నీహా
రనికాయంబున కిటు వల, సెను జిక్కి వడంగ నెలవుం జెడ ఘన మగునే. 61

గీ. తగి తాటంకములధగద్ధగలు మాసెం, గాంచికాకింకిణీక్వణక్వణన మడంగె
లలితమంజీరపటుఝుళంఝుళలు డొంకెం, దరుణి నెడంబాసియున్న కతమునం గాదె.

క. ధృతి నగ లేంతిం దాల్తుం, బతిం బాసితి ననుచు భూమిపతితమ సేయం
గతిమాలి భూషలిదె నా, గతి వైరాగ్యంబుం దాల్చెం గాంచితె వత్సా. 63

వ. అని యనేకవిధంబుల వగచి వగచి పుడమిపట్టి నప్పుడె యెడంబాసినట్టులం జిత్తంబుల నుత్తలంబు గ్రొత్తసేయం బవనసుతుండు ప్రియవచనంబుల ననునయింప నూఱడిల్లె నిట్లు సుగ్రీవునితోడం బద్ధసఖ్యుండై యవ్వానరేశ్వరు నుద్దేశించి ప్రమదాతిరేకంబున. 64

ఉ. మిత్రతనూజ పాత్ర మగుమిత్రుండ వైతి వమిత్రగోత్రగో
త్రత్రుటనాస్వరప్రకటితప్రబలాస్మదమోఘపత్రుల
స్మిత్రులు నీకుం గల్గిన వెసం దునుమాడెద నన్నం బుణ్యచా
రిత్రుని రాముం గన్గొని హరిప్రియపుత్రుం డనంతతోషియై. 65

వ. సకరుణంబుగా నిట్లనియె. 56

క. నా కగ్రజుండు వాలి వ, నౌకోగ్రేసరుండు బలిమి నాయాలి రుమం
గైకొని వెడలంగనడిచిన, నా కీ గ్రావమున వేదనం బడవలసెన్. 67

క. నయ మొక్కింతయుఁ దలఁప క, నయమునం బాధింప రామ నరవర యిచ్చో
నయమునం జెడి తిరిగెద వే, న యమునం జూడంగ వాలి ననుపును శక్తిన్. 68

వ. అని పలికి యంత నిలువక. 69

శా. నిష్కారుణ్యుఁ డగారిదారకుఁ డుర న్నిశ్శేషశుష్కద్రుమో
చ్ఛిష్కాకుండ వనం దనర్చి వెస భస్మీభూతుఁ గావించి ధా
నుష్కాగ్రేసర పుష్కరాక్షులను నన్నుం బ్రీతి వీక్షించి నన్
గిష్కింధాధిపతిత్వ మొందెదఁ గదుం గీశు ల్ప్రశంసింపఁగన్. 70

క. తనయాలి విడుచునతఁడుం, దనయాలి న్విడుచునతఁడు దశరథభూభృ
త్తనయా లేశంబును వే, తన యాలిఁక నుందుదురు గదా తలపోయన్. 71

వ. అని పలికి మఱియు నవ్వాలి ధైర్యస్థైర్యాదిగుణంబు లగ్గింపం దలంచి యిట్లనియె 72

స్రగ్ధరావృత్తము

మాయావిం దన్ని చీరెన్ మదవదుఁ బ్రబలోన్మాదుఁడై తన్నుఁ జీర
న్మాయావిం దుందుభి న్నామ మడఁచి మడిచె న్మానకన్నన్ని త్యా
మ్మాయావిశ్వంభరాభృద్వ్యసననిరతుఁ గా హాక్రియం దోఁచె శ్రీరా
మా యావీరాధివీరు న్మఘవసుతుని సామర్థ్య మెన్న న్వశంబే. 73

వ. మఱియు నబ్బలాధికుండు. 74

క. దుందుభి నడంచి దివి సుర,దుందుభులు సెలంగ శక్తితో నప్పుడ త
న్మందరనిభకుణపంబు న, మందరభసుఁ డగుచు వీచె మహీమాధికుఁ డై. 75

వ. ఇట్లు ఋశ్యమూకాచలాగ్రంబునకు. 76

క. జోటుజోటు నెత్తు రురుల వీఁచుటయుం దప మాచరించుచుఁ జట్టిలుఁ డొకఁ డ
చ్చోటునుండి కటువు లదరఁ, బటుపటు పికటుగతిఁ దపటలి గోలుకు మున్. 77

ఉ. క్రొవ్వున నిన్నగాగ్రమున కుం గుణపం బిటువైచి నేఁ
డెవ్వఁ డతండు హారిజభవేశ్వరు లడ్డ మైనఁ జచ్చుఁ బో
యివ్విపులాధరాగ్రమున నెక్కినయంతన యంచు శాపమి
న్నవ్విపులోగ్రవాక్యనిచయంబులు వింటిమి నేను వాలియున్. 78

వ. ఇవ్విధంబున మతంగమహామునీంద్రుండు శపించుటం జేసి యిన్నగంబునను న్నన్ను
మాయన్న పెన్నడిప వెఱచియున్నవాఁ డని పలికి యతనికిం దనకుం గలపూర్వ
వైరకారణంబు సవిస్తరంబుగా నెఱింగించి విషాదఖేదసాదోదూయమానమానసుం
డగు భానుసూను ననునయించి మేఘగర్జితసంకాశంబులగు భాషణంబులఁ బూష
కులభూషణుం డిట్లనియె. 78

క. ఆలింపుము రవిసుత నీ, వాలిం గూడెదవు నిశ్చయంబుగ నిఁక లే
దాలస్యము జవవచ్ఛర.కీలిం గీలించి వాలి గీలిం గాల్తున్. 80

క. నేలఁ బడఁగూల్తు వారిసుతు, నేలఁ బడం జాలి వానరేశ్వర నీచే
నేలఁబడుం దత్పద మిఁక, నేలపడఁతికూఁతు వెదక నీపని సుమ్మీ. 81

వ. అని నమ్మికదోఁప నాడుటయు సుగ్రీవుండు జడస్వభావంబుగా నిట్లనియె. 82

క. మాయన్న మున్ను దుందుభి,మాయ న్నశియింపఁ జేసి మడపిన కాయం
బోయన్న కదల్చినఁ జుమ్మీ యెన్నఁగవచ్చు వాలి నణఁచెద ననుచున్. 83

చ. అన విని నవ్వి రాముఁడు మహామహుఁ డందఱుఁ గూడి వాసవి
ప్రణిహతదుందుభిప్రకటరాక్షసకాయము హేయముం గనం
గొని చరణాంగుళి న్మిఱియఁగోటన మీటినఁ దచ్ఛవంబు యో
జన మగుదూరదేశమున శైలమన న్వడిఁ గూలెఁ గూలినన్. 84

క. కని విస్మయంబు మనమునఁ, బెనఁగొన వానరులు రాముఁ బ్రభుమాహాత్మ్యమునం
గొనియాడి రంత నారవితనయుం డిట్లనియె నద్భుతప్రమదమునన్. 85

ఉ. వాలి జవంబున న్విసరివైచినకాయ మితండు గాలిపె
న్ప్రేలునఁ దూలమీటెఁ గడువింత యుఁ గంజన దిప్ప డెండుటం
జేలిక యయ్యె నాతని వధింప సమర్థుఁడవేని పూని యీ
తాళము లొక్కకోల వసుధం బడఁ గూల్చినఁ జాల నమ్ముదున్. 86

క. అని తాళసప్తకముఁ జూపిన దశరథనామకాశ్యపీనాథసుతా
గ్రణియుఁ గపీశుఁడుఁ దను మెచ్చ ననల బాణంబు వింట సంధించి కడున్. 87

చ. లలి విడువం గలంబ మవిలంబగతిం ద్రుణరాజసప్తకం
బిలనొకవెట్టఁ గూలి పడనేసి ధర న్వెస దూసి ధారుణీ
తలమును బాసి భోగుల పదంబు క్షణంబున డాసి రాముని
మ్ముల పొదిఁ జొచ్చె నెల్లరుఁ బ్రభూతభయాస్పదులై కనుంగొనన్. 88

క. తాళములఁ గూల్చి వెసఁ బా,తాళముఁ గని బాణ మత్యుదగ్రత వెడలం
దాళిత భూతంబులు బే,తాళంబులు భీతి నొందెఁ దత్క్షణమాత్రన్. 89

క. తాళ్ళు దెగ నింక దనుజుల,యాళ్ళయొడళ్ళఁ గల మంగళాభరణములం
ద్రాళ్ళు మనకాళ్ళసంకెల,త్రాళ్ళును దెగు ననుచు దివిజతతి దివి నలరన్. 90

క. అప్పుడు తాళము లొఱఁగెడు,చప్పుడు కకుభముల నిండ సకలకుభంబు
లొప్పుడు వాలిం దునుమక, తప్పఁ డితం డనుచుఁ ధరణితనయుఁడు వొంగన్.

వ. మఱియుం దశమనంబున నపరిమితానందంబు నొందె నయ్యవసరంబున. 92

శా. బంధూకారుణభానుసూనుఁ గని భూపాలుండు సుగ్రీవ కిం
ష్కింధాద్వారముఁ జేరి వాలి నని కిం గేల్మోల్పు మే నంతటు
స్స్ఫ ధాభార్గవుఁ డీతఁ డంచు జను లెంచ న్నింపుబాణంబున
స్సెకింధాంతర్నిపతవృత్తి వాలి సెగుతుం గ్రౌర్యం బవార్యంబుగన్. 93

క. అని సుగ్రీవుం బురికొల్పి నరేశ్వరుఁ డనుజాఁడును గలిసి యమునఁ ఋష్య
ల్దనఁ గొలువ నేగి తత్సవిధనగాంతరమున వసించె ధానుష్కుండై. 94

ఉ. వాలి సెదిర్చి పోరుబలవంతులు లే రనుచుం గడంగి దే
వాలినుతు ల్సెలంగఁ గడు నర్హితవ ప్రముఖోజ్జ్వలద్యశ
శ్శాలి నొనర్పనో తరులచాటున డాఁగెను వాలిఁ గూల్పఁగా
కాలములోన రాముఁనకు సద్దమె వాలియుఁ గూలి గెలియుంగన్. 95

వ. అంత ననంతసంతోషితస్వాంతుం డగునసంతమణిసంతతి కిష్కింధానగర ద్వారంబుఁ
జేరి మీఱి. 96

ఉ. ఏ సుగ్రీవుఁడ వాహవోన్ముఖుఁడ నై యేతెంచితి న్నిన్ను నీ
తా సుగ్రీవునొనర్చంచుభయదాహ్వానంబుఁ గావింపఁ దా
రాసౌందర్యవతీమనోహరవదగ్రప్రాగల్భ్యతాకర్ణన
వ్యాసంగుం డమరేంద్రనందనుఁడు దుర్వారుండు దర్పోద్ధతిన్. 97

గీ. క్రాలి విలయకాలకాలకాలుఁడు కేలి,గూల మొక్కమూలపాలు చేసి
వాలివచ్చుచున్న వాఁ డన నవ్వాలి, తాఁకెఁ దనయమిత్రుఁ దరణిపుత్రు. 98

వ ఇట్లు. 99

క. తలపడ నినతనయుండు ను, త్తలపడనిమనంబుతోడఁ దాఁకెఁ గరుణయుం
దలఁపఁ డనివార్యుఁ డీతని,తలఁబడ నేయు వెస దశరథసుతుండనుమన్. 100

క. అబ్బలియు లబ్బురంబుగఁ, బొబ్బలిడుచు బొబ్బమొకయు బొబ్బమొకంబున్
బెబ్బులియున్ బెబ్బులి యుఁ, గుబ్బలి గుబ్బలి యుఁ జలముకొని కవియంగన్. 101

క. దంతంబులఁ గఱచుచు నఖ,కుంతంబులఁ జీఱుచుం బ్రకోపు లగుచుఁ బ
ల్వంతంబులు వలుకుచుఁ దదు,పాంతంబులశిలలు నలఁగఁ బదహతి లెసఁగన్. 102

ఉ. ఫాలము లెఱ్ఱవాఱ దిగిభశ్రుతిదారణకారణాహవా
స్ఫాలితబాహులై రిపువిఫాలనతత్పరులై కరంబుల
న్వాలము లెత్తి త్రిప్పుచు నవారణ వారణ యుగ్మకంబు నాఁ
బోలి పెనంగి రాప్లవగపుంగవు లింద్రదినేంద్రనందనుల్. 103

వ. మఱియు నన్యోన్యమర్మవిదారణకారణంబు లగుసంభాషణంబు లాడుచుం బోరా
డుచున్న సమయంబున. 104

క. అద్రిగరుద్భిత్సూనుఁ, డద్రిజనూజునకు భేద మారయ లేమి
న్నిద్రావితారివారుఁడు, భద్రాయితమూర్తి రామభద్రుఁడు శంకన్. 105

క. వదనంబులు రదనంబులు, బదము లుదరములు నురములు బాహులు నఖము
ల్పొదవు లొకరూప వాలికిఁ, దదనుజుఁ డై ట్టితరణితనయున కరయన్. 106

గీ. కానలెస్సగ సుగ్రీవు వానివాలు, వట్టియు నిరర్థకం బగునట్టియస్మ
దీయబాణంబునను వాలి నేయవలయు, ననుచు నెంతయుఁ దలపోయుననసరమున.

శా. శౌనాసీరికి సౌరి పాఱి రఘువంశ్యస్వామినిం జేరి యి
ట్లౌనా వాలి నెదిర్చి పోరు మని న న్నాజ్ఞాపితుం జేసి వే
వానిం ద్రుంకు ముపేక్ష సల్పితివి విశ్వాసంబుఁ బోఁద్రోఁచి నా
దేనిం గూల్పవె చూడు జర్జరిత మయ్యెం గాయ మెల్లం గడున్. 108

క. వాలి నను జంపఁ జిదప, న్వాలిం జంప ఫల మేమి వసుధేశ్వర న
న్వాలిఁ గొనఁ జేసెదె జను,లాలిఁగొనం జేసితివి మహాత్ముఁడ వయ్యున్. 109

మ. అన నారాముఁడు నొచ్చి యిట్లనియె నీ కావాలికి న్రూపయా
వనసత్త్వాదుల భేద మేమిఁ గని దుర్వారాస్మదీయాస్త్రమో
చనముం జేయనితప్పు సైఁపు మెడఁద న్సందేహమా న్మను మి
ప్పని కే నొప్పరికించి చూచెద నె ప్రభ్రష్టప్రతిజ్ఞుఁడ నై. 110

క. సమరూపాతిశయులు ఘనసమరము మీ రాచరించుసమయంబున మో
స మగు న్వర మిం దెవ్వరి, సమయించునొ యనుచు విడువఁజాలఁగ నైతిన్. 111

వ. కావున సాభిజ్ఞానుఁడ వై రణంబు సేయుము మఱియున. 112

క. కంటికి నెప్ప యగుచు మృ,క్కంటి యరుగుదెంచి వాలిఁ గాచిన వినుమీ
కంటెల్లఁ దీఱ నీవాల్గంటిఁ గొనినవానిఁ బట్టి కండలొనర్తున్. 118

వ. అని పలికి పవనపుత్త్రుం గనుంగొని. 114

గీ. వాలితోఁ బోరునెడ నానవాలితండు, మాలి యైనను నీవంతుమాలితనము
నఱుత నొకరెత్తుఁ దగులుపు మరుగు పట్టు,లేని రిపుఁ గూల్తు నే నడ్డులేనికడిమి.

వ. అనంతరయుం దక్షణంబున. 116

ఉ. జ్ఞానినుతుఁడు సంగరవిశారదుఁడు న్మహనీయకీర్తి ప్ర
జ్ఞానిధి రామమూర్తిసముఖంబున వాయుతనూభవుం డభి

జ్ఞానము గాఁగ నెంతయుఁ బ్రయత్నముఁ స్మరించి తెచ్చి స
న్మానముతోడ నుంచె సుమమాలిక నేలికకుఁ దపాలికన్. 117

వ. అంత. 118

క. కంధరధృతమాలికుఁ ఘన,కంధరనిభదేహు రవిజుఁ గని రాముఁడు ద
ర్పాంధు భవదగ్రజన్ము ను,ధాంధఃపతిపుత్త్రు బిల్వు మాహవమునకున్. 119

చ. అనవుడు సంశయంబు హృదయంబునఁ దోఁప నడంచికొంచు వే
చని విబుధేంద్రనందనుని సాహసమొప్పఁగఁ జీరెఁ బేరెలుం
గున సమరంబు సేయ నిదిగోఁ జనుదెంచినవాఁడ నంచు న
ధ్వని విని వాలి పంకజహితప్రభవు న్వధియింప నుగ్రుఁడై. 120

వ. చనుదెంచునెడ నెదురువచ్చి నఖనిజితతార యగు తార యిట్లనియె. 121

క. ఏను బలవంతుని వెనుబ్రాపున వచ్చినవాఁడు తపనపుత్త్రుఁడు కాకు
న్నను బోరి పాఱి మరలఁ, జనుదెంచునె కలని కిది విచారించు మెదన్. 122

క. హృదయేశ నామదిం గడు, బెదరొదవిన దదియుఁ గాక ప్రియ కుడి వెస నా
కదరుచునున్నది పోఁగూడ దనుడుఁ దద్వచనములు విని చెవులఁ బెట్టకన్. 123

వ. ఇట్లనాదరించి హితోపదేశిని యగునమ్మత్తకాశినిం గనుంగొని. 124

క. తరుణి నను జయింపఁగ న,త్తరణిసుతుఁడ వాఁడు నిశ్చితంబుగ విను మి
ద్ధరణిఁ బ్రయత్నంబున నవ,శరణము నొందఁగ వలదె వైరం బైనన్. 125

క. బోటీ నీమాటలు నా,బోఁటిమహావీరు నెడలఁ బొసఁగ వనుచుఁ గో
పాటోపమానసుండు న,నాటవిభుం దరుగుదెంచె నర్కజుఁ డాఁకన్. 126

వ. ఇట్లు వచ్చి. 127

క. కోపరసం బొడ లూనెనొ,కో పరికింపఁగ ననఁగఁ గుసుమశరరిపుజుతో
నోపంద మద్భుతాహతి, నోపం దర వాలె తలఁగు మోటమి వచ్చున్. 128

చ. అని వెస వాడి సౌరి నొకహస్తమునం గుదియించి యొంటి కే
ల నతనిమస్తకంబునఁ బలం బెసలారఁగ గ్రుద్దినం గడు
దనరెడు వా పెటిల్లి తనతమ్ముని గాఁగిటఁ జేర్చి స్వాధికా
రనిఖిలభార మాతనిశిరంబునఁ బెట్టె నొకానొక మునంబ యుల్. 129

వ. ఇవ్విధంబున. 130

క. గ్రుద్దిన నీడంబోవక, ప్రొద్దునిసువు వాలియురముఁ బొడుచు నిరువురుం
దద్దయు నద్దపిడిం బెన్నుద్దు లగుచు వ్రేటు లాడుచున్న ట్టితఱిన్. 131

క. సుగ్రీవుఁడు మాలాస్యగ్రీవుం డగుట వాలి నపుడు దెలిసి భూ
పాగ్రణి సమగ్రదోఃప్రబలోగ్రుఁ డగుచు వాలిఁ దునుమ నూహించె మదిన్. 132

ఉ. రాముఁడు ధార్మికుం డురుశరంబు గుణంబునఁ గూర్చి భానుజుం
డీ మొనరించి యాతని వడిం గొనివచ్చినయట్టి వాలి శా
ఖామృగశాలి పేరురముఁ గాఁడఁగ నేసెఁ గలంబమున్ దరు
స్తోమముచాటున న్నిలిచి సూటిదలిర్పఁగఁ గాలవేదితన్. 133

వ. ఇట్లు దృష్టిముష్టిసౌష్ఠవంబు వెలయుం దెగవాపుటయు. 134

ఉ. తాళము లేడుఁ గూల్చి వసుధాధరముం బెకలించి మించి పా
తాళముఁ జొచ్చి వచ్చినకదంబము వాలి యురంబు దూసిపోఁ
జాలక నిల్చె నెంతయును జానెసఁగె న్వెస వానిప్రాణవా
తూలము బీల్చుచున్న దనఁ దోయజమిత్రతనూజుఁ డార్వఁగన్. 135

వ అంత. 136

చ. సరభసవృత్తి రామునిపృషత్క మురంబున గాఁడినం దివీ
శ్వరతనయుండు హా యని దివాకరనందను వీడి ధారుణీ
ధర మురుభీకరస్వనమహాతం బయి కూలినభంగి వాలి గం
హారి దిగఁ గ్రుంగఁ గ్రాలి తదనంతర మానృపుఁ గాంచి దీనుఁడై. 137

ఉ. తార హితంబుఁ దెల్ప నతిధార్మికుఁ డారఘురామమూర్తి ని
ష్కారణ మేల నాపయిఁ బృషత్కము నేయు నటంచుఁ దద్వచ
స్సారము నీస చేసి పరుషక్రియ వచ్చి త్వదీయకైతవ
స్ఫారత నిట్లు పాలయితిఁ జావఁగ నీ కిది పౌరుషం బొకో. 138

క. మించినధార్మికుఁడవు కడు, వంచన గావించి వృక్షవారమునడుమం
బొంచి నను గూలిచితి వెఱ్ఱించి ననుం గెల్వ నవ్విరించికి వశమే. 139

వ. అది యట్లుండనిమ్ము. 140

సీ. ననుఁ జేరఁబిల్చి తమ్ముని రాజ్యమునకేఁ, పాపి వాఁడ నటంచుఁ బల్కవైతి
వతనికి నీకుఁ బోరిత మెట్టు లయ్యె ము, న్నని తెలియంగ నన్నడుగవైతి
వతని కీహరిరాజ్య మంతయు నొసఁగిపా, మ్మవలి కీ వనుచు నన్నాడవైతి
వినజునితో వైర మేల నీ కని సన్నుతింప సఖ్యము సంఘటింపవైతి
గీ వింతయేటికి నన్నెదిరించి పోరఁ, గ్రూరనారాచమునఁ బడఁగూల్పవైతి
వకట రామ సమగ్రగూఢచర్యఁ బొంచి, ప్రమదఁ జేసితి విష్ణుఁ డేమందు నిన్ను. 141

క. అంధునకున్ జాత్యంధుండు, పంథానము సూపలేనిపగిది ప్రాతసతీ
బంధుం డగుచట్టి వారిజబంధుసుతుం డెట్లు నీకు భార్యం గూర్చున్. 142

క. పరుల కహితంబు బొనర్చక, తరుల గిరులం దిరుగుకపి వృథాపాలియుం బ
న్నరవర నీ కన్యాయమె న, న్నవఱలుగఁ జేసినాఁడ వన్యాయముగన్. 143

క. విను సత్త్వహీనుచందం, బునఁ దరునికరంబునడుమఁ బొంచి మదమున
న్నను గపటంబునఁ బరిమార్చినవాఁడవు నీవు మానిసివె కలపోయున్. 144

వ. అని యిట్లు. 145

చ. అలసత వాలి రోషపరుషాక్షరగుంభితవాక్యసంతతు
ల్వలుక రఘూత్తముం డవనిపాలశిఖామణి రామభద్రుఁ డ
బ్బలిముఖుతోడ నీ కిటులఁ బ్రాణము వీడఁగ ధాత్రపాతమున్
గలుగఁగఁ దప్పు నెట్టు లెఱుఁగన్వశ మౌనె పురాకృతంబులన్. 146

వ. అదియునుంగాక. 147

క. నిను నెవ్విధమునఁ బరిమార్చిన నాకుం బాతకంబు సిద్ధింపదు త
మ్ముని భార్య రుమం జెఱపినపెనుదోషివి సిగ్గు లేక ప్రేలెద వనుచున్. 148

క. వాలి దనుదూఱునుడువుల, కోలి సదుత్తరము లిచ్చుచున్న యెడలం దా
నాలించి కపికులాధిపు, నా లించుక తాల్మి లేక యవశతఁ గొంచున్. 149

మ. గళదశ్రూదకధారయై విగతముక్తాహారవిస్తారయై
చలదత్యల్పకచావలగ్నయయి విస్రస్తాసితాభుగ్నయుం
తలయై హస్తతలప్రతాడనవిధూతప్రోల్లసత్ఫాలభా
గలసత్కుంకుమచిత్రకప్రరుచియై యత్యంతదీనాక్షియై 150

క. చనుదెంచి జీవితేశుం, గనఁ బోయెడుజీవితేశుఁ గని తార మహా
ధ్వని రామచంద్రునకు న, య్యినజునకుం గరుణ మానహింపఁగ నేడ్చెన్. 151

వ. ఏడ్చి రామరాజన్యకంఠీరవశిలీముఖముఖవిభిన్నుం డగు శాఖామృగకులరాజుం గనుం
గొని 152

క. వానరనాయక యిప్పుడు, వానరనాయకునిబాణహతి నీగతి నే
నెమ్మేనయుఁ బొరల నసయ, నెమ్మనవలోకింపవలసె నే మనస్సున్. 153

క. శైలశరాసునివాసము, కైలాసముఁ దొల్లి బంతిగా నెత్తి యయ
పౌలస్త్యుని వాలమ్మునఁ, గీలించినదిట్ట విట్టు గిట్టితె కట్టా. 154

క. దారం దారను విధవో, దారకు నారదుని హరిపదంబు విడిచి బృం
దారకలోకమునకు బృం, దారకరాజసుత పోవఁ దలఁచితివె మదిన్. 155

వ. అని మఱియు నతని సాహసాదిగుణంబు లగ్గించి విలపించుచు. 156

క. ధరణిం బడి పొరలెడు తరు,చరవరు శిర మంకపీఠి సంధించి తదీ
యరమణి నిజాశ్రుకణసం,భరితాననుఁ జేసి మిగులఁ బరితాపముతోన్. 157

చ. నను గనువిచ్చి యొప్పరగ నాథ కనుంగొను మేను దార చూ
రను నను జూడ నీకు మది రాదు వినష్టసుభాగ్య నౌట నీ
తనయు నంగదప్రవిజితస్ఫురదంగజలీలు శత్రుసై
న్యనికరభంగదు న్మణిమయాంగదు నంగదుఁ జూడు మర్మిలిన్. 158

క. కను విచ్చి నన్నుఁ గనుంగొను, మని యఱచుచు నంగదుఁడు పదాంతికభూమి
న్వినుఁ బొరలుట యువరాజ్యం,బునకు నను బూన్పు మనుచు మ్రొక్కుటయుఁ బతీ.

క. ఇనజుఁడు సుగ్రీవుఁడు నా,యనుజుఁ డనక యతని వైభవాప్తి సేయ
న్ననుజునిచేఁ జావవలసెఁ, జను నే యెవ్వరికి సహజశత్రుత్వంబుల్. 160

వ. అని ధర్మంబు దోఁప నాడి. 161

గీ. మఱియు శోకాంబురాశినిర్మగ్న యగుచు, హస్తయుగ్మకమున నిజమస్తకంబు
మోఁదికొనుచును దనతోడ మీఁద నున్న, ధవునితల డించి తార రాఘవునిఁ గాంచి.

క. ఒకతోఁ బోరెడునావరు, నురుతరుషండంబులోన నొదిగి యొదిగి సం
గరధర్మకోవిదుండవు, ధరణింబడఁ గూల్చితివి విధాత్రనిచయుదిన్. 163

ఉ. నీసతి సీత నెత్తికొని నింగిఁ జెలంగుచు నేగ రావణుం
డామరవృత్తి నాసురగణారి వధింపక నీవు నావిభుం
జేసితి కాలగోచరుఁగఁ జెప్పెడి దేమి యొకండు నేరమిం
జేసిన శత్రు వేలొకనిఁ జేసితి సామ్యము చెప్పినట్టుగన్. 164

క. మిత్రతనూజన్ ఘనుఁ డగు, మిత్రునిఁగా నెంచికొని యమిత్రత్వంబుం
గోత్రరిపుసుతునిపై నో,ధాత్రీశ్వర చూపుట యధిక ధర్మము గాదే. 165

వ. అని పలికి యంత నిలువక. 166

క. పాలనునిరీతి నోభూ,పాలక భార్యాసుతాలకుఁ బాపితి విపుడీ
వాలినిఁ జెప్పెడి దేమీ, వాలిని బిడ్డలను గూడి యలయుదె కుక్షివై. 167

వ. అని పలికి కెండియు ననేకవిధంబులం బలవించుచుండె నయ్యవసరంబున. 168

చ. అదరుచు వాలి యాలిఁ బ్లరగాఖలి మేదినిఁ ద్రాలి యున్న యం
గదుని మహోహరాంగదుని గన్గొని వేవనపేర్మి గాఢగ
ద్గదిక నెలుంగు రాలుపడఁగా ననిమొ న్వినుఁ డేల చాలనం
గదమురపిల్ల నెల్లనకుఁ గాలము మూఁడినఁ జేటు తప్పునే. 169

క. ఇఁకఁ బుత్త్రసత్కళత్రా,దిక బంధుసహోదరప్రవృద్ధతర మగుపాం
దికఁ బాఱఁ గడచనియెఁ గుం,దక ధైర్యము నూఁదుఁడీ మనమ్ముల మీరల్. 170

వ. అని పలికి తనవారి నెల్లం గలయం గనుంగొని. 171

ఆ. మున్ను నన్నుఁ గొల్చి యున్నచందంబునఁ, దపనపుత్త్రుఁ గొల్చి తదనువర్తు
లగుచు మెలఁగుఁ డతఁడు దగవర యతనిని ,దించి కాదె చావుఁ దెచ్చికొంటి 172

వ. అని పశ్చాత్తాపపరవశుండై. 173

క. దారం దారను నఖజిత,తార స్మితకాంతిదంతతార న్మణిమం
జీరం జేరంజీరిగ,భీరోక్తుల వగపు మాన్చి ప్రియ మిగురొత్తన్. 174

మ. కొడుకుం గౌఁగిట జేర్చి మోహమునఁ జెక్కుల్ నొక్కి ముద్దాడి యో
కుఱ్ఱఁడు మోహంబున వాలి యిట్లనియె నీకు న్వేఱుకం దక్రిపెం
దొడవై వాడుట తీఱె నిన్నుఁ గనుసంతోషంబు నా కింతటం
గడతేఱెం గలకాల మెవ్వరికి నేకాకారతం జెల్లునే. 175

క. అని మఱియుఁ దనయుం డుచితవ,చనముల నూరార్చి బాష్పసలిలోద్గముఁడై
తనయెదుర మిగుల వగ నొం,దునలి హితసుతున కంగదుం జూపి దయన్. 176

చ. అనుజుఁడ చింతఁదక్క పరమాదరణంబున నామవాక్యము
ల్వినుము మును దుర్వివేకి నయి వేయువిధంబుల నిన్ను బాధప
ట్టినఫల మీవిధంబున ఘటించె నటుంచుము దాని వీని నా
తనయునిఁ బూర్వమత్కృతవిధంబుఁ దలంపక ప్రోవుమీ దయన్. 177

వ. అని తనయునకుం దగినవచనంబులు వెండియు నుపన్యసించి యొప్పగించి తమ్ముఁ
డా నీకు నర్వంబునకు రాముండ కలం డని నిశ్చలాంతఃకరణంబున రామచంద్రున
కభిముఖుం డై. 178

క. కలలో నెవ్వనిపదములు, దలఁచిన నఱచేతి వగుచుఁ దనరుచు నుండుం
గలలోకము లప్పదములు, గలలోకైకనుతు నిన్నుఁ గంటి న్మంటిన్. 179

మ. అని తద్దివ్యపదాంబుజద్వయమరందాసక్తహృద్భృంగవ
ర్తనుఁడై తృష్ణ నిరాకరించి భవహర్తా రామ శ్రీరామ రా
మ నను న్సత్కరుణాకటాక్షమున సన్మానింపు మంచుం దొరం
గ నొగిం బ్రాణము లేనఁ బొర్లుచును సుగ్రీవాగ్రజుం డొక్కటన్. 180

వ. ఇవ్విధంబున సకలసద్గుణశరధి యగు దాశరథిశరపాతపాతితపాతకుం డగునతండు.

గీ. ఫలము లారులు దిని దిగంబరతఁ దిరుగు, నట్టివనచారు లేగడునట్టిగతికి
ఫలము లారులు దిని దిగంబరతఁ దిరుగు, వట్టివనచారి యయ్యెఁ దా నప్పుడు చనిరాం

వ. ఇట్లు దివిజరాజనందనుండు దివిజరాజరాజధానిం బ్రవేశించుటయుం బ్లవంగాం
గనలు నింగి వగుల వగలం బొగిలి రందుఁ దార శతారాయుధనందనుం దలంచి. 183

క. భిదురనిభం బగు రామప్రదరం బుదరంబుఁ గాడి పడిపోయితివా
పద రవిసుతుఁ డార్వఁగ న్యాయది నపగతశూర భూరమణి యని తలఁతున్. 184

క. ఆహార మెడలి కడు మృక్తాహారత నివ్విధమున నలఁగితె యిచ్చో
నాహా నాబాహాబల, మాహావమునఁ గపటుఁ జిత మయ్యె నని కటా. 185

వ. అని మఱియు నతనిగుణంబు లెగ్గించి పొరయుచున్న సమయంబున. 186

ఉ. రామునియాజ్ఞ లక్ష్మణుఁ డరాతిభయంకరు నాంజనేయు ను
ద్దాముఁ బురస్కరించుకొని తారను దారకుమారకుం గపి
స్తోమము నర్కనందనుని సొం పగుమాటల నూఱడింప సు
త్రామజనూభవుక్ హితవిధానముసం దహియించుపూనికన్. 187

వ. సుగ్రీవుం డంగదుం బురస్కరించికొని సమస్తవానరచమూసముపేతుండై సము
త్పాటితరామసాయకుం డగు వానరనాయకుం డగ్గఱి డగ్గుత్తికఁ బెట్టి యేడ్చుచు
నొకింత సేపునకు ధైర్యంబు జిక్కంబట్టి యక్కుణపంబుఁ బవిత్రజలపరిప్లుతంబుఁ
గావించి గంధమాల్యాద్యలంకరణశోభితంబుఁగా నుచితవాహనంబున నిడి బల
వంతు లగు బలీముఖప్రకరంబు మోచికొనిరాఁ బ్రేతభూపరిసరకాననంబునకుం జని
యుక్తక్రమంబున శిబిక డించి చందనాదికసౌరభపదార్థసంచయంబుఁ గూర్చి
పేర్చిన శోకంబునం జితి పేర్చి యప్పాడపై వాలికళేబరంబుఁ జేర్చి యప్రదక్షిణం
బుఁగాఁ దిరిగివచ్చి శిరఃప్రదేశంబున నంగదప్రయుక్తయుక్తం బగు నప్పార్చిఁ బ్రవృ
ద్ధార్చిఁ గావించి విరక్తియుక్తు లాడుచు నుచితక్రమంబున నగ్నికార్యంబు డపె
నంత వానరవధూవిలాపంబు లాకసమొగిం దిక్కుల ధ్రువం బిక్కటిల్లె నందుఁ దార
వనోకవల్లభు నుద్దేశించి. 188

ఆ. అతులసుందరాంగయుతుఁడ వగుచుఁ దార, రతిఁ గరంచి సంగరంబునందు
హరికుమార భస్మ మయిపోయితివె యక్క, టకట రాజమాళియంబ కాగ్ని. 189

క. అని మఱియుఁ బెక్కుఁదెఱఁగుల, నగమిమపతి సుతునిఁగూర్చి యార్చెడు తారం
గొని పంపాతీరమునకుఁ, జని సుస్నాతు లయి గద్రిచరవరు లెల్లన్. 190

వ. ఇట్లు పవిత్రస్నానంబులు గావించి. 191

క. వలయుఁదిలోదకములు నిశ్చలభక్తి నొసంగి షోడశమహాదానం
బుల నన్నదానములఁ దృప్తులఁ జేసిరి బ్రాహ్మణులఁ గవులఁ దగురీతిన్. 192

వ. మఱియు నవ్వానరేంద్రున కమరేంద్రలోక స్థితినివాసకరంబు లగు కరణీయంబు
లెన్నియేని నడిపి యశుచిత్వాపనోదార్థం బప్పుణ్యనదీతీరంబునఁ గొన్ని దినంబు
లున్న యనంతరంబున రవినందనుండు రఘునందన చరణారవింద సందర్శన కందళిత
హృదయానందుండై చని. 193

క. అంగదునింగూర్చి ప్లవంగాంగనలం బురికి ననిపి యాఁగము పొంగా
రం గుముదరిపుసుతుఁడు సర్వాంగాలింగిత వసుంధరావలయుం డై. 194

భుజంగప్రయాతము. ప్రణామంబుఁ గావింప రాముండుజూచ
ద్ఘృణామందహాస ప్రకీర్ణాననుం డై
గుణాఢ్యుం బవిత్రాత్మకున్ భానుసూనున్
మృణాళోరుబాహుద్వయిం గ్రుచ్చియెత్తెన్. 195

వ. ఇట్లు గాఢాదరపూర్వకంబుగా గారవించి కరుణారససముద్రుం డగు రామభద్రుండు
పవనతనయానుజాలం గనుంగొని. 196

ఆ. వాలిచేతమున్ను పాలితంబగు కపి, రాజ్యమునకు నినజుఁ బూజ్యలీల
నాచరింపుఁ డభిషేచనశోభనం, బి కఁ దడవు సేయ నేల మనకు. 197

క. అనవిని సౌమిత్రిపవనతనయు లలఘుతరము లజానితనయుండును ద
క్షిణకపియూథపులుం బ్రియ్యాన నాతనిఁ జుట్టుముట్టి యతులితలీలన్. 198

ఉ. బాంధవ మొప్పఁగూడికొని బంధురతూర్యరవంబు లుప్ప ది
క్సింధురకర్ణగోళములఁ జిందఱవందఱ సేయ సిద్ధగ
ర్వాంధత వానరుల్ దవ పల్లనఁ దోడ్కొనివచ్చి రప్పు గి
ష్కింధకు దేవలోకమలరుచిప్రతిభానుని భానుసూనునిన్. 199

వ. ఇట్లు దోడ్కొనివచ్చి.

క. శ్రద్ధఁ బ్లవంగాంగనలు సమిద్ధగతి నివాళులీయ నినజుఁడు సొచ్చె
న్నృద్ధాంతఃకరణుఁ డగుచు, శుద్ధాంతారుద్ధసిద్ధశుద్ధాంతంబున్. 200

వ. ఇట్లంతఃపురప్రవేశంబుఁ గావించె నంతకమున్న పౌరులు. 201

ఉ. కట్టిరి తోరణంబు లెసఁగ న్మను ముట్టిన తోరణంబులం
బెట్టిరి పూర్ణకుంభములు మేదురలీల మృదంగకాహళ
ల్గొట్టిరి పుష్పమాలికలు గుమ్మనఁ దావులు గ్రుమ్మరింపఁగాఁ
జుట్టిరి ద్వారదేశముల సూర్యతనూభవుఁ డుల్లసిల్లఁగన్. 202

క. ఫలయుతరంభాక్రముకంబుల సొల్లెడఁ బొందుపఱిచి పునుఁగుజవాదిం
గలయంపిఁ జిలికి కస్తురి, నలికి యిడిరి యాణిముత్తియపు నునుముగ్గుల్. 203

వ. వీడియును బరమశోభనంబుఁ గావించి రథ్యావర్గంబు సమస్త సంభార సంభరితం బును వారాంగనా నృత్తగీత విచిత్రంబును మంగళ తూర్యరవ సంగతంబును సకల జననయనానంద కరంబునై కరంబు విలసిల్లుటయును. 204

ఉ. అంత ననంతసంతసమ్మోదంబున నంబుజమిత్రపుత్త్రి న
త్యంతమనోహరాంబరనవాభరణాన్వితుఁ బుష్పమాలికా
క్రాంతగళప్రదేశు నొడికంబుగఁ దోడ్కొనివచ్చి తత్సభా
భ్యంతరసింహపీఠమున నాతనిఁ గూర్చి రమాత్యు లొప్పుగన్. 205

క. చామరము లిడిరి వేల్పుం, జామల కెనవచ్చు ప్లవగచంద్రముఖులు ని
స్సీమాభిరామభూషా, స్తోమఝుళంఝుళులు సన్నుతులు సేయంగన్. 206

గీ. తిపుర రాఘవుఁడు కృతప్రతిజ్ఞుఁడయ్యెఁ, గాన నీవును బ్రత్యుపకారపరుఁడ
వగు మనుచుఁ బుత్త్రి నరుఁ దెల్పనరుగుదెంచె, మిత్త్రుఁ డనఁ నొప్పె సంగ సితచ్ఛత్రమంత.

వ. పట్టాభిషేకసమయం బాసన్నంబగుడు హనుమజ్జాంబవదాదు లవనీసురసహాయు లై పుణ్యాహవాచనపూర్వకంబుగా హోమవిధి యథావిధి నిర్వర్తితంబు గావించి.

చ. కలుషహరంబు లంబువులు గల్గినభూరిసువర్ణకాంచనో
జ్జ్వలకలశంబు లందికొని వానరరాజ్య వరాభిషేచనం
బలరఁగ నాచరించిరి మహాగుణశాలికిఁ బ్రొద్దుమాలిక
య్యలఘులు రామచంద్రుని దయామృతముం జిలికించునట్లుగన్. 209

క. అమరి నమరావతికి నయ్యమరు లమరనాథునిఁ గ్రమాధికృతికి న
ర్యమ మున్నభిషేకించిన, క్రమమున సుగ్రీవు నఖిలకపిపదమునకున్. 210

క. అభిషేకం బొనరింపఁగ, నభివీక్షితుఁడయ్యె భాస్కరాత్మజుఁడు కపి
ప్రభుఁడగుచుఁ దారకామృ,ధ్యభాగభాగమృతకిరణు నాకృతి నంతన్. 211

గీ. సకలవానరులకు రామచంద్రునకు ను,ప్రమోదము గాఁగ నప్పుడ యంగదునకు
విదితమగు యౌవరాజ్యసంపదకు నర్హుఁ,జేసి పట్టాభిషేకంబు సేసెఁ గరుణ. 212

వ. ఇవ్విధంబునం గోత్రభిత్పుత్రునకుం బూజ్యయౌవరాజ్యపట్టాభిషేచనం బాచరిం చి ప్రాజ్యసామ్రాజ్యంబు వడసి మార్తాండనందనుండు రెండవ చండకిరణుం డనం బ్రజ్వరిల్లి. 213

ఉ. అత్తఱి వానరాంగనలు హారతు లీ సచివప్రయుక్తుఁడై
పత్తన వెల్ల వెల్లన సభార్యకుఁడై ప్రచరించి రాజ్యసం
పత్తిఁ గరంబు రాగిలి నృపాలతనూభవదివ్యదర్శనా
యత్తహృదబ్జుఁ డబ్జహితాత్మతనూభవుఁ డుల్లసంబునన్. 214

క. చనిబద్ధాంజలిపుటితాననుఁ డున్నయవినయభయవినమితశిరస్కుం
డును నగుచు రామచంద్రుం గని మ్రొక్కి యతండు ప్రీతిఁ గౌఁగిటఁ జేర్చెన్.

వ. అపరిమితానందభరితాంతఃకరణుం డగుచు నతని కిట్లనియె. 216

క. ప్రతిన నెఱపితివి నీవు, ప్రతిహతబలశాలి వగుట బ్రతికితిఁ గృపనన్
బ్రతిపీక్షింపుము ప్లవగ, ప్రతతిఁ దప్పింతు నీదు ప్రమదస్వేదకన్. 217

చ. అనవిని సంతసించి నలినాప్తతనూభవుఁ గాంచి రాముఁ డి
ట్లను బురికిప్డు పొమ్ము శరదాగమనమ్మున నమ్ము ధారుణీ
తనయను వార్తఁ దెమ్ము విదితమ్ముగ నిప్పుడు వానకాలమం
దనఘ వసింతు సోదరసహాయత నిగ్గిరిగహ్వరంబులన్. 218

క. కర్ణకజపదయనయనోత్కర్షము వర్షము కువరుఁ గాఁ గపిసేనా
ఘర్షితభూభాగుఁ డవై, వార్షమ్ము నరమ్ము కార్తికాగమనమునన్. 219

చ. అనుడుఁ దదాజ్ఞ వానరసహస్రసమేతము గా మహోత్సవం
బునఁ బురికేగుదెంచి కపిముఖ్యుఁడు భాస్కరనందనుండు త
జ్జనకసుతాగవేషణముఁ జాలినమర్కటకోటిఁ బిల్వఁ బం
చి నిఖిలమంత్రిపుంగవవిశిష్టసహాయము పేర్మి నెంతయున్. 220

క. రమణీమణియగు తారా, రమణీప్రియుఁడగుచు భాస్కరసుతుఁడు మెఱసె
న్మను నధికభూషణ మనోరమఁ గూడి ప్లవంగరాజ్యమున కధికృతుఁడై. 221

వ. ఇట్లు సంప్రాప్తమనోరథుండై మహాసుఖంబు లనుభవించుచుండె నంత నక్కడ
రాముండు సౌమిత్రిద్వితీయుండై ప్రవర్షణగిరిబిలంబుల సీతావియోగసాగరం
బు నిస్తరింప నుపాయంబు గానక సంతప్తచిత్తుండై యుండునంత. 222

క. కాలమునఁ దోఁచెఁ దొలకరి, కాలము నిబిడీసకాళికాకాలము భే
కాల మతిరిక్తశైత్యకు, నూలము పాంథజనములకు శూలంబగుచున్. 223

క. ప్రాఙ్మారుతబహుళము జల, ముఙ్మాలాపిహిత మగుత మోహము చతు
ర్దిఙ్మాలిన్యము దరదహి, భుఙ్మౌర్య్యము వర్షబుతువు పాలు ప్రవహించెన్. 224

చ. ప్రబలితవలాహకంబులు నభంబునఁ ఘూర్ణిలుచుం దటిల్లతా
ప్రబలత లోకమెల్లఁ దిమిరస్థగితంబుగఁ బర్చెనుప్రదే
శబలభిదుగ్రచాపవిలసత్స్థితి యొప్పఁగ వృష్టిఁ గల్గఁ జే
సె బహుళభూతకోటులఁ గృశింపఁగఁ జేసినతాప మాఱఁగన్. 225

క. వెనుమిన్నిడి పల్లంబిసి, యనిజనముల కేర్పరిప నవళంబుగ వృ
ష్టి నిరంతరధారాపాతమున భువనంబు భూమ్యుదకమయ మయ్యెన్. 226

గీ. పాంథకలహంసహృదయనిర్బంధకంబు, సమితనాగకుమారభయప్రదంబుఁ
గాఁగ నెంతయుఁ గేకికేకారవంబు, గల్గె నెల్లెడఁ బర్వతాగ్రంబులందు. 227

వ. అయ్యవసరంబున.

చ. అతులితరీతి గోత్రికి హర్షము వృద్ధి నొసంగుచుండఁగా
సతి రమణీయబాలతృణ మంతట నెంతయు నొప్పుమీఱె సం
తతకనకాప్రవర్షవితతస్ఫురదంబులసత్ప్రవాహసం
గతమున భూతధాత్రి కురుగత్రికిఁ బ్రాఁకుడువట్టెనో యనన్. 228

క. కమలాకరములు నిండెను, గనలంబులు దెలివిఁదూలి కమరెఁ గమలినీ
రమణుండు తిమిరపిహితుండై, సమదం బెడలి వారికోయసం దద్వేళన్. 229

గీ. వనము లెల్లను ఝిల్లికావనములయ్యె, భువనమెల్లను సంపూర్ణభువనమయ్యె
నభ్ర మభ్రమయంబయ్యెఁ బ్రమగఁ గన, నిబిడవారిదప్రావృడనేహమునను. 230

శా. ప్రోదిత్ర్యంబకదీప్తి గర్జితరథాంగారావముం బ్రస్ఫుర
ద్యాదశ్శోణిత మింద్రగోపభయదోద్యద్వ్యాఘ్రసఖుండుల బస
చ్ఛాదోమేదము వర్షబిందు లసదస్త్రం బభ్రమాతంగము
న్నోర్మిభూత సమస్తభూతముఁ బతన్ముక్తాసిలేశంబునై
శోధింపంబడె వానకాలము రణక్షోణీశక్రక్రియన్. 231

ఆ. అఖిలభూతకోటి కాప్యాయనంబగు, నట్టివానకాల మగుడఁ బుడమి
పట్టియగుడు రామభద్రుండు జలజాక్షి, దగుపిరాలిఁదూలి తాల్మిమాలి. 232

వ. తమ్మునిం గనుంగొని.

గీ. లక్ష్మణ తుణక్రభాప్రభాలక్షితంబు, మేఘనిర్ఘోషఘోషసమ్మిశ్రితంబు
నతుల ఝంఝాసమీర సమాశ్రితంబు, నైన యకాల మధికభయంబు గాదె. 233

క. పసిపిడుగులజడికంటెను, గడు బెడిదము లిమ్మయూర కంఠధ్వను లె
క్కుడు విసదారుల మెసపిన, వడితనమది సెనునె యెట్టిక్రంతలఁ బడినన్. 234

క. అని మఱియు న్వినుమనుజుండ, పెనుగతిఁ బ్రావృట్పయోదపిహితములగుని
ద్దినములు దుర్దినములుగా, కనఘా సుదినంబులెట్టులగుఁ బాంథులకున్. 235

క. అశుగము నాకుస్మరపుఁ, జాశుగనిహతత్రివలెఁ దాపమధికముఁ జేసెం
గ్లేశవినాశని జనక, క్ష్మేశసుతం బాసియున్న కృపణుండ నగుటన్. 236

వ. అని మఱియుం దద్వియోగకృశానుయోగ సంతప్యమానంబగు మానసంబున సౌమి
త్రిహితవచనరచనామృతంబునం దనుపుచుం దున్నంతం గతిపయదినంబులకు. 237

సీ. ద్యోధునీనిర్మల పాథోంతరపరిస్ఫుటత్పుండరీకషండంబులనఁగ
వ్యోమకేశునిజటాభ్యూహాభోగంబునఁబూసిన వెలిబూది పూఁతలనఁగ
ఖచరులు దడివోవఁగా నాకసంబున నాఱఁగట్టిన తెలిచీరలనఁగఁ
దొలుకరిఁ జిక్కిన నలమానసముఁబాసి పఱతెంచు రాయంచ బారులనఁగ
గీ. మంచుపగవాని గర్భీకరించినట్టి, నింగిజవరాలిగండపాండిమములనఁగఁ
జకితచాతకజాతసంజాతపాండు, రాభ్రములు మించెఁ దచ్ఛరదాగమమున. 238
గీ. భూసతీస్తనగిరుల ముస్తాబుసేయుకొన్న, లలితకస్తూరికాదంబు దొలఁచికొనసి
తాభ్రయోజితచంద్రకం బఁటదెననఁగ, నలరెను సితాభ్రము ల్పూర్వతామ్రములను. 239
క. అడఁగె న్నేకంబుల రొద, లడఁగె న్నేమంబు లంచ లబ్జవనములం
గడఁగె న్విధుండు శరములు, గడిగె స్మరుఁడేచి విరహిగణముల సెకవల్. 240
చ. కలుషతఁ దొల్లి తీరములఁ గాచిన భూరుహకోటిఁ గూల్చి త
త్కలుషతనిట్టులయ్యె ననఁగా నదు లెంతయు నిర్జలంబులై
వెలవెలఁబాఱఁజొచ్చె నది యెంతయుసంజన దెట్లుఁ గాంచనో
ర్ములుగలవారికిన్ ఘనతయొచ్చునట్టు లొకప్పుఁ బాడియే. 241
వ. అంత. 242
ఉ. దక్షిణగాములైన జలదంబుల కొక్కొ ధరాసురుండు ప్ర
త్యక్షముగాఁగ ప్రొక్కుచుఁ బ్రయాణము మానినవో యనంగఁ బ్రా
గ్దక్షిణభాగమందున నగస్త్యమహోదయమైన మేఘమా
లాక్షయమయ్యె నంబరమహార్ణవశోషి శరత్సమాద్ధృతిన్. 243
సీ. మఱియుఁ దచ్ఛరదాగమంబునఁ దనంతరితఖురవోలె రాజహంసలఁ బెనంగి
పక్షిరాడ్ధ్వజభూరివక్షఃస్థలంబువోలెఁ లాలితకమలానుకూలమగుచు
ధర్మాభిరతసభాస్థానంబువోలె నలక్షితపంకకలంకమగుచుఁ
బ్రమథనాయకునిశిరఃప్రదేశమువోలె విమలభాసురనదీవిహితమగుచు
గీ. డంబుమీఱెను చంద్రమండలమువోలె, నధికతరచారుకువలయహ్లాదమగుచు
నట్టిజలదాంతసమయసమాగతప్రశస్తతరపాత్ర శారదరాత్రులందు 244
క. వెరవరి లోకేశుఁడు త, స్కరజారవ్రజములనెఱి చలిచీకులపై
నురుగతిఁ జల్లినముగ్గను, కరణిఁ గువలయానుమోది కౌముది ప్రబలెన్. 245
ఉ. అట్టిశరన్నిశన్ హిమకరాతపమాత్మకు నార్తిగూర్పఁ దోఁ
బుట్టువుకేలువట్టి రఘుపుంగవుఁ డాలి విరాళిఁ దూలి వ

స్ఫుట్టులికింపఁ జొచ్చిరతిభీకర లీస్మరవారిజారులీ
పట్టుఁ బ్రాణముల్విడుతుఁ బ్రాణములేటికి సీతఁబాసితిక్. 246

వ. అనిపలికి చంద్రోపాలంభనపరుండయి లక్ష్మణుం గనుంగొని. 247

క. ఇతఁ డమృతకిరణుఁడే కాఁ, డతివిషముఁడు గాకయున్న ననుజూఁడ దారా
యుతుఁగానినన్నుఁ దారా, న్వితుఁ డేఁచందగునె యామినీచరవృత్తిక్. 248

క. తగనెంచుం గువలయహితుఁ,డగు రాజుకళాప్రపూర్ణుఁడగుఁగాక కడుం
దెగనిక్కళత్వ మిమ్మల విబుధగురుద్వేషి కగుఁగ నితఁడు తక్కెనె చెప్పుమా. 249

క. అకలంకుఁడ సన్మార్గుఁడ నకుటిలుఁడనటంచుఁ బొంగు నమవసఁ గ్రుంగు
న్సకలంకుఁ డసన్మార్గుఁడు, సకుటిలుఁడుం గార్యుఁ డితనిచంద మెఱుఁగమే. 250

వ. వీనిరాకపోకలు జనంబులెఱుఁగరే యని వెండియు. 251

ఉ. ఈతఁడు చోరకోటికి ననిష్టుఁడటందురు కొంద ఱీతఁడే
ఘాతయొనర్చుఁ బాంథుల నకారణ మిమ్మిహిరాంశుఁ డెంతయు
ద్యోతకుఁడంచు లోకములు దూఱఁగ నించుక సిగ్గునొందఁడా
పాతలపోయఁగార్యుఁడగు నాతఁడు లజ్జ నెఱుంగఁడేకదా. 252

వ అని యివ్విధంబున. 253

క. వనజారిదూఱి మీఱిన, జనకసుతావిరహవహ్ని సమసీనధృతి న
మ్మనుజేంద్రుఁ డంతఁ గఁదర్పునిఁగూర్చి విశేషరోషపూరితముఖుఁడై. 254

క తుఁటుకలఁ జిలుకతేజియు, నంటినఁ గసుగందుపూవుటమ్ము లెవరికిం
గఁటబడని సచివుఁడు మాకొంటి ననుటికంటిమంటఁ గ్రాఁగిననీకుక్. 255

క. అట్టివిలుకాఁడ వీవే, యిట్టుల విరహిజనహృదయపాటనమునకుం
దిట్టవయితి వ్రాహింపఁగ, నిట్టివిగావే విధాతృకృతచిత్రంబుల్. 256

చ. కటకటపూవుబాణములఁ గమ్మని విల్లునఁదాల్చి చిక్కితే
రటనిటుఁ ద్రిప్పుచు న్వరిసహాయతనెంతయు దర్పయుండవై
యటుఁ దపం బొనర్చుచు ధరాత్మజుఁ బాసిన రాజమౌళిపైఁ
బటుగతి నేలపోయెదవు భస్మముగాఁగల కంబకాగ్నిచేక్. 257

వ. అని పలికి నిట్టూర్పునిగుడించి. 258

క. తమ్ముల శోకమ్ములఁ గుం, దమ్ముల సందమ్ములగుచుఁ దనరారెడుచూ
తమ్ముల నేయకు ననుఁ గుసుమ, దమ్ముల నేయము మటులైనఁ దనువుఁ దొఱఁగుదుక్.

క. అనిపలికియు నివ్విధంబున, వనజారిక్ దూఱిదూఱి వసుధేశుఁడు మె
ల్లనిచల్లనిగాడుపుఁ బి, ల్లతెఁరున కోయవకఁ జలంబటిపలుకుక్. 260

చ. అనిలుఁడ విన్ము నిన్ను హారమాంబు ననంతుఁడుపట్టి మ్రింగ నా
తనిజఠరాగ్ని నించుకయు దగ్ధము గాక తదాస్యవిస్ఫుర
ద్ఘనవిషవహ్నితోఁడుపడఁగా విగహిప్రజకున్ కాననం
బనయ తనేర్చి పేర్చెదు దయాపరిహీనుఁడ వుగ్రమూర్తివై. 261

సీ. ఘనజాలములనెల్ల గాసి యొనర్చెద వొకచోటఁ గాదు నీయునికిపట్టు
జనులెల్ల నినుఁ బ్రభంజనుఁడని పలుకుదు రెట్టివారలనైన నెదిరికొందు
వంతకు దెసనుండి యరుగుదెంచెదు చలపట్టిరహస్యంబు బైటనిడుదు
వురగులకడుపులనుండి వచ్చెదు వరతరులఫలంబుల నరులఁ ద్రోతు
గీ. వాటిపోయెదు పపులాగ్ని నాటనీవు, బీదవారలఁ గనుఁగొన్న బిట్టు నేతు
వట్టినిన్ను జగత్ప్రాణుఁ డనిన పంక, జాసనుం డేమి చతురాస్యుఁ డరసిచూడ. 262

వ. అని వెండియు బహువిధప్రలాపంబులు గావించుచుఁ బురోభాగవిఫలారుణకిసాలరసాలసాలాగ్రంబునం గండుమీఱి యున్న కీరకిశోరంబు నవలోకించి విభ్రమితాంతఃకరణుం డగుచు నిట్లనియె. 263

చ. అలరు ఫలోపయోగము సహాయసవర్తనముం దనర్ప ను
జ్జ్వలనిగమాంతవాస మహావాప్తకలాయత నొందిరాముని
ఱలుకటు ప్రాణిహింసనము మానటు యిట్లఖిలస్వహింతయుం
గలిగిన యోగశుకద్విజముఖంబున రాగముఁ బూను టుగ్రమే. 264

చ. అనుచు విరాళిఁ దూలి తనయాలికి చాలివినీలిమంబవో
లినవధులిట్టులంబు లురలీలను గానము విస్తరించుచున్
ఘనలతికాలతాంతవ్రదుకల్పితడోలికల న్సమీరణుం
డనుచెలియూఁచ నూఁగఁగని యోరెడు సీతఁ దలంచి యార్తుఁడై. 265

క. సీతాయుష్మద్వ్యాహో, జ్జ్ఞాతనలవిట్లు నాకఁ జల్లాటుభవ
చ్ఛ్రితనపమారుచి, స్నిగ్ధకటాక్షెతుణాక్షేకము లేవిన్. 266

క. అళుకొదుచ మరుఁడు కైదువ, జళిపించెడునట్లు నీ సాలకీసాలం
ఒళికచచలింపనెయుఁ, గళవళమందెన్ మనంబు కావందిగదే. 267

క. అటనాఁట సైన్యమునో, లలనా యొక నిముసముం దలంపక మఱవం
గలనా శుకశారికల, కలనాదములిపుడు వనముఁ గలఁపఁగఁ జొచ్చెన్. 268

వ. అని పటిమయం దదీయవియోగంబు సహింపక. 269

ఉ. తావులు గ్రుమ్మరించెడు లతాభవనంబులఁ దూఱివచ్చు క్రొ
మ్మావుల నీడ కేఁగు నటు మానికొలంకులఁ జేరఁబోవు న
వ్వోవెడలుం బరిస్ఫురితసూనరజంబు నలందు మేనసీ
తావిరహార్తి రాముఁ డొక తావునఁ గాల్నిలువంగ నేరఁ డిఁకన్. 270

వ. పరితాపంబు నొందుచుఁ బరిభ్రమించుచుఁ బరవశత్వంబు నొందుటయు నుచితవచన
శిశిరోపచారంబులం గొంత సేద దేర్చి లక్ష్మణుండు. 271

ఉ. ఏల పరిభ్రమించెదు మహీశ మహాశనికల్పతావకా
భీలశరావలీజ్వలనభీమశిఖోష్ణసహిష్ణు లప్పది
క్పాలురు సత్యరోష్యగిరిపాలురు గా రటులైన సాధ్విఁ
బ్భూలలనాకుమారి నృపపుంగవ ముందటఁ దెచ్చియుంచరే. 272

ఆ. అంతయేల యినజుఁ డాంజనేయాంగద, జాంబవత్ప్రముఖసారవాచర
భల్లుకోత్తములను బటుగతిఁ బిలిపించి, సీత వెదుక నాజ్ఞ సేయఁదన్నె. 273

చ. అనుటయుఁ గ్రోధశోకపరవశాత్ముఁడు రాముఁడు లక్ష్మణుం గనుం
గొని కనుఁగొంటివే ప్లవగకుంజరు వాలి నడంచి తన్మహా
ఘనవిభవంబు లిచ్చుటయుఁ గైకొని దుర్మదమెక్కి యెంతయుం
న్మనలఁ దలంపఁడయ్యెను రమాపతి గోతుల నమ్మఁజెల్లునే. 274

క. అనిపలికి మఱియు నతఁ డిట్లనుఁ గిష్కింధాపురమున కరిగి యతఁడు భూ
తనయానరయఁ బూనుట మదిఁ, గని సైఁపము కాకయున్న ఖండింపవా. 275

మ. అని యిట్లానతియీ రయంబున సుమిత్రాత్మోద్భవుం డేగి కాం
చె నభోల్లేఖితశాఖికాఫలరసస్వీకారసమ్మోదన
ర్తనశాఖామృగశాబకోత్కరయుతాక్రాంతోరుశాంతారము
న్ఘృణిపస్త్రాజితాంధకారమును గిష్కింధాపురీస్థానమున్. 276

వ. కని చేరంబోవు నవసరమ్మున నచ్చటి ప్లవంగపుంగవులు తమలోన. 277

మ. అహిమాంశుండు మహానురాగమునఁ బుత్రాలోకనాపేక్ష ని
మ్మహి కేతెంచెననంగ నొప్పెను జగన్మాన్యుం డనంతాభరో
ద్వహవాత్స్య తసమర్థుఁ డితఁడని తత్సౌందర్యగాంభీర్యస
న్మహిమాలోకనదర్పంబులను సంభ్రాంతాత్ములై చెచ్చెరన్. 278

క. చని సుగ్రీవుం దారా, వనితాప్రియుఁ గాంచి మ్రొక్కి వానరవరు లి
ట్లని రోదిననాయకసుత, విను మొకవిన్నపము విన్నవింతుము తెలియన్. 279

చ. అని సచివాళిఁ దోడ్కొని యహార్పతినందనుఁ డామమారుతోఁ
జనియెను రామునిం బ్రథితశాశ్రతగోత్రవిరామునిం గనుం
గొనినటు లేగి రాఘవునకుజ్జ హృదయంబునఁ గ్రోధశాంతికై
మును మును లక్ష్మణుం గనిచి మోదముతో నతఁ డట్లొనర్పఁగన్. 293

వ. మోక్షాగేలు ఫాలంబునం గీలించి. 294

క. పదపడి నపకనుతుండు తత్పదపద్మంబులకు మ్రొక్కి ప్రస్తుతు లెసఁగ
న్మది యదరుచుండ నపుడు య్యుదితేనుసమానముఖుఁ డొయ్యనఁ బలికెన్. 295

క. శాంతగుణాకర చతురా, శాంతంబుల నున్న యాద్రిచరముఖ్యుల నే
నింతకుమును పిలిపించితి, సంతోషము నొందు మిపుడ చనుదెంతు రనన్. 296

వ. దీనదయాళుం డగు రఘునందనుండు మహానందంబునం దపవనందనుం దదమాత్యులం గనుంగొని కనుఁగొనలఁ గరుణారసంబు జాలువాఱ వారలం గలపికొనియుండె నంతం గతిపయదినంబులకు. 297

శా. లాంగూలోచ్చలనోదితక్ష్వపటలీలాధూతధారాధరో
త్తుంగుల్లాంగలదీర్ఘదష్ట్రి లధికోద్యుక్తు ల్మహీభృన్మహా
భీలాంగు ల్నఖరాయుధోద్ధతులు నిర్భీతు ల్చతుర్దిక్కులన్
లాంగూలోత్తము లేగుదెంచిరి మనోల్లాసంబు సంధిల్లఁగన్. 298

వ. మఱియును. 299

క. దాశరథులకుం గిష్కింధేశునకు న్నతపం బహీనతనొందం
గీశులు సనుదెంచిరి నానాకేశసమానబలు లవని యీనికరణిన్. 300

క. గిరినిభుఁడు గంధమాదనుఁ, డరిపంకజమత్తకుంభి యగునగ్గజుఁడు
న్హరివిక్రముండు కేసరి, యరుదెంచిరి ప్లవగసైన్యులై వేర్వేఱన్. 301

సీ. అపరిమితాద్రిచరానీకములు గొల్వ, నరుదెంచెఁ గుముదాఖ్యుఁ డనునతండు
కొలఁదివెట్టఁగరాని కోఁతిమూఁకలతోడ, నరుగుదెంచెఁ గవాఖ్యుఁ డనునతండు
గణుతింపరాని వృతుచరభటాళిఁ దోడ్కొనివచ్చెను శరభుం డనునతండు
లెక్కయిడఁగఁజాలలేని వానరులతోఁ, జనుదెంచె వడిఁ దారుఁ డనునతండు

గీ. లలి నసంఖ్యాకకీశబలసహితముగ, నర్థి నేతెంచెఁ గుంజరుం డనునతండు
నరయ నంతింత యనరాని తరుచరాలి, తనరఁ గనుపట్టెను పనసుం డనునతండు. 302

క. వివిధవిపినాటసైన్యపరివృతులు నరిమథనులు నపరిమితబలులు వ
చ్చి విడిసిరి వినతమైంద,ద్వివిదులు నలనీలగలదధిముఖప్రముఖుల్. 303

చ. అతిబలు లుగ్రవేగులు మహాశనికర్కశదీర్ఘబాహు లు
ద్ధతతను లన్యసైన్యవిపినశ్వసనాకృతు లిద్ధకేసరి
శతబలులైన వృక్షచరసైనికు లెంతయుఁ దన్నుఁ గొల్వఁగా
శతబలి వచ్చెఁ బద్మహితసంభవు పంపిన పంపొనర్పఁగన్. 304

క. నల్లనిమేనులు నెంతయుఁ, దెల్లనిమోరలును గల్గి దిశ లెల్లను భే
దిల్లఁగ బొబ్బలు వెట్టెడు, భల్లుకములతోడ జాంబవంతుఁడు దోఁచెన్. 305

క. మానవనాయక భాస్కర,సూనులకు న్సంతసంబు సొంపువహింపం
గా నేగుదెంచెఁ దరుచర,సేనలు దనుఁజుట్టిరా సుషేణుఁడు కడిమిన్. 3˜6

క. అద్రులఁ గనకాద్రిసురల, రుద్రుఁడు తారకల హిమకరుండును బోలె
న్భద్రం బగుగపిసుభటస,ముద్రంబునఁ బవనసుతుఁడు ముఖ్యం డయ్యెన్. 307

క. తతవర్గబిందుతారా,తతికిం బరమాణుసైకతలవంబులకు
న్మితివెట్టుఁగాక సక్కపి,వితతి న్లెక్కింప విధి యధిఁబడదు న్నే. 308

వ. ఇవ్విధంబునం గట్టాయితం బగువనచరచమూసమూహంబు సముద్రజలంబులం బుడిసిలింపను, బ్రహ్మాండభాండంబు వగులింపను గులాచలంబులు విసరివేయనుం జాలి కయ్యంబునకుఁ గాలు ద్రవ్వుచుండె మఱియును. 8.9

క. అనుపమతరహరిసేనా,వననిధి ఘననీలగజగవయశరభనిశా
తనఖరకకేసరివేష్టనమునఁ బనసుతరశస్తతఁ బొలిచెన్. 310

వ. భుజబలాంగదుం డగు నంగదుండును విపులకపిసేనాసమేతుండై సేనాముఖంబునకుఁ గన్నాకై నిలిచె నట్టియెడ. 311

ఉ. అక్షులకుం బ్రియం బొదవునట్టిప్లవంగమసేనఁ గాంచి రా
మక్షితినాథుఁ డాదరసమగ్రుఁడు భాస్కరపుత్రుఁ గాంచి ప్రా
గ్దక్షిణపశ్చిమోత్తరపథంబుల జానకి రోయ నెంతయుం
దక్షుల బుద్ధివానరులఁ దప్పక యిప్పుడ పంపు మింపుగన్. 312

క. అనవుడు మహాప్రసాదఁ, బనఘ యటులుచేయువాఁడ నని కపిసేనం
గని పొంగి జనకజావిచ,యనతత్పరచిత్తవృత్తి నర్కజుఁ డంతన్. 313

క. వినతు న్వినతాసుతజవ,వినుతుం గని నీవు నూఱువేలప్లవగులం
గొని నేర్పునఁ దూర్పునకుం, జని జనకజ వెదకిరమ్ము చయ్యన నెలకున్. 314

మ. అని తద్దిక్ప్రతభూరిభూభృదురుగోష్ఠారామపల్లీగుహా
ఘనగంభీరసరిత్ప్రవాహములు వేడ్కం దేటతెల్లంబుగా

నిజుం డానతి యీ నెఱింగి వినతుం డేగ న్వడిం బూర్వది
గ్వనితాకర్ణపుటప్రపాట విరావాపూర్ణనై న్యాయధుర్యుఁడై. 315

వ. తదనంతరంబున. 316

చ. అనిలసమానవేగు ననిలాత్మజు నాత్మజసన్నిభుం గనుం
గొని రఘువంశశేఖరులకుం దగ నాతనిఁ జూపి వారి కి
ట్లనియె దృఢవ్రతుండు జతురాగమవేదియుఁ గామరూపకుం
డనిలసమానవిక్రమవిహారి మహారివిహారి యారయన్. 317

సీ. కనకాద్రి మెచ్చ దీతనిధైర్యరమ మించు జడదారిదొరకుఁ జేపడియె ననుచుఁ
దపనుని మెచ్చ దీతనితేజ మెక్కాల మొకరీతిగా నుండ నోఁడు ననుచు
నుదధిని సరకు సేయదు వీనిగాంభీర్య మలమంథనగముచేఁ గలఁగె ననుచు
నీమహామహుజవం బీఁదఁ గాదను నది యురుమనోరయమున కోప దనుచు

గీ. నీపటునితాల్మి భూతధాత్రీవనితను, గేలిఁ గావించుఁ జంతుప్రకృష్టభార
శమన మొదఁ గోరి యొక్కొకసారి బ్రహ్మ, విష్ణురుద్రాదులకు మొఱవెట్టుననుచు.

క. అంతియకా దీతఁడు తనకాంతి మనంబుల జయించెఁ గంతుని గౌరీ
కాంతున కె యగు నీహనుమంతుఁడు ధృతిమంతుఁ డంశుమంతుఁడు కాంతిన్. 319

ఉ. చాలు నితఁ డొకండ కులశైలసముద్రవనంబులుం దిశా
పాలపురంబులు న్వెదకి భామిని సీత నెఱింగి రా యశ
శ్శాలి మహాత్ము నీతని వెస న్నియమింతు నవార్ధిగర్భిస
త్కాలవహిద్రభూరుహనికుంజముల న్మహిపుత్రి రోయఁగన్. 320

వ. అని పలికి కరువలిపట్టిఁ గౌఁగిటం బట్టి సస్నేహంబును, సబాంధవంబును,
సగౌరవంబును, సవినయంబును సాదరంబును గా నతని కిట్లనియె. ః21

క. అతిబలకపిసేనాపరివృతుఁడ వగుచు యామ్యదిశకు వే చని తద్ది
క్షితధరణి వెదకి రమ్మా నృహితనూజ న్నీవ పరమహితుఁడవు నాకున్. 322

చ. అనవుడుఁ బొంగి నింగి నొరయం దనవాలము వెంచి భానుజ
న్మునకు నరేంద్రసూనులకుఁ బ్రమొక్కి మహామతి యప్డు వారి కి
ట్లను ననిలాత్మజుండు జనకాత్మజఁ గన్గొని వచ్చువాఁడ నం
బునిధిఁ గడాచియైన జను న్విదళించియు నైనఁ జెచ్చెరన్. 3.3

వ. అని పలి°. 324

గీ. ఇట్లు తుణమ దక్షిణమునకుఁ దరలనున్న, హనుమఁ గన్గొని రాముఁ డత్యంతవ్యాప్త
చిత్తుఁడై నిజకార్యసంసిద్ధి యితని, కతన నగునని తలఁచి యాఘును నతించె. 325

క. మాసక వెండియు నప్పవ,మానసుతుం బొగడి రామమహీనాథుఁడు ప్ర
జ్ఞానిధి జనకజకుం బ్రజ్ఞానార్థం బంగుళీయకం బొసఁగుటయున్. 326

వ. స్వామికార్యధురంధరుం డగు గంధవహనందనుండు గంధగజంబు తరుణకిసలయం
బుఁ బరిగ్రహించు చందంబున నయ్యంగరంబుఁ గరంబు రాగంబుమీఱం దత్క్ష
ణంబ దక్షిణకరంబు సాఁచి. 327

క. కొని హరివాక్యముల నూఁ,కొని వానరసమితిఁ గూడికొని వారల వీ
డ్కొని దక్షిణపథముం గై,కొని యేగె నొక్కెడ మలమికొని హెచ్చింపన్. 328

వ. ఇట్లనిలనందనుం డంతసత్త్వసంపన్నులగు నల నీల గజ గవయ గవాక్ష గంధమాధన
దధిముఖాంగదజాంబవదాదిమహావీరపరివృతుం డై యెల్లవిధంబులం బుడమిపట్టిం
గనిపట్టి వచ్చునట్టి ప్రతిన వట్టి చనియె నంత. 329

ఉ. ఆదశ నున్న యున్నతమహామహిభృత్సరసీవనంబు ల
త్యాదర మొప్పఁ దెల్లముగ నాతనికిన్ వినిపించి భీమసం
పాదిప్లవంగసైన్యము నపారముఁ దోడ్పడ నంపె నా ప్రతీ
చీదిశ సీతఁ జూడఁగ సుషేణుని వైరివనీకృశానునిన్. 330

క. అతనికి నొకమాసంబు, న్మితి వెట్టి యనంతరమున మిహిరసుతుఁడు ద
గ్గతపర్వతగహనాదులు, వితతమతిం దెలిపి రామవిభుఁడు నుతింపన్. 331

క. ఒక్కొకఁడ చాలి నాలుగు,దిక్కులు వెదకంగ జాలు ధీరులఁ గపులం
బెక్కండ్రఁ దోడుచేసియు, దక్కకుభంబునకు నా శతబలిం బుచ్చెన్. 332

వ. ఆతండు నొక్క మాసంబునం జనకతనయాన్వేషణంబుఁ గావించి మరలువాఁడై
చనియె నిట్లు. 333

క. కాష్ఠామాత్రమునఁ జతుః,కాష్ఠావిచయనసమర్థగతులు కపివరుల్
స్పష్టాహంకృతు లెసఁగఁ గ,రిష్ఠాత్ములు చనిరి గహ్వరీసుత నరయన్. 334

వ. ఇట్లరిగి. 335

క. తరుచరవర్యులు మునుముగఁ, దరుణిం ధరణీశనూజఁ దడవిరి మిగులన్
దరుల న్నదీనదంబుల, దరులం దిమిరప్రగాఢతరులం జరులన్. 336

సర్వలఘుసీసము.

మఱియుఁ దరుచరులు మసలక యవనిజ వెదకఁగఁ దొడఁగిరి వివిధగతుల
బులుఁగులు మెకములు మెలఁగెడు నెఱవులు బులుఁగులరుతములఁ బొదలుపొదలు
నుఱువులఁ బొరువులు మలలను శిలలను బొలములఁ గొలఁకులఁ బులినములను
బురములు నుపవనములు నిఱుకటములు నహులవివరములు గహనములును

గీ. వనులు దపములుగలిగెడువనములను శబరులయునుఱులఁ దలిరుఁబరఁగులతలు
నటజములు నవటములు బహుళశిఖరము, లపరమితభయదకరము లగుతలములు. 337

వ. ఇట్లరయుచు వెండియు. 338

ఉ. భానుసహస్రచారుతరభానుపరిస్ఫుటధాత్రి నీఁగ కా
లూనిన యంతవట్టయిన నూనమునొందక యుండునట్లుగా
జానకి సర్వరాత్రియ జానుగ రోసి యెఱుంగలేక యా
ర్వానరు లెల్లఁగూడికొని వచ్చిరి క్రమ్మఱ దైన్యచిత్తులై. 339

వ. దక్షిణదిశాపరిశోధనార్థం బరిగిన యశోధనులగు హనుమదాదులు తక్కం దక్కిన యక్కపులెల్ల నొక్కమొగిం దిక్కులఁద్రువ్వి జనుదెంచి రాజపుత్రరవిపుత్రులం గాంచి నమస్కరించి తమపోయివచ్చినచందం బెఱింగించువారై యిట్లనిరి. 340

మ. సితకీర్తి ప్రియులార యేమఁ బ్రతీచీప్రాగుదీచీదిశ
స్థితశృంగోన్నతపర్వతంబులఁ బయస్సింధూపగాతీరవి
స్తృతకాంతారములం గుడుంగముల ధాత్రీపుత్రి శోధించి వ
చ్చితి మెచ్చోటను వార్తయైన విన మాసీతానిమిత్తంబుగన్. 341

క. ఇఁక నెందు వెదకువారము, వెకలిం తుమె భూతధాత్రిఁ బెల్లగిల న
స్తకులాద్రులఁ ద్రొతుమె వా, నుకిఁ గోటల వెఱుకుదుమె యశోధనులారా. 342

గీ. ఆజ్ఞ యొసఁగుఁడు మా కని రంత రామలక్ష్మణులు నినజుండును దక్షిణంబు
వెదకఁబోయిన యమ్మహావీరవరుల,మీఁదఁ బ్రాణంబు లిడియుండి రాదరమున.

వ. అంత నక్కడ దక్కినంబుననుం జనినవనచరు లాలస్యంబున దక్కి యెక్కిన ప్రమాణకులు మరల నెక్కి వీక్షించుచుఁ, దడవిన ప్రదేశంబులు వెండియుం దడవుచు, నేమ మేమ జనకజం బొడగాంతుమని ప్రతినలు వట్టుచు రాఘవుండు మహానుభావుండు తదీయ కార్యనిర్వాహకుఁడ సర్వోత్కృష్టుం డని యాడుచు హనుమంతుం గొని యాడుచుం జని చని. 344

సీ. కొలఁకులు శోధించి కొలఁకుల లేమిన్నఁ, గొలఁకులు బురదగాఁ గలఁచివైచి
పొదరిండ్లు పరికించి పొదరిండ్ల లేమిన్నఁ, బొదరిండ్లు బయలుగాఁ జిదిమివైచి
తరువులు వీక్షించి తరువుల లేమిన్నఁ, దరువులు వ్రేళ్ళతో నురులఁద్రోచి
నగములు గనుఁగొని నగముల లేమిన్న, నగములు బిట్టు పెల్లగిలఁజేసి

గీ. గుహలు దఱఁగాంచి సీత కద్గుహల లేమి, గుహలు నగ్గొలుపఱచి యాకోఁతులిట్లు
తరులుగిరులున బొదలు బొదలు కొలఁకులు, గుహలు శోధించియమ్మహావనములువఱియు.

వ. సీతాన్వేషణంబు గావించుచు, 346

క. అని రంత నంగదుం డిట్లనియె న్వానరులఁ జాల మనమున నెటుకుం
బనిగలదే పోవఁగ మన, కనువగుఁ బ్రాయోపవేశ మందఱ కరయన్. 354

సీ. అనుచు గద్గదకంఠుఁడై యెల్లవారల నీక్షించి మఱియుఁ దా నిట్టులనియె
నవనిజఁ గనుఁగొన మని యటువోయినఁ జంపుఁ గాని యనుగ్రహింపఁ డర్క
నందనుం డాట రా నందుల కిచ్చోటఁ బుచ్చక నసువులు పొందు మీర
లెల్ల మీమనమున కిష్టమగునెఱవుల కనుచు మోమున దైన్య మాక్రమింప

ఆ. నశ్రు లురులుచున్న యంగదుఁ గనుఁగొని, యఖిలవానరులు మహార్తిఁ దూలి
నిశ్చయముగ నేము నీతోడివారము, గాక మాకుఁ బోవఁ గలదె మఱియు. 355

చ. సమయము రామచంద్రునకు సమ్మతిగా నొనరించి ధన్యలో
కములు జటాయు వెంతయు సుఖంబునఁ బొందినయట్లు రామకా
ర్యమున నసుప్రపంచముఁ దిరంబుగ వీడితిమేనిఁ బుణ్యలో
క మెమరు వచ్చునంచుఁ బ్లవగప్రభు లాతనిఁ జుట్టి యేర్చినన్. 356

వ. ధైర్యహిమవంతుం డగుహనుమంతుండు వారల కిట్లనియె. 357

క. మనము పరమాత్ముఁ డగు రాఘుని మనమునం బడయలేని మూర్ఖుల మని య
య్యనఘుఁడు నిజకారుణవం,తనిపేక్ష్యలఁ జేయుఁ జచ్చినం జాకున్నన్. 358

ఉ. కావున ధైర్యము న్విడక యకారణ మిగ్గిరిగహ్వరంబులం
జావఁగ నేల యప్పరమసాధ్వి నిలాసుతఁ గాంచి పోయి ధా
త్రీవరుమన్ననం బడసి తేజము నొందఁదలంపుఁ డిట్లు సం
భావితచిత్తవృత్తు లగుపాలసులట్లు తలంక నేటికిన్. 359

వ. అని వెండియు నుచితవచనంబులం దేర్చె. 360

క. కడుఁగుందు సీతవెదకం, గడుఁగుందు ముఖంబు లశ్రుకలితంబులు న
న్నడుగుండు కార్య మనునెడ, నడగుండు పగిది విహంగనాథుఁడొకఁ డొగిన్.

వ. సంపాతి యనునతండు. 362

ఉత్సాహము. అచటనుండి వారి క్రింద నరుగుదెంచువాఁడు త
ద్వచనసరణిఁ దనదుమద్దఁదమ్ముఁ డీల్గుటెరసి వ్ర
తుచరనాథ వరులఁ జేరఁ జనుడునపుడు కాంచి వా
నిచరితం బెఱుంగలేక నిఖిలకపులు భీతులై. 363

ఉ. కాలినపక్షముల్ క్రియఁ గల్గినమేనునఁ గూటమో యనం
గ్రాలుగళంబు నెత్తికొని క్రచ్చఱవచ్చెను నొక్కభూత మ

కాలుని ప్రేరణంబునఁ దగ న్మరణేచ్ఛ వహించియున్న కీ
శాలిఁ గ్రసింప దీనిపనినా మనకెల్ల మనోరథంబులున్. 364

క. అని మనల న్మ్రింగఁగను బొం,చున్నని నిర్భీతాత్ము లగుచు నఖిలకపులుఁ వా
నిన చూచుచుండఁ జేరం,జనుదెంచి విషాదమెసఁగ సంపాతి యనున్. 365

క. ఎక్కడి జటాయువతఁ డే, చక్కటి సమరంబు సేసి సమసెఁ బిదప మీ
రక్కరణి నెట్లెఱింగితి, రక్కట చెప్పుఁ డేను వానియగ్రజుఁడఁ జుండీ. 366

క. వారనికోపంబున నెవ్వారలతో రణ మొనర్చె వానికిఁ బోరం
గారణము మీదురాకయుఁ, గారణముం జెప్పుఁ డీవు గారవమెసఁగన్. 367

వ. అని యడిగి చింతాపరిక్రాంతుండై. 368

క. కలశలగోత్రంబున నెక్కల గాలి విదిర్చి వేయుఁగలఁడు కృపణుఁడై
కలనఁ బడవలసె మనము వికలమయ్యె జెప్పుఁడ తత్సకలవృత్తంబున్. 369

వ. అనిన నప్పతంగపుంగవునకు ప్లవంగపుంగవు లిట్లనిరి. 370

సీ. దశరథసుతుఁడు సీతానాథుఁ డనుజన్మసహితుఁడై పితృనాజ్ఞ నరణ్యవాసంబుఁ
బూని పంచవటంబుప్రాంతఁ బర్ణకుటీర మొనరించి నియతి నుండఁ బఙ్క్తి
కంఠుండు రామలక్ష్మణులను వంచించి జానకిం గొనిపోవు సమయమున జ
టాయువు రావణునాఁగి మహాహవం బొనరించి యొరగించి యుక్కడకి

గీ. దనుజచంద్రహాసదళితపక్షుఁడై, ధరణితలముఁ గొంచు దైత్యనాథుఁ
డెక్కడేఁగె ననియొ నక్కడ రాఘవు, లవనితనయ లేమి నలమటించి. 371

వ. తదన్వేషణార్థంబు నరణ్యంబునం బరిభ్రమించువా రెదురం బర్వతోపమానుండై పడియున్న జటాయువువలన నత్తవృత్తాంతంబు విని యనంతరంబునం బ్రాణపరిక్షీణుండగు నప్పక్షివరేణ్యు దశరథక్షితినాథుంబోలె దహించి తిలోదకంబు లొసంగి శబర్యాశ్రమంబును బంపాతీరంబునుం గడచి ఋశ్యమూకంబున వనచరేశ్వరుం డగు సుగ్రీవుంతోడం బద్ధసఖ్యులై తద్దినంబుగా వాలిం దునిమి తత్పదం బొసంగినం గొని పుత్తెమింగల ప్లవగపుంగవుల రావించి సీతాన్వేషణనిమిత్తంబుగా నెల్ల దిక్కులకుం బుచ్చిన నే మిద్దక్షిణంబునకుం జనుదెంచి యెందునుం జనకనందన సందర్శింపనేరక యూరకపోఁ దీరక ప్రాయోపవేశంబునం బ్రాణంబులు విడువ నున్నవార మని చెప్పి యప్పులుఁగు తేనికి వెండియు నిట్లనిరి. 372

క. పక్షివర నీకు నీగతిఁ, బక్షవిహీనం బగుట విపత్కృత మొ శా
ఖాక్షరసంకలితమొ మా, కీక్షణమున దెలిపుఁ బల్కుమీ నీవనుడున్. 373

ఉ. దేవరయొలర్ప భానుమును జేరఁగ నోపుదు నేన నేనయుం
జావిపులాద్రికాయుఁడు జటాయువు నేనునుఁ బిన్నదంబునం
బోవఁగ సూర్యరశ్మి మును బో. దిన నమ్మహనీయువేగికి
న్లావులలావులెల్ల వికలత్వము నొందుచువచ్చెఁ జెచ్చెరన్. 374

ఉ. తమ్ముని పక్షయుగ్మకము దగ్ధము గొంటు గోర్వలేక శీ
ఘ్రమ్మున నెద్ది మూర్ఛిలి ధరాపతనోన్ముఖుఁ డైన వానిమా
గ్గమ్మున నాత్మపక్షములఁ గప్పిన నప్పుడు కాక నా పత
త్రమ్ములు గాలె వాఁడు సురక్షితుఁ డయ్యె మదాత్మ నొంగఁగన్. 375

వ. ఇట్లు చండకిరణప్రచండకిరణదగ్ధగరుద్వయుండనై. 376

క. ఇక్కుధరంబునఁ బడి కదుఁ, జిక్కినవాఁడ దగుసేవ సేయుచు నిచటం
బెక్కుదినములుండి యతం, డెక్కడ కేని చనె యర్థేచ్ఛాపరుఁడై. 377

వ. నాఁటంగోలె వాఁడుమాయందు సుపార్శ్వుండగు సుపార్శ్వుండు నిత్యంబు నాహార రసంబు నిర్వర్తించుచుండం బరపడి జటాయువు ముని స్థానంబగు జనస్థానంబు సుస్థాయంబుగా నున్నవాఁ డనివింటి నొక్క సమయంబున మదీయపూర్వసంపాదిత పుణ్యకర్మవశంబున బాలసఖుం డగు నొక్కతపోధనుం గనుంగొని సభక్తిక సాష్టాంగ దండప్రణామంబు లాచరించి ప్రార్థించిన నస్మద్దీనదశాకారణంబుఁ దనదివ్యతపోమహానుభావంబున నెఱింగి నావలన వెండియుం దెలిసి యక్కరుణాకరుండు నాకుం గరుణించి పత్త్రివరా దశరథసుతాన్వేషణంబు నెపంబుగ వనచరులు రామాజ్ఞ నెన్నండేనివ్వంగంబునకు వరుగుదెంతు రమ్మహాత్ములకు సీతావృత్తాంతంబు దేటపడం దెల్పి లబ్ధపక్షుండవు గమ్మని దీవించి వేంచేయుటయు నాఁటంబట్టి మీరాకఁ గనిపెట్టి ప్రాణంబులు చిక్కంబట్టియున్నవాఁడఁ గృతార్థుండ నైతి నని పలికి తమ్మునిం గూర్చి యార్చి పేర్చిన శోకంబు బుడిపికొని యవ్వారోత్తముల సహాయంబునం బుణ్యనదీ స్నానంబు గావించి జటాయువునకుం దిలోదకపిండప్రదానంబు పెట్టి పవిత్రుండై వారలం గనుంగొని. 378

చ. నగచరులార యింక మరణవ్యవసాయము మానుఁ డిష్టసీ
తఁ గనువిధంబు మీకు విదితంబుగఁ దెల్పెద దూరదృష్టి మా
కుఁ గలదు లంకనున్నది యకుంఠితసద్వ్రత రాముదేవి యి
మ్మగ శతయోజనంబులు సముద్రముఁ దాఁటుఁడు గానవచ్చెడున్. 379

క. అని మఱియుఁ బెక్కుభంగులు, వనచరులకుఁ దెల్పి పక్షివర్యుఁడు సంపా
తి నిజపత్త్రమ్ములు గల్గిన సంతసమంది వారికిం దగ ననియెన్. 380

ఉ. ఎక్కలు వారు నత్తబిసి యేనికృపం బ్రభవించె సత్త్వమిం
పెక్కుపతివ్రతామణి మహీసుత వీఁపునఁ బెట్టి లంకతో
నిక్కడఁ దెత్తునో కడు నహీనజవాఢ్యు మదీయపుత్రకుం
జక్కఁగఁ దోడ్కొనర్తునో ప్రశస్తగుణాస్పదులార చెప్పరే. 381

చ. అనవుడు సంతసించి శకునాధిప జానకియుండె లంకలో
నని తెలియంగఁ జెప్పితి సహాయము గాదొకొ నీవు నీసుతుం
డును జనుఁ డిట్టివర్తనఁ గడుం బఱపైన సముద్ర మెవ్విధం
బునఁ నయినం దరించి మహిపుత్రిఁ గనుంగొన నేము చాలమే. 382

క. అని పులుఁగు తేనిఁ బోవఁ, బనిచి కపిప్రభులు నెఱఁగు బంటిదొరలు ను
బ్బున నాడుచుఁ బాడుచుఁ జని, చని దక్షిణవార్ధితీరశైలోత్తమముక్. 383

చ. మలయగిరిం బ్రదక్షిణనమస్కృతు లొప్పఁగ నెక్కి వానరా
వలి గనియె స్సముద్రము నభంగతరంగరవాతిరౌద్రము
న్దలితనిజోరుఫేనరుచిలజ్జితనిర్మలతత్పశూద్రము
న్జలచరభద్రము న్మహితసాంద్రప్రవాళలతావిసద్రముక్. 384

క. కని తత్తరంగశీకర, జనితపరమశైత్యముం బ్రసన్నతలీలం
గొని మలయసమీర మెదుర్కొని తమమార్గశ్రమంబు కొంచెపఱుపఁగన్. 385

క. ననుఁ బ్లవగు లెట్లు కడచెద, రని నవ్వొకభంగి ఫేన మడరం బోని
త్తునె వీరల నాఁగక నను, ననువున భంగంబు లంతకంతకుఁ బెరుఁగన్. 386

వ. ఘూర్ణిల్లుచున్న వారాకరంబుఁ గనుంగొని భయభ్రాంతులగువారును మూర్ఛాపరవశత్వంబు నొందువారును మహానందంబు నొందువారును తరుగుల్మలతాగ్రంబులనుండి వీక్షించువారును విస్మితులగువారును, సరకు సేయక తత్తరంగంబుల నోలలాడువారునై రంత నంగదుండు తమవారిదెసఁ గలయం గనుంగొని. 387

క. ఎవ రెన్నియోజనంబులు, జవమున జలరాశి దాఁటఁ జాలుదు రనిన
న్నవదశయోజనముల దాఁ,క వచించిరి ప్లవగభల్లుకప్రభుముఖ్యుల్. 388

గీ. ఇట్లు తమతమకొలఁదుల నేర్పఱించి, యఖిలవనచరులును దెల్ప నాలకించి
యింద్రనందననందనుం డిట్టు లనియె, వారలెల్లను సంతోషవననిధిఁ దేల. 389

చ. అసదృశవేగి వాలి కెన యానధిరుండగుఁ గాని తక్కగాఁ
డసమున నీతఁ డంచుఁ గపులందఱు సంస్తుతిసేయ వారిరా
శి సరభసంబునం గడచి సీత గనుంగొని లంక నగ్రకే
ళి సలిపి మామనంబు లమలీమసవృత్తిఁ దలిర్ప వచ్చెదన్. 390

వ. అని తాను శతయోజనంబు లవలీల దాఁటనోపుట యుగ్గడించి యొక్కింత విచారించి
వెండియు నత్తరుచరులతో నతండు. 391

క. తరుచరు లానందింపఁగ, శరనిధి వెస నుత్తరించి జనకజఁ గని త
త్పురిఁ గాలఁ జమరి క్రమ్మఱి, యరుదెంచుట నాకు శక్య మానో కాదో. 392

వ. సంశయంబు గలదని పలికి ధైర్యాతిరిక్తంబున వెండియు. 393

చ. అది యటులుండనిండు ముదమారఁగ నియ్యెడ నుండుఁ డేను బో
యెద నిదె పర్వతాకృతి వహింపఁ బయోనిధి దాఁటి నాఁగ నం
గదుఁ గని వారలెల్లను సగౌరవ మొప్పఁగ నాడి రీవు చా
లు దుదధి దాఁటి యెల్లపనులు న్నవ ఘటించి మమ్ముఁ బ్రోవఁగన్. 394

క. అయినను నీ వేగినఁ ద్రుటి, యయినను నే మోర్వఁ జాల మనయంబున మా
నయనములు చల్లఁగా నీ, దయినశుభాంగంబు గాంచి యలరుదు మెపుడున్. 395

క. ఈకడలి వెడలి తగనవ, నీకన్యం జూచి రాఁగ నీవోపుదు నీ
పోక కపివరులయసువుల, పోక సుమీ కలమె నిన్నుఁ బొమ్మని పలుకన్. 396

సీ. పసితనంబున ఫలభ్రాంతి నుక్కుఱ బాలభానుఁ నెవ్వాఁడు చేపట్టవిడిచె
దుష్టవర్తనుల దైత్యులఁ బట్టి పాలార్చె మునులచే నెవఁడు దీవనలువడసె
దివ్యాస్త్రముల కసాధితుఁడగా బ్రహ్మాదిసురలచే నెవ్వాఁడు వరములందె
నితనిచే మనపనియెల్లఁ దీరఁటంచు ముద్రి కెవ్వనికి రాముం డొసంగె

గీ. నెల్లవిధముల జానకి నేఁ గాంతుఁ బ్రకటగతి నని యెవ్వాఁడు ప్రతినవట్టె
నట్టిహనుమంతుఁ డతిశాంతుఁ డరికృతాంతుఁ, డుండ మనకేల యోయఁగ దుండడనఁగ.

వ. అని యివ్విధంబున నాంజనేయుండు వినుచుండం బలికి వెండియు నమ్మహావీరు
జన్మబలపరాక్రమప్రకారంబు లగ్గడించి యయ్యంగదుం బురస్కరించికొని జాంబ
వదాదులు హనుమంతుం బ్రశంసావచనంబుల నగ్గించుచు డగ్గఱి. 398

శా. ఖద్యోతద్యుతినిర్జితాత్మరుచి లోకప్రాణసత్పుత్ర నీ
వుద్యచ్ఛ్రీఘనగతిం బయోధితరణోద్యోగంబు గావించి యా
పద్యుక్తం బగు వానరావళిఁ బ్రబుద్ధప్రాణవాతంబుగా
విద్యాజీవ కడంగుమా జనకజాన్వేషార్థ మర్థించుచున్. 399

క. వనచరు లిట్లనరాఁ, గని భీతిల్లెదరు తమకుఁ గడవఁ గొలఁదిగా
దని పురుషోత్తమ నీకి, వ్వననిధిపతిపుఁ దాఁటు టెంతభరమూహింపన్. 400

క. గురుఁడగు వారియము ధవద్గురుఁడగు వారిరయముఁ బక్షిఘోటకుఁడు జగ
ద్గురుఁడగు వారియమును నీ, గురుయమున కెట్టు లెనయగు న్నారివరా. 401

వ. అదియుంగాక. 402

చ. ఒకనిముసంబునం బహుళయోజనముల్లను ప్రౌఢతేరితో
నొకనిముసమ్మునం బాయక తదుష్ణము నోర్చి నభఃప్రచారివై
సకలకలావిభూతి రవిసత్కృప నేర్చినయట్టినీకుఁ జా
టుకడలి దాఁటు టోపని కటా యిటు లొప్పరికించి చూచెదే 403

వ. అని మఱియుం బెక్కుభంగులం బ్రార్థించి యగ్గించుటయు వానరేశ్వరుండు వారి
దైనదైన్యంబు వాయం బొంగుచు నిట్లనియె. 404

మ. రయతం బిచ్చుకగుట్టఁ గేసరికిశోరం బెట్టులంఘించు నా
క్రియఁ బాథోధిఁగడాచి యందుఁ జని పఙ్క్తిగ్రీవు లంకాపురీ
తుయసౌధోపవనోపకంఠముల నాక్ష్మాపుత్త్రి నీక్షించి యా
రయ నస్మన్ముద్రిక నిత్తుఁ దెత్తు ముదమారం బ్రత్యభిజ్ఞానముల్. 405

క. అని పలికి వారలెల్ల, దనమోమునఁ జూడ్కు లునిచి తద్దయుమోదం
బునఁ జూచుచుండ నప్పుడు పవనజుం డొప్పారె హైమవతసింహగతిన్. 406

వ. మఱియును.

చ. అతులితపర్వతాగ్రమున నాహనుమంతుఁడు వొల్చెఁ బూర్వప
ర్వతశిఖరోదితోజ్జ్వలదివాకరబింబసదృశుఁడై సమా
వృతకపివక్త్రపద్మములు విస్ఫురితంబులు గా నిజాననో
ద్ధితరుచిభాను లొప్పఁగ మహీచరఖేచరకోటి ముబ్బఁగన్. 407

క. ఇప్పగిది నొప్పి యెల్లను, దప్పక దీవింప నిజపదద్వంద్వంబుం
గుప్పించి యుప్పరంబున, కప్పుడెగసెఁ బర్వతాగ్ర మవని సమముగాన్. 4(8

వ. ఇట్లు లీలావాలోచ్చాలనంబుఁ గావించి నిఖిలవానరమనోనయనానందకరుండును
రామకార్యపరాయత్తచిత్తుండును నప్పవనప్రియనందనుండు దక్షిణాభిముఖుండై
సముద్రలంఘనంబు గావించి. 4(9

క. గిరిచాపవినిర్గతమై, యురుజవమున నిగుడు శరముకో యన లంకా
పురదహనార్థ మడరె నంబరచరులకు విస్మయంబు మల్లడిగొనఁగన్. 410

వ. వెండియు నత్తరుచరసత్తముండు. 411

క. ఖేటకసురీతి వాలముఁ, బాటవమునఁ ద్రిప్పికొనుచుఁ బటురభసమునన్
ఖేటములఁ బట్టికొన నా, ఖేటమునకుఁ జనినయట్లు కీర్తికిఁ దయ్యెన్. 412

వ. అంత. 413

గీ. ఘనఘోరఝంఝావాయువేగగరుడజవ,శరసరభసంబులను మించి చనుచునున్న
హనుమఘనదేహ మంతయు నంత కక్షి,గోచరము గామిఁ బ్లవగులు చూచు టుడిగి. 414

వ. మోముల విన్నందనంబు గదుర నమ్మహాత్మురాక వార్చి తత్తీరసికతాతలంబులం
ప్రాణంబులు చిక్కంబట్టియుండి రంత. 415

క. ఆ కార్యపరత్వము ని,ర్భీకత్వము దృఢరయంబు బీర మరసి య
ట్లాకాశంబున నేగుమ,హాకాయుం గాంచి పొగడి రంబరచరులున్. 416

గీ. ఇట్లు ఖచరాభినుతగతి నేగునమ్మ,హాత్ము కాయోద్ధితశ్వసనాహతాబ్ధి
పాథముచ్చుటయె చెప్ప నప్పరమసాధ్వి, నందు వెదకుచుఁ జనియెనో యనిన కరణి.

వ. ఇవ్విధంబునం బరమసాహసంబున నేకచరుండై ఖచరసంస్తూయమానగమనంబు
నం జను నయ్యగచరవర్యు నుద్దేశించి నిజకుక్షిసురక్షితంబగు మైనాకక్షితిధరంబున
కంబుధి యిట్లనియె. 418

ఉ. ఇమ్మహిరుట్పురోత్తముఁ డహీనజవాఢ్యుఁడయ్యెన నిట్టులో
క్కుమ్మడి సాహసించి శతయోజనము ల్చన దప్పి వుట్టుఁ బొ
మ్మమ్మహనీయ వేగు భవదగ్రమున న్నిలుపంగ రామకా
ర్యమ్మున కెవ్వరేనియు సహాయము సేయక మాననేర్తురే. 419

క. ఈకడలి నెడలి మత్ప్రియ, మీకార్యముఁ దీర్చనోపు దీవెట్లును మే
నాకక్షిఁ బుట్టినాఁడవు, నాకుక్షినవృద్ధిఁబొందినాఁడవు గానన్. 420

ఆ. అనుడు నట్లొనర్తు నని శింశుమారక,ర్కటకశాఖలొప్ప ఘనవిశుద్ధ
పాదశోభి యగుచుఁ బాథోధిమిత్రత, బయలు మెఱయ వెడలెఁ బర్వతంబు. 421

వ. ఇట్లు కడలి వెడలి హనుమంతున కభిముఖుం డై. 422

ఉ. ఓకపివంశసాగరపయోరుహశాత్రవ వాయుపుత్ర నై
నాకుఁడ వార్ధిపంపున ఘనత్వరితంబున వచ్చినాఁడ సౌ
మ్యాకృతి గొంతసేపు నిలు మస్మదురూన్నతకూటకోటి ని
శ్లోకరయంబునం జనఁగ నేల శ్రమంబు జనింపఁ దెంపునన్. 423

వ. అని పలికి వెండియు. 424

క. హలసదృశనఖర కోలా,హలబహుశం బిప్పయోధియం దునికి హలా
హలగళుఁడు బావ కోలా,హలుఁ డన్న హిమాద్రి కన్నయా తఁడు నాకున్. 425

చ. అనఘుడు నమ్మి వానిపయి హస్తము సాఁచి ధరేంద్ర వార్ధిబం
పినఁ జనుదెంచితంటి కడుఁ బ్రీతమనస్కుఁడ నైతి జానకిం

గనుఁగొని కాక విశ్రమముఁ గాంచుట మేలె తలంప నూఱుయో
జనములమాత్ర దాఁటుట యసాధ్యమె పొమ్మని వీడుకొల్పెడున్. 426

వ. అగ్గిరిచుమ నచ్చెరువందుచు నమ్మైనాకుండు సనుటయు మున్నిటి మిన్ను దఱిసి
పోవుచు నబ్బల్లిముండు. 417

క. సురఖేచరగంధర్వోత్కరవిస్మయకామరూపధగణము పేర్మిన్
సురసమ్మతి నేతెంచిన, సురస మ్మతివొంగ ననిచి సుస్థిరుఁ డవలన్. 428

శా. ఛాయాగ్రాహిణి తన్ను నాఁగిన నవష్టంభంబునం జేర్చి త
న్మాయాజాలము లెల్ల మాన్చి వెస నన్నక్తంచరీప్రోజ్జ్వల
త్కాయంబు న్నిజవాలపాశముఁ జిక్కంగట్టి యంభోధివి
స్ఫాయద్భంగనిమగ్నఁ జేసి విలపింపం జంపి తా నేగుచున్. 429

క. వే లవణాబ్ధిఁ గడచి యా, వేలం బవనాత్మజుండు వీక్షించె మహో
ద్వేలశతయోజనాంబుధి, వేలం గుసుమసౌరభాతివేల సువేలన్. 430

క. దండిమగఁ డిట్లుకనియు, ద్దండగదాదండవాలదండ మెసఁగ న
క్కొండపయి న్వెలుఁగనడ, గొండపగిది వ్రాలెఁ బిట్టు కుతలముగ్రుంగన్. 431

ఉ. హనుమంతుండు సువేలమీఁ దడిగి శైత్యాపాదిమందానిలం
బనుకూలం బగుచుండఁ గన్గొని మొఁ దుంగాంచద్విటంకాకరి
న్ఘనసౌధస్థితదర్పణాంశులహరీఖద్యోతశంకాకరిన్
దనుజాహార్యనగేంద్రబృంహితమహాధ్వానోగ్రలంకాపురిన్. 432

వ. కనుంగొని నిజాంతర్గతంబున. 433

క. గోపుర వలరాజునకుం, గాఁపుర మలకాపురంబు గనుఁగొన నీలం
కాపురమున కెన యగునే, కాపురమయ్యె న్నిశాటగణభరితంబై. 434

క. ఈవీకు సురభయంకర, రావణపాలిత మగుటఁ గరంబొప్పదు సౌ
మ్యాకృతియైన విభీషణు, చే వెలయు నటంచుఁ దలఁచెఁ జిత్తములోనన్. 435

ఉ. ఈగతి నెంచి తత్పురి మహీసుతరోయఁ దలంచి భూరిహే
మాగసదృత్తుకర్కశనిజాంగముఁ గుంచి సమీరనందనుం
డాగిరి డిగ్గి డిగ్గియులనందము లైన పురోపకంఠభూ
భాగములం దలిర్చువిరిపందిళులం గని యాత్మ మెచ్చుచున్. 436

సీ. నవరత్నఖచిత సుందరవేదికాహృద్య లసితంబులైన యాలయవరములఁ
గల్హారచక్రచక్రమరాళశైవల స్ఫారంబులైన కాసారములను

మకరందబిందు సమాశ్రిత మేదినీ భాగంబులైన యుపవనములను
రత్నకంబళ మహారజతసింహాసన స్థానంబులైన యాస్థానములను
గీ. జవలనంటి వెలింగెడు సౌధములను, నతిపవిత్రతరమహాశ్వశాలయములఁ
గామరూపధరుండగు కపివరుండు, వెదకి జానకిఁ గనలేక విహ్వలించి. 437
గీ. మఱియు నర్తనశాలలు మందురలును, నాయుధాగారములుఁ గృతకాచలములుఁ
బ్రాకటశిరోగృహంబులుఁ బ్రబలు బ్రపలు, నంతిపురములు నరసి యనంతరమున.
ఆ. అనిలసుతుఁడు రావణాంతఃపురంబున, నవనితనయ నరయ నరుగువాఁడు
లంక బింకమింక లంకిణి నిశ్శంకఁ, బిలుకుమార్చెఁ గడిఁది బీరమొప్ప. 439
ఉ. వంచనఁ దత్పురంబుఁ జొరవచ్చిన వారి నెఱింగిపట్టి బా
ధించు నిశాటి తన్ను నవధీరణసేయుచు వచ్చి చంపనూ
హించిన నివ్విధంబున మహింబడ మొట్టునఁ దాఁచుడున్విలా
పించుచుఁ గూలె లంక యరిబృందముచే పడునంచుఁ దెల్పుచున్. 440
క. లంకాస్వరూపయగు నా, లంకిణి గూలుటయు నిష్కళంకుండు నిరా
తంకుండు నగుచు మణిప, ల్యంకమునెర పేర్చి కానిలసితం బగుచున్ 441
వ. అనేకవిధాలంకరణ శోభితంబగు లంకాధ్యక్షు శుద్ధాంతంబున శుద్ధాంతఃకరణుం
డగు వృత్తచరాధ్యక్షుండు మానవాధ్యక్షు శుద్ధాంతంబు నరయుచుం జని చని కాం
త విధుకాంత శిలాస్థగిత విశాలరమణీయతరంబగు నొక్క ప్రదేశంబున. 442
సీ. మణిమద్యపుత్రికా మహిత నిజప్రతిబింబభేదముఁ జలనంబు కతన
వీణావిరాకతన్వీవాక్ప్రకర విభాగము దగు డాళిమానము కతమున
రమణీయ దీపికా రత్నదీప ప్రభాన్యత్వము నొందు నర్ణము కతమున
చంద్రికాపాండుర సౌధదీప్తిచ్ఛటాంతరము చకోరమోదంబు కతనఁ
గీ. దఁనెఱిఁగి యహార్నిశాతారతమ్య, మశననిద్రావిహారభోగాదికములఁ
దెలిసి భావగతంబుఁ జూపుడన తెలిసి, సకల కార్యంబులకు నవసరము దెలిసి 443
క. స్వస్త్రీ సమానలగు ర, క్షస్త్రీ నివహంబులు పరిచర్యలొనర్పన్
వస్త్రాభరణంబులఁ గుసు, మాస్త్రశరప్రతిమ దేహయష్టి వెలుంగన్. 444
క. ఈమేనిపద్దిగాఁ దగ, దామేలిక డాని దీని కనుమానములే
దేమేనిఁ బసిండికిఁ గల, దేమేలగు తాని యనుమతికిఁ బాత్రంబై. 445
వ. ఒప్పు మెఱయుచున్న 446
గీ. కాంచనామోద దేహముక్తాఫలప్రవాళరదన రదచ్ఛద వారణపతి
యాన లసమానయుపమాన మానగుణభరితఁ గృశోదరి మందోదరీసమాఖ్య. 447

క. దబ్బాటునఁ గని జనకజ, నబ్బారఁగఁ గంటి నని మహోజ్జ్వలుఁ డెవలో
నబ్బా కీడు దలంచితి, నబ్బాలిక వేడ్క సల్పు నాయిబ్భంగిన్ 448

క. పతిఁ బాసిన కతమున స, మ్మతిలేమిం దాల్మిఁ దూలి మగువ రఘువరు
స్మృతిఁ దలఁచుచు మేనున్ వను, మతిరజము వర్ష వగల మఱుఁగక యున్నే. 449

వ. అని లెస్సతలంపుచేసి మతియును రావణవిహారస్థానంబు లగు నయ్యాయి ప్రదేశం
బులఁ బరమపవిత్రచరిత్ర యగు జనకపుత్త్రీసమన్వేషణపరుం డై యెందునుఁ బొ
డసూపకున్న హనుమంతుండు నిజాంతర్గతంబున 450

సీ. కడుఁ బ్రయత్నమున లంకాపురి శోధించి, కాంతాతిలకమును గందునో కో
కని రామచంద్రుఁ డిచ్చిన యభిజ్ఞానమే, యుక్తముగ వేడ్క సీతచే నిడుదునో కో
యిడి ప్రత్యభిజ్ఞాన మేలమిఁ గైకొని కపులున్న రిపు వసధి లంఘింతునో కో
లంఘించి శ్రీరామలక్ష్మణ సుగ్రీవులకు శుభవార్తఁ దెల్పఁగలనో కో
గీ. తెల్పి జలరాశి దాఁటి పృథ్వీవధూటి, పుత్త్రిఁ గని కపులుబ్బ నబ్బోటి పాటి
మరల రాఘవులకుఁ దెల్పె మారుతియను, పొగడునకుఁ బాత్రభూతుఁడ నగుదునో కో

క. అని తలఁచి యనిలతనయుం, డనిలజవుం డంత నొక్క హార్మ్యము నెదురం
గనుఁగొని తదగ్రమున కొ, య్యన నగమున కెగయు హరిక్రియం దాటితగన్. 452

క. రామరమణియగు సీతా, రామామణి నరయునంత రహిన చ్చోంత
ప్రామాగ్ర పూగబహుళా, రామ మొకటిఁ గాంచె నంతరంగము వొంగన్. 453

చ. ఫలదళబంధురప్రసవబంధనచారుశలాటుమంజరీ
లలితలతామహీరుహవిలక్షితనిష్కుటము న్గాంచి య
వ్వలనికిఁ జేరఁబోయి హరివర్యుఁడు తన్మహితాంతరంబునం
గలయఁ జరించి భాగ్యమునఁ గామినినొక్కత రాక్షసీవృతన్. 454

సీ. మంచుబొట్టులఁ బసమించని తమ్మికై వడి మోము కన్నీట వాడుదోఁపఁ
దామరతూండ్లు బెండడి డిందువడు మాడ్కిఁ బుజములు సుమ్మన బ్రుంగుకువడ
నెండచే నొగిలిన యిపురు నా వేఁడి నిట్టూర్పుచే వాతెఱ యొప్పుఁ దప్పఁ
బొగచుట్టికొనదివ్వె జిగివట్టిన గతి మాపుసుఁ బుట్టుమునమేని పొలుపుతూలఁ
గీ. దడి మకిలవొందినట్టి యద్దముల కరణిఁ, జెక్కుళులఁ గ్రమ్మ చెమటచేఁ జెన్ను దొరఁగ
మాననియలంత నొక పెనుమ్రానినీడ, నుల్లమునుఁ బ్రలాపించుచున్న దాని. 455

సీ. అపయశంబునకుఁ జోటైతి నాహాయని, విన్ననిమోముతో నున్న దాని
బతిభక్తి సతుల కాపద్ధారియనిరాము, నడుగకఁ దలఁచుచు నున్న దాని
మనుజాదులు గ్రసింతురని భీతి సంగంబు, చెన్నఱ వడఁకుచు నున్న దాని
నాథుఁ జూడంగల్గునా యనుతలపోత, నల్లంబు మఱుగుచు నున్న దాని

గీ. దుష్టచేష్టాసురీసమావేష్టనమున, సిద్ధనఖకేసరీప్రతిరుద్ధబాల
మృగియనఁగ నెంతయుం దనహృదయమునదర్శనమును విడువంగగమకించుచున్న దాని
క. అనశనతాంతం జింతా, వనతవదన పిహిత కృత్త వస్త్రాంత స్త్రీ
హనుమంతుఁ డంతనంతం, గనె దుఃఖాక్రాంత రాముకాంత భ్రాంతన్. 457
క. కని మునికన్యయగుట భూతనయయగుటఁ దెల్వ నవ్విధంబున జడల
ల్లీన కేశపాశమున మన్ననఁ బొరలెడు జానకిం గనుంగొని వంతన్. 458
చ. తగునె విధాత కిట్టియుపిదం బతిఁబాయఁగఁ జేత సీతయు
ప్పగిది నెసంగుచున్న పతిభక్తి విశేషముచేత నొప్పెడుం
దగనియులంత మోము వెలిదమ్మి దుమారమున న్మసంగ హీ
నగతి మలీమసార్ధవసఃస్థితి నెంతయు నొప్పకుండియున్. 459
క. క్రిక్కిఱిసియు రక్కసులలో, నిక్కంజదళాక్షియొప్ప దించుకయును బ
లక్కసుల నాగవల్లిక, చిక్కిన క్రియ యయ్యెనేమి సేయఁగవచ్చున్. 460
క. మతిచెడి రాక్షసుచేనవ, మతినొందితి నిట్లు దిక్కుమాలి మిగులదు
ర్మతినంచు దూఱుకొంచుం, బతివ్రతాతిలక మింత పడునె కటకటా. 461
గీ. మధుకరవ్యాప్తి సుపరాగమహిత పంకజాతమునుఁబోలె నిమ్మహీజాతమోము
చూర్ణకుంతలభృంగసంకీర్ణమగుచు, భూపరాగపరాగసంపూర్ణమగుచు. 462
వ. అని వెండియు ననేకప్రకారంబుల శోకించుచు జానకీసమాశ్రయాశోకానోకహ
శాఖోపశాఖావిలీనుఁడై తదీయలక్షణంబు లిమ్ముగ విమర్శించుచుండె నంత. 463
చ. బలిమిఁ గుబేరునిం గెలిచి పంతమెలర్పఁగఁ దెచ్చికొన్నయు
జ్జ్వలరుచి పుష్పకం బసురవారిజనేత్రలు గొల్వనెక్కియు
క్కలనికివచ్చి సీత నతిఖిన్నఁ గనుంగొని మానినీ కరం
బలమటు మాని నీహృదయంబున నన్గయికొన్నఁ గూడదే. 464
క. నినుఁ గానని వగ రాముఁడు, ననుజన్ముఁడుఁ జాకయున్న నంబుధిఁ గడువం
జనునే కడచిన మనుజాదనుల గెలుచుటెట్లు వారిఁ దలఁచు టుడుగుమీ. 465
సీ. జగదీశ్వరుండగు శర్వువాసంబుఁ గైలాసంబు బంతిగాఁ జేసినాఁడ
శక్రునంతటివాని సాధించికట్టితే వలతియా పుత్రుండు గలుగువాఁడ
నలకాధిపతి నన్న యనక మానంబుతోఁ గొఱలు విమానంబుఁ గొన్నవాఁడ
దేవతలకునైనఁ దేఱిచూడఁగరాని పట్టణంబు జలధిఁ బడసినాఁడ
బ్రహ్మ చంపకుమని నను బ్రస్తుతించి, విడువు మన జము నుండల విడచినాఁడ
నట్టి నన్నొల్లిదమ్మొనర్చి యధికభోగ, భాగనుత్తమ వీక్షమ వదుటమేలె, 466

క. పతిసేవయనుచు ననుఁ బలుకు, పతియుఁ దివస్పతియుఁ బ్రేతపతియును సంభః
పతియును గొలువఁగ మఱిఁ బతి, పతి యని పలవింతువో యనిఁ బాముఁ నరునిన్. 467

ఆ. పద్మహస్త కరుణఁ బట్టి కైకొనవు మన్మథుఁడఁ గాను జారనాయకుఁడను
దలఁపు దీర్చి నన్ను దౌవారికునిఁ గాఁగఁ, జేసి యేలరాదె చెప్పనేల 468

వ. అని మఱియుం గామోపహతుండు గావున నవివేకభాషణంబు లాడుటయుం
జలించి, 469

క. పరపురుషులఁ జూడని యప్పగమపతివ్రత తృణంబు బరికించుచుఁ దాఁ
బరుషవచనుఁ డసురుం డిప్పుడసువ నాడుటయు నోర్వఁబడి యిట్లనియెన్. 470

శా. సారాచారవిదూర క్రోష్టివనమతిన్ శార్దూలి గామించునా
సారంగంబును బెంట్రిసింగమును వాంఛం జేర నూహించునా
సారంగంబును శాతతన్నఖరవిస్తారాహతింగూలు న
ట్లామూఢి న్నను సాధ్వి నాసపడి చానంతఃకృతిం దోఁచెదే. 471

క. ప్రభుతిలకుండగు రామప్రభు భార్య న్నన్ను నాసపడియెదు వహ్ని
ప్రభఁ గాంచి చేఁబోవు శలభవృత్తి యుకాదె నీచలం బూహింపన్. 472

క. ననుఁ గారింపక దనుజాంగనలకు నాజ్ఞాపనంబుఁ గావింపుము భూ
తనయా గ్రసింపుఁడనుచు నీ, తనయుక్తి నిట్లాడకుము వృథావచనంబుల్. 473

క. భోగేచ్ఛ లేదు ప్రాణ, త్యాగేచ్ఛయె కాని నాకు దనుజాధమ ని
ర్భోగేచ్ఛ నన్నుఁ గోరక, భోగేచ్ఛుఁడ వైతి గానఁ బొమ్ము రఘుపతిన్. 474

వ. అని పలికి తన్ను నుద్దేశించి. 475

ఆ. కలుషమార్గఁ గామిఁ గామిఁ గామికి నీకు, నెట్లు తెలియవచ్చు నిపుడు రామ
చంద్రు సాంపరాయసాయకముల, నవని నోఁగి పొరలునపుడు గాక. 476

వ. అనియధోవదనయు నవిరళబాష్ప జలపూరిత కపోల యుగ్మకయునై చెక్కిటఁ
జేయిఁ జేర్చి తలయూఁచుచు దైవంబుఁ దిట్టుచు నిట్టూర్పు నిగిడించుచు నూర
కుండుటయుఁ బంక్తిగ్రీవుండు సీతం గాచికొనియున్న రాక్షసీనిరీక్షణల నిరీ
క్షించి రూక్షాక్షరవచనంబుల నిట్లనియె. 477

క. ఈకరణిఁ దపింపక సౌ, మ్యాకరణము రెండు నెలలకయినఁ గలుగు న
ట్లేకరణి నేని దీనివ,శీకరణ నొనర్పుఁడనుచుఁ జెప్పుచుఁ జనినన్. 478

వ. పోలదిండిపోలంతులుం బుడమిపట్టిం జుట్టుముట్టి రావణుం జెట్టువట్టు మని బిట్టుబాధ
లం బెట్టి పెట్టి యొక్క యవసరమ్మున. 479

క. కావలివారలు జనకజ, కావలిదెస నిద్రనొంద నప్పుడె తేఁగి యశో
కావనిరుహంబు డిగియెం, బావని ఖేదమునఁ బరమపావనిఁ జూడన్ 480

వ. ఇట్లు డిగి. 481

మ. వినయంబెల్లఁ గపిస్వరూపమున నావిర్భావమైనట్టి చా
డ్పున సామీరి నతోత్తమాంగుఁడయి మోడ్పుంగేలు ఫాలప్రదే
శనిబద్ధంబొనరించి భక్తి మెసఁగన్ క్ష్మాజాతమం జేర ప్రమో
క్షనవిభ్రాంతభయాంతరంగయగు మం గీశున్సమీక్షించుచున్. 482

క. ఇతఁ డెవ్వఁడొకో ప్లవగా, కృతి నాకుందోఁచె రాక్షసేశ్వర మాయా
కృతి నేతెంచినయట్టి సుకృతియేని బట్టి ప్రణమిలఁడే యేనలరన్. 483

వ. అని బహుప్రకార విచారంబులకుం జొచ్చి తలంకుచున్నంత శాంతస్వాంతుండు హనుమంతుండు సాంత్వనస్వనంబున నక్కాంత కిట్లనియె. 484

క. మాయమ్మ రాముదూతను, మా యుమ్మలికంబు వాయు మాపద లెల్లన్
బాయు నమ్మవు నీ మలుకనుమా, నమ్మకు నంక రావణాసురపతికిన్. 485

చ. అనఘుఁడు భానువంశుఁడు మహాత్ముఁడు రాముఁడు సంతసింపఁగా
జనకజ నిన్నుఁ జూడఁగఁ బ్రశస్తుల వానరుల న్విధింప వా
రుసరిగి రెల్లదిక్కులను రోయఁగ మత్సుకృతంబు పేర్మి ద
క్షిణమున కేను వచ్చి కృతకృత్యత నొందితి నిన్నుఁ గాంచితిన్. 486

క. హనుమంతుండనువాఁడఁ బవనపుత్రుఁడ నేకలోకవంద్యుఁడ జగతీ
తనయఁ బొడఁగంటి నని రా,మునకు న్వినుపింపఁ గనుట ముదితాళికా. 487

క. విను మారీచుని మాయ,న్మునిఁగిన శ్రీరామలక్ష్మణులు నినుఁ గోల్పో
యినవారలగుట లజ్జా,వనతవదనులగుచు వగయువా రొక్కయెడన్. 488

ఉ. ఆయటవీస్థలంబున జటాయువుఁ గాంచి త్వదీయవర్తనం
బాయనఘుండు దెల్పి తదనంతర మాత్మఁ బరిత్యజింప శో
కాయతవృత్తిఁ బక్షిరఘునాథుఁ డమ్మ విలపించి తత్పిత
న్యాయమునగ్ని సంస్కృతి నొనర్చిరి నాకజగన్నివాసిగాన్. 48

వ. తదనంతరంబున భవన్నిమిత్తంబుగా మహారణ్యపథంబులం బరిభ్రమించువారు. 490

గీ. బంధురహితానుబంధుఁ గబంధు శాప, మోక్షితునిఁగా నొనర్చి లోలాక్షి శఫరి
శబరిభక్తి నొసంగు పూజలు గ్రహించి, పంకపర్వతశంప నప్పంపఁగడచి. 491

వ. ఋక్షవానరచమూకంబగు ఋశ్యమూకంబునకువచ్చి భక్తి నతఁ గీవుండగు సుగ్రీవుతోడ నగ్ని సాక్షికంబుగా మత్సన్నిధిం జెలిమిఁ గావించి. 492

క. తరణిసుతుఁ డోలి నాతని, తరుణిం గైకొన్న వాలిఁ దునుమ శరాళిం
దరణికులుఁడు శ్రీరాముఁడు, ధరణింబడఁ గూల్చి తత్పదం బొసఁగె దనుక్. 493

క. పేర్చినధృతి వాలిం బరిమార్చి యతనివైభవంబు లన్నియుఁ దన్నుం
జేర్చిన వానరుల న్సమకూర్చి యనిచె నాల్గుదెసలకు న్నసురారియుక్. 494

వ. ఇవ్విధంబునం బ్రత్యుపకారపరాయత్తచిత్తుండగు మిత్రపుత్రుండు 495

ఉ. పంపినవానరోత్తము లపారబలాఢ్యులు మారుతత్వరు
ల్గుంపులుగట్టి మున్దెసలకుం జనఁ గొందఱు మేము యామ్యది
క్కుంపరిశీలనార్థము వెసంజనుదెంచి కనంగలేక వెం
దెంపునఁ బ్రాణము ల్జలధితీరమున న్విడువందలంచుచున్. 496

క. చావఁ గలదె మీరు గడుం, జేవగలిగి జలధి దాఁటి సీతఁ గనుఁడు ల
జ్జావనతవదన యగుచుం, జావఁ దివిరియుండె లంక జానకి యనుచున్. 497

క. ఖగపతి యొకండు దెల్పిన, విగతప్రాయోపవేశవృత్తులమై వా
ర్ధి గనుంగొని ననుఁ బొమ్మని, నగచరు లనుపంగ దాఁటినాఁడే బయోధిన్. 498

వ. ప్లవంగసంప్రార్థితుండనగు నేను బూర్ణశతయోజనవిస్తీర్ణఘూర్ణమానమహార్ణవావ
తీర్ణుండనై సమయానురూపరూపంబున లంకాపురంబంతయుం బరిశోధించి రావ
ణుండు నీతోడ దుర్భాషణంబు లాడునప్పు డవసరజ్ఞుండనై వానిపయిం దెంపు
సేయక యయ్యశోకానోకహాగ్రంబున నొదిఁగియుండి యద్దురాత్ముండు వోయినం
బొడగట్టితి నని పలికి యెల్లవానరుల నుద్దేశించి వర్ణియవ్వారవర్ణిని కిట్లనియె. 499

ఉ. ఆదట భూవరైర్యకనకాచలు లందఱుఁ గామరూపుల
య్యాదట సారవేగమానితాఘు లందఱు శూరులైనవా
రందఱు నిన్నుఁ గాంచి చరితార్థత నిమ్మెయి నొందియున్న వ
న్నందరు పుణ్యకీర్తుల నవం దరుచారికి బ్రహ్మచారికిన్. 500

ఉ. అన్నలినాక్షి యిట్లనియె నన్న భవద్వచనోద్గమత్సుధా
క్లిన్నమనస్క నయ్యె నిటుఁ గృత్రిమవానరరూపమూని మా
యన్ననుఁ గాఁచియుంబలుప నారయ రక్కసుఁగాఁగ శంకయా
పన్నహృదబ్జనై యొకఁడు వల్కెద నేర్పడ విన్నవించెదే. 501

క. రాముని దూతననుచు నా, తో మొదలం బల్కితివి సుకుండవు నాకు
న్నీ మోముఁ జూచుటం జే, తో మోదంబయ్యెఁ బల్కుఁడు న్నీతోడన్. 502

ఉ. రాముఁ డరణ్యభూములకు రాఁబనియేమి తదీయ భీమసం
గ్రామమున్ భోంచి నెవ్వరు పరాజితులై రతఁ డేవ్రతంబుపైఁ

ప్రేమవహించియుండు మహిభృత్సుఁ డేక్రియ మేని వాఁకు త
త్స్వామియుఁ దమ్ముఁడుం గదుఁ బ్రసన్న మనస్థితినున్న వారలే? 503

క. సౌమిత్రి యెట్టివాఁ డా, రామునకు ననుజునకుఁ జిరంబగు సఖ్యం
బే మెయిఁ గల్గె బయోనిధి, నే మెయి దాఁటితివి తెల్పు మేర్పడ నాకున్. 504

చ. అనవుడు నమ్మ నిట్లనియె నమ్మ భవత్పతి కైక వాంఛకై
కనలక వచ్చెఁ గానలకుఁ గయ్యము సేయఁగ నోడె భార్గవుం
డనితరసాధ్యుఁ డా నృపతి కాతనిచే మృతినొందిరట్టి వా
రవయులు తాటకాదులు ఖరాదులు ఘోరవనాదు లంగనా. 505

వ. మఱియు నమ్మహాధనుర్ధరుచే మారీచాదు లనేకులు పంచత్వంబునొందిరది యట్లుండనిమ్ము. 506

క. వాలమునఁ గ్రూరు రావణుఁ, గీలించి చతుఃపయోధికీలాలములం
దేలించిన యవ్వాలిం, గూలించె నరేంద్రుఁ డొక్కకోల న్నిలకన్. 507

క. సువ్రత రామునకేది ప్రియవ్రతమని తొలుత నడిగి తెలింపుము స
త్యవ్రత మది యొకఁడేల పతివ్రత ప్రియ మేకపత్నీవ్రతముఁ గదన్. 508

క. రాముఁడు మేచకజలద, శ్యాముఁ డతఁడుఁ దమ్ముఁడుం బ్రసన్నహృదయులై
కామిని యెట్లుందురు నీ, తేమినిఁ గడు చిత్తములు చలించుచునుండన్. 509

తే. లక్ష్మణుఁడు లక్ష్మణుఁడు కృతలక్షణుండు, తప్తకాంచన భాసురధామదేహుఁ
డన్న యెడఁ భక్తిగలఁడు నిన్నాత్మఁ దలఁచి,తలఁచి వగనొందు మాతల్లి గల్గియుచు.

క. నీవు ధరాపతితలంబులు, గావించిన భూషణములు గాన్పించిన సు
గ్రీవునితో బద్ధస్నే,హావేశితబుద్ధి యయ్యె నధిపతి మిగులన్. 511

వ. రామలక్ష్మణులకు నావిధంబునం గల యనుకంపావిశేషంబునను మజ్జనకుండగు జగత్ప్రాణుని ప్రసాదంబు కలిమిం గడలిఁ గడచి వచ్చితి మదీయాగమనంబున కెదురు చూచుచున్న కపినికరంబు కరంబు నానందంబునొంద న్భవదనుగ్రహంబునం బయోరాశి మరల నతిశ్రమంబునం దాఁటిపోవం గలవాఁడ నని పలికి వెండియు

క. భూవిభుఁ డనంతుఁ డనఁదగు, నావిభుతమ్ముఁడు ననంతుఁ డతులితబుద్ధి
న్నీవు ననంతవు తుమకన్, నావుకు నంతటను జనకనందన ప్రీతిన్. 513

చ. వెడవెడ నమ్మ యిట్లనియె వీరవరా మదధీశునాజ్ఞ ని
జ్జడధిఁ గ్రమించి వచ్చినయసాధ్యబలాఢ్యుఁడ వౌదు రామభ
ద్రుఁ డిటకు వచ్చి దానవులఁ ద్రుంచి బలం బెసలార నన్ను నె
ప్పుడు గొనిపోక గల్గు నను బోటికి దుఃఖము పారమొందు నే. 514

చ. అనిపదనంబువంచి విపులాశ్రుసమార్ద్రకపోలయుగ్మయై
జనకజ యూరకున్నఁ గపిచంద్రుఁడు తత్సతి కిట్లు వల్కె నీ
మనమునఁ జింతఁ దక్కుము క్రమంబున రాఘవుఁ డిందు వచ్చి దై
త్యనికరము న్వధించి ముదమార నినుం గొనిపోవు నంగనా. 515

వ. అంతియేల నీవనుమతింపవు గాక వీఁక నియ్యశోకవృక్షవాటికాసహితంబుగా నిన్నెత్తికొనిపోయి రామలక్ష్మణులసన్నిధిం బెట్టఁజాలనే యని పలికి వెండియు.

ద్వ్యక్షరకందము. మానుము నీమనమున ననుమానము నను నమ్ము మిన్ను మనుమని నని నా
మానిని నీ మేను న్నన, నూన మమానమును నెమ్మి నూనుము నమ్మన్. 517

చ. అనుటయు సంతసించి జనకాత్మజఁ గ్గొని మన్నిజాకృతిం
గనవల తేనిఁ జూపెద నగంబులు నాదగు కాలిపెద్దవ్రే
లిఁకఁ జిరుతంగఁ జాలిన బలిష్ఠుఁ డనంచుఁ గడంగి మేను పెం
చె నతఁడు విశ్వరూపముఁ బ్రసిద్ధముగా హరి చాల్చు కైవడిన్. 518

క. చుక్కలు తలపువ్వులుగా, నక్కంజవిరోధి తనకు నవతంసముగా
దిక్కులు వసనంబులుగా, నక్కపి సర్వజ్ఞుఁడొప్పె నతిపూర్ణుండై. 519

ఉ. ఈగతి మేను పెంచిన కపీశ్వరుఁ గాంచి మహీజ చాలుఁ జా
లీగతి నద్భుతాకృతి వహింపఁగ నేరికివచ్చు నీవు ము
న్నేగతినుండి తట్ల ధరియింపుము సూక్ష్మశరీరము న్నభో
భాగము భూమియుం దెసలు బ్రద్దలగుం దను వింకఁ బెంచినన్. 520

క. కడు నమ్మితి నీరూపం, బుడువీథికి మించెఁ బెంచు టుడుగుమిఁక న్నా
వుడు విరళదేహుఁడై యొ,క్కఁడు మోదము జనకకన్యకుం బొనరించెన్. 521

వ. ఇట్లెప్పటియట్ల సూక్ష్మశరీరుండై యమ్మహీతనయకుం బునఃపునర్వందనంబులు గావించి తత్సుందరి డెందంబు మహానందంబు నొందందగు భాషణంబులాడి యొక్కయవసరమ్మున. 522

క. హనుమ ప్రయత్నంబున డాఁచినరాముని యుంగరంబు సీతకుఁ గాన్పిం
చినఁ జూచి యాలేఁడి గైకొని యొడ లంతంతకుం గగుర్పొడువంగన్. 523

ఉ. కన్నుల నద్దుచు న్మనముగంబునఁ జేర్చుచు ముద్దువెట్టుచుం
గన్నుల నమ్మదాంబువులు గాలువగాఁగఁ గపీంద్రు నెంతయు
న్మన్ననసేయుచు న్మగనిమాటలు దెల్పుమటంచు నూర్మికం
గ్రన్నన వేఁడ చన్ సుపతిఁ గాంచినయట్టుల సంతసించుచున్. 524

సీ. ఇందాఁక ననుఁ బాసి యెందుండితి వటంచు, విభుఁ గూర్ప వచ్చితివే యటంచుఁ
గడలి నెవ్విధమునఁ గడచి వచ్చితివంచు, నీ వెట్లు పాసితి నృపతినంచు
నీవున్నఁ దెచ్చునే రావణుం డనుచును, రాముండు ననుఁ జూడ రాఁడె యనుచు
రామలక్ష్మణులకు క్షేమమే యనుచు నే, నెంత పాపప్రజన్మ మొ త్రికనుచుఁ
గీ. చేర్చు హృదయమున శిరమునఁ జేర్చికొనుచు, భర్తసన్నిధి వడసిన పగిది నధిక
మోహమందుచు మఱియు నమ్ముద్రికాళి, నీక్షణ మొనర్చి పల్కెఁ బృథ్వీతనూజ.
క. మేనికిఁ బ్రాణముఁ దెచ్చిన, దానవు మద్దితమునకు నిదానవు గానన్
దానవుఁ గూల్ప నరేంద్రుం, దేనవు నవుఁ బాటుగల్గదే తేమన్నన్. 526
క. నీవిట వచ్చినపుడు నీ, తో విభుఁ డేమనియె నన్నుఁ దోడ్కొనిపోవం
గా వచ్చితివే యని యా, పావని మాటల్కు నిగుడ్చెఁ బొంగుఁ జెలంగన్. 527
వ. ఇవ్విధంబున నతిరిక్తహర్షపరాయత్తచిత్త యగు నమ్మత్తకాశిని యుత్తరుచరోత్త
మున కిట్లనియె. 528
క. నీవసమానుండవు నే, నేవిధమున నీఋణంబు నీఁగుదుఁ మనిసం
భావిత నీకతనఁ బునర్జీవిత నైతిం గదుం బ్రసిద్ధముగాఁగన్. 529
ఉ. నాపడుపాటు లెల్లఁ బవనప్రియనందన చూచినాఁడ వ
బ్బూభపతితోడఁ దెల్పి రఘుపుంగవుఁ దోడ్కొనివచ్చి రావణు
న్నూపతిఁ జూపరు ల్వొగడ రూఢివధింప నొనర్చి నన్ను సం
ప్రాపితశైత్యఁ జేయుము కృపాపర మ్రొక్కెద వేయు నేటికిన్. 530
వ. అనుటయు నప్పవనతనయుం డుమ్మలికమ్ము గ్రమ్మదేఱ నయ్యమ్మకు నెయ్యమ్ము
గా నిట్లనియె. 531
క. ఖరనఖరంబుల నరహరి, హిరణ్యకశిపున్వధించు నెడైతి దోఁప
న్గరనఖరంబుల రాముఁడు, దురాత్ము రావణువధించు దురమునఁ దరుణీ. 532
ఉ. సందియమేల రాముఁ డనుజన్మసమేతముగాఁ బ్లవంగపు
ల్వందడిసేయ నెట్టయిన సాగరము న్వెస నిర్గమించి దై
త్యుం దును మాడి యంతఁ బరితుష్టమనస్కత నొందియాతఁడో
సుందరి నిన్నుఁ గైకొను విశుద్ధచరిత్రవు శోక మేటికిన్. 533
వ. అని వెండియుం దగిన వచనంబుల నూఱడించి. 534
క. నారాక కెదురు సూచుచు, నీరాకరతీరభూమి నిలుతురు ప్లవగు
ల్పోరా కపివర్య యనుచు, నోరాకాచంద్రవదన యొసఁగుము సెలవున్. 535

క. నాపైఁ బ్రాణములిడి రఘు,భూపతియుం దదనుజుండుఁ బూవసుతుండుం
జూపులు దీపులుగట్టఁగ, భూపుత్రీ మాతు రిపుడ పోవఁగవలయున్. 536

ఉ. జానకిఁ గాంచివచ్చితి నసాధ్యజవోన్నతి లంకనంచు భూ
జానికిఁ దెల్పినం గడు నిజమ్ముగ నమ్మఁగనిమ్ము ప్రత్యభి
జ్ఞానము నావుడుం జనకకన్యక సంతసమంది యమ్మరు
త్సూనుమొగంబు గాంచి పరిశుద్ధపరిస్ఫుటభాషణంబులన్. 537

ఉ. భాసురచిత్రకూటకృతపర్ణకుటీరమున న్వసింపఁ గా
కాసురుఁ డేఁచ దెంచి నను నాత్రియొనర్ప నరేశ్వరుండు ని
ష్కాసితుఁ జేసె వాని నొకకన్ను వగిల్చి యెఱుంగ రెవ్వరుం
ద్రాసవిదూర యివ్విధము రాఘవు లిర్వురు నేనుఁ దక్కఁగన్. 538

క. కావున నీ కెఱిఁగించిన, యీవిధము నరేశ్వరునకు నేర్పఱచినచో
నీవు ననుఁ గాంచి వచ్చుట, భావించుం డంచుఁ దెలియఁబలికి ముదమునన్. 539

క. వీఁడు ధరానందనఁ గ, న్నాఁడని రాముండు మిగుల నమ్ముటకు సతీ
చూడామణి యొసఁగె న్నిజ, చూడామణి బ్రహ్మచారిచూడామణికిన్. 540

ఉ. నూత్నసరోజగంధి సువనోషి తమారికి నివ్విధి న్నిజో
రత్న మొసంగినం గొని శిరంబునఁ జేర్చుచు నమ్మణి న్మహో
యత్నముతోడఁ దాఁచి పవనాత్మజుఁ డెంతయు వేడ్క మానినీ
రత్నము వీడుకోల్పడసి రాక్షసవంశపరిక్షయార్థియై. 541

క. దుర్భరపరుషాకృతియుత, దుర్భ్రమలు జనకకన్యతో రావణుఁ డ
ప్రార్భటినాడ వినుట నా, నిర్భరక్రోధవహ్నివశాత్ముండై. 542

వ. సహింపక హనుమంతుండు లంకాపురాభిముఖుండై కేళీవనోద్యానంబునకుం జొచ్చి. 543

క. తోఁటలుఁ బూఁదోఁట లనఁటి, తోఁటలు ననఁదమలపాకుఁదోఁట లగల్చి
న్నాటములు వాజిశాల, వాటము లురువేదికాకవాటము లూడ్చెన్. 544

వ. వెండియు. 545

సీ. విస్తారఫలతరువిస్తారములు రాల్చి సాలము ల్సాలము ల్నేలఁగలపి
సారమ్ములైన కాసారమ్ములు గలఁచి గొమ్మలు గొమ్మలు గూలఁద్రోయి
గోపురస్పర్ధులు గోపురమ్ములు వ్రాలఁ ఖగముల ఖగముల కడకుఁదోలి
తోఁటల గుడుల పోటులఁ బెదరించు ధామము ల్ధామము ల్నమమడఁచుఁ
గీ. దావలమ్ముగ భద్రదంతావలమ్ము, లున్నశాలలు నురుమాడు నుగ్రవాల
జనితవాతూలవిభ్రమజ్జలదశకల, సంభవుం డగు పవమానసంభవుండు. 546

క. వారనికింక న్లంకా,ద్వార మధిష్ఠించి దైత్యవారము దన్నుం
దూరమునఁ గాంచి సింహకి,శోర మనుచు మిగుల భీతిఁ జొచ్చి కలంగన్. 547

క. విహరించుచుఁ బ్రాణంబు ల,పహరించుచునున్న ప్లవగపతిఁ గాంచి భయా
వహమగుచుఁ బాఱెఁ దనుజని,వహము పులిం గాంచి కదుపు వాఱువడువునన్.

ఉ. అంతం గొందఱు మానవాదనులు రక్షోధ్యక్షునిం గాంచి య
త్యంతంబు న్భయవిహ్వలాత్ములగుచున్ హాహాధ్వను ల్మీఱ ని
స్సంతోషంబుగ నిట్లు పల్కిరి దశాస్యా పట్టణద్వార మా
క్రాంతంబయ్యెఁ జుమీ యొకానొకప్లవంగస్వామిచే నెంతయున్. 549

చ. కటకట యిట్టి యద్భుత మొకప్పుడుఁ గానము బ్రహ్మచారియ
ర్కటుఁ డొకఁ డీవు దెచ్చిన ధరాసుతకుం దగు మాటలాడి యు
ద్భటగతి నిందు వచ్చి మనపట్టణతోరణ మెక్కి క్రవ్యభు
గ్భటకమలాకరంబుఁ గలపన్ దొడఁగెం గరివోలె నుగ్రుఁడై. 550

క. ఉపవనములు పవనహతి, న్విపులలతాపతితంబులైన విధమున మిగుల
న్విపులతరధృతవాలవి,నిపాతితములయ్యె నొక్కనిమిసములోనన్. 551

క. కపిమాత్రుఁడు గాఁడు ప్రభూ, కపిమాత్రుఁడు గాని లోకకంటక వాని
న్నిపుణత శక్తి యొకర్షకఁ, గృపఁ జూచితివేని జాఁగేడకు మనకున్. 552

వ. అనవుడు. 553

ఉ. కన్నుల నిప్పులొల్క దశకంఠుఁ డకుంఠితబాహుసత్త్వసం
పన్నులఁ గామరూపుల నపారజవాఢ్యులఁ బల్వుర న్నిరా
పన్నుల దైత్యులం గని కృపాపరహీనుని మర్కటేశుని
న్మన్ననఁ గల్పరందు మిము మన్ననసేయుదు నంచుఁ బల్కినన్. 554

క. ధృతిగతిఁ జన్నెనా, చతురంగములను మృదంగశంఖారవముల్
చతురాశాభరితముగఁ, జతురత నడిపించి రసురసైన్యాధిపతుల్. 555

వ. ఇట్లు సైన్యంబులు నడిపించుచు. 556

ఉ. దంభులు జంభజిద్రిపు లదభ్రభుజాబలు లన్నెకు లమ్మరు
త్సంభవుఁ జుట్టుముట్టి నిశితప్రదరంబుల నొంపఁ దోరణ
స్తంభముఁ బ్రుంక్కితుం దమితసత్త్వుఁడు వాయుకుమారుఁ డాహవా
రంభుఁడు పేర్చి పృథుకరమ్ములఁ గరమ్ములఁ బట్టి వైచుచున్. 557

ఘనజాలు వారిదమ్ములపథంబునఁ బైపయి బాణవర్షము
న్ననిచినఁ గొండకైవడి విశృంఖలవృత్తి వహించి వాలసం

జనితమహోద్ధతిం దనుజసంఘమహోద్ధతి మాన్చి వెండియుం
మొనసిన నుగ్రుఁ డిట్లుఁ గపిమూర్తి వహించె నవాంగరాళుఁడై. 558

క. పదవాలకరనఖరముల, నదిమి విసిరివేసి వచ్చి యచ్ఛకేళిన్
మదగజతురగస్యందన, పదాతులహరించెఁ బవనభవుఁ డొకమాత్రన్. 559

వ. ఇవ్విధంబునం జతురంగంబులం బరిసమరి. 560

ఉ. రూఢధృతి న్విరోధుల శిరోధుల వాలముచుట్టి తోరణా
రూఢుఁడు వాయునందనుఁడు రోదసి పిక్కటిలంగ వార్చుచుం
గాఢజవంబునం జలధిఁ గల్పుచుఁ బేర్చుచు నివ్విధి న్సమి
త్ప్రౌఢిమ ఖేచరాళి దనుఁ బ్రస్తుతిసేయఁ జెలంగి యాడుచున్. 561

ఉ. వారక వెండియుం దనుజవారము దన్నెదిరింప నయ్యెడ
ద్వారముఁ జేరఁబుచ్చుచు ననార్యబలోద్ధతిమై తగ న్ప్రతీ
ద్వారముఁ జేరి నిల్వఁ దనవారల చావు గనంబుఁ బొందలో
వారలచే నెఱింగి పరివారముఁ గాంచి దశాస్యుఁ డార్తుఁడై. 562

ఉ. ఘోర విచిత్ర మర్కటప్లవగాధముఁ డిందఱ రాక్షసోత్తమా
చారుల సద్విచారుల విచారవిదూరులఁ జంపె నద్దురా
చారునిఁ గూల్చి రండని ససంభ్రమత న్నియమించెఁ బాపవి
స్తారచరిత్రులన్ దివిజశత్రుల నేడ్వురమంత్రిపుత్రులన్. 563

ఉ. తప్తహృదబ్జుఁడై విభుఁడు దమ్ముటు పంపఁగ సత్వరంబున
న్సప్తమహోగ్రమంత్రిసుతసప్తక మెంతయు నుబ్బిమీఱ ను
త్తప్తభుజుల్ నిశాచరులు దారుణరావము గూడి కొల్వ సం
తప్తసువర్ణభాసురరథద్విరదాశ్వచమూసమేతమై. 564

క. చని పవనతనూజుం గనుఁగొని పొదువుం డేయుఁ డనుచుఁ గొల్లలుసేయన్
హనుమంతుఁడు తనమనమున, ననుమాన మొకింత లేక యతిమాత్రుండై. 565

క. గొదగొని మదకరిపదముల, జెదఁ జదిపినభంగి శుక్రశిష్యబలంబుం
జిదురుపలుచేసి ముదమెద్దఁగ దనుజమంత్రిసుతసప్తకముఁ గిట్టి వెసన్. 566

క. వాలము కరవాలముగా, నాలము గావించె మర్కటాధ్యక్షుం డా
భీలముగా దనుజులకుం, గాలముగా నప్పుడినుపగాలం బగుచున్. 567

గీ. ఇట్లు పోరాడి యిరువుర నెత్తి కేలఁ, బట్టి శిరముల నొండొండఁ బగులవేసి
దానవామాత్యపుత్రసప్తకము నొక్క, పెట్టఁ బంచత్వ మొనరించి పేర్చి యార్చి.

క. పంచత్వం బొనరించె నృపంచత్వాగ్రం బంచభూరుహహతులం ద
త్పాంచకము మంత్రిపుత్రక, పంచత్వం బెఱిఁగి దనుజపతి మతి నొవన్. 569

క. ప్రాప్తసువాలభ్రమణ, వ్యాప్తజగత్ప్రాణఘనసహాయుత హనుమ
ద్దీప్తాగ్ని మంత్రిపుత్రక, సప్తకవన మిట్టులేచ్చి సరభసవృత్తిన్. 570

వ. క్రమ్మఱ నెప్పటి యట్ల తోరణస్తంభాధిరూఢుండై విజృంభించుటయు. 571

క. హతశేషులు చేఁ దనమంత్రితనూజులు దెగుటవిని యధికరోషమున
న్వితుఁడగు రావణునానతి, నతనిసుతుండు వెడలె నక్షయబలుండగుచున్. 572

సీ. కాలకింకరసదృక్కాలదేహంబుల నుగ్రాల పార్శ్వచరుల రాక్షసులు నడువ
రథనేమిహయసింధురఖురపదోద్ధితరజము నాకధునిఁ గర్దమము సేయ
నింతవిక్రమశాలి నీకఁ జూడనని తండ్రి తనలోన నమితమోదంబు నొంద
నక్షయుం డితఁడు ఘోరాక్షుఁ డఱుఁడు పక్వసమృద్ధివని సురావలి వడంక
గీ. నధికరాక్షసవంశకుటుంబుఁ డెల్ల, వితతముగఁ బక్షులపసవ్యగతులఁ దిరుగ
నరదమునఁ డెక్కి మునఁ గ్రద్ద లాడుచుండ, నెలమి రావణనందనుం డిట్లు వెడలె

క. అక్షయుఁ డీక్షించె న్మహోగ్రక్షసదృక్షు స్స్వపక్షరక్షాదక్షు
న్వ్రుత్రుచరాధ్యక్షు నసత్రక్షశ్శిక్షావిచక్షు రాజితవక్షున్. 584

వ. కనుంగొని. 575

క. తలపడి తనకంటె న్మును, దలపడి పోరాడి పరతనయుని బాహా
బలజలధిమగ్నమగు నిజ, బలజలధిం గాంచి రోషభరితుం డగుచున్. 576

క. కోలలమరుఁ డేయ న్వైరి, కోలలక్రియ హనుమ లెక్కఁగొనక బలువిడి
న్వాలములు గురియ నసుర కీ, లాలంబులభంగి వానిఁ జక్కఁడఁచి వెసన్. 577

ఉ. వెండియుఁ జండకాండములు వ్రేసినవాజ్యము గుమ్మరింపఁగా
మండెడు నగ్నివోలె హనుమంతుఁడు పేర్చి దశాననాత్మపు
త్రుం డరచాపుచావ నొక దొడ్డశిలం దలవ్రేయ నొచ్చి యా
తం డవశత్వమొందియుఁ బడంపడి విక్రమదోహలంబునన్. 578

చ. మనుజవిరోధి తన్ను వెడమాయలు వన్నినఁ గోపమెత్తి య
ద్దనుజవిరోధి యక్షయకృతప్రకృతు ల్గనవొందనీక యా
తనిమెడ వాత్మవాలకలితమ్ముగఁ జేసి ధరిత్రి వ్రేయుడుం
గనుఁగవ నశ్రుధార లొలుక న్విలపించుచుఁ గూలె సోలుచున్. 579

క. క్షయరహితుఁ డనిలసుతుఁ డక్షయుం రహితప్రాణుఁ జేయఁ గ్రమ్మతి దనుజు
ల్భయవృత్తిం బుత్రపరిక్షయ మెఱిఁగించుటయుఁ బజ్క్తికంఠుం డార్తిన్. 580

స్రగ్ధరావృత్తము. భీమబ్రహ్మాస్త్రపాశాపిహితు హరిసుతుం భీషణాటోపబర్హి
ష్మత్సామేయప్రకాశు న్సుభగచరితు నక్షోభ్యసత్త్వోద్యమునవ్య
గ్రీష్మాదిత్యప్రతాపు న్బృథుమహితయశోర్ధి న్మహాబాహు దీర్ఘా
యుష్మంతుం బాపుఁ డద్దైత్యుఁడు గని యధికోద్యుక్తుఁడై చేరి యంతన్.

క. పట్టికొని నిజరథంబునఁ, బెట్టికొనియెఁ గానియితఁ డభేద్యుఁ డెవరికిం
బట్టువడఁ డివ్విధంబునఁ, బట్టువడుట లీలయనుచు భావింపుఁ డెదన్. 590

వ. ఇట్లు సురభిమానంబున నవ్వనచరేంద్రు నిజరథంబునం బెట్టికట్టి మహానందంబున శంఖ
భేరీ మృదంగ ప్రముఖ నిఖిల జయధ్వానంబులు నింగి ముట్టం గదలి. 591

చ. పురముఁ జెల్లవారుఁదను బోరనఁ గీర్తనసేయ నాయెల
బ్బురముగఁ దేల నిట్లు కపిపుంగవుఁ దోడ్కొని వచ్చి రాక్షసే
శ్వరునకు మ్రొక్కి చూడుము నిశాచరనాయక కట్టితెచ్చితిం
దరుచరునంచుఁ జూపిన ముదంబునఁ బుత్రకుఁ గౌఁగిలించుచున్. 592

ఉ. తోరణమెక్కి రక్కసులఁ ద్రుంచుచు నక్షయుని న్వధించి యా
ధోరణముఖ్యులం జగిపి దోస్బలనిర్జితశక్రజి త్తైననీ
తోరణమాచరించుటకుఁ దోఁచినవానరుఁ బట్టితెచ్చితే
శూర కుమార నిన్నుఁ గొనియాడఁగ నేరితరంబు చెప్పుమా 593

వ. అని మఱియుం బ్రియనందను నపరిమితమధురవచనంబుల నగ్గించి రక్షోధ్యక్షుండు
వృక్షచరాధ్యక్షు నిరీక్షించి యాక్షేపకరపరుషవచనంబుల నాక్షేపించి. 594

క. ఎవ్వఁడ వెవ్వఁడుపుత నీ, వివ్వనరాశిం దరించి యేతెంచితి ని
న్నెవ్వఁ డిటఁ బంపె నంపుడు, నవ్వనచరుఁ డసురతోడ నవ్వడరంగన్. 595

ఉ. రామునియాజ్ఞ నిచ్చితి ధరాసుతఁ గన్గొన వారిధి న్రఘు
స్వామియనుగ్రహంబున జవంబున దాఁటితి వాయుపుత్రుఁడ
న్నీ మది నొవ్వ దైత్యుల ననేకులఁ బట్టి వధించితిం గపి
స్తోమము సంతసింప నినుఁ జూచి భవత్పురిఁ గాల్చి పోయెదన్. 596

వ. అని పలికి వెండియు. 597

క. అవినీతిపరుఁడ వగుని, న్నవనీపతి సంహరించి యవనీతనయా
నవనీశ దేవిఁ గొనిచను, నవశ్యమున రాక్షసేంద్రుఁ డాగ్రహుఁ డగుచున్. 598

క. ఈతరుచరవరుఁ గపటా, న్వీతుని వధింపుఁ డనవుడు విభీషణుఁ డురుని
ర్ధూతాఘుఁడు వారించెం, దూత యవధ్యుఁడని పలుకుదురు బుధులనుచున్. 599

క. ఈకరణి నివారింప మ,హాకోపము నొంది రావణాసురుఁ డసురా
నీకములఁ గాంచి యీకపి, తోఁకకు నగ్గిఁ దవిలించి తోలుం డనినన్. 600

మ. దనుజుల్ తైలవిలిప్తవస్త్రవితతిం దద్వానరాధీశవా
లనిబద్ధం బొనరించి ఘోరగతిఁ గీలాప్రస్ఫురద్ధవ్యవా
హనుఁ గీలించి సురేంద్రజిద్విహితబ్రహ్మాస్త్రప్రబంధప్రమో
చనుఁ వాతాత్మజుఁ బొమ్ము పొమ్మనిరి హాస్యంబు ల్ప్రసంగింపుచున్. 601

ఆ. ఇట్లు సోఁకుమూఁక లెలమి నవ్వుచుఁ దను, జిహ్వ్యసంతసింపఁ జేరివాని
తోఁక రవులఁబెట్టి తొలఁగి పొమ్మనుటయుఁ, గాలిచూలి మిగులఁ గసరుకొనుచు

క. కీలిప్రకలితనిజఘన, వాలాలాతభ్రమణవివర్ధితవహ్ని
జ్వాలాజాలుఁడై యాగ్గోలాంగూలోత్తముఁడు సకోపుం డగుచున్. 603

క. పురమునఁ గల బంధురసుం, దరమందిరవారణాయుధస్థలగర్భా
సురుచిరలసత్ప్రాసా, దరథంబుల కొక్కపెట్టి దహనము వెట్టెన్. 604

క. పొగ వెడలి యెల్లదిక్కుల, బుగబుగ మనుమంట లెగయఁ బోరిబోరిఁ దనుజు
ల్వగనొంది పత్త్రికక్కఱు, దెగ కిరి సతిసీత నేల తెచ్చెనటంచున్. 605

వ. అంతం గ్రమక్రమంబున సప్తార్చి ప్రవృద్ధార్చియై పేర్చి. 606

క. దళమగు వహ్నిజ్వాలలఁ, జిళ చిళ యని చిటిగి సౌధబృందము వడఁగా
గళవళ మందుచు హతభు, క్ప్రియసుగా వగచి మిగుల భయపడి రసురుల్. 607

గీ. రామకోపాగ్ని యిట్లు మ్రక్కటశతేర, మూని లంకాపురము నేర్పుచున్నదనఁగ
వాయుతనయుఁడు గొఱిక్కైవడి విజోను, వాలదండంబు త్రిప్పుచు వర్తిలంగ. 608

సీ. ధామము ల్నిర్ధూమధామము ల్చేసి జోకమరుపుఁదోఁటలు గమలఁజేసి
వర్త్మంబులను గృష్ణవర్త్మంబు లొనరించి భూతిశాంతయును విభూతిఁ జేసి
కలశాలలెల్ల నింగలశాల లొనరించి జాలంబులను శిఖాజాలముంచి
యవరోధ మధికధూమావరోధనుఁ జేసి పటురూపములు విరూపము లొనర్చి
గీ. మండపంబులు మండెడు మంటఁగలిపి, గుమ్మములనెల్ల నిప్పులు గుమ్మరించి
కాయమానంబులు ధగద్ధగాయమాన, ములుగ నొనరించె హరివాలకలితవహ్ని. 609

వ. ఇట్లాత్మవాలాభీలవహ్నిజ్వాలాజాలంబుల వాతూలబాలుండు లంకాపుటభేదనం
బు భస్మంబుఁ గావించుచుండె నట్టియెడ. 610

ఆ. కంటిమంటఁ దోఁక కంటించికొనివచ్చి, క్రాలుచున్న కాలకాలుఁ డనఁగ
నీతఁ డొప్పెననుచు హృదయంబులు చలించు, చుండ నసురు లుద్ధ హార్యలేక.

చ. కోలలఁ జేరువారుఁ దమకుం బొగచుట్టిన నక్రువారిక
న్గోలుకలఁ గాలువారుఁ గపికుంజరుఁ గాంచి భయాతిరేకులై
కేలఁ గులఁ బోలువారుఁ గడుఁ గేకలు వెట్టెడువారు నెంతయు
న్వాలువెలఁ బారువారునయి విహ్వలమందిరి రాక్షసాధముల్. 612

సీ. బడబాగ్ని జడనిధి వెడలి లంకాపురిఁ, జేర్చుచున్నదని యూహించువారు
నదె విభీషణుఁడు పుణ్యాత్ముఁ డాతని యిల్లుఁ, జేరదగ్గి యని వీక్షించువారు
నీకపిలయరుద్రుఁ డిది ప్రళయంబుగా, నితరంబు గాదని యెంచువారుఁ
గొని తెచ్చికొనినట్లు క్రోఁతతోఁకకు నగ్గిఁ, బెట్టి నేలయటంచుఁ దిట్టువారుఁ
గీ. బూర్ణమై మండుచు హుతభుక్శిఖాక, లాపముల గ్రందువారు విలాపమందు
వారుబంధుల బేర్కొనువారుఁ బాలు, వారునై రక్కసులు గడవగలఁ బొగులు. 613

క. వాయుసుతుం డీసకోల్పఁగ, వాయుసఖుండు పేర్చి ఘోర మవారణ నేర్చె
న్వాయుజవాశ్వయదేభర, థాయతకేతననికేతనాదుల తోడన్. 614

గీ. కపికులాధీశ్వరుఁడు దాపికాఁడు గాఁగఁ, బొదలు ధూమకేతుఁ బురము సొచ్చి
ముఖ్యధనధాన్యపరిధానములు హరించె, గాలిచెలికాఁడు జిచ్చనుకన్నగాఁడు. 615

ఆ. సమనివార్యభావిసాగరబంధన, సాధనోపకరణసమరణముల
నధిక యత్న మొప్ప నంగారములు గాల్చె, చందమొందె బవననందనుండు. 616

వ. తదనంతరంబున నిజలాంగూల ప్రభవ శోణిమధన సముద్భూత పావనీయాగ్నిం బూ
ర్వసుధాశనరుధిరాజ్యధారాచ్ఛటాసేకంబునం బ్రవృద్ధంబు గావించి మంత్రసుత
సప్తకాక్షయకుమారాది పశువిశసనంబు గావించి వేల్చి పురందరాది బృందారక
సందోహంబు మహానందంబునొంద రక్షస్స్త్రీవిలాప మంత్రంబులతో లంకాపురం
బుఁ బూర్ణాహుతిఁ గావించి తద్ధూమాఘ్రాణంబున ఖచరకిన్నరీ కాంతాసంతా
నంబులు మొదల సాంజనేయ సోమయాజి యాజిలీలామఖంబు నిర్విఘ్నంబు గా నానం
దసాగరావభృథస్నానంబు గావించి శాంతిఁ బొందివరలె వాఁ డైతనమనంబున. 617

క. వాలాగ్నికీల మడఁచె, వాలగతిం జల్లఁగుట వసుధాతనయో
ద్వేలకరుణాసుధారస, మూలంబని తలఁచికొని ప్రమోదభరితుఁడై. 618

క. తనసేమముఁ గోరెడు భూ, తనయకుఁ బ్రణమిల్లి పోయెదనని తదాజ్ఞం
జని కాంచె వారిరాశిం, జనితపరమశైత్యలలితజలతాక్లేశిన్. 619

ఆ. కనినఁ బసక్కరించి క్షాభేరిజ్ఝఘుఁ, డగుచుఁ గడలి దాఁటె నక్రమమున
దన్ను నెదురుసూచు తరుచరవర్యుల, ప్రాణవాయువనఁగ బవనసుతుఁడు. 620

వ. ఇట్లు మహాబలుండు నిజవీక్షకర్కశలాంగూలవిక్షేపప్రసూతప్రభూతమహాబలంబున సముద్రంబు పాయువడం జేయుచు వడివడిం జనుదెంచు నవసరంబున నవలివలిముఖులు వన లోన. 621

మ. చనుదెంచుం బవనాత్మజుండు గదె రఘూద్ఘూమాసత్తారావమో
యనవీతెంచెడుఁ దద్విరోచిశరదుం బంచుం బ్రతీక్షించుచుం
డ నభోభాగము భూమియుం దెసలు నిండం బర్వు తేజంబుతో
ఘనుఁ డాకీశవిభుండు వచ్చెఁ బ్లవగోత్కంఠం బనంతంబుగన్. 622

ఉ. దక్షిణవార్ధితీరము ముదంబెసలారఁగ నిట్లుచేర వ
చ్ఛ్రుతచరోత్తముం గని ప్రహృష్టమనస్కత వానరాలి ప్ర
త్యక్షసమీరణుం డితఁడటంచు నుతించి కవుంగలించి తా
రాక్షితిపుత్రివార్తఁగని యూతఁడు వచ్చెటఁ జెంగి యుబ్బుచున్. 623

ఉ. గంతులువైచి రంతఁ బ్లవగప్రభు లంగదముఖ్యు లమ్మరు
త్సంతతిఁ జుట్టిముట్టి కడు సంతసమందుచుఁ బల్కి రీవుస
త్సంతతి సన్నుతింపఁగ బళం జలరాశిఁ దరించి ధారుణీ
సంతతిఁ జూచి వచ్చితి యసాధ్యబలుండవటంచు నెంతయున్ 624

క. వేయువిధంబుల సన్నుతి, సేయ న్మనమునకు వేడ్కసేయం దగన
వ్వాయుతనూజుండపుడుము, నాయతగర్జాధ్వనిప్రహాసితధ్వనితోన్. 625

గీ. జలనిధిఁ దరించి క్రమ్మఱ సాగరంబు, దాఁటివచ్చుట మొదలుఁ దుదయును గాఁగఁ
గలుగువృత్తాంతమెల్ల నక్కపివరులకుఁ, దెల్పె వెండియుఁ బుణ్యసద్వినయుఁడు. 626

క. సతి రాజవశాళిఁబాసిన, గతిఁ బ్రాణముఁ జిక్కఁబట్టి గతిలేమినసం
గతి సిలుగుమిగులసీతా, సతియున్నది రాజవశాళి సన్నిధిలేమిన్. 627

క. కావున వేవేగ న్మన, మీవిధము రఘూత్తమునకు నెఱిఁగింపుటయుం
బోవుద మనవుడు విని సం, భావనమెసఁగం గపిప్రవరులు ముదమునన్. 628

క. ఆడుదురుఁ బాడుదురు గుమి, గూడుదురు సమీరజన్ముఁ గొనియాడుదురే
ట్లాడుదు రోడుదురుత్సవ, మూడుదురు మనంబులధికహర్షంబులు గాన్. 629

630

వ. తదనంతరంబున.

ఉ. అంగదజాంబవద్ధనుమదాదు లతిత్వర నమ్మహోదధి
స్సంగతతీరము న్విడిచి శైలశిలామహిరుట్ప్రతామహో
త్తుంగనదీవిశాలమగు తోరపుమార్గమువట్టి యంత ను
ప్పొంగుచు భల్లుకప్లవగపుంగవు లెంతయు హెచ్చరింపఁగన్.

వ. నిరంతరప్రయాణంబులం జని చని కిష్కింధాపురసమీపగతమధువనంబుఁ గనుంగొని.

క. ఉల్లంబుల వెల్లివిరియ, నుల్లాసిలసల్లహరిక నోలాడి కపు
ల్భల్లూకవరు లవ్వనముం, బల్లన నిలువంకఁ జొచ్చి భయవిరహితులై. 634

సీ. ఫలములనెల్ల నిష్ఫలములుగా రాల్చి యాకుల ప్రోవుఁ జీకాకుపఱిచి
విరిపిడిఁ గోసి వావిరిపిడి గావించి లతములు గాఁగఁ బల్లవములూడ్చి
మూలంబులెల్ల నున్మూలముగ్గావించి యూడల ప్రేలాడి యూడఁదీసి
కలకంఠములనొప్పు కలకంఠములఁ జోపి గములయి వఱలు భృంగములఁ దోలి

గీ. ఘనలతాక్షయములు బరిక్షయ మొనర్చి, కపివరులు వనమెల్లనుఁ గాసిచేసి
రవనిజావార్తఁ దెచ్చిన యట్టివార, లగుట నించుకయేని భయంబులేక. 635

క. మధుపానం బొనరించుచు, మధుపాన మొనర్చినట్లు మత్తులగుచు న
మ్మధువనముఁ గాచువారల, విధువనముం జేసి రసమవిక్రమవృత్తిన్. 636

క. జనకజఁ గనుఁగొనఁ జనమున, వనరాశియ కాదె యడ్డువచ్చె ననుచు న
వ్వనరాశిఁ గాసిచేసిరి, వనచరు లనివార్యశౌర్యవర్తను లగుచున్. 637

ఉ. తద్వనరక్షులాత్మణము తాపఁగ గాంచి నమస్కరించి భా
స్వద్వరపుత్ర చిత్ర మొకవార్త వినందగు నంగదాదులు
ద్యద్విరదంబులో యన భయంబణుమాత్రము లేక వీఁకయు
ప్పొంగ్వనమెల్లఁ గొల్లఁగొల సాల్వడఁజేసి రొకింత లోపలన్. 638

క. క్షితిప్రగతి నేము చని ప్లవగప్రభులం గాంచి యడుపఁగా నడుగక వా
రప్రతిహతప్రభావు ల, గ్రక్షతిమలు నగుచు నవనిఁ గలిపిరి వనమున్. 639

క. ఇందిందిరములు కుడుచు మ, రందము ద్రోలు నెడ నుష్కరత నఁగ్రములు మో
పందలఁ కునట్టి మధువన, మందఱు నగచరులు గలఁచి యాడిరి స్వేచ్ఛన్. 640

చ. అని వనముం గలంచిరని యాడినమాటకుఁ బొంగి జానకిం
గనుఁగొని వచ్చి రట్లగుటఁ గాదె భయం బొకయింత లేక మ
ద్వనమున సంచరించి రనివార్యపరాక్రము లంచు రామచం
ద్రునకనుజన్ముఁ డైనయుఁ దోయజమిత్రకులీనుఁ డిట్లనెన్. 641

క. మన హనుమన్ముఖ్యులు రా, మన రేశ్వగ సంతసంబు వల్లడిగొనఁగా
జనుదెంచి యిపుడు మన్మధు, వనముఁ గలఁచి యాడుచున్నవారట వింటే. 642

· కృతకార్యసిద్ధి నరుదెం, చితిరని సంతోషభరితచిత్తులగుచు వా
రతిలోకపరాక్రము లీ, గతి వర్తింతురని మదికిఁ గానఁగవచ్చెన్. 643

ఆ. అనిన రామచంద్రుఁడనుజన్మసహితుఁ డత్యంతహృష్టమానసాబ్జుఁ డగుచు
నిజము స్వామికార్యనిర్వాహకుల కిట్టి, చనవు దగునఁ గాదె యనఘులార. 644

వ. అని పల్కె నంత ధాత్రీపుత్రీకళత్రసుమిత్రాపుత్రులు తదాలోకన సీతానువార్తా
శ్రవణపరాయణచిత్తవృత్తులై యుండి రయ్యవసరంబున. 645

క. ఆవన మిత్త్వైధమున వీ, తావన మొనరించి పృథురయంబు మెఱయ న
ప్పావని మున్నిడికొని ప్లవ, గావలి సనుదెంచె ధరణి యంతయు నద్రువన్. 646

ఉ. ఆత్మజవాపహాసితరయం బెసలారఁగ నిట్లు రా సమీ
రాత్మజుఁ డాత్మజన్మవిజితాత్ముఁడు జాంబవదంగదాదిపూ
తాత్ములఁగూడి హర్షవినయంబుల ప్రోవన నేగి గాంచె శు
ద్ధాత్ముల రామలక్ష్మణతమోంతకపుత్రుల సచ్చరిత్రులన్. 647

ఆ. కని నమస్కరించి కరములు జోడించి, తనముఖంబుఁ గాంచి తరుణి ధరణి
తనయ నితఁడు గాంచి చనుదెంచె నని రాముఁ, డాత్మఁ బొంగ నిట్లనియె నతఁడు.

మ. కనుఁగొంటి న్నతిసీత నశ్రుకణముక్తాదామసంవీత నే
కనికృత్తాంబరపూత ఘర్మసలిలాక్రాంతాననాబ్జాతఁ బా
వనసౌశీల్యసమేత భీమ్యదనుజీవ్యావీరసంభీత నా
త్మనిరుద్ధోగ్రభవద్వియోగపరిభూత న్ఘోరలంకాపురిన్. 649

సీ. అతిభయదోల్కాసహస్రంబులోపల నొక్కట రోహిణి యున్నయట్లు
శాతకంటకలతావ్రాతాంతరంబున నొకలవలీవల్లి యున్నయట్లు
ప్రసవితేహామృగప్రకరమధ్యంబున నొక్కట సారంగి యున్నయట్లు
బహువిధశ్యేననివహసమీపంబున నొకఁడు బాలకపోతి యున్నయట్లు

గీ. ప్రబలమార్జారికాకదంబంబులోన, నొంటిమెయిఁ గీరి వణఁకుచు నున్నయట్లు
క్రుద్ధదైత్యాంగనాప్రతిరుద్ధ యగుచు, నున్నయది సీత సన్నుతాపన్నజాత.

వ. అని విన్నవించి ధీమంతుం డగుహనుమంతుండు. 651

క. ఏ మరిగి యామ్యదిగ్గత, భూమీధరతరునికుంజపుంజంబుల న
బ్భూమిజ వెదకి కానక, యేమనిపోదుమని వికలహృదయుల మగుచున్. 652

ఉ. వెండి కడంగి రోయుచుఁ గుభృద్వివరం బొకఁ డేముఁ గాంచి మా
ర్తాండమరీచికావిరహితంబగు నగ్గుహ సొచ్చి యందు నిం
దుండన కల్గునాననయుతోఁ దప మొప్ప ఘటించుచున్న యు
ద్దండమహానుభావ నొకతం గని భక్తి నమస్కరించుచున్. 653

వ. నిజప్రభాపటలతిరోహితగుహాతిమిర యగు నాస్వయంప్రభ మమ్ము నాశీర్వచన
సముచితాతిథేయంబులం బ్రియంబు నొందించి యమ్మహాబిలంబు వెలువరించినం
దదుపాంతకాంతారాంతరంబున భవత్కాంతామార్గణార్థ చింతాక్రాంతుల మగు
మేము త్తరశిరస్కుల మగుచుం బ్రాయోపవేశంబు సేయం గుశాస్తరణంబుల శయ
నించియుంటి మయ్యవసరంబున. 654

క. మృత్యర్థుల మగు మాకొ, కత్యర్థస్వాదువాదుం డగునొక్కఁడు సం
పాత్యభిధానుఁడు గోత్రా,పత్యస్థితిఁ దెలిపి చనియెం బ్రముదితుం డగుచున్. 655

ఉ. ఆఖగేంద్రుఁ డిట్లు నెనరాగ మహోదధిమధ్యమంబున
ద్రావణపట్టనంబున ధరాసుత యుండుటఁ దెల్పి పోవ నే
మావనరాశిఁ జూచితి మనంతర మెంతయు వానరాలి సం
భావనసేయ వార్ధి సులభంబునఁ దాఁటితి దద్దయాదృతిన్. 656

ఆ. ఇట్లు కడలి గడచి యెడనెడ విఘ్నంబు, లెన్ని యేని గలుగ నేను గలఁగ
కప్పురంబు సొచ్చి యచట లంకిణి ద్రచ్చి, తిరిగితిరిగి యొక్క తరువునీడ.

మ. కనుఁగొంటి న్సతి సీత నశ్రుకణముక్తాదామసంవీత నే
కనికృత్తాంబరపూత ఘర్మసలిలాక్రాంతాననాబ్జాతఁ బా
వనసౌశీల్యసమేత భ్రామ్యదసురీవ్యాహారసంభీత నా
త్మనివిద్యోగ్రభవద్వియోగశిఖభూతి న్ఘోరలంకాపురిన్. 668

క. కని వినయంబునఁ జేరం, జనునప్పుడ రావణుండు సనుదెంచి జగ
జ్జననియగు సీత బరుషవచనముల నొప్పించి యతఁడు సనియెం బెలుచన్. 659

శా. రక్షోధ్యక్షుఁడు డిట్లు పోవుటయు సంరక్తాక్షులై భీమకృ
ద్రక్షోగణామినులాక్షణంబునను గర్జారావము ల్మీఱఁ బ
ద్మాక్షి రావణుఁ జెట్టపట్టుమని రూక్షాకారలై డిట్టుఁ ద
న్నాక్షేపింప ధరాకుమారి కటుదైన్యాక్రాంతయై మూర్ఛిలన్. 660

క. నీకు శుభంబగు నసురా, నీకశుభకరము గాఁగ నేఁ గలఁగంటి
న్శోకింప నేల యని సీ,త కాంతఁ దేర్చెఁ ద్రిజట తగువాక్యములన్. 661

వ. తత్సమయంబున. 662

క. మాయమ్మ రామదూత సు,మీ యమ్మలికంబు గాదు మాపద లెల్ల
న్మాయు నమ్మగు నీయలుక సుమా యమ్మగు నింక రావణాసురపతికిన్. 663

క. అనుచు వినీతుండై యల్లనఁ బ్రేమొక్కుచు నన్న నక్కులసతీమణి న
న్మనివ్యాదయంబునఁ బో ష న్మని నక్కున నేను కృతార్థుఁడ నగుచున్. 664

క. మన్నిజరూపముతోన జగన్నుతభవదంగుళీయకముఁ జూపిన వే
డ్కన్నన్ను నమ్మి మిగులఁ బ్రసన్నహృదయ యగుచుఁ జనకజాత ప్రియమునన్.

వ. భగవతీసుందరచరణారవిందంబులు డెందంబునం దలంచి వందనంబులు గావించి సుమిత్రాపుత్రు సేమంబడిగి మీకుం బ్రత్యభిజ్ఞానార్థంబుగాఁ జిత్రకూటచిత్రకూట కృతకృతక కాకాసురకథాకథనంబు నడిపి యప్పతివ్రతాశిరోమణి శిరోమణి యొసంగి సెల వొసంగినం బ్రణామంబు గావించి నామగిడివచ్చునప్పుడు లంకాపురాభిముఖుండనై యెదిరికొనిన దనుజమంత్రిసుతసప్తకంబుఁ బంచత్వంబు నొందించి యక్షకుమారుం బరిక్షయంబు గావించి తదనంతరంబున నింద్రజిచ్చతురాననశిలీముఖపాశప్రబద్ధుండనై నగుమదీయవాలాగ్రంబున నద్దనుజపతి యగ్గి ముట్టించిన నయ్యనలం బస్మత్క్రోధోద్రేకవాయువశంబునం జేర్చి కరంబు దన్నగరంబు భస్మీభూతంబుగా విచిత్రకాంతుండనై తరుచరచమూసాగరమ్మున కానందంబు గ్రమ్మం గ్రమ్మఱ సాగరమ్ము గడచి యేతద్వృత్తాంతంబు నీకెఱింగింపఁ గంటిం గృతార్థుండనై మంటి యని పలికి సీత నుద్దేశించి వెండియు నిట్లనియె. 666

క. కన్నీరు దవదంబునఁ బడి, సన్నగిలుంగాని కాల్వ సాఁగుట లేదే
మన్న విను జనకతనయో,త్పన్ననవతిరిక్తహృదయతాపము పేర్మిన్. 667

చ. అడిరియొకఁ డేమికెంత విను మన్నలినాయతనేత్ర వంత మ
ట్పదములు గాంచి పుష్పరసపానము సల్పవు కండుఁ గోవెల
ల్జిగురవు పల్లవంబులు ద్విజిహ్వలు వాయువుఁ గ్రోల వేమిచె
ప్పుఁ దరులిగుర్వ వాగ్రఫలభక్షణ సేయవు పక్షులక్కటా. 668

తే. హెచ్చి దశకంధరుఁడు చెఱదెచ్చిపెట్టి, ఖచరకాంతలు దమకుంతఁ గట్టిపెట్టి
యంతఁ గరంబుల మహిజా కాంతఁ గూర్చి, చింతనొందుదు రిక వేఱ చెప్పనేల. 669

వ. అని పలికి రామచంద్రుం గనుంగొని. 670

క. జగతీసుత సంతోషాభిగమ యగుచు నీకుఁ బ్రత్యభిజ్ఞానార్థం
బుగఁ జూడామణి యొసఁగెన్, జగదీశ్వర చూడుమని పొసఁగఁ జేనిడినన్. 671

క. మణిఁ గాంచి జనకకన్యామణిఁ గాంచినయట్లు పొంగి మహివిభుఁడు నభో
మణివంశజుఁడు సద్గుణమణి లక్ష్మణుఁ గాంచి మధురమందమృదూక్తిన్. 672

గీ. రత్నగర్భాతనయ శిరోరత్న మిట్లు, పంపు టరయంగ నిజభార్య పరమదుఃఖ
భరితయై యుండ నోర్చి తెప్పగిదిఁ గఠినహృదయుఁడవటంచు ననుఁ దూఱుటే యొనర్చె.

వ. అని పలికి కన్నీరొలుక నూరకున్న యన్నం గనుంగొని సుమిత్రాపుత్రుండు విషాదం
బడర నిట్లనియె. 674

క. అవనిజ యమ్మత్సాంగత్యవిహీనతఁ బెంపు దూలు ... సూచించెన్
భరదంగుళోపలాలితమవు నిమ్మణి తొంటియట్ల నల ... గంటే. 975

క. పద్మభవుచెయిది రక్షస్సద్మోపగనోపవాసనంస్థితివల
బద్మాలయోపమను సచ్ఛద్మమతికి నిట్టు లనదచాడ ... గట్టా. 676

క. అని వగచుచున్న తమ్మునిఁ, గనుఁగొని రాముండు ... గద్గదకంఠం
బున నేడ్చె ధరణిసుతఁ బేర్కొని తరణిసుతుండు ... డికొని శోకింపన్. 677

వ. తదనంతరంబున హనుమంతుని పలికిన శాంతవచనంబు ... వలు ) దెలివినొంది రమ్మ
హిఃభుఁడు పవనపుత్రుం బ్రియవచనంబుల నభినందించి. 678

మ. బహునక్రోద్భటతుంగభంగవిచలత్పాథోధి లంఘించి ...
ర్వహగర్వస్థితి ...తుయాదిదనుజవ్రాతంబు ఖండించి ...
ద్వహసౌధాదిక మాత్మవాలకలితాగ్ని జ్వాలఁ జ ... య
మ్మహిపుత్రీశుభవార్తఁ దెచ్చితివి సామాన్యుండవే ...నీ. 679

క. క్షోణీసుతవార్తఁ బరిక్షీణీకృతమయ్యె ననుచుఁ జి... చెడు మ
త్ప్రాణము నిలిపితివి జగత్ప్రాణాత్మజ వశమె నిన్నుఁ బ్రస్తుతిసేయన్. 680

క. అని మఱియుఁ బవనతనయునిఁ, గొనియాడె రామవిభుండు గుమదరిపుజుండుం
గొనియాడె లక్ష్మణుండుం, గొనియాడెం బ్లవగతతియుఁ గొనియాడెఁ గడున్. 681

మ. తను నిట్లుదము సన్నుతింపఁగ జగత్ప్రాణాత్మజన్ముండు రా
మనరేంద్రాదులఁ గాంచి యిట్లనియె నాక్ష్మాపుత్రి లంకాపురి
న్ఘనదుఃఖాబ్ధి మునింగియుండఁగ నుపేక్షావృత్తి గాదింక నూ
ల్కొనఁ డంభోధి దరింప రావణుఁ గుశీలుం బట్టి సాలాన్పఁగన్. 682

క. అని యిట్లిలతనయ చెప్పినపని కనుకూలు రగుచుఁ బ్రభువార్గాధి
న్మనిఁగి రని చెప్పి వెండియు, ననుమోదరసార్ద్రహృదయుఁడై యిట్లనియెన్. 683

మత్తేభకందగర్భితసీసపద్యము.

సీ-జలమేఘాకృతి సాధుపోషణరతీ సామగమోద్యన్నుతీ మహేశ
స-లలితానందద సారసాంచితపదా లాక్షణ్యనాభీనసాక్షితిధర
ప్ర-బలదైత్యోత్కర పర్వతాశనికరా పాపాఘదర్వీకరా పరేశ
య-ఖిలబాధాపహహారి సద్గుణగుహా కీశోరుసౌఖ్యావహా శశిముఖ
విమలయశ పండితావన। సమరవిజయ, చక్రహస్త సర్వాత్మక సా। రమకుట
గరుడతురగ వి। శ్వమహిత పురుషవృషభ, విభవవిహితవర్తి మునివినుతయుక్తి. 684

చతుర్విధకందము.

హంసశశినేత్ర దైవవ్రతహంసా। శంసితచరిత్ర। దైత్యన్వ। శంసా।
హంసహయవంద్యసారళు, భాంసా హంసనుత నిర్దయావిధ్వంసా.

మాలిని నిగమనిగమవాసా నిస్తులస్వర్ణవాసా, వికతవిగతదోషా వేదనిందాబ్జదోషా
సుగుణసుగుణరుద్ధా శుద్ధసాపీ. రుద్ధా, జగతిజగతిగోళా ఛత్రవత్కృత్తగోళా.

గద్య. ఇది శ్రీసూర్యనారాయణ పదాబ్జధ్యానపరాయణ ధూర్వహ ధైర్యవినయ రామశార్య తనయ పండితసేవాసముచ్చయ కొత్తపల్లి లచ్చయప్రణీతంబైన దాశరథిలా సంబను మహాప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము



శ్రీరామ.

# దాశరథివిలాసము.



## షష్ఠాశ్వాసము.



క. శ్రీమానినీమనోజ్జ్వల,తామరసమకరందపానతాత్పర్యమిళిం
దా మేరుతుల్యవేంకట,ధామసుమహీభృదళిందసామజముకుందా. 1

గీ. అవధరింపు మధికహర్షి వాల్మీకిమహర్షి యిట్టు లనియె నట్లుసంత
సాధ్వి మునిఁగి రాముఁ దర్కనందనుఁ గాంచి, యిట్టు లనియెఁ బ్రేమ మెసక మెసఁగ.

క. ప్రాణంబులు మనకు జగ,త్ప్రాణాత్మజుఁ కరుణఁజేసి క్రమ్మఱఁ గలిగెం
బ్రాణము లాలింపక మ,త్ప్రాణేశ్వరి వెదకె నితఁ డుదధి మధ్యమునన్. 3

చ. ఇతని నుతింప నాకు వశమే యిది యట్టుల యుండనిమ్ము నీ
వకులబలాఢ్యు లైనప్లవగాధిపుల న్సమకూర్చి యబ్ధి ను
చ్ఛ్రితఘనభంగలబ్ధినిఁ దరించి దశాస్యు వధించి మించి మ
త్పతి సతి సీతఁ జూడక యసాధ్యమనఃపరితాప మాఱునే. 4

సీ. శశికాంతవేదికాస్థలవిరచితసుమశయ్యాతలంబుఁ జందనార్ద్ర
దేహ లై సౌరభోద్గీర్ణకారణతాళవృంతానిలాలోలవిపులమార్ణ
కుంతల లై మహత్కాంతాసదృక్పరిచారికాశతసహస్రములు గన్న
నైగ నూడిగములు సల్ప మద్బాహుద్వయోపలాలిత లై యమోఘ సౌఖ్య
లీల మెలఁగుచట్టి లేమకు ధురవాంత,రమునఁ గటికినేల రాక్షసీమ
హోగ్రతర్జనముల నొక్కట వణఁకుచు, నుండవలసెఁ జిత్ర మొకఁడు గంటె. 5

క అని మఱియు వగచు రామునిఁ, గనుఁగొని సుగ్రీవుఁ డేను గలుగ విచారం
బున కెడయాకుము ధరణీ,శ,తనయాపహారువధ సలుపుదము ముద మొదవన్. 6

వ. అని యిట్లాయోధనసాధనపోషణంబు లగుభాషణంబు లాడి యప్పుడు. 7

క. అవనిఁ గలప్లవంగమపుం,గవులన్ జతగూర్చి తెచ్చి కనుఁగొంటె మహా
పావకకర్కశాంగు లియ్యో,ధవరుల కడ్డమె విరోధిదైత్యబలంబుల్. 8

ఉ. సంభరియింపఁ జాలునె యసాధ్యతరం బగుమద్భ్రగంబు వి
శ్వంభర యంచు నీ ప్లవగసైన్యము దాఁటెను నభ్రవీథికిన్

దంభ మొకింత లేదు వసుధావర చూడుము నావుడుఁ బ్రణో
జ్జృంభితచిత్తుఁ డై ప్లవగసింహుఁడు సంతస మంది యిట్లనన్. 9

క. కడు సంతస మందితి నిఁకఁ దడ, వేటికి? బ్రోఁ జేరఁ దరుచరబలము
న్నడిపింపు మనుఁడు సూర్యసుతుఁడు సంభ్రమ మెసఁగ సమరదోహలుఁ డగుచున్.

క. హనుమదంగదగవయగవా,క్షనలాంగదపనసదధిముఖప్రముఖకపీం
ద్రనితాంతావన మగు,సైన్యనికాయము నాహవంబునకు నాలొగ్గలుపన్. 11

సీ. కుంభినీధరముల గ్రుద్ది బ్రద్దలు సేయఁ జాలినహస్తము ల్సాఁచికొనుచు
ఖచరకాంతాపువ్వకంబులు సుడివడి తిరుగ వాలంబులు ద్రిప్పుకొనుచు
దిఙ్మదదంతిశ్రుతిస్ఫుటితంబుగా సింహనాదంబులు చేసికొనుచు
వెలయ డెబ్బదిరెండు వెల్లువ ల్గలకపిసేన వెలసిన వీక్షించి రామ
చంద్రుఁ డధికహర్షసాంద్రుఁ డై యప్పుడు, సంక్రందనందనాంజనేయజాంబ
వన్ముఖవనాటశల్లకప్రవరులఁ, గాంచి యిట్టు లనియె గారవమున. 12

క. భద్రము గాఁగ నపూర్వస,ముద్ర మనం గంద మిగిలి మొన వెడలెడు ని
ద్రింద్రగతి నింక శాంత్ర, విద్రావణకేళి కిపుడ వెడలుద మనుడున్. 13

శా. తద్వాహిన్యధినాథు లెంతయు మహోద్యజ్జైత్రయాత్రాప్రశం
సద్వాక్యాగుణప్రయత్నభరితోత్సాహంబునం బొంగి మా
ద్యద్వేదండకరోరుధీరణభుజద్వంద్వంబు లుప్పొంగఁ గా
సుద్యాహోద్వహనార్థులట్టులు సమీకోద్యోగు లై రంతటన్. 14

క. ఉదయగిరిశిఖరవిస్ఫురి,తదినేంద్రేంద్రు లన దశరథసుతు లనిలజాం
గదభుజశిరఃప్రదేశము,లఁ దనర్చిరి చూచువారలకు ముద మొదవన్. 15

వ. ఇవ్విధంబున మహారథు లగు నద్దాశరథుల కీశరథులై వొలిచి నడిచి రంత వనచర
సమూహంబును భాస్కరసుతప్రేరితం బై పుడమి వడవడ వడంకఁ గడువడి నడు
వం దొడంగె నట్టియెడ. 16

క. తతవానరసైన్యసము,ద్ధతభూమీరజము వొలిచె దివిపద్గంగా
స్థితరక్తసరోరుహసం,తతికిఁ బరాగ మయి యద్భుతస్థితిదోఁపన్. 17

క. పొన్నిఁ దెలగతి వాలము, లన్నిటి దివి నోరయఁ ద్రిప్పి యాడుచు విసతో
మిన్నేటిఁ గూడఁ బొంగెడు, మన్నిటికిఁ జేర నడిచె మొన యలఘుగతిన్. 18

చ. ముదమున నిట్లు రెండవసముద్ర మనం గపిసైన్య మేగి త
త్సదమలతీరహారకుఁరపికాలలసత్పులిన ప్రదేశముం

గదిసె ననంతరంబ పొడగాంచిరి రాఘవభానుసూను లా
పదపథసన్నిరుద్ధఘనభాగవినిద్రము నాసముద్రముల్. 19

క. కని యంత రామలక్ష్మణు, లనఘులు పవనతనయాంగదాంసతలంబుల్
ఘనమతులం డిగిరి గిరియుగ్మమును డిగు హైమవతసింహములజంట యనన్. 20

వ. ఇట్లు కల్పకతరుస్కంధంబులం బోని తరుచరస్కంధంబు లవతరించి చమూనాథపరివేష్టితులై సమవిశాలచంద్రికాధవళచిత్రపవిత్రస్థలాసీనులై సముద్రతరణోపాయంబుఁ జింతించుచుండి రంత నవ్వనచరబలంబులును దత్తీరపర్వతగహనంబుల విడిసె నయ్యవసరంబున లంకాపురంబున దశకంధరుండు. 21

క. ఈలీల రామలక్ష్మణు, లాలమునకు వచ్చి విడియు టాలించుట నో
డ్డోలగమున మంత్రులఁ గా, ర్యాలోచన మడుగుచున్న యప్పు డతినిభృతిన్. 22

మ. దశకంఠానుజుఁ డవ్విభీషణుఁడు భ్రాతం జేరి కేల్మోడ్చి పౌ
లస్త్యుం డిట్లనిపల్కె నిష్ఠుఁడ యమర్త్యశ్రేణి ప్రార్థింప భూ
రికశతారాయుధధారి వైరికుల మూర్విం గూల్ప నీలీల మ
ర్త్యశరీరంబు ధరించె రాముఁ డన సీతాహృత్సరోజాళియై. 23

క. అని నారదాదిమునివరు, లన వింటిమి కాకయున్న నిమురులమీఁద
న్మనుజులు చనుదెంతురె చెప్పినపని గాదనుచునే కపిప్రకరంబుల్. 24

చ. ఒకకపి మున్న రామునినియోగమునన్ జలరాశి దాఁటి జా
నకిఁ గని యూఱడించి తదనంతర మొక్కట మంత్రిపుత్రస
ప్తకము వధించి యక్షయు నపక్షయశౌర్యమదం బడంచి తా
వకపురి గాల్చి పోవఁడె భవత్పరివారము చూచుచుండఁగన్. 25

క. వాలి నినుఁ గొన్న హైహయుఁ, దూలించి భార్గవు న్విధూనముఁ జేసె
న్వాలిం గూలిచె టనీ, వాలించితి చలము విడవు మాప్రతిపయిన్. 26

వ. అని పలికి వెండియు. 27

క. ఎదిరిం దమ్ము నెఱుంగక, వదరెడు ప్రెగ్గడలపలుకుబడికి నెడందం
గుదురుపడ నీకయేని, న్బెదరు విడిచి బ్రదుకఁగలరు పిన్నలుఁ బెద్దల్. 28

క. వనరాశి మనుజు లెవ్విధమున దాఁటెద రని తలంపఁబోకుము మది న
ల్గిన జలధి నిపుడె శోషింపఁడె, మనుజేంద్రుఁ డగస్త్యుఁడ త్రమార్గణవహ్నిన్. 29

క. ప్రణుతించి వేడ నానతి, గణుతించి నిశాటకోటి గణుతింపక నై
పుణి వెలయఁగఁ జని పాదప్రణతజనబుభద్రు రామభద్రుం గనుమీ. 30

చ. కనకరథంబునన్ జనకకన్యక నుంచి నరేంద్రమౌళి క
ప్పన మొనరించి కావుము కృపాంబుధి యంచటి తప్పు సైచి కో
పనుఁడవు గావు నీ వనుచుఁ బ్రాంజలివై ప్రణమిల్లు దేని యే
మనియెడువాఁడు గాఁడు శరణార్థు నిమం గరుణించు నర్మిలిన్. 31

క. కోలము నొక్కని రించితి వా కోలము న్నిల్పు మని నృపవరుం బ్రణమిల్లం
దలపకుట మానుఁ గృతమునఁ, దలఁపఁ డటులు గాన యిపుడ తగు నిటు సేయన్. 32

చ. వననిధి దాఁటి వారిటు వచ్చుటను న్మరుగాఁగ జానకిం
గొని చని రామలక్ష్మణుల కన్న కణం బని సంధి చేయుటో
ప్పు నను చెల్లభంగులను బోఁడిమి నెంతును నీవు నీకుఁ దె
చ్చినదినముం దొడంగి తగఁ జేయుము సౌమ్యత రాజమౌళికిన్. 33

వ. అని మఱియు ననేకభంగుల నుపన్యసించుచు. 34

ఆ. వె. దోషరహితు డవ్విభీషణుఁ డిట్లను, నింక నొండు తలఁపు లెల్ల మాని
సీత నిచ్చి రాముఁ జేరి ప్రార్థించుట, కంటె బ్రదుకుఁ దెరువొకండు లేదు. 35

చ. అన విని క్రోధతామ్రనయనాబ్జుఁడు లిర్వదిట స్వహోదరుం
గనుఁగొని చాలుఁ జాలుడఁగి కయ్యము చేయఁగఁ జాల వేని క్రే
వనోదిఁగి యుండు కిట్లు బలవంతులు మానవు లంచుఁ దెల్పుచు
న్మనుజభుగాళికిం బిఱికిమాటలు దెల్పఁగ నేల చేలవై. 36

ఉ. యక్షులమీఁద దాడి చనునప్పుడు నుద్దవిడిం ద్రివిష్టపా
ధ్యక్షులఁ ద్రోలునప్పుడు భయం బొకయింతయు లేని రాక్షసా
ధ్యక్షుఁడ నొక్కమర్త్య నభయం బని వేఁడుట యెట్లు విద్విష
త్పక్షముఁ బూని నాకు నహితం బోధింపఁ దలంచి తాత్మలోన్. 37

సీ. తపమున మెచ్చి ధాత వరంబులీయ రానెంచి యక్షుద్ర మాసించినావు
బుద్ధి చెప్పుటకునై యుద్ధవాధీశుఁ డంపినదూతఁ జంపింప మిడికినావు
బలిమిమై నిర్జరభామలఁ జెఱదెచ్చునప్పుడు వలదని చెప్పినావు
అలనాఁడు వానరుఁ డిలుకుమాలఁ గనీక మించినపురముఁ గాల్పించినావు
నిండుకొలువునఁ మనుజుల యండఁ జేరి, కొలిచి బ్రదుకు మటంచు వాక్రుచ్చినావు
వేడబంబుగఁ దలపోసిచూడ నీవు, మొదలనుండియు నవగుణమ్ములకు తావు. 38

వ. అని తనమనంబున నితండు మదీయవైభవబలపరాక్రమంబులకు ననూయగ్రస్తుండై
పలుకువాఁడు గాకేని యని నిశ్చయంబు గనుంగొని. 39

మ. వికటభ్రూకుటిఘూర్ణితేక్షణుఁడగు న్వేఁ శ్వాంభరాదేవవై
రికటుస్పందన మాచరించి ప్రబలార్చిష్మచ్ఛిఖాజాలవ
త్ప్రకటక్రోధకషాయితాక్షుఁ డగుచుం బాదంబునం దన్నె మ
న్నికటంబు న్వెసఁ బాసిపోవు మనియె న్నిష్కారణాహంక్రియన్. 40

ఉ. పాప్మని కెండియు న్సుగుణభూషణుఁడైన విభీషణు న్మహో
గ్ర మ్మగుమాడ్కిఁ జూచి దశకంఠుఁ డకుంఠితలీలఁ జంద్రహా
సమ్మున వ్రేయఁ బూనుటయు సంభ్రముఁడై పఱతెంచి మాను ఘో
ర మ్మని యాఁగ నయ్యెడఁ బ్రహస్తుఁడు హస్తము చాఁచి రావణున్. 41

క. తన్నివ్విధమునఁ గనలుచుఁ, దన్నె వెసలు సునుఁడు శోకతాపితుఁ డగుచుం
దన్నిశ్చితి కోరువక భ్రాతన్నిష్ఠురవచనముల నతం డిట్లనియెన్. 42

ఉ. ఉల్లములోన నీ చెడుట కోర్వక యెంతయు నొత్తి చెప్పిన
న్నొల్లవు ప్రాణమారుతము నొల్లనివానిక్రమంబున న్మహీ
వల్లభుఁ గానఁ బోయెద నవశ్యము నిప్పుఁ దొఱఁగి సజ్జనుం
డెల్లెడ నెట్టి యాప్తుఁ డగు నేనిఁ ద్యజించుట నీతి దుర్మదున్. 43

క. అని పలికి మ్రొక్కి వీడ్కొని, చనుదెంచి సభక్తి పూర్వసాష్టాంగంబున్
జననిం గొనరించి యాపెకు, వినిచె నిజాగ్రజుఁడు పరిభవించుటఁ దెలియన్. 44

చ. ఇటు వినిపించి రావణునకే నభియాతిగ నైతిఁ దల్లి నీ
నటు విను మింక రాఘవమహీశ్వరునిం గొలువంగఁ బోయి త
త్పటుకరుణాకటాక్షపరివర్ధితవర్తన నొందియుండెదం
గటకటపాటు మాని గజగామిని వే సెలవిమ్ము పోయెదన్. 45

క. అనవుడు భయ మందుచుఁ దజ్జనని కుమారకునిఁ గాంచి స్వాంతములోన
న్మనః పాటిక నిజభర్తవచనములు దలపోసి వీతసంభ్రమ యగుచున్. 46

శా. సంతోషంబు సుపుత్ర నీ కనుచు వాత్సల్యంబునం బల్కె నా
ద్యంతప్రీతిఁ గుమారుఁ గౌఁగిటికిఁ దీయం బొంగి యుర్వీశ్వర
కాంతారత్నము సీతకో ల్వడసి రక్షఃప్రాణవాతాశిభూ
కాంతు ల్రాము సలక్ష్మణుం గను మపేక్ష న్సంభ్రమాయత్తుఁడై. 47

మ. కరమర్థిం జని యాత్మదార సరమం గాఢోల్లసన్మందహా
సరమ న్వీడ్కొని రాఘవేశ్వరపదాబ్జద్వంద్వసందర్శన
స్థిరబుద్ధి న్నిజమంత్రు లెంతయుఁ బ్రపత్తి న్నల్వురుం గొల్వఁగా
వరపుణ్యుండు విభీషణుండు జలధివ్యాకీర్ణ మా తత్పురిన్. 48

చ. వెలువడి యంతరిక్షపదవి న్నవణోదధి సంక్రమించుచో
నలువురమంత్రు లిర్వురనుఁ దను గొల్వఁగఁ గొల్వుటోపలన్
బలువిడి యన్నతన్నరిభవంబొనరించుటఁ జెప్పుచుం గపు
ల్బలువురు గొల్వ నన్నరపాలకు పాలికిఁ బోవునంతటన్. 49

క. అంచిత మగు తద్రక్షః, పంచకము దనర్చె మిగులఁ బ్రాపితఁ దనుమ
న్వ్యంచించి రావణాధము, పంచప్రాణములు వెడలి పాఱె సుభంగిన్. 50

వ ఇట్లు చని. 51

క. రోధనిరోధము నీరధి, రోధముఁ జేతాసురావరోధ మధికసం
బాధముఁ బృథులాంగూలా, శ్వేధముఁ గపియూథ ముసురశేఖరు లెనరన్. 52

చ. కమఁగొని విస్మయంబును బ్రకంపము హర్షముఁ గ్రమ్మఁ గీశవా
హిని దరిఁజేరి రాఘవమహీపతి నారయుచున్న వేళ న
ద్దనుజకులాధినాథుల దితస్వవిరోధుల సాధులన్ జగ
జ్జనుతవాదులన్ హ్వాశవిహాసుల వారి విభీషణాదులన్. 53

క. రావణు వేగులవారలు, గావలయు వధించు డని కపులెల్లను ద
ద్భావము తెలియఁ మివారల, నేవురఁ బట్టికొని చనిరి నృపసన్నిధికిన్. 54

వ. తోడ్కొని చని తారకానికరమధ్యభాగభాసితుం డగు ప్రాలేయమయూఖుండు నుంబోలె సకలస్తవానరసైనికాంతరంబునం బ్రజ్వరిల్లుచున్న యన్నరేంద్రుం గనుం గొని సభక్తిసాష్టాంగదండప్రణామంబు లాచరించి రాక్షసోత్తములం గానిపించి మహాత్మా వీర లస్మదగ్రజాన్వేషణార్థంబు పరిభ్రమించు రావణుచారులవార లు గానోపుదు రిప్పంచకంబుఁ బాపాత్ముల నొందింతుమే యని పలుకునిజయూథుల వాక్యంబు లాలకించి కరుణారససాంద్రుం డగు రామచంద్రుండు తజ్జని వ్యారించి వారిం గాంచి 55

క. ఎవ్వరుపంపిన వచ్చితి, రెవ్వరు మీ రేమిపనికి నేతెంచితిరో
యెవ్వీటనునికి నిక్కముగా, నివ్వీటిలం దెలుపుఁడీ యనియె సస్మితుఁడై 56

తే. నగుమొగముతోడఁ గారుణ్యమిగుర వోడయు, రాముఁ డీరీతి నడిగినఁ బ్రణతుఁ డగుచు
భక్తిఁ గేల్మోడ్చి యిట్లని పలికె నొప్పఁ, బ్రానుగుణవిభూషణుండు విభీషణుండు.

చ. కవినుతకీర్తి యేను దశకంధరుసోదరుఁడ న్నమాత్యుం
త్రివరులు వీరు వీరనుమతింప భవచ్ఛరణంబు వేఁడి నీ
దవుదను సిద్ధపుణ్యజనతాంచితభూతి గడుం జెలిర్పఁగా
నవు నని యన్నఁ బాసి భవదంఘ్రులు గొల్వఁగ నిందు వచ్చితిన్. 58

క. రామునితో నెదిరిచి సంగ్రామము శివుఁ డైనఁ జేయఁ గాలేఁడు రఘు
గ్రామణి శరణుసొరుము సీతామణి నొసఁగి యని కడు హితంబులు సెప్పన్. 59

ఉ. బుద్ధులు సెప్ప నెవ్వఁడవు పొమ్ము మహాత్మ యెఱుఁగ కిట్లుసం
బద్ధపుమాట లాడెదవు ప్రాణము లైనఁ ద్యజింతుఁ గాని యా
త్మోద్ధతి తూల మన్ననిసమున్నతి సైఁచుట యెట్లు రావణుం
డిద్ధబలాఢ్యుఁ డేల యొకహీనవరు న్శరణంబు వేఁడెడిన్. 60

క. అని పలుచనాడి పరిభవ, మొనరించిన నతనియొద్ద నుండక నిన్నుం
గని కొలిచి బ్రదుక వచ్చితి, ననఘమతీ యే విభీషణాఖ్యుండన్. 61

తే. మాటలకు నెల్ల నోర్చి మామాట మింత, లేక యాతని బ్రదుకునకై కడంగి
యొత్తి చెప్పంగ నీరస మెత్తి బిట్టు, కాల దన్న నెపేఁద బెట్టు కాలదన్న ! 62

వ. అని సకరుణంబుగా నాత్మప్రవృత్తి సమస్తంబు నెఱింగించి భవద్భృత్యకోటిం
గలిపికొని రక్షింపు మని ప్రార్థించిన రాముం డతనిం గటాక్షించి కపులదెస నిరీక్షిం
చుటయు. 63

క. పగవానితమ్ముఁ డితఁడుం, బగవాఁ డగుఁగాక యెట్లు మైత్రి యొనర్పం
దగువాఁ డగుఁ గడు నికృతిం, దగువాఁ డగుఁగాక యనిరి తరుచరు లెల్లన్. 64

తే. అంత హనుమంతుఁ డితఁ డతిశాంతుఁ డింద్ర, జిద్విధాతాస్త్రవినిహతిఁ జిక్కియున్న
సమయమున రావణునిచేత సమయకుండ, నితఁడ కాఁడె నన్విడిపించె నిద్ధబుద్ధి. 65

క. జాతి కితఁ డసురుఁ డేని, నీతాత్ముఁ డెవ్విధమున నిందార్హుఁ డగున్
జాతిగిరి కడు విహీనుని,చేత మిగుల వలదు నిది ప్రసిద్ధము యనుచున్. 67

క. అనిలసుతుఁడు నుడివినయడ, లనుకూలము లగుడు రాముఁ డయ్యసురవరుం
గనఁగొని యభయం బొసఁగితి, ననుమానం బేల డాయ నరుదె మ్మనఘా. 67

చ. అని నెనరారఁ బల్కి యతఁ డానతుఁ డైనఁ గవుఁగిలించుచు
న్వినుము విరోధితమ్ముఁడవు నిన్గణించుట వింత గాదు న
న్ననిశరణంబు వేఁడిన జగత్త్రితయవాసులు మెచ్చ రావణుం
దునుమక తక్కుదు న్మిగుల దుర్మతికి న్శరణార్థి వధ్యుఁడే. 68

వ. అని యివ్విధంబున నభయం బొసఁగి కృపాతిశయంబున. 69

క. కలుషకలుషితాత్ముఁడు మొక్కలుఁ డగుభవదగ్రజన్ముకాయము నలిను
క్కలి సేసి యతనిపదవి క,కలుషమతీ నిన్ను విభునిఁ గావింతు దయన్. 70

వ. అని యతనిఁ గలిపికొని యామాత్యమిత్రుల గారవించి తన్ముఖమున శ
త్రుని బలపరాక్రమంబులు వినుచు ముద్దము న్నొందుచున్న వేళ నిభృతుఁడై. 71

వ. హనుమంతుం డిట్లనియె. 72

చ. కరము దురమ్మునర్చి దశకంఠునికంఠము లూడ్చి తత్సహో
దరునకు వానియేలెడుపదం బొనగూర్చుట యెంత పెద్ద నీ
కరయ విధాతగా దని తదంచితశాశ్వతసత్యలోకసు
స్థిరవిభవంబు నాశ్రితులఁ జేర్పఁగ నోపుదు వాత్మమెచ్చినన్. 73

క. అన విని భవత్సహాయం బున నాకుం గడఁగి తీర్పఁ బోలని కార్యం
బనఘా యొకఁడుం గల్గునె, యని యతని న్మెచ్చి రాముఁ డభినందించెన్. 76

వ. తదనంతరంబున సుగ్రీవాదులు రామచంద్రుఁ గరుణాసాంద్రుం డని పొగడిరి విభీష
ణుండును మంత్రిచతుష్టయసహితంబుగా సంతోషించె నంత రాముండు నిజాంత
ర్గతంబున. 75

క. అంభోరాశి గభీరము, గుంభితనక్రాదిజంతుఘోరము విపులో
జ్జృంభితకపివారము నిర్దంభస్థితి దీని నెట్లు దాఁటఁగ నగునో. 76

వ. అని కించిన్మీలితలోచనాలోచనుండై. 74

క. తుష్టి నుదధిఁ గొల్చి తదుపదిష్టసరణి గపికులాంబుధి న్దాఁటి మనో
భీష్టముఁ బడసెద నటుచుఁ బ్రహృష్టహృదయుఁ డగుచుఁ దలఁపు లిగురొత్తంగన్.

క. ఆరాముఁడు శుచియై దర్భాచితపత్రితాసనాసీనత నా
హారాంచత్స్వవిహారవిహారంబులు మాని జలధి నారాధించెన్. 79

ఆ. మఱియు భక్తియుక్తి మాసంబునఁ బయోరాశిఁ గుదురుపఱిచి రామవిభుఁడు
భావ మేకముఖముగా గావించి సదధికప్రౌఢి మెఱయ నిట్లు ప్రస్తుతించె. 80

క. సరిదోఘంబెల్లను దమి ససుఁడ వగు నిన్నుఁ జేరి సమ్మోదించున్
దరణిస్థితి భవదీయా, దరణంబునఁ గాదె నిలిచెఁ దలపోయంగన్. 81

వ. నీవు సుగుణరత్నాకరుండవు గంభీరుండవు కవిశ్లాఘనీయుండవు నపారుండవు భువన
ప్రశస్తుండవు నని మఱియు ననేకవిధంబులఁ బ్రస్తుతించి కరకమలంబులు ముకుళించి.

మ. మతి నాపైఁ గరుణించి యాత్మమహిమ సన్మార్గంబు దోఁప స్సరి
త్పతి నాపైనను నిర్వహింపు మనుచుం బల్మాఱుఁ గీర్తించి యా
నతుఁ డైనం గరుణించి రాముని జగన్మాన్యుం గనం బోఁ డప్పాం
పతి నిర్గంధుఁడె యాతఁ డంచు విబుధుల్ వైపై ప్రసంగింపఁగన్. 82

క. ఇటు పొగడి జలధినాథుం, డటుకన సాక్షాత్కరింపఁ దలఁపఁ డనుచు ను
త్కటరోషదీప్తుఁ డగుచుం గటము ఉదర నిల్చి ఘోరకార్ముకధరుఁడై. 88

శా. క్రోధోద్రేకమనోజ్ఞబాహుఁ డగుచున్ ఘోరాస్త్రముం బూని య
ప్పాథోరాశి హరింప నిష్ఠురకృతప్రారంభుఁడైన న్నభో
వీథి న్మాసె నినుండు తారకలు పృథ్వింగూలె నుల్లోకము
ల్బాధం జెందెఁ గులాచలంబు లొరగెన్ వ్రస్సెం జతుర్దిక్తటుల్. 84

శా. తన్మాత్రంబున నెట్టి పుట్టుటయుఁ బాథస్స్వామి భీతిం గడు
న్నమ్మానంబున రామచంద్రపదపీఠాగ్రాతుకాయత్తస
ద్భ్రమ్మాస్యస్థితి నొందెఁ గాని పటుభక్తిన్ వేఁడుచున్నాఁడటం
చు న్నజ్ఞావెఁగఁ బోవఁ డయ్యె జడరాసు ల్పాసుల న్నేత్రురే. 85

వ. ఇవ్విధంబునఁ బొడము భయాతిరేకంబున. 86

క. బడబాగ్ని వేఁడికి న్నడి,వడిమెను నే నిపుడు రామబాణాగ్నిఁ గడుం
జెడనె యని యతనిఁ జూడ, న్వెడలె జడధి మానసంబు వేగిరపడఁగన్. 87

తే. వెడలి తగురీతి మూర్తీభవించి జహ్ను,కన్యకా గౌతమీముఖ్యమాన్యనదులు
మూర్తిమంతంబులై తన్ను మొనసి కొలువ, నద్రిసారానుకంపరసాబ్ధిఁ జేరి 89

క. వెలవెలఁ బోవుచుఁ జనిరా,ముల సచ్చరణయుగమునకు మ్రొక్కి వినీతిన్
జలనిధి వచించె నృపవర, పలు చనివారలము కలఁగఁబడమె యలిగినన్. 0

క. ఏ దెలియ నెంతవాఁడ మ,హీమహిత్పవరా భవన్మహిమ బ్రహ్మసురేం
ద్రాదులు నెఱుఁగరు శత్రువి,భేది మదపరాధ మాత్మఁ బెట్టకు మింకన్. 91

క. ఈ యుదధి నెట్లు దాఁటుదు,నో యని తలపోసెదే యనవు బుధవిబుధ
ధ్యేయుఁడవమేయుఁడవు నా,రాయణుఁడవు నీవు మార్గ మడుగఁ గలయునే. 92

క. కట్టా యూరక నాపైఁ, గట్టలుక వహింపనేల కట్లుం జెట్లుం
గట్ట యొకఁడు కట్టక పోడ,కట్టునె మార్గంబు నన్నుఁ గడవఁగ మీరల్. 93

ఉ. సేతువు గట్టి రక్కసులఁ జీల్చి వధింపఁగ సేనతోడ నీ
వీతటి నేగు మంచు వచియించి సముద్రుఁ డదృశ్యుఁ డైనను
జ్జాతకుతూహలంబున నిశాచరజాతుల నిర్ధిదుక్షిసం
జాతులఁ గూల వేసె మును సాగరవేయఁగఁ బూను కోలచేన్. 94

వ. అయ్యమోఘబాణుండు తదనంతరంబున నిజసైనికుల నాలోకించి కార్యదశానిరూప
ణంబుగా నిట్లనియె. 95

ఉ. గట్టులఁ జెట్టులు న్వెతిచి కంధిపయిం బడవైచి యడ్డుగాఁ
గట్ట యొకండు కట్టిన సుఖంబున లంకకుఁ బోయి రావణుం

బట్టినఁ దింపవచ్చు నని పల్కిన రాముని భాషణంబులం
బుట్టినసంతసంబునఁ గపు ల్చెలరేఁగుచు నాడి రీగతిన్. 96

క. ఒకకట్టగాదు జలనిధి, సకలంబును బర్వతముల సంపిహితము చేఁ
తమఁ జాలునట్లు గాఁగం, బెకలింతుము మందరాదిపృథ్వీధరముల్. 97

క. అని పలికి మఱియు నిట్లని, రనఘా నీయానతిచ్చి నట్టులు సేయం
జనుఁగాదె సేతుబంధన, మొనరింత మటంచు సంభృతోత్సాహమునన్. 98

క. బలిముఖు లవ్వననిధికి, న్బలిమిఁ బొనరించి విష్ణుపతి కెఱఁగి కడున్
బలిమి మెఱయ నందఱు గ, బ్బలులం బెకలించి తే నృపాలు నాజ్ఞన్. 99

వ. నలు దెసలకుం జని రట్టిసమయంబున. 100

సీ. లవణవారాశిఁ గాలువచేసి యినుమాఱు దాఁటినపవమానతనయుఁ డొకఁడు
తాతకంటెను బలాతీతుఁ డీతం డని పొగడంగఁ దగువాలిపుత్రుఁ డొకఁడు
నుత్తరాశాపార మొకక్షణంబునఁ జూచి వడిరావలఁతి శతబలి యొకండు
మును శైలకూటంబు ములుకలై మోఁకాలఁ బగులఁజేసినఋక్షపతి యొకండు
దధిముఖుఁ డొకండు గంధమాదనుఁ డొకండు, నీలుఁ డొకఁడు సుషేణుఁ డన్వీరుఁ డొకఁడు
పనసగజగవయగవాక్షవినతతార, కేసరిప్రముఖులును దక్కినకపులును. 101

మ. విపులాభాగము సంచలింప విబుధు ల్వీక్షించి వర్ణింపఁగా
విపులాద్రు ల్పెకలించి తే నలుఁడు పృథ్వీనాథు నాజ్ఞప్తి న
క్కపు లారీతి దెచ్చి యిట్టి వసుధాగ్రావాళిఁ జేసందని
క్కా పయోరాశిని వైచి కట్టఁ దొడఁగెం గట్ట న్మహోజ్జృంభతన్. 102

క. తానేమేని సముద్రుని, పైనుంచిన ముంపఁ డగుటఁ బటుధరంబు
ల్పైనందె నలుఁడు సేతువి, ధానోన్ముఖుఁ డయ్యెఁ గడు నిదానము గాఁగన్. 103

వ. అప్పుడు. 104

క. ఒకతరుచరుండు పదిగిరు, లొకగిరిఁ బదుగురు వనాటు లొకవృక్షచరుం
డొకగిరిగా నిర్వహమునఁ, బెకలిచి తెచ్చి రతితుంగపృథ్వీధరముల్. 105

చ. కడుకొని వాలపాశములఁ గట్టి కుభృన్నిచయంబుఁ గీశు లి
ప్పుడు గొని తెచ్చు టొప్పె మును పూర్వసుధాశనులు న్సుధాశను
ల్గడఁగి పయోధిఁ ద్రచ్చి రది గాదని ఘోరసముద్ర మొక్కఁడొ
క్కఁడె తరువంగఁ బూని రనుకైవడి నెంతయు నద్భుతంబుగన్. 106

క. మన్నిటజమఁ బీఁప మర్కటనాయకు వేఁడి తరుచరులు జలదములం
గ్రొన్నెఁ దొడ్కొని తెచ్చుచు, నన్నగముఁ ద్రవ్వి తెత్తు రొగి ఘనగిరులన్. 107

వక్రముగ నప్పయోధి నొకకట్టు యొనర్చితి రీయశంబు సు
స్థిర మయి ముజ్జగంబులఁ బ్రసిద్ధికి నెక్కదె సర్వకాలముల్ 117

క. అనఁ గపులు భవదనుగ్రహమునఁ గాక కడు స్సముద్రమున సేతు వొన
ర్పను మావశంబె నీమనమునఁ దలఁచినకార్య మది యమోఘము గాదే. 117

వ. అని సన్నుతించి రంత నంతవృత్తాంతంబును దశముఖుండు దెలిసి కలంగి శుకసార
ణాదిమంత్రులతో మంత్రాలోచనంబు గావించి లంకాపురంబు సురక్షితంబు గా
వించికొని యుండె నద్దివసావసానంబున. 119

క. నూత్నమతి స్వనురాశిఁ బ్రయత్నంబున డాఁచికొన్న యాతనిఁ బోలెన్
రత్నాకరుండు నంబరరత్నము లోఁగొనియె నసఁగ రవి గ్రుంకెఁ దగన్. 120

వ. ఇట్లు కువలయవ్యథాకరకరగ్రహణంబు చాలించి యినుండు శాంతుం డగుటయు.

—: సాయంకాలాదివర్ణనము :—

సీ. పడమటిదొరసానిఫాలభాగంబున సవరించు కాశ్మీరజన్మ మనఁగ
సంఫుల్లలోధ్రకసానుసముచితాస్తమహీధ్రగైరికధాతు వనఁగ
రవిరథపతనకారణవిభాజితసరస్వన్మధ్యబాడబవహ్ని యనఁగ
బ్రాహ్మణార్ఘ్యోదకబాణప్రభిన్నమందేహదేహోత్థశోణిత మనంగఁ
గోకనదపద్మరాగబంధూకబింబశుకముఖాశోకతామ్రకింశుకలసత్ప్ర
వాళసురగోపజతుచక్రవాకపక్షకాంతి నిరసించి సాంధ్యరాగము రహించె. 122

తే. సాంధ్యరాగప్రథుచ్ఛవి సాగరోదకంబు కీలాలపద్ధతి గానిపింపఁ
జెలఁగి యసురులు తద్రక్తసేవ సేయఁ దోఁచి రన నొప్పె నిరులు ప్రదోషవేళ. 123

చ. అనుపమదుఃఖపంకమలినాంగలతాపరిశుద్ధయై నవా
ననవనజంబు వాడఁ గరివ స్తనచక్రము లుబ్బువీడఁ బ
ద్మిని విషసంగ్రహం బనుమతించె మనోజశిలీముఖాహతు
ల్దనికిన నోర్వలే కవుఁగదా యినుఁబాసినదోషహేతువుల్. 124

తే. విష్ణుపద మనువిఖ్యాతి వెలయుచుండుఁ, గాన నయ్యెడఁ దోఁచునఖంబు లనఁగఁ
గ్రమతరపద్మరాగప్రకాశమాన, తారకంబులు నభమున బూనటిల్లె. 125

వ. అంత నొకింతసేపునకు. 126

తే. రాజు చనుదెంచుచున్నవార్త విని పుష్కరాంగన నిజాననాంబుజ మలమికొనిన
భ్రమరకంబుల నెగయించి ప్రబలెననఁగఁ, జీకటులు వాసిప్రాగ్దిశ చెన్నుమీఱె.

క. పవలు కువలయము రవిచే, నవయుట విని యమృతసేచనము సేయ సుధా
నవకలశ మెంతయు న్సనుయవిధాత్రుం డెత్తె నన హిమాంశుఁడు వొడిచెన్. 128

క. త్రిజగత్ప్రవిశదమగు తద్ద్విజరాజోదయము మనమున నధికరాజీవ
వ్రజము ముడింగె భువనముల, భుజంగవిలసన మడంగెఁ బో భువనములన్. 129

తే. ఇట్లు చంద్రోదయం బైన నెల్లదిశల, వెన్నెలలు పిండి చల్లినవిధము గాఁగ
దెలిమడుంగులు పఱచిన తీరు దోఁప, నిండికొనెఁ గపు రెంతయు గండుమీఱి. 130

చ. హిమకరదీధితు ల్దరికి హేమమయం బయితోఁచు వార్ధితో
యమునపయిఁబీచు వీచులసహాయమునం జనుదెంచు మించునై
త్యమలయమారుతంబు మలయం బులినంబుల సేతుబంధన
శ్రమ ముడుగంగ భావిసమరస్థితు లాడుచు నిద్రఁ జొక్కఁగన్. 131

వ. హనుమదాదులును రామలక్ష్మణులమహాయశంబునుం బోని యప్పండువెన్నెలబైట
నారాజశేఖరుం బరివేష్టించి నిద్రాసుఖం బనుభవించి రంత.

క. ద్విజసత్ఫలాప్తిఁ జెఱిచిన, వృజినము పచ్చక్రనిరతవేధాపటుహే
తుజనితదోషము రాజు ప్రభఁ జెఱిచె నన నిందుఁ డల్పభానుం డయ్యెన్. 133

వ. తదనంతరంబున. 134

సీ. తారాపథాంగన దాల్చుతారావళిఁ గనుపట్టునాయకమణి యనంగ
జారచోరవికారకారియై పాంథుల నటునిటు నడిపించునౌషధ మన
నాకమహీరుహప్రాకటపూర్వదిశాశాఖఁ దగు గుళుచ్ఛం బనంగఁ
గమలారికరబిసకాండము ల్మేసెడి యభ్రధునీచరద్ధంస యనఁగ
మిత్రుఁ డరుదెంచుట సహస్రపత్రములకుఁ, బద్మభవుఁ డెఱిఁగింపఁగఁ బంపినట్టి
భర్మలేఖ యనంగఁ బ్రాగ్భాగమునను, వెలసె నెంతయుఁ దెలువెక్క వేగుఁజుక్క

మ. అవనీజాగ్రము వార్ధి గట్టితిరి లెం డాలస్య మింకేల యో
యవనీజాటకులార! యంచు నవనీజాళు ల్వడి న్లేపుచు
న్నవనం గోకిలకేకికీరముఖనానాపక్షిసంఘాత మె
క్కువిధి న్మ్రోసె విశాలతుంగపటుశాఖాశాఖికాగ్రంబులన్. 136

వ. అంత. 137

క. ఉదయగిరి మండె నన నెం, పొదవిన ప్రాగ్దిశ విశస్వదుదయము రక్త
చ్ఛదమై ప్రతాప మాకృతి నొదవి యరుగుదెంచుచున్నదో యన మెఱసెన్. 138

వ. ఇట్లు లోకచక్షురాహ్లాదకరుం డై భువనచక్షుం డుదయించుటయు. 139

ఉ. అంతకమున్న రాముఁడు సహానుజుఁ డక్కపికోటితోన ని
ద్రాంతము నొంది కృత్యముల నన్నిటిఁ దీర్చి దినేంద్రపుత్రజుం

భాంతకవాయుపుత్త్రులను భల్లుకనాథసుషేణముఖ్యవి
క్రాంతుల సేతుకృద్ధిముఖప్లవగాదులఁ గాంచి యిట్లనున్. 140

క. దేవాసురవరులకెల్ల భావంబున నైన నిట్టి పని యొనరింపం
గా వలఁతులె యుదధి మహోగ్రావంబులు నిల్పె మీరు కపులే తలఁపన్. 141

వ. అని మఱియు ననేకవిధమధురవచనంబుల నగ్గించి కార్యవచనంబులు ప్రసంగించి. 142

శా. గర్జాభీమపలాశవాగ్విహితలంకాద్వీపము న్మ్రింప వి
స్ఫూర్జద్బాహుతరంగవానరబలాంభోరాశి దుర్వారమై
న్నిర్జేయస్థితి నేరువట్టులు మది న్వీక్షింపుఁడీ రంచు స
చ్యార్జ్ఞమూర్తవపుర్విలాసుఁ డగు గోత్రానాథుఁ డామోదుఁడై. 143

చ. అనవుడుఁ బావనిప్రముఖు లాతనితో భవదీయసేనపై
దనుజులమీఁది కాలిమిను దాఁకఁగ నేర్చిన యుద్ధయాత్రకీ
వనుమతి చేసినప్పుడ జయావహమై నయమార్గ మట్లు గా
వున నెడసేయ కిప్పుడె తపుం జన లంకపయి న్మహీశ్వరా. 144

వ. అని పలికి యమ్మహాయోధు లాయోధనంబునకు నాలోచించుటయు నక్కపి
యూథంబు యూథపాధినాథులై విబుధవరూథినీవిధానంబున గండు మిగిలి
రాకానిశాకరోదయంబునకుం బొంగు నీరాకరము ననుకరించి పొలిచి వెలుం
గ సత్త్వరసంబునం బరస్పరాహ్వాననినదంబును దేవదుందుభిధ్వానంబును జలధితరంగ
విరావంబును నేకీభవించి దిక్కులు పిక్కటిల్లె నంత రామలక్ష్మణులు వనచర
స్కంధస్యందనాధిరూఢులై సప్తజిహ్వుండును ద్విముఖంబులు దాల్చినచందంబునఁ
బ్రతాపంబికిమే నైనవిధంబున సేనామధ్యం బలంకరించి మహాకపివీరపరివృతులై
వంశకరుం డగుఖరకరునకుం గరంబులు జోడించి యంబుధిం బూజించి ప్రార్థించి
యాంగికంబు లగు శుభనిమిత్తంబులకుఁ జిత్తంబులు హృష్టపరాయత్తంబు లగు
చుండ విభీషణుండు మంత్రిచతుష్టయసహితుండై యంతరిక్షమార్గంబునం బఱతేర
సేతుమార్గంబున లంకాపురాభిముఖులై నడువం దొడంగి రయ్యెడ. 145

క. మీఁకెదురువచ్చు దనుజానీకంబుల యుబ్బు విరియ నిజమిత్త్రునన
ట్లాకడలిఁ దరంగంబు లనేకంబులు వెడలి విఱుగు నెదురఁ గపులకున్. 146

సీ. అంబుధి నుభయపార్శ్వంబులఁ గనుఁగొని నడికట్టువడుచు నడుచువారు
మేరమీఱి జగంబు ముంచక పాథోధి నిలుచు టబ్రం బని తలఁచువారు
జలనిధికుక్షి నిశాచరు లెట్లు వసించిరో యనుచు నూహించువారు
మేటికడలి యుద్ధిమేఖలామేఖలాకృతిఁ గహించె నని తర్కించువారు

దర మొకింతయు లేక సాగరములోన, నీఁదులాడుచు సేతువు నె
మించి చనువారుఁ జాల వర్షించువారు, నైకపు లాహావాపేక్ష

వ. ఇవ్విధంబునం గపిచమూసాగరంబు సాగరంబుపై నరవడించి చను

క. వారిధితరంగశీకర, వారంబుల లెక్కవెట్టవచ్చు ధరణి నె
వ్వారికిఁ బ్లవగచమూవి,స్తారమ్ము గణింపవచ్చుఁ జాతుర్యమునన్.

చ. అని ఖచరు ల్నుతింపఁ బ్లవగౌఘ మహోఘరయంబు మీఱఁగాఁ
జనిచని వార్ధి ఖేయము నిశాచరగేహము లంక దవ్వులం
గనుఁగొని క్రోధఘూర్ణితముఖంబగుచున్ దరిఁ జేరి రాక్షస
ధ్వని విని యంత నిల్చెఁ బ్రవిదారణకేళికి నుత్సహించుచున్.

చ. నిలిచినసేనఁ గాంచి తరణిప్రియపుత్త్రుఁడు చేయి వీచి పే
రెలుఁగున లంకచుట్టు దిగుఁ డింక భయం బొకయింత లేదు వా
బలిముఖు లన్ని శాటకులపాలకుప్రోలికిఁ బోవ నొక్కట
న్వ్రాలువడి యెక్కి రన్నతను వేలము సద్విటపీవిశాలమున్.

వ. ఎక్కుటయు నక్కుధరగహనంబు ధరాసయం బయ్యును నప్పు
కాననసంయుతంబునుం బోలె నయ్యవసరంబునఁ గపులు

సీ. అరివినిర్భేద్యసుస్థిరతరామోఘయద్వారబంధకవాటతతులు గలిగి
పృథులోగ్రదంభోళిభిన్నతుంగోరుదృషత్త్రపుస్థగితకుడ్యములు గలిగి
దనుజసంరక్షితదారుపాషాణయంత్రప్రకల్పితగోపురములు గలిగి
శిఖరసంస్థాపితాసితక్షురికాఖరకాచశకలసాలగణము గలిగి
యుగ్రబాణబాణాసనయోధవీర,బృందధనధాన్యఘాసరసేధ్మసలిల
కఠినబహువిధయంత్రసంగ్రహనిశాచ,రప్రమాషితఘోరదుర్గములు గ

క. భృంగాకర్షితమదమా,తంగపవనజవపరిహాసితసుగంధరో
త్తుంగరథవీరభటసే,నాంగచతుష్టయము గలిగి యతులితభంగిన్.

క. ఒప్పుచునుండు లంకాపుర, మప్పుడు వీక్షించి ప్లవగు లధికౌత్సుక్యం
బుప్పతిల దానిచుట్టుం, గప్పికొనిరి ఘోరవార్ధికైవడి నంతన్.

చ. విడిసినసేనయందున్ దనుజభీషణహుంకరణంబు మీఱఁగా
విడిసెడుసేనయు న్విడియ వేఁకనొందెడుసేన సేతువు
న్విడిచెడుసేన పొంగెడుమనస్థితితో వెసఁగట్టు నెక్కఁగా
వడలెడుసేన యయ్యె రఘువీరున కెంతయు సంతసంబుగన్.

వ. ఇట్లు లంకాపురంబునకు దెసలం బుడమి యీనినక్రమమ్మునం గ్రమ్మికొనిన యుత్తరచ
రవాహినీవిస్తారంబు. 157

క. నాపుత్రికవ్యాదయుపరీతాపము వాయు నని తలంచి ధరణీసతి హ
ర్షాపరిమిత గా మేనం, గాపట్టెను పులకపటలశోభం దనరెన్. 158

ఆ. వె. అట్లు లంకయను మహాలతాభవనంబు, నలమికొనిన వనపలాశన మున
మున్న సేనఁ గాంచి యుల్లంబు సంతోష, మగ్న మగుచునుండ మనుజవిభుఁడు. 159

వ. సోదరసహితంబుగా వనచరస్యందనావతరణంబు గావించి త్రికూటప్రాంతసమ
విశాలరమణీయప్రదేశంబున యోధవీరసహితంబుగా సమాసీనుండై విభీషణుం
డయ్యయిప్రదేశంబులు వేఱువేఱ నిరూపించి చూపుచున్న యవసరంబున. 160

క. కోపారుణలోచనుఁడై, భూపాలవరుండు లంకఁ బొడగను టొప్పెం
దూపుల నేర్పక తత్పురిఁ, గాపుల నేరుపను భంగి శోభిల్లంగన్. 161

క. అంత దశాస్యుఁడు తద్వృత్తాంతము విని చింతనొందు తదవసరమున
స్వాంతోత్సవము పెరుఁగఁగఁ దత్సంగతి యగు శక్రజిత్తు తా నిట్లనియెన్. 162

ఉ. ఏఁ గలుగ న్విచార మది యేటికి మర్త్యుల నాప్లవంగుల
న్లేఁగఁగఁ గాంచి బెబ్బులి చలింపఁగఁ జేసి వధించునట్టు లా
భోగుల నగ్రుఁడై ఖగవిభుండు హరించెడునట్లు ద్రుంతు వా
రేఁగలు గంధసింధురము నేను ననుం జెనకంగ నేర్తురే. 163

చ. అను నెడ ఖడ్గహస్తుఁడు ప్రహస్తుఁడు రావణుతోడ నీకుమా
రున కెదు రెవ్వ రక్కపివరూథిని నొక్కఁడ త్రుంగఁ జాలుఁ ద
క్కక పిశితాశులుం గడఁగి కీశుల నాశము సేయ నేర్తు రీ
వనితరసాధ్యవిక్రముఁడ వాత్మ విచారము సేయ నేటికిన్. 164

వ. అని బరవసంబు సేసి పల్కె నంత నతికాయ మహాకాయ మహాపార్శ్వ సుపార్శ్వా
దులును బ్రధనసన్నాహసముత్సాహపోషణంబు లగుభాషణంబు లాడుచుండియు నద్ద
శాననుండు గండుమిగిలి భండనంబునకు లెండు లెం డనుడు సన్నద్ధులగు దండ
నాయకులు తత్క్షణంబ. 165

సీ. కాలజీమూతసంకాశదేహంబులఁ గాలురక్కసులఁ జెక్కంద్రఁ గూర్చి
కాటుకకొండలకైవడి నిరసించు కరులమొత్తము లనేకములు గూర్చి
పృథుల నేమ్యారవబధిరీకృతదిగిభకర్ణంబు లగు తేరిగములు గూర్చి
పవమానవేగంబుఁ బరిహాస మొనరించు నశ్వోత్తమము లసంఖ్యములు గూర్చి

భూరికాహళభేరికాఘోషనినద, మాకసము దీటుకొనఁ జతురంగబలము
నివ్విధంబున సమకూర్చ నేపురేఁగి, యవనియానినక్కైనడి నతిశయిల్లె. 166

క. ఠంకారసహితస్థితి భటు,హుంకారమ్ములను మదమహోత్కటగజకృ
ద్ఘీంకారము లనురథను,ట్టంకారములుం జెలంగె సైన్యములోనన్. 167

వ. ఇట్లు కట్టాయితంబై రాక్షసబలంబు కయ్యంబునకుఁ గాలు ద్రవ్వుచుండె నటి
యెడ. 168

క. రాముఁడు సాధుపిక్కై కా,రాముఁడు పరిహాసికపాళురాముఁడు సీతా
రాముఁడు దర్పితశత్రువి,రాముఁడు కరుణారసాభిరాముం డగుచున్. 169

— అంగదుని రాయబారము —

క. వాలికుమారుఁ గుమారుం, బోలినబలశాలిఁ గాంచి భూమివిభుఁ డెదన్
జాలి మిగుల నిట్లనియెను, వాల ముడిగి రాయబార మంపెడుబుద్ధిన్. 170

క. వృత్రారిపుత్రపుత్ర జగత్త్రయశత్రుఁ డగు పంక్తికంధరు దుశ్చా
రిత్రుఁ గని నీవు వాగ్వై, చిత్రి మెఱయఁ బల్కు మేను జెప్పినభంగిన్. 171

ఉ. వాయునుజుఁడు నేను గవనంబునఁ గ్రుమ్మరువేళ జానకిం
దోయజనేత్రఁ దెచ్చితివి దొంగతనంబున దానఁ గోపము
త్ప్రేయిత మైన వానరబలాంబుధితో జలరాశి దాఁటి యం
హోయుతు నిన్నుఁ గూల్పఁగ మహోగ్రత నీపురి కేగుదెంచియున్. 172

చ. మతిఁ గరుణోద్భవం బగు తమాసుతఁ దోడ్కొని వచ్చి తప్పునే
పితిఁ గరుణింపు మంచు నను జేరినఁ బ్రాణముతోడఁ గాతు న
ద్ధతిఁ దొడరం దలంచిన విధాత్రునిఁ జొచ్చినయేని మచ్ఛరా
హతి మరణంబు సిద్ధము కటా! తగు నే బలవద్విరోధముల్. 173

వ. అని యేనాడినచందంబున నేర్పడం బలుకు మని చెప్పి మఱియుం దగినవచనంబు
లుపన్యసించి. 174

క. లంక విభీషణునకు నక,లంకధృతికి నొసఁగి నిశ్చలనమతిశాపుం
బంకజముఖి సీతనొసఁగి, శంకవిడిచి ప్రతుకు మనుము సారవిచారా. 175

చ. అనవుడు నంగదుఁడు భవదస్త్రహతిం గడనొచ్చి భీతి ని
న్నని శరణంబు వేఁడ టకుఁ గా దశకంఠుఁడ యుండు వచ్చు నీ
వనుపమ సత్కృపానిరత మైనమనఃస్థితి రావణాసురుం
గన నను బంపనేల నము ఖంబున కేయు రాయబారమే. 176

క. అని నీపనుపున నేదురా, డినతనూజుఁడు మిమ్ము నని వడిం దక్షిణ మ
హావనచరుఁడు లంకపై కుఱికె, నసురనాశకరధూమకేతువు నాఁగన్. 177

ఆ.వె. వినయ మెసఁగ రామవిభునకుఁ బ్రణమిల్లి, యతనియాజ్ఞఁ గొని రయంబు మెఱయ
లంక మీఁది కిట్లు లంఘించి పంక్తికం, ధరుసభాంతరంబుఁ దఱియ నరిగి. 178

ఉ. ఇంచుక యేని భీతిని వహింపనిచిత్తముతోడ రావణుం
గాంచి నయంబు మీఱ దశకంధర! రాముఁడు రాయబారము
ర్థించి భవత్సమీపమునఁ దేటపడం దగుమాట లాడఁ బు
త్తెంచిన దూత నాటఁ జనుదెంచితి నప్పని నిర్వహింపఁగన్. 179

క. అంగదుఁడ భూతముల కహి, తాంగదుఁడం బటుభుజాబలాంగదుఁడను నీ
వంగద నొందక తెలియవి, నంగదవయ్యా మదీయనయవచనంబుల్. 180

ఉ. రాముఁడమోఘగోచరుఁ డరాతిభయంకరుఁ డమ్మహాత్ముతో
సామ మొనర్చి బ్రహ్మకు నసాధ్యుఁడవైన మను మొప్పుఁ గాక, సం
గ్రామము సేయువాఁడ సుముఖస్థితి రామున కేను భూమిపు
త్రీమణి నీ నటంచుఁ గుమతీ చెడనొప్పునె దుర్వివేకివై. 181

తే.గీ. లంక నీతమ్మునకు నకలంకమతి వి, భీషణునకిచ్చి రఘుకులభూషణునకు
జనకజాత సమర్పించి శరణుసొచ్చి, కంటె బ్రదుకుఁదెరువొకండుఁ గంటె చెపుమ.

వ. అని తెగనాడి రాముండు తానాడినచందంబున నాడుమని యానతిచ్చినవాక్యంబు
లన్నియు నగ్గడించి వెండియుం దగిన వచనంబులు ప్రసంగించి యంగదుండు. 183

క. సింధువు దాఁటియుఁ గరుణా, సింధు వగుచు నీగతి న్వచింపఁ బనిచె ద
ర్పాంధత చన రామునితో, సంధి యొనర్పు మిది మేలు సకలంబునకున్. 184

క. మహిపుత్రి నొసఁగి రాము, న్మహితాత్ము శరణు సొచ్చి మనుట కడుఁ దగు
న్బహుపుత్రమిత్రనాశన, మహాహవం బైరింప నెట్టు లగుఁ గలహమునన్. 185

క. కడు సంధి గోరి బలవం, తుఁడు దూతం బనుప వానిఁ ద్రోచిన మిగులం
జెడుటు నిజము ఘనవైద్యునిఁ, గడపినరోగిక్రియఁ బంక్తికంధర వింటే. 186

ఉ. నావుడు నవ్వి క్రొవ్వి కపినాటు నిశాటకులాధినాథు న
న్నీవిధి నొవ్వఁ బల్కె దక్షహీనులు మర్త్యులదెంత మున్నను
ర్వ్యావలిఁ దోలియాడిన మహాబలశాలికి నాకు లంకయున్
దావదవంబు వానరపతంగముల న్వడి మ్రింగ కుండునే. 187

తే.గీ. బుద్ధి చెప్ప నీకెవఁడు బుత్తెంచినాఁడు సీ కి, బుద్ధి వచ్చు నిన్నుఁ బొలియఁజేయ
నని దురుద్ధతిన్ దశాననుఁ డంగదుఁ, దిట్టి చంపు మనియె భటులతోడ. 188

ఉ. అట్టియెడ న్మహోగ్రబలుఁ డంగదుఁ డింద్రుని మన్మఁ డట్లు ద
స్పట్టఁగవచ్చు రక్కసులఁబట్టి నఖంబులఁ దన్ముఖంబులన్
బిట్టు వగిల్చి వాలమున బెట్టు నొగిల్చియు మెట్టమెట్టి య
ట్టిట్టు విదిర్చియు న్వడి ననేకులఁ జంపె విలాసశాలి యై. 189

క. ఇటులు పొలియించి రోషో,త్కటుఁ డగుచున్ దశముఖుండు గనుఁగొనుచుండం
బటురక్తసిక్తనఖుఁడై, తటుకున రామావనీంద్రు దరికిం జనియెన్. 190

ఆ. వె. చని నమస్కరించి సకలంబు వినిపించి, రఘుకులాబ్ధిచంద్ర రాఘవేంద్ర
చేటుమూఁడెఁ బంక్తిశిరునకు నతఁ డేల, యాలకించుఁ బథ్యమైనదాని. 191

వ. కావున ననుమానంబు మాని భవదీయదివ్యచిత్తంబున నవధరించిన తెఱంగున మాకు నాజ్ఞాపింపుం డని కపులం గఁపికొని పలికిన మందస్మితసుందరవదనారవిందుండై.

క. రశ్మినిభదీర్ఘవాలుర,నశ్మసదృక్కర్కశాయతాంగులనతిను
త్నశ్మశ్రులు విలాసుఁడు ఖర, రశ్మికులజనాథుఁ డాదరము నిండారన్. 198

చ. రవిసుతముఖ్యభూరుహచరప్రభుసత్తములార మీర లా
హవమునకుం దిరం బగు ప్రయత్నము సేయుఁ డనంగఁ బొంగి నిం
గివగుల వాలదండములు గేల నమర్చి విదిర్చుచు న్రఘు
ప్రవరుని యానతిన్ క్షితిధరద్రుమవార్ధ్యముదగ్రపాణులై. 194

ఉ. క్రుద్ధులు బాహువిక్రమసమృద్ధులు వానరు లంత యుద్ధస
న్నద్ధులు గాఁగఁ గాంచి నరనాథుఁడు రాముఁడు లక్ష్మణుండు ను
ద్యద్ధమహోద్ధహాస్తులు ముదంబున నిల్చిరి వెన్నుదన్ని య
ట్లుద్ధతి మోహరించిన మహోగ్రబలు ల్కపు లల్క పెంపునన్. 115

—॥ యుద్ధారంభము ॥—

శా. పాషాణంబులు వైచి కోటములఁ దీవ్రప్రక్రియన్ అర్చి వి
ద్వేషం బుప్పతిల న్మహీరుహము లుద్వృత్తిం బ్రయోగించి దీ
ర్ఘోపాకర్కశవాలసంహతిఁ గనత్కేతువ్రజం బూడ్చి య
ట్లీమద్భీతులు గాక లంకపయి నక్ష్వోష్టాటు లాటోపతన్. 196

సీ. సోఁము లస్త్రశస్త్రంబుచే రల్చి కోటము ల్గోటుపంక్తులఁ బగిల్చి
నఖములచే హస్తినఖములు గోరాడి వరగోపురముల గోపురము లడఁచి
వాటంబు లైనకవాటము ల్విదళించి గసులచే వెదలురక్కసులఁ గూల్చి
యశ్మశాలలను గండాశ్మము ల్చెండించి దంతావళముల దంతములు పెటికి

స్యందనమ్ముల నురుతరస్యందనముల, గ్రుందఁ గడుమోచి దానవమందిరావ
రోధవ్యూహయావరోధనిర్ఘోషు లరిజిగీషు లత్యంతరోషు లీశు లిట్లు. 197

వ. చలము సాధించుటయు నప్పష్టంబునం గలవా గావులకుం బొంది హాహాకారంబు
లొనర్చి రంత. 198

క. మండిపడి దశాననుఁ డు, ద్దండులఁ దనదండ నున్న దండాధిపుల
స్యందనమునకు వరూథిని, గండుమిగుల నమపుఁ డని సగర్వస్ఫూర్తిన్. 199

క. వ్రశములు వితికి శరశా,లాప్రముఖాలయములం గలఁచి యాడిరి ప్ర
క్షిప్రప్రక్రియఁ దరుచరు, లప్రతిహతవిక్రమాఢ్యు లగుచుం బెలువన్. 200

క. తరసము మెసవెడు మాశాం,తరసము గడు మేలుగాను తలపోయంగా
తరసమ్మత మది కలహం, తరసమ్ముఖులఁ దరుచరులను దఱుముఁ డురవడిన్. 201

వ. అనుటయుం జేర్చి చతురంగసైన్యంబులం దత్సైన్యాధిపతులు జన్యంబునకు నాయి
కొలుపుటయుం. 202

చ. నరభుజు లాహవోపకరణంబులతో రణభేరికోరుభాం
కరణముతో మదేభతురగంబులతో రథరథ్యకోటితో
నురవడి గర్జితాభ్రములకోయనఁ గోయని యార్చి తాఁకి ర
క్తరుచరవర్యులం బసమదారుణచర్యుల ధైర్యధుర్యులన్. 203

వ. ఇవ్విధంబునం దలపడుటయు నంతకుమున్న కట్టాయితంబై యున్న యుగ్వానర
బలంబునుం బొంగి నింగివగులు సింహనాదంబుతోడం దాఁకుటయును. 204

చ. తరుశరకోటుల న్నఖరదారుణకుంతములన్ ధరేంద్రము
ద్గరముల వాలఖడ్గముల దంతకుఠారములన్ దృషద్భయం
కరపరిఘంబుల న్నగనికాయము గన్గొని పొంగఁ గ్రుంగ న
క్తరుచరమానుపాదు లతిదర్పితులై సమరంబొనర్పఁగన్. 205

ఉ. మేదశ్చాదము లస్థిగము లిషుర్మింబులున్ ఛత్రస
త్కాదంబంబులు ఖేటకూర్మములుఁ జక్రగ్రాహసంకీర్ణము
లోత్కాదండాహులు రక్తవాహినులు రక్షోరణ్యసంభూతము
ల్యాదోనాథునిఁ జేరె మస్తకశిలావ్యాప్తంబులై యత్తఱిన్. 206

లయగ్రాహి.

పిచ్చిచననొచ్చియయియచ్చరులు మెచ్చఁగమహోచ్చనగముల్విఱిచి తచ్చియసురాళిన్
మ్రచ్చులముచ్చులను జొచ్చికడు వచ్చరము పెచ్చు పెరుఁగన్నిగుల క్రచ్చొ[illegible]

వ. సమరతలంబున. 486

గీ. దనుజశరకోటి తను నంత దాఁకకుండ, నాఁగి యమ్ములు శోణితం బానకుండ
నుచ్చి చనవేసి యసురుల నుక్కడఁచెఁ, గడురయంబున నొక్కనిఁ గడపకుండ.

గీ. రాముఁ డరుణాంబుజముఖాబ్ధి రాముఁ డగుచుఁ, దక్కునిశాచరుల నెల్ల నుక్కడంచి
మీఱి యంతకుమును మూర్ఛ దేఱియున్న, యనుజుఁ బొడఁగాంచి కపిరథం బవతరించి.

వ. గజగవయగవాక్షగంధమాదననలనీలసుషేణపనసవినతతారకుముదవేగదర్శివృషభమైంద ద్వివిదసుగ్రీవాంగదపవనతనయకేసరిశతబలిదధిముఖప్రముఖవలీముఖపరివేష్టితుం డై సముల్లాసంబునం దేలుచుండె నంత నక్కడ లంకాపురంబున నెట్టకేలకు నొక్కింత భయంబు దక్కి దశముఖుం డాప్తుల నవలోకించి. 489

క. హరికులిశము హరిచక్రము, హరువరశూలమును గ్రౌంచహరుశక్తియు నా
హరిభీకరతరదండము, సరిగా శ్రీరామచంద్రుసాయకములకున్. 490

చ. ప్రథితయశుం డ్రఘూత్తము నృపాలశిఖామణి నోర్వలేక ధై
ర్యధనుఁడ నయ్యు వైరినిచయంబులు నవ్వుచు సంతసింప వే
పథువు జనింప లంక కిటు పండవిధంబునఁ బాటిపచ్చితి
స్థితి విపరీతవృత్తిఁ బ్రభవించిన యాపద కింత యేటికిన్. 491

వ. అని పలికి విషాదవేదనాదోదూయమానమానసుండై యూరకుండి. 492

ఉ. నాయనుజన్ము నస్యశిపిఁ బ్రబలార్చికకాండజన్ము నా
గాయుతసత్త్వుఁ బర్వతసమానసదృశోగ్రవిశాలవక్త్రర
క్తాయతచారునేత్రునిఁ జితామహదత్తవరప్రలబ్ధని
ద్రాయతుఁ గుంభకర్ణుని నదభ్రవిదారితకుంభికర్ణునిన్. 493

క. బోధింపుఁ డాతఁ డైన విరోధివరూథిని వధించి రూఢధృతి మను
ష్యాధములఁ గూల్చి లవణపయోధిఁ గలపి మరలివచ్చు నొకనిముసమునన్. 494

గీ. కాన నాతమ్ము సుఖసుప్తి నూనియున్న, వాని మేల్కొల్పి యాహవవర్తనంబు
నిర్వహించి మదీయసాన్నిధ్యమునకుఁ, దోడికొనిరండు నా నరాదులు కడంగి. 495

క. ఘననిశ్వసనోచ్ఛ్వసనో, ర్జనితధ్వనిభయము నతినిశాచరమయము
న్మన జాగ్రత్స్థితికలచయమ్ము, జని కాంచిరి కుంభకర్ణశయననిలయమున్. 496

వ. కనుంగొని యతిప్రయత్నంబున. 497

క. చేరి ఘటకర్ణకర్ణ, ద్వారంబులు రెండు బిట్టు వ్రయ్యలు గాఁగన్
ఘోరనారినాద ఘనశంఖారవము లొనర్చి నిద్రఁ గదలకయుండన్. 498

సీ. కృష్ణవర్త్మనిశాతకీలలఁ గ్రాఁగిన తైలంబు కర్ణరంధ్రములఁ జొనిపి
ధారాకఠోరవిస్తారసంహతులచే ముఖమున నంటంగ మొనసి మోఁది
మత్తదంతావళమల్లంబుఁ గొనితెచ్చి కడువడి నురమున నడువఁ జేసి
పలువురు బలియురు పనివడి తెచ్చి గండాశ్మజాలంబు దేహమున విసరి
గదల నడిచియుఁ బొడిచియుఁ గఱచియు మత్తశౌండిన్యయై స్వానలానరింప నిట్టునట్టు
పొరలి వెస నావులించుచుఁ బొంగ నీల్గి, యొట్టకేలకుఁ దెలివొంది యిట్టు లనియె.

గీ. దివిజరిపులార నన్నుఁ బ్రబోధింపనేమి, యవసరం బిప్డు వచ్చె దశాననుండు
రోషవిషమునందు బలవద్విరోధ మెదిరి, తెచ్చికొనియెనో తెల్పుఁ డదియునుఁ గాక.

క. కులభూషణుఁడు విభీషణుఁ, డలఘుగుణుఁడు కుశలియే కదా యతఁడున్నం
గలుగదు విపరీతత్రుటా, కులపాటిపుడేల మేలుకొలిపితిరి నను. 501

గీ. పెద్దనిదుర వేఁడ్చి పెద్ద వరం బిచ్చె, నెడల బలిమి నెవ్వరేని దెలుప
నాఁడు పెద్దనిదుర వీడ్కొందుఁ దద్దాన, లేచెనేని జగము నేఁచునని యె. 502

వ. అట్లు గావున నూనమహాశ్వాసికసుషుప్త్యవస్థుండ నగు నాకు యుద్ధంబున మరణంబు
సిద్ధం బని పలికె. 503

సీ. ప్రకట నిద్రాభంగ రక్తలోచనము లంగారధానికల ప్రకారమొంద
నలసత దోఁపంగ నావులించిన వక్త్రము ద్రిగహ్వరలీల ననుకరింప
నాఁకలిగొని వెన్ను నంటిన జఠరంబు బడబాగ్నిజలరాశి కీడు గాఁగ
దంతసందష్టనోద్గతభైరవారావ మభ్రంబు వెట్టి లేసినట్లు గాఁగ
నున్న కుంభకర్ణు నుజ్జ్వలానలవర్ణు, నగ్రభాగమునకు నరుగ వెఱచి
పార్శ్వముల వసించి ప్రణుతించి యల్లన, నిట్టు లనిరి దైత్యభృత్యవరులు. 504

క. ఓ యన్న మహాకార్యము, మీయన్నకుఁ గల్గి నిన్ను మేల్కాంచుపఁగ న
త్యాయతమతిఁ బుత్తెంచిన, నీ యున్నెడ కరుగుదెంచి నిపుణత మెఱయన్. 505

క. నిను లేపితి మన్నవలన, వినఁ దగు కార్యంబులెల్ల వెందు బుభుక్షా
వినివృత్తి గాఁగ మాచే, సిద్ధవంటకములను దృప్తిఁ జెందు మనవుడున్. 506

క. కాల్యములు దీర్చి గంధసుమాల్యాన్వితుఁడై శాకసూపసహితధవళగు
ల్యాల్యాన్నకుధరములు దధి, కుల్యంబులతోడ భక్ష్యకోటులతోడన్. 507

వ. పాతాళవివరంబునుం బోని నిజకంఠబిలంబునం దిగవైచి వెండియు నక్కుంభకర్ణుం
డనేక మార్జారమాంసంబులు నపరిమితకుక్కుటపలలంబును నిశేషమహిషామిషంబు
ను బహువిధ్యగతరసంబులు నసంఖ్యాతసూకరక్రవ్యంబును నగణితమాసవపిశితంబును

నధికగోధికాధాతువును సమధికమూషికపిండికయును నతిరిక్తవిహంగమకాళికయును
సమగ్రజలచరపలలంబును రాశీకృతతప్తోప్తంబును మెసవి. 508

క. శతఘటశోణితమున్ దశ,శతఘటమద్యమును బంచశతఘటమధువున్
శతఘటగోఘృతము న్నవ,శతకఘటతైలంబుఁ ద్రావి సమసుం డగుచున్. 509

మ. విపరీతాకృతి ఘోరహుంకృతిఁ గులోర్వీభృత్సదృక్షోన్నతిం
జపలప్రకియు రాజపద్ధతిని జెచ్చెన్ భ్రాతృవీక్షాప్రలో
లుపబుద్ధిం జనుకుంభకర్ణు ఖలశీలుం గాంచి నిశ్చేష్టమై
కపిసంఘంబు భయార్తిఁ జేరెను రఘుశ్రేష్ఠనాథుసామీప్యమున్. 510

వ. మహోద్భుతలంకాసముద్భాసభూతంబు చందంబున నరుగుచున్నం దదీయవికృతాకృతిం గాంచి వెఱగి పఱచు తనుచరుల నోడకుం డని ధనుర్ధరుండును సత్వయుండు నగు పూషవంశభూషణుండు దోషాచరకులవిభూషణుండగు విభీషణుం గనుంగొని.

మ. తనఘోరాకృతిఁ గాంచి భీతమనుమున్ ధైర్యంబు పోల్పెదఁ జే
తనరాహిత్యులపోలె వానరవరుల్ త్రస్తాత్ములై యుండఁ గే
తనవస్త్రంబులు జానులగ్నములుగా దర్పంబునం బోవు నీ
తనిపే రెయ్యది నాకుఁ దెల్పు మరియంత్రప్రక్రియావేదివై. 512

వ. అనుటయు నమ్మహాత్మున కప్పునీతాత్ముండు. 513

గీ. వీఁడు రావణు ననుజుండు వీనిపేరు, కుంభకర్ణుండు నిద్రగూరియుండు
సమధికబలుండు సమరప్రచండుఁ డాజి, సుస్థిరభుజుండు నాకగ్రజుండుఁజుండు.

క. నాగరకుల నెఱుఁగక ని,ద్రాగరిమను నాఱునెల లితఁడు పవళించున్
జాగరమొకదివసము నాఁ, డోగిరము భుజించు సుఖసమున్నతిఁ గాంచున్. 515

వ. మఱియు నద్దివసంబున దివిజులకు నజేయుండు నేఁడు ప్రజాగరణదినంబు గామి యెఱింగియు దశకంధరుండు భవదీయదివ్యాయుధశిథిలీకృతదేహుండైనవాఁడు గావునం గార్యాకార్యవినిశ్చయబుద్ధిహీనుండై ప్రబోధింపబంచినం దెలివినొంది యగ్రజాలోకనాయత్తచిత్తుండును మత్తుండునై చనుచున్నవాఁ డిన్నండేని యన్యులచేత బలాత్కారంబున బోధితుం డగు నాఁడ మృత్యువుం జెందు నని బ్రహ్మవచనంబుగలదు గావున నితండు నీకశ్రమసాధ్యుండుగాని దుర్విభేద్యుండు గాఁ డని పలికి వెండియు నక్కుంభకర్ణు జన్మబలపరాక్రమప్రకారంబులు వేఱువేఱ విన్నవించి మఱియు ను. 516

క. కపులవెలుపు దీటుగ నిక్కపుదైత్యుఁడు గాఁడు కాష్ఠకల్పితవిచర
త్కపటాకృతి యని చాటం బనుపు మనవుడు మెచ్చి నృపుఁ డనుజ్ఞ యొసంగన్.

క. నీలుఁడు సమస్తసైన్యము, నాలోకించి కపివీర యసురుఁడు గాఁడు
ద్వారమగు దారుయంత్రము, పోల స్వాకృతంబు గూల్చఁ బతి యీప్రతిమన్.

చ. అనవుడు గ్రమ్మఱంగ విపినాటచమూనివహంబనీకసా
ధనమయి నిల్చె నట్లు కపథప్రవిలేఖనతుంగమస్తుఁడై
ఘనభుజవిక్రముండు ఘటకర్ణుఁడు దీవనఁ బ్రోలు పుణ్యకా
మిను లురుసౌధకూటముల మీఁద వసించి పయి న్విడుర్వఁగన్. 519

మ. చని కాంచె న్నవరత్నకీలితమనోజ్ఞస్తంభసంవాహమున్
గనదభ్రంకషకేతువాతవిచలద్రాగాంబుజవ్యూహమున్
మనుజగ్రాహము వైరిభీకరచమూమందీకృతోత్సాహమున్
దనుజవ్యూహముఁ బంక్తికంధరమహోదంచత్సభాగేహమున్. 520

క. కని యూపాక్షవిరూపాక్షనికుంభాద్యనిమిషరిపుసంభృతగేహం
బని వారితుఁడై చేరం, జని యగ్రజు చరణసరసిజములకు మ్రొక్కెన్. 521

క. మ్రొక్కి నిలిచిన సహోదరు, నక్కునఁ గదియించి యాదశాస్యుఁడు గడువెం
పెక్కిన రత్నపుగద్దియ, గ్రక్కున నిడఁ బంచెఁ గుంభకర్ణునకుఁ దగన్. 522

వ. పనుచుడు బలిమియగు పలువురు రక్కసులు వెక్కసంబునం గొనివచ్చి యిడిన
సమున్నతంబగు పసిండిగద్దియ సుఖాసీనుండై హుంకృతుల నభోభాగం బవియించు
చు నన్నం గనుంగొని. 523

ఉ. తేఁపరులై నిలింపు లవధీరణ చేయఁదలంచిరో విరో
ధింపుము నష్టదిక్పతులు దేఱిరొ సూర్యముఖగ్రహాళి వే
ధింపఁ దలంపు గల్గెనొ సుధీజనమేను సమీరసన్నబో
ధింపఁగ నేమి కారణము తెల్పుము నిద్దుర దీరకుండఁగన్. 524

చ. కలఁచుమనో పయోధి యుదకంబులు బొదరిగాఁగ మేదినిం
గలఁపుమనో నభంబు పటుగంబఁ బ్రోఁచి దినేంద్రచంద్రుల
న్నిలుపుమనో నభోయసరణిం జనకుండఁగ నాకుఁ గార్యముం
దెలుపుము గాక నావుడు నతిప్రమదంబునఁ బొంగి యిట్లనున్. 525

క. మనదు సోదరియగు శూర్పణఖ నిరపరాధఁ బట్టి ప్రసభంబున ఘో
రనిశాతశరాహతి ముక్కును గర్ణయుగంబుఁ ద్రెవ్వఁగోసి రాఘవుఁడున్. 526

వ. జనస్థానంబున నుత్తమక్షత్రియకులుం డొకం డా ప్రియానుజప్రియాసహితుండై ప్రవర్త్తి
ల్లుచున్నం గనుంగొని సహింపక. 528

చ. అనఘమతు ల్చతుర్దశసహస్రనిశాచరసైన్యయుక్తులై
ఘనఖరదూషణాదు లసమానబలు ల్చని పోరొనర్చి త
ద్ఘనశరవృష్టిఁ బ్రాగినఁ బడంపడి కంచన సేయ గాలవే
వినఁగుచు వానిభార్యఁ గొని తెచ్చితి సీతఁ గజాతలోచనన్. 528

క. పటుకపటంబునఁ దత్సతిఁ, బటుకునఁ దెచ్చుటయు నతఁడుఁ దమ్ముండును న
త్కటశోకవేగమున మర్కటులం గూర్చుకొని కడలిఁ గడచెను వెడలన్. 529

క. అర్కకులుఁడు రాముఁడు కోట్యర్కవిభుం డాదివిష్ణుఁ డనుచు మఱియు న
మ్మర్కటులు దివిజు లనుచుం, బేర్కొని వెఱపించె నను విభీషణుఁడు గడున్. 530

క. ఏనుమహీసుతరామున, కీనని పలుకుటయుఁ గోప మెక్కి వసుమతీ
జానిశరణంబు వేఁడఁగ, దా నప్పుడు వెడలిచనియెఁ దనమంత్రులతోన్. 531

వ. తదనంతరంబున రాముం డనేకవానరసైన్యపరివృతుండై సేతుమార్గంబున లంకా
పురంబుపై విడిసి ప్రహస్తధూమ్రాక్షమహానాదమహాకాయాకంపనాదుల నరాదుల
ననేకుల సంహరించి మించి పరాక్రమించి యున్నవాఁ డదియునుంగాక. 532

క. హనుమంతుం డనఁగా నొక, వనచరుఁ డవనిసుత వెదకవచ్చి బలియుండై
వనము నింతయు మును విక్రమమున నక్షునయుఁ జంపి లంక గాలిచి పోయెన్. 533

ఆ. మఱియు నింద్రజిత్తు మహితోరగాస్త్రాళిఁ, జిక్కువడనిరాజసింహుఁబోలెఁ
గడఁగి యేసిపోయి కాందిశీకుండనై, జరగివచ్చితిని నిజంబు దెల్ప. 534

క. నీవు సహజబలశాలివి, గావున బోధింపవలసెఁ గయ్యమున ధరి
త్రీవరుఁ గూలిచి నాచే, జీవన వడయు మన నతఁడు ధృతిచలనుండై 535

గీ. కొంతతడవూరకుండి యక్కుంభకర్ణుఁ, డన్నఁ గన్గొని వింటె దశాస్య వింత
గాదె నరవానరులు వార్ధిఁ గడచు టెల్ల, భంగిఁ దలపోయ దురము శుభంబు గాదు 536

మ. మునుముం దాటకసంహరించి భృగురాముం గెల్చి తోడ్తో విరా
ధునిఁ జక్కాడి ఖరాదులం జిదిమి మత్తుండైన మారీచునిం
దునుకల్సేసి బృహన్మదాంధునిఁ గబంధుం గూల్చి యేకాశుగ
మ్మున వాలిం బడవేసినట్టి రఘురాముం డేల మర్త్యుం డగున్. 537

క. సముఁడైనవానియెడ సా, మము దానం బధికునెడల మత్తునియెడ భే
దము హీనుఁడైనయెడ దండము సెల్లుఁ దెలియుము [illegible] 538

క. సింధురసైంధవరథభటు, బంధువితతి తెగినఁ గాంచి పదపడి రిపుతో
సంధి యొనర్చిన నదియు, స్సంధియుగుం గాన మొదల సామము వలయున్. 539

క. లోకంబునకుఁ ద్రివిష్టప, లోకమునకు మన మొనర్చు లోపంబులు ము
ల్లోకములకు హితుఁడగు నా, లోకేశుఁడు మున్న శేషలోకేశునకున్. 540

మ. వినయం బొప్పఁగ విన్నవించుటయు నవ్విష్ణుండు దైవారి న
ద్వినయం బొప్పఁగ బ్రహ్మతో దశరథోర్వీనాథపుత్రుండనై
దనుజధ్వంసన మాచరింతునని యంతర్ధానముం జెంది య
వ్వినుతాకారుఁడు రాముఁడయ్యె బలవద్విద్వేష మింకేటికిన్. 541

క. మును విని యంతయు నారద, ముని వినిచెం దద్వచన మమోఘము నాకుం
జనువు గలిగి తెలిపితి యో, జన సేయుము వలదు దుర్విచార మనవుడున్. 542

ఉ. పక్కున నవ్వి పెద్దయని పాడి దలంపక నిండుఁగొల్వునం
బెక్కులు ప్రేలి నాఁడ విబ్బుధము సంతసముంద నట్టినీ
యెక్కుడుసోదరుండ విది యెట్టివినీతులు చాలుఁజాలు నీ
వెక్కుడ సంగరాంగణ మదెక్కడ నిద్దుర పొమ్ము పొమ్మిఁకన్. 543

చ. వెనుఁగొను భీతిచే మును విభీషణుఁ డెంతయు నొత్తిచెప్పె నా
తని దొకచిన్నవెట్టి హితంబుగ నీదొక పెద్దవెట్టి యా
తనిక్రియ నన్ను దాటినకతంబున బింక మెఱుంగకట్టి వీ
రునినిను లేపునాదొక విరుద్ధపువెట్టిగదా తలంపఁగన్. 544

క. రాముఁడె వలమురిదాల్పు వ, లీముఖు లవ్వేల్పులైన లిబ్బిపడఁతి సీ
తామానినియైనను నను, సామంబే నొల్ల నెట్లు సంగ్రామమగున్. 545

వ. అది యట్లుండనిమ్ము నిద్రాసక్తులు నంగనాసక్తులు భోజనాసక్తులును సంగ్రామం
బున కర్హులుగా రీవధికనిద్రాసక్తుండవు భోజనప్రియుండవు భయభ్రాంతుండవు
గావున నీసహాయం బే నొల్ల నెల్లభంగి సమరంబున విరోధుల వధింపక తక్కుమనే
యని పలికి మొగంబు గంటువెట్టుకొని యూరకున్న యన్నం గనుంగొని కుంభకర్ణుం
డు తనమనంబున. 546

క. దుర్ణయుఁ డితఁడు వినీతవి, నిర్ణయవాక్యములు వినఁగ నేర్చునె యనుచున్
ఘూర్ణితలోచనుఁ డగు ఘట, కర్ణుం డిట్లనియె నన్నకర్ణము లలరన్. 547

చ. తెగని సుషుప్తిచేఁ బలికితిం గలహాం బకుభం బటంచుఁ ద
ప్పుగొనకు మిద్ధతేజితి స్ఫుల్లపు లెంతటివారు వైరులం

దిగిచి క్షణంబులోనఁ బగ దీఱ గ్రసించెద మేనఁ బ్రాణముం
డిఁగ వసుధాతనూజ వరనాథున కీయఁగ నీయకొందు మే. 548

క. బాణకృపాణపటుతను, త్రాణంబులు వలదు బాహుదర్పమున రిపు
ప్రాణములు గొందు మూర్ధా, ఘ్రాణం బొనరించి కుంభకర్ణు ననుపుమా. 549

వ. అనుటయు సంతసించి. 550

క. వాలి నడిచి కపుల రవిజు, నేలించిన భంగి నిన్ను నేలించెద దై
త్యాలి రిపుఁ దునిమి యనుచుం, బ్రేలునఁట నృపుండు మన విభీషణునొద్దన్. 551

వ అదియునుంగాక. 552

క. నిద్రితుఁడవు నీవధికభ, యద్రుతుఁడను నేను నగుట నహితబలం బ
త్యుద్రేకము నూపెను న, య్యుద్రిచరావలి వధింప నరుగు మనవుడున్. 553

సీ. శరశరాసనకవచస్యందనాదిరణోపకరణముల సజ్జగించి
యపజయం బెఱిఁగించు నమితతూర్యధ్వనులకు నపశకునములకు వెఱవక
శూలంబుఁ జేదాల్చి శూలికైవడిఁ బొల్చి పురజను లొప్పరనఁ బొగడుచుండఁ
గతిపయభయదరక్షస్సైన్యయుక్తుఁడై తనదునిద్రాభంగమును విరించి
తనయువాక్యములను దలపోసి మరణంబు, సిద్ధ మగు టెఱింగి చింతలేని
మానసంబుతోడ దానవేంద్రునిచేతఁ, జావుఁ గోరి వెడలె సమరమునకు. 554

క. వడిఁ బుర మిర్విధమున వెలు, వడి పనివడి కలహమునకు వచ్చె నీ వాఁ డె
క్కుఁడితండని కపులచ్చెరు, వడి చూచుచు నుండి కొంతవడికిం దమలోన్. 555

ఉ. నీలుఁడు చెప్పినట్లు రజనీచరరూపకకాష్ఠపుత్రిగాఁ
బోలును గట్టిబొమ్మఁగని పోఁడిమి దూలఁగ నేల రామభూ
పాలుఁడు దీనిఁ గూల్చు నని పల్కుచు నుల్కుచుఁ జూచుచుండ నా
భీలుఁడు కుంభకర్ణుఁడు విభీషణపూర్వజుఁ డాత్మయోధులన్. 556

క. తలకడచి దావదహనము, చలిచీమల నేర్చుపగిది సర్వకపులఁ గొం
దలమందఁ గుంభకర్ణుఁడు, లలి మ్రింగఁదొడంగెఁ బ్రవిపులముఖుం డగుచున్. 557

వ. భీషణాటోపంబునం గనిమసంగి వనచరులం దిగిచి యహార్యగుహాకుహరసదృశం
బగు నిజబంధురకంధరసుషిరంబునం జాఱ విడుచుచున్నం గనుంగొని. 558

చ. పనివడి వానరుల్ పనసపంటికిఁ జీమలు చుట్టినట్లుగా
మునుకొని గంధభద్రగజము న్వడి నీఁగలు మూఁగులాగునం
బెనఁగొన నబ్బలిష్ఠుఁడు కుభృన్నిభమూర్తి విదిర్చి వెండియుం
గొనకొని బొక్కఁ జొచ్చె రఘుకుంజరు లక్ష్యముఁ గాంచి పొక్కఁగన్. 559

క. అద్రిచరావలి తనపై, నుద్రేకము మీఱ వైచు నుర్వీరుహభూ
ధ్రాద్రిప్రకరములు పృథు,చ్ఛిద్రము లొనరించి దనుజసింహుఁడు మఱియున్. 560

సీ. పలువుర బలియుఁడై పట్టి యుద్వృత్తిఁ దిగమ్రింగి వక్త్రంబు దెఱచి యార్చు
మఱియును వేఱొకమాఱు వేవుర ముద్దగావించి మేనునఁ గలయ నలఁచు
నొకమాఱు నూర్వుర నొగి శూలమున గ్రుచ్చి కావిక్రొన్నెత్తురు గ్రాగ్రేఁచు
నింకొక్కసారి యనేకుల నేకులకైవడి మూఁకంబుగా విదుర్చు
నివ్విధంబున దానవుఁ డేచి విలయ,సమయసమవర్తిసమవృత్తిసముదమూర్తి
సమయఁ జేయుచు సమరవసుమతి విడిచి, పాఱిరి వనాటు లసుర లేపారి మూఁక. 561

చ. సమరము సేయఁ జాలక వెసం బఱవెత్తెడు సేనఁ గాంచి రో
షమహితుఁ డంగదుండు రభసంబున నడ్డమువోయి శౌర్యవా
క్యములు వచించి వానరులఁ గ్రమ్మఱ నాజికి నాలుకొల్ప నొ
క్కమొగి ద్రుమంబులన్ దనుజు కాయము గప్పిరి దాన నంతయున్. 562

క. లింగము మాలూరదళా,లిం గప్పిన కైవడిం జలింపక యతఁడో
లిం గముల నతికి మ్రింగఁ దొ,డంగిన ద్వివిదుండు గడు బెడంగగు లీలన్. 563

ఉ. రక్కసు పెన్నురం బురుధరాధరకూటము వైచి యార్వఁగా
నక్కపి నాత్మఁ దుక్కుమెఱనున్ని జదేహహతిం బగిల్చి యా
చక్కటి వానరోత్తములఁ జక్కడఁపం గని మారుతాత్మజుం
డొక్కయహార్య మద్దనుజు డొక్క చిరుంగఁగ వైచె వైచినన్. 564

క. తద్ధతి కించుకపోలి దు,రుద్ధతి నకుంభకర్ణుఁ డుద్ధవిడి సమి
త్సద్ధతి చెడి మూర్ఛిల్లి బ,లోద్ధతు హనుమంతు నేసె నురుశూలమునన్. 565

సీ. అలంబుమాని వాతూలబాలుఁడు నేల వ్రాలిన నీలుఁ డుద్వేలుఁ డగుచుఁ,
బాపాత్మ నిలు నిలు పాఱిపోకు మటంచుఁ బాషాణపటలంబుఁ బఱపఁ జేయ
నది పిండిగాఁ జేసి యతఁ డున్నెడ గవాక్షనలవృషభాదు లనలసదృశులు
తన్నెదిరింప నందఱఘోరహుంకారమునన పాఱఁగఁ జేసి వనచరాలి
బిట్టు చుట్టుముట్టి పీనుఁగుపెంటగా, వించుచున్నఁ జూచి విహ్వలించి
యాత్మసేన నిట్టు లలయించునే యుద్ధ,రాత్ముఁ డనుచు వాని కడ్డమేగి. 566

క. వాలిసహోదరుఁ డురుతర,శైలంబున వైవ దానిఁ జక్కాడి వడిన్
శూలము విసరుడు నదివా,తూలసుతుఁడు మూర్ఛదేఱి తునుకలు సేయన్. 567

క. శూలంబుఁ గేలఁ దాల్పని,శూలిక్రియం బేర్చి రాక్షసుఁడు తపనజు ను
త్తాలాద్రికూటమున మూ,ర్ఛాలసుఁ గావించెఁ గపిబలాంబుధి గలఁగన్. 568

వ. ఇట్లు లంకామలయాచలకూటపాటనంబున సమ్మూర్ఛితుం గావించి యక్కపికులుంగు లేని
పట్టిం బట్టుకొని భుజంబునం బెట్టుకొని. 569

క. లంకాభిముఖుండై చను, లంకానాథానుజుం దలంకక శౌర్యా
లంకారుఁడు హనుమంతుఁడు, హుంకారముతో నెదుర్చ నూహించి మదిన్. 570

క. ఇనజుఁడు విగ్రహమునఁ దేజమునన్ తను దాన తెలిసి యరుదెంచు నరా
దను మోసపుచ్చి యీతం, డనితరభేద్యుఁ డని తలఁచునంతట్రిలోనన్. 571

ఉ. అన్నకుఁ జూపువేడ్కఁ హరిదశ్వసుతుం బృథుగాఢమూర్ఛితుం
గ్రన్ననఁ గొంచుఁబోవు ఘటకర్ణునిఁ గన్గొని పౌరభామ ల
త్యున్నతసౌధభాగములనుండి సుమంబులు పైవిదిర్చి రా
పన్నత వానరుల్వివిధభంగుల నేడిచి రార్తనాదులై. 572

గీ. అంతఁ గుంభకర్ణు నంసభాగంబునఁ, బుష్పమాలికయును బోలియున్న
రవిసుతుండు తేటి రక్కసుచే నిట్లు, కట్టుపడితిఁ దప్పెఁ గార్య మనుచు. 573

క. లోసంతాపము నొందుచు, నాసమయంబున విభీషణాగ్రజు చెవులు
న్నాసికయును మొదటికిఁ దెగఁ, దీసెన్ ఖరనఖరదంతతీవ్రత మెఱయన్. 574

క. ఉక్కుం జేవయు చలయఁగ, ముక్కుం జెవులుం దుఁగఁ ద్రుంచి ముదితాత్ముండై
దిక్కుంజరములు మ్రొగ్గఁగ, నక్కుంజహితాత్మజన్ముఁ డవనిక నతికెన్. 575

చ. పృథివికి శాతకుంభమహిభృచ్ఛిఖరాగ్రనివారిత పింగదృ
క్పృథుకము దాఁటు మాడ్కి నసువ్యాప్తపుటభేదకోటి నెంతయుం
బృథుగతిఁ జెంగలించి ప్లవగేశుఁడు కీశులభీష్టతాప భూ
మిధవుల రాఘవేంద్రుల సమీపముఁ జేరెఁ గరంబు మెచ్చఁగన్. 576

ఉ. అంతటఁ గుంభకర్ణుఁ డవురా విపరీతపు వానరంబు ము
క్కంతయు రక్కఁపోయె నిఁక నన్నుఁ గనంగొనఁ బోవఁజాల నా
గొంతుకగ్రోవి నమ్మసలి గ్రోఁతిని వైచెదనంచు శోణితా
క్రాంతశరీరుఁ డాతుణమ క్రమ్మతిమొ మ్రనణ మాచరింపఁగన్. 577

చ. మిగిలినవానరాలి దిగ్రమింగఁ దలంచెడు కుంభకర్ణుని
న్మిగిలి నరాదు లుద్భట సమిత్ప్రసితాత్ములు పోనొర్ప రాఁ
దగిలినకిన్క మర్కటనితానము దార్కొని తద్బలంబులం
దగిలి నటించె నద్భుతవిధంబున నెత్తుట నీఁదులాడుచున్. 578

తన సైన్యము దైన్యముఁ గనుఁగొని రోషావేశుఁ డగుచుఁ గుంభశ్రవసుం
డనివారితుఁడై మర్కటములను గారించుటను చూచి లక్ష్మణుఁ డలుకన్. 579

శా. జ్యానాదస్తనితంబు నిష్ఠురధనుష్టంకారనిర్ఘాతము
గ్రానేకాంబకవృష్టి మర్కటమహోద్యచ్చాతకామోదము
ర్వీనాథానుజధూమయోని ఘనమూర్తిం గుంభకర్ణాద్రిర
క్తానూనోత్సము ముంచె దానవవ్యాదబ్జామోదహీనంబుగన్. 580

చ. ప్రకటబలుండు రాముఁడును బాణపరంపరఁ బెల్లు ముంప మ
త్తకరికి సిళ్ళు సూపిన విధంబున నున్మదలీల శాత్రవ
ప్రకరము నైజసైన్య మనుపాడి దొఱంగి కరంబు సాఁచి యం
దికొని గ్రసింపఁజొచ్చె నవధీరణఁ గ్రోఁతుల దైత్యజాతులన్. 581

వ. అక్కైకసీనందనుండు రామలక్ష్మణభయంకరాస్త్రవహ్నిజ్వాలాపిహితుండును వి
నాశితస్వసైన్యుండును విదారితనాసికాకర్ణకోటరుండును నిరాయుధుండును నిరవధి
కాయోధనశ్రముండును నయ్యును జలింపని ధైర్యంబున. 582

క. కరి తుంగమడువు సొచ్చిన, కరణి న్మందరము జలధిఁ గలఁచుపగిది ని
ర్జరముఖుఁ డరణ్యమేర్చు ప్రకరణంబున నలఁచెఁ గుంభకర్ణుఁడు కపులన్. 583

క. కట్టలుక నిట్లలంచుచుఁ, గట్టిడి యగునట్టి కుంభకర్ణుఁడు గనిగొం
గట్టెమర విభీషణుఁ డోఁ, బుట్టువు నంచద్గదావిభూషితు డగఖిన్. 584

చ. కనుఁగొని తండ్రి కుందకు వగం దనుజాన్వయమంతరింప నుం
డ నిలుపువాఁడ వీవ నరనాథు దయ న్మము నెల్లఁబాసిపో
తి నని మనంబునం దలఁపఁ దీరదు మర్జనులైన బంధుల
న్మనమును రోసి నిత్యసుఖమున్ జిరకీర్తియుఁ జెందఁ జెల్లదే. 585

క. నీకటు పలు విసని యప్పుశ్రీకరుఁ డగు దశముఖుండు చెడుట నిజము సు
శ్లోకుండ వీవిధంబున, శోకింపఁగ నేల తొలఁగి చూడుము నన్నున్. 586

వ. అని పలికి తనకు నమస్కరించి యథోముఖుండను నిరంతరబాష్పసలిలధారాపరిపూ
రిత లోచనుండునై యూరకున్న విభీషణు ననునయించి యతనిం దలమిగిలి. 587

క. చని వానరు లడ్డము సొచ్చిన వారల నింత సరకుసేయక రాముం
గని యిదె వచ్చితిఁ గలహంబునకు రా రమ్ము తొలఁగి పోవకు మనుచున్. 588

చ. పొగరున నిన్నెదిర్చి సరిపోరుట జన్మఫలంబు పోరిలోఁ
దెగితిన యేని వెండియును దేజము నొంద జనించి నీమొదం
బగు గొని గెల్తు నందు నినుఁ బట్టి జయింపఁగఁ జాలనేని పొం
దుగ నినుఁ జేరి బంటు నగుదు న్వినుమిట్లు ప్రతిజ్ఞపట్టితిన్. 589

క. ఏను మనుజమాత్రుండన, గాననికాఁబోలు నింత గర్వించెదు నీ
తో నెనసి పోరవచ్చిన, యేను దనుజమాత్రుఁడనె రహిం దలపోయన్. 590

క. సర్గస్థితివిలయములు నిసర్గముగాఁ గలుగు నింద్రజాలుఁడవు గదు
న్నిర్గుణుఁడ వనుచు డాయు ధ,నుర్గుణసారణ విభుఁడు దనుజపతితోడన్. 59

క. నీకంఠము దునిమి మహో,ద్రేకుండగు రావణు న్వధించెద నిక ము
ప్పోకటఁబోయినఁ జెల్లను, మీకని దశరథసుతుఁడు సమీకోన్ముఖుఁడై. 592

సీ. ఘటకర్ణ సముదీర్ణ కర్ణ కోటరములు పటుపత్రులకు మనికిపట్లు చేసి
పావకర్మనేత్రరూపము లిక్కిలి ఱఱచుగా శరపూరితములు చేసి
రాక్షసముఖగహ్వరంబు నానాజిహ్మగములకు వాసయోగ్యంబు చేసి
దశకంధరసహోదరశరీర కాంతార మతులబాణకదంబయుతము చేసి
కైకసీపుత్రు హస్తశాఖలను ఖగనివాసములు చేసి మఱియు నవ్వాసవారి
ఘోరవక్షఃకవాటంబుఁ గ్రూరసార,సంబులకుఁ దావు చేసి రోసంబు మిగుల.

క. వాని గలుగు వాలిం బడ, నేసిన యస్త్రమును దానికెక్కుడయగుబా
ణాసారంబున మంచుమ, నాసురపతి నొచ్చియును మహాగ్రహుఁ డగుచున్. 594

క. గొదకొని వైరిబలంబుల, వదనంబున వైచికొనుచు వానరనికరన్
గదగొని కదనంబునఁ దం, గడిసెం గాలాంతకప్రకారము గాఁగన్. 595

వ. కదిసి భయంకర సింహనాదంబు గావించుటయును సహింపక. 596

క. హస్తిసమగ్రబలుఁడు కృత,హస్తుఁడు వాయవ్యశరనిహతి దనుజుబ్రహ
ద్ధస్త్రము ద్రుంచుటయుఁ బరిభ్రస్తంబై పడియె గదయు జర్జరితముగన్. 597

చ. గదయును బాహుదండమును ఖండములై పడ నొండుకేల ను
న్మదుఁడయి సాలముం బెఱికి మానవనాథుని వ్రేయఁబూనుడు
న్నదురనిభేంద్రసాయకముఁ బెద్దయు వేడుక నారిఁ గూర్చి నిం
డఁదిగిచి తత్కరంబును బడ న్వడినేసె నమోఘవేగుఁడై. 598

క. శరయుగమున ఘటకర్ణుని, కరయుగముం గూల్పఁ జెల్లగానవియుసమి
ద్ధరణిఁ బడి చదిపె నసురో,త్కరముం గపిబలము నద్భుతస్థితిదోఁపన్. 599

క. శాఖారహితమహోన్నత,శాఖిప్రక్రియ దశాస్యసహజుండు దురా
శాఖిలమానసుఁ డగుచువి,శాఖనిభుం గవిసె రామచంద్రు న్నింగన్. 600

క. పదహతులన్ ధరణి వియ,త్పదమున్ హుంకృతులఁ గ్రక్కదల బద్దలుగా
నెదిరించి యిట్లు గపియడు,గదనవిశారదుఁడు సమధికబలోద్ధతుఁడై. 601

క. ఏనొకరుండన వైరులఁ, బూని వధించెదనటంచుఁ బోయి రిపులచేఁ
దాన మృతుఁ డయ్యెఁ బురుషుఁడు, దానొకఁడు దలంప నొకఁడు దైవము దలఁచున్.
వ. అని బహుప్రకారంబులం బరిదేవనంబు గావించి తమ్మునిం జేర్కొని. 613
క. హా యను మేరుతులితదే,హా యను వక్త్రజితగిరిగుహా యను దగునా
హా యను రిపువనహవ్యవ,హా యను సుమనోమచాపహా యను మఱియున్. 614
మ. అనుజా నిన్నుఁ ద్రివిష్టపస్థులను డాయన్నేను నీపట్టివో
మనుజాధీశ్వరమార్గణాగ్నిశిఖలన్ మ్రందం గనుంగొంటి నే
నని జాలింబడి రావణాసురుఁడు ధైర్యాయత్తచిత్తంబునం
దనుజాలింగని యిట్లు వల్కెఁ బటుచింతాక్రోధఘూర్ణాత్ముఁడై. 615
చ. గతజలసేతుబంధనము గాదె మృతుండగు వానిఁ గూర్చి శో
కితమతు లౌట మీ రరిగి ఖేచరకోటి దలంక నష్టది
క్పతులు వడంక హాస్తిహయపద్దరథధ్వజినీసమేతులై
హితమతులార రాఘవమహీశులఁ గీశులఁ జంపి రం డనన్. 616
క. అంతకసన్నిభు లగుచు న,రాంతకదేవాంతకులు మహాపార్శ్వాదు
ల్వింతశకునంబులకు న,భ్యంతర మింతయును లేని యాత్మలతోడన్. 617
సీ. కాటుకకొండలు కదలి యేతెంచెడుభంగినొప్పెడు మదేభనికరంబుఁ
బూర్వవాయువుల నుప్పొంగు సముద్రంబు తరగలఁ బోలు సైంధవచయంబు
సంవర్తసమయోగ్రజాకాల కాళికాక్రమము గాంచెడు శతాంగవ్రజంబు
సమవర్తికింకరసదృశఘోరస్వరూపప్రదీపితవీరభటచయంబు
నాహవపటిమ మగుచుఁ దో నరుగుదేర, సమరభేరీరవంబులు చదలునిండఁ
గదలి యద్ధాశకంతు లుత్కంఠులగుచుఁ, దాఁకి రహితబలంబులు తల్లడిల్ల. 618
క. తాఁకిన నంతకమాసన్న,సమీకోన్ముఖు లగుచునున్న మిహిరసుతాదుల్
డీకొని ప్లవంగపృతనా,నీకముఁ బురికొల్ప దురము నిష్ఠుర మయ్యెన్. 619
క. ద్రుమచరులు తరుశిలావర్షము దనుజుల మీఁదఁ గురియ రాక్షసులుం ద
ద్ద్రుమచరులమీఁద శరవర్షముగుఱియించి రతిలోకసాహసవృత్తిన్. 620
చ. అపుడు నరాంతకుండు సరయంబు హయంబు మరల్చి సాధ్వస
వ్యపగతవృత్తి వానరచయంబు గలంగఁ దోలంగఁ గ్రుంగ శ
క్తిపటిమ శక్తివైవ వినుతించుచు దైత్యులు సందడించి ర
ట్లపరిమితప్రతాపగరిమయై దనుజాధముఁ డాక్రమించుడన్. 621

క. కని వానియేపు సైఁపని, హనుమంతుని కడ్డ మరిగి యంగదుఁ డుదుసా
లనిహతి శిరంబు విపులా, శ్మనిహతి సర్వంబు గూలి చదియఁగ నేసెన్. 622

చ. అటులఁ విహీనశాంతకు నరాంతకు నంతకుచెంత కంచుచుం
గుటిలమనస్కులైరి రిపులు గూడినతోడన వాయుసూనుఁడుం
జటులరయంబునం బరమసాహసులం బ్రథుఘోరయుద్ధలం
పటుల నిశాటులం జదిపె బాహుబలంబుఁ జలంబు మీఱఁగన్. 623

వ. మరుత్పుత్రమరుత్ప్రేరితంబును వాలజ్వాలాజాలంబును రోమధూమావృతంబు నగు
నంగదానలంబు విరోధిసేనాకాననంబు దహింపం దొరకొనుటయును సహింపక. 624

క. అశనినిభుఁడు దేవాంతకుఁ, డుశనాంతేవాసిపతి మహోదరుఁ డసుహృ
త్పిశితాశి మహాపార్శ్వుఁడు, త్రిశిరుండును గడఁగి యానదీపితు లగుచున్. 625

శా. సుగ్రీవాంగదజాంబవత్ప్రముఖు లత్యుగ్రప్రభావాఢ్యు ల
త్యుగ్రగ్రావమహీరుహావలి సమీకోద్రేకముం జూప దా
శగ్రీవాగ్రణు లాత్మ మెచ్చక ధనుష్టంకారము ల్సేసి తీ
క్ష్ణాగ్రామోఘశరౌఘము ల్వఱపి బాహాదర్పము ల్చూపినన్. 626

క. అంగదు మునుమున ముష్టి, హతింగూరిన దైత్యబలము దేటిరకపులుం
బొంగుచుఁ దలపడుటయు నురు,సంగరము బలద్వయముకి ససమగతి నయ్యెన్. 627

క. తలఁప విపరీత మగురణ, తలము గనుంగొనఁగ నద్భుతస్థితి నయ్యెం
దలఁపడునెడయును వ్రేఱను, తలపడునెడయుం గడంగి తలపడునెడయున్. 628

వ. అట్టి క్రందుకయ్యంబునందుఁ గబంధపాఠీనబహుళంబులును విపులాస్థిమూర్ణసైకతప్రదే
శంబులును మాంసకర్దమంబులును వాలశైవాలంబులును గరవాలవ్యాళవ్యాళంబులు
ను గపాలపుండరీకషండంబులును నగురక్తప్రవాహంబులు వెడలి యనేకముఖం
బుల సాగరసంగమంబు లగుచుండె నట్టియెడ. 629

ఉ. ఆనన మెట్టివాఁడు బ్లవగావలి మీఱ మరుత్తనూజపం
చానన ముగ్రభంగి నఖరావలి శాత్రవకుంభికుంభము
ల్మానక వ్రక్కలించుచుఁ బలాదనకాననవృత్తి యున్న దై
త్యానమగుణంబు గాఁగ విబుధాంతకుఁడుం ద్రిశిరుండుఁ బావనిన్. 630

క. శరములు ముంచునెడ మహో, దరుఁడు మహాపార్శ్వుఁడును మదంబునఁ దోడై
యఱుముడు నీలవృషభులా, హరివరునకుఁ దోడువడ మహాహవ మయ్యెన్. 631

గీ. త్రిశిరదేవాంతకులఁ గులాద్రిప్రతిముల, నప్రతిహతప్రతాపుల ననిలసుతుఁడు
పిండి గావించె గండాళ్మ పిండిఁజేసి, యుగమనోహారతరరథయుగముతోన. 632

క. దరమింతయు లేక మహోదరుని బ్రహ్మాస్త్రాంతకుఁడు మదంబునఁ గూల్చెం
దరుచరులు మెచ్చికొనఁ దత్కారియును ఘీంకారపూర్వకం బయిఁ బ్రాలన్. 633

క. ఆదర మింతయు లేక మహోదరుసోదరు వధించి యొప్పెను నీలుం
డన్నేనిఁ గూల్చె నరిరణాహ్లాది మహాపార్శ్వుఁ డట్టహాసముతోడన్. 635

ఉ. నీలుపయి న్నిశాఁగ మవనీరుహచారులు తల్లడిల్ల నా
ఖీలతఁ బోవనిచ్చి శరభీకరవృత్తి వహింపఁ గాంచి య
న్నీలుని వెన్కఁ ద్రోచి యవనీరుహముం జెకలించి యెంతయుం
జోలిక లేనికిన్కఁ వృషభుం డరిభిద్వృషభుండు వ్రేసినన్. 636

గీ. బిట్టు మూర్ఛఁ జెంది పెద్దతడవునకుఁ, దేరిమీఁద మూర్ఛ దేరియున్న
యవసరంబు గాంచి యమ్మహాపార్శ్వుని, వాతనెత్తురుకల జాతనైచె. 637

వ. పవనతనయవృషభులచేతం ద్రిశిరదేవాంతకమహోదరమహాపార్శ్వులు గూలుటయుం
గనుంగొని కపిబలంబు లుప్పొంగి దనుజబలంబులం గలంపం దొడంగుటయు. 638

క. తుండంబులు దెగిపడు వేదండంబులుఁ బడెను బాహుదండంబులుఁ గో
దండంబులుఁ దొరిగెడు హయఖండంబులు నగుచుఁ గ్రందుకయ్యం బయ్యెన్.

ఉ. చిట్టలుగాఁగ నాప్లవగసింహులతోడ నెదిర్చి పోరి తోఁ
బుట్టువు లేవుసం బొలిసిపోయిన నుద్గతశోకవేగుఁడై
కట్టుక రథంబు నతికాయుఁడు వేమఱలించి క్రోఁతులం
బిట్టులగట్టులం జెదరి పోవఁగ నేసె మహాస్త్రసంపదల్. 640

క. ఇవ్వని నవ్వనచారులఁ, గొవ్వాఁడికరంబు జేసి క్రొవ్వుచెఱుమమ
న్నవ్వుచుఁ జివ్వకుఁ గదియుచు, దవ్వుల నవ్వీరు రాము తమ్ముఁడు గనియెన్.

క. కని సరభసంబు మీఱఁ, జనుదెంచి తొలంగు మింక నిశాచరకులపాం
సన రిత్తచావు నమ్మార్గ్కనవన్నను నా దశాస్యకొడుకు నిల్లియెన్. 642

చ. ఇతఁ డతికాయుఁ డీతనిపయిం జనుదెంచితి పిన్నవాఁడ వ
ప్రతిహతబాహువిక్రముఁడు పంక్తిగళాత్మసనూఁ వుండగ
ప్రతిముఁ డనల్పుఁ డల్పుల దురంబున మార్కొనఁ డెందు విక్రమో
న్నతు భవదగ్రజన్ముఁ గదనప్రియు రాముఁ జయింపఁ జూచెదన్. 643

క. అలంబుల తెఱఁగెఱుఁగని, బాలుండవు తొలఁగు మనుచుఁ బటుగతి విశిఖ
జ్వాలలు నిగుడింప మహీపాలానుజుఁడు న్మార్చెఁ బ్రతివిశిఖమునన్. 644

వ. మరలించి యూర్ధ్వాస్యమాలినీశత్రునరు సుమిత్రాపుత్రుం డిట్లనియె. 645

చ. కదనము సేయ నిన్నెదిరి గర్వమెలర్పఁగ నున్న నన్నుఁ జి
ల్కఁదనము సేయుటర్హమె ప్రలాపములం దగు బంటువోలె నీ
వదలిచి యొండుచోటికి భయంబున వంచన చేసి పాఱిపో
వఁ దలఁచితి వెకాక బలవంతుఁడవే గణికాకుమానకా. 646

గీ. అని కృణీరించి యద్రిపైఁ బిడుగులు, వడ తెఱంగు గాఁగ బహుశరములు
వఱపి యట్టహాసభాసురుం డగుచుఁ, గోల్పులిదృష్టంబుఁబోలెఁ బోదువుటయును.

క. హరినాథు నెదిర్చిన మద, కరినాథుని భంగి నిగ్రహఁ గవిసిన మహీభృ
త్సగణి హరిఁ దాఁకు కైటభు, కరణిం దాశరథి దాశకంఠి నెదిర్చెన్. 648

క. దివ్యాస్త్రరాజ మగువా, యువ్యాస్త్రం బహితుఁ డేయ నసనిఖండమై
త్యవ్యాహతఘోరతరశర, వ్యాహారం బడఁప రావణి కినుకన్. 649

క. దోషాచరులు నతిఁపఁగ, నైషికరౌద్రాస్త్రములు రయంబారఁగ న
ప్పూవ్వమశలీనని వేయుడు, శోషించిరి కపులు నృపుఁడు సుక్కోనటుంచున్. 650

క. అగ్నినిభైంద్రాస్త్రము ఘో, రాగ్నేయాస్త్రంబు సేసి యవి పోడిగ్రమైన
స్వభగ్నత్రిపుటి యగుచు శర, మగ్నిం గాఁజేసె నృపుఁడు మార్గణవహ్నిన్. 651

గీ. ఏసి విల్లు రెండు సేసి హూతునిమెడ, దీసి తెక్కెము వడఁ గ్రోసి పగతు
డాసి పార్శ్వచరులఁ గోసి వారనికిన్కఁ, జేసి లక్ష్మణుండు వాసి మిగుల 652

క. అస్త్రశిఖామణి యగుబ్ర, హ్మాస్త్రమున నభేద్యకవచ నతికాయు ధను
శ్శాస్త్రవిధిజ్ఞు వధించెఁ గృ, తాస్త్రుఁడు రాజసుతుఁ డగచరావలి పొగడన్. 653

వ. కుంభకర్ణుండునుబోని యతికాయుఁ గొండగూలిన చందంబునం గూలనేసి సింహనా
దంబు గావించుటయును. 654

క. వనచరులు సుమిత్రాసుతుఁ, గొనియాడుచు గుంపుగూడికొని యాడుచు రా
మునిఁ జేరఁ బోవుటయుఁ ద, మ్మునిఁ గౌఁగిటఁ జేర్చి నలఁగు ముదమున నంతన్.

క. రణహతశేషులు విప్రల, వణ శోషులు దైత్యవరులు వడిలంకాప
ట్టణమునకుఁ బాటి యటరావణుఁ గన్గొని యిట్టు లనిరి వడఁకు నొడలితోన్.

గీ. సమర మొనరింపఁజాలక, సమసె న్భవదీయపుత్రషట్కము మేము
స్సమరవిముఖుల మగుచుని, సముఖమునకు వచ్చితిమి నిశాచరనాథా. 657

వ. అని యిట్టిట్టివా రిట్టిట్టివారిచేతఁ దెగిరని నిరూపించి చెప్పి, యేకనిశ్చయంబున నద్వితీ
యం బగు సంగరంబు త్రిలోకభయంకరముగా నాచరించి సేనాంగచతుష్టయం
బుతోఁ బంచత్వంబు నొందె భవదీయపుత్రషట్కంబు నటుయు నప్రత్యసనపరిభూ

వ. అయ్యనేకవిధరణవిధానంబు శాంబరీవిధానంబై. 670

క. పడిఁ బిడుగులజడి వడుక్రొ, వ్వడి సురవడి బాణకోటి వఱపుచుఁ గనఁజే
ద్వడి పడియెఁ బ్లవగబలమొక, యడుగిడఁగా వసువు లేని యట్టులు గాఁగన్. 671

సీ. కఠినాత్ముఁ డొకమాటు గహనాటులు దలఁకఁ బటుగతిఁ బాషాణపటలి యుర్వి
దుర్మార్గుఁ డొకమాఱు ద్రుమచాయ లడుకొందఁ బనివడి ముండ్లుఁ గంపలును విసరి
క్రూరసాదుఁ డొకసారి తరుచారిగణ మోడ సరగున రక్తవర్షంబు గురిసి
గతధర్ముఁ డొకవేళఁ గపిజాలము వడంక బలుపిడుఁ జిల్లకోలలు నిగిడ్చి
కొఱవి గిరగిరఁ ద్రిప్పిన తెఱఁగు గాఁగ, ఘోరకలను కాలచక్రంబునా పరిభ్రమించి
నైజమాయావినిర్మగ్న సకచరాలి, కెందుఁ జూచినఁ దానయై యేఁపు రేఁగి. 672

తే. ఒక్కదెస నార్చుఁ బేర్చు వేఱొక్కయెడల, నొక్కచోఁ బాఱు నాఁడు నింకొక్కచోట
నొక్కచోఁ దోఁచు వైచు నింకొక్కదిశను, బ్రమశరావలి మత్తుఁడయ్యింద్రజిత్తు.

వ. ఇట్లు మాయాతమోవిలీనుండై వ్యాసురకులీనుండు పేర్చిన జేయునది నేరక యెల్ల
వానరులుం దమతమ వైచిన గండోపలంబులు విఫలంబు లగుటకు నచ్చెరువందువారు
ను గాలుఁ జేయి తునిసినం బడి పొరలువారును గపిప్రళయంబు గాఁ బోలు ననువారు
ను గర్తంబుల డాఁగువారును మృతకరిహయభటనికరకబంధంబులం దూఁగువారును
రాఘవులం జీరువారును నమ్మి తెయ్యలం గిటిపడూఁ గానుచు నెక్కడుచటంబున
బేరువాఁడి రక్కసులం దలపడి పోరాడువారునై మిక్కుటముగం గనుంగొని. 674

ఉ. ఆహవకేళికిన్ దశరథాత్మజనూజులు మీఱి లేమి సం
దేహముఁ బొందుచున్న యెడ దివ్యశరాగ్నికి వైరికోటిఁ బూ
ర్ణాహుతి వేల్చునంచు దనుజాధముఁ డేడ్తెఱ గాఢశక్తి స
మ్మోహనబాణ మేసె మృతిఁ బొందుగతిం గపు లుర్విఁ గూలఁగన్. 675

గీ. ఇట్లు కూల్చి లంక కేగి తండ్రికి జయ, మెఱుఁగఁ జేయ నాతఁ డెల్లవారిఁ
గలయఁ జూచి పుత్రుఁ గౌఁగిటఁ గదియించి, యమితహర్షమున్నఁ డయ్యెనంత.

ఉ. చావనిశత్రుకోటి యెడ సందియ మించుక లేక యున్నచోఁ
బావని ద్రోణభూధరగభాసి విభాసితపాద్యమైన సం
జీవనిఁ జేసి వానరుల సేవయుఁ దెంచిఁ గ్రమ్మఱంగ యు
ద్ధావనికిం దలంకక ప్రమాణ మొనర్చిరి గందుమీఱఁగన్. 677

వ. దివ్యాస్త్రబంధబాధితుండుగాని పవననందనుండు దనుజమాయామోహితుండుగాని
విభీషణుండు సహాయుండుగా నించుక తెలివి నొంది యున్న జాంబవంతునుపదే

శంబున ననేక కోటి జనదూరస్థితంబగు ద్రోణపర్వతంబు ననహాయశూరుండై సముద్ర
మార్గంబునం బెకలి తెచ్చి ప్లవంగసైన్యంబు సముద్ధరించి రామచంద్రు నలరించి
తదాదేశంబున నద్దివ్యౌషధపర్వతంబు యథాస్థానసంస్థాపితంబు గావించి వచ్చె నివ్వి
ధంబున. 678

క. సమ్మోహనశాత్రవబల, సమ్మూర్ఛితమగు వనాటసైన్యము సంగ్రా
మమ్మునను బ్రమ్మికొలిచెం, బ్రమ్మజ బలగర్వసమధికస్ఫూర్తిమునన్. 679

వ. ఆసమయంబున. 680

క. నవ్రమింకు నితఁడు తేజమ్మురయమున ననుమఁ బవనపుత్రుని జూడన్
మ్మనమున సిగ్గువొడమి యే, గి క్రైవశి నర్కుఁ డస్తగిరికిం జేరెన్. 681

క. పంకజహితుఁ డరుగుడు సా, యంకాలపుసాంధ్యరాగ మతిశయ మయ్యెన్
లంకాపురమంతయు ఘూ, సూనునిచే నిల్లు కాలు నని తెల్పఁగతిన్. 682

క. సంజీవినీమహౌషధ, సంజీవితమగు ప్లవంగసైన్యము గెలువన్
గుంజరములు వనుదెంచు గతిన్ జీకఁటు లడరె నెల్లదిశలు మునుంగన్. 683

ఉ. వానరులంత రామనరవల్లభు నానతినొంది ఘోరలం
కానగరంబుఁ గాల్పనకట్టి మహోల్ముకపాణులై యమ
స్థానలమంతటంతఁ దమ కగ్గలమై వెనుపొం దనందలు
న్వానలదిక్కులం దగులఁ బెట్టిరి వహ్నిశిఖాకలాపముల్. 684

వ. అర్ధరాత్రసమయంబున. 685

క. దట్టించి లంక నగలను, మిట్టిం ప్లవంగవంశముఖ్యులు భయముం
బుట్టించి రంత్రికింపనుఁ దిట్టించిరి సీత నేల తెచ్చినటంచున్. 686

క. పొగ మిగుల నెల్లదిక్కుల, బుగబుగమను శిఖలు వెలుఁగఁ బొరిఁబొరి భవనం
బుగ శోకమంటఁగ జనము, లిట్టుఁగూడని మేని వేల్పుతరప్రబలుడున్. 687

క. సీతాశోకాగ్నిపరి, స్ఫీతమగుచు లంకఁ జుట్టఁబెట్టె ననఁగ ఖ
ద్యోతనసమదయుసముదయము, మాతఱి నయ్యెవన నుష్ణమకృజమైనన్. 688

సీ. పడిరవుల్లొక్కని శిఖావళులు మీఱిమి వాలవిపులవ్యజనముల విసరువారుఁ
దమరెక్కయాడు సౌధవితతి కాలిమూలఁగ నొందుగడలను నెగయువారుఁ
గవ్వలఁబొగచుట్టి కదలనేరకయున్నవారిఁ గన్గొని క్రేళ్ళు వాఱువారుఁ
దమ్మెదిరించి యుద్ధమొనర్చువారలఁ బట్టి మంటలలోనఁ బెట్టువారు
నింటివారలు బైటికి నేగుదేర, ఖండగొండ్లెములను బిగఁగొట్టువారుఁ
గొఱవులందందఁ ద్రిప్పుచుఁ గొఱలువారు, నైరికపినాథు లుత్సాహపతిశయిల్ల. 689

క. తెంపరులై దానవులు న, తింపఁ గరిఘటాభటాశ్వపృథురథయుతులై
కంపనముఖ్యులు సమరా, కంపనగతి నడిచియుత్సుకత్వస్ఫూర్ణతన్. 799

క. కుంభనికుంభులు భీకర, కుంభీనసయూథయుక్తి మిగులఁగోఁ జూడు ది
క్కుంభినిభులపుడు వెడలిరి, కుంభినిఁ గ్రక్కదల శౌర్యసంభృతు లనికిన్. 700

క. క్రోధనుఁడుఁ బ్రజంఘుండును, క్రోధములఁ బ్రజంఘులగుచు ఘోరాకృతులై
యోధనుతులు వెడలిరా, యోధనమునను సమధికతరోన్నతి వెలయఁగన్. 701

క. ఆక్షణమున వడినడిచిర, సిక్షురికాద్యాయుధప్రసిద్ధకరులు యూ
పాక్షమకరాక్షు లతిభీ, మాక్షులగుచు ననికి శోణితాక్షసహితులై. 702

క. హుంకారము లధికధను, ష్టంకారములుం బ్రమోదసాధనభేరీ
ఝాంకారములు న్మెఱయ న, హంకారత ననికి వెడలి రసురులు వడితోన్. 703

క. ఇట్లు పురి వెడలి సోఁకుం, డెట్లు గడంగుటయుఁ దడవు సేయక యట్లుం
గిట్లు విసరి యహితులఁ గపి, కోట్లుం దలపడినఁ బోరు ఘోరం బయ్యెన్. 704

వ. అత్యుద్భటయుసేనాపదాహతి సముద్భూత ధరారేణుపటలంబు నభంబున ఘనంబగుట
యుం విద్యుల్లయం బాణమయంబును వసుంధరాభాగంబు కబంధమయంబు నయ్యె
నంత. 705

సీ. ప్లవగశిలాహతిఁ బ్రాణము ల్విడిచియుఁ గైనవృక్షాహతవని గట్టికనము
రక్షోవిదారిత వక్షఃకవాటులై పడియుఁ బైఁబడఁ గాచుకడిశనంబుఁ
నిశితక్షతకీలాలధారలఁ దడిసియు జడియని దండితనము
నాయకమాయాళిసారతమమున మునిఁగియు మొనసెను మొఱసుదనము
ప్రాణముల కాసచేయని బంటుతనము, దుశ్శకునముల వెఱవని దుడుకుఁదనముఁ
జూచి ఖరరావముల్ లలలూఁచి కొనఁగఁ, బోరిరి కపీంద్రులును మాంసభోజనులు. 706

మ. నగముల్ తొమ్మగము లక్షీంద్రుఁడు సుధాంశక్రుల స్వామిన
స్సగముల్ క్ష్మారుహులుగాఁగ రక్కసులు బాణవ్రాతముల్ పంచి క్రుం
పఁగ కీనాశకపిశితాహీనుల బీభత్సాహవం బొప్పచో
పొంగముల్ గాని వెలంగఁ గలపనఁ దుంగుంభుంకుం బ్రజంఘాములున్. 707

క. వాహనములు మెఱయ రథా, వాహనులై నైజయోధవరు లలర నప్ర
గ్యాహీనులమనఁగ మర్కటు, వాహినుల నలంచుఁ యుద్ధవసరములోనన్. 708

వ. అంగదుండు తొడరి. 709

శా. ఉద్గ్రీవుఁడయి చూచి కంపనుపయిన్ హుంకారమేపార భా
స్వద్గ్రావంబునిగిడ్చి తన్నిహతిమూర్ఛం దన్ని కొంచున్న సం
చద్దైవేయకచాపకంధరమిలాచక్రంబుపైఁ దూల ను
ద్యద్గ్రావంబున వైచె దానవుఁడు హాహాకారముల్ సేయఁగన్. 710

వ. శిలాపాతంబున మూర్ఛితుండై పర్వతాఘాతంబున. 711

క. కంపనుఁడు పడినఁ గ్రోధనుఁ, డుప్పడినభంబునిండ నంగదుఁ గడిమిం
జంప్రదునని రోసమున నిలింపులు గుంపులయి దివినిలిచి భయమందన్. 712

క. మూఁడుశరంబులురంబునఁ, గాఁడించి యిషువ్యయము ముఖంబున నేయ
న్వాఁడిశరంబుల నతనికిఁ, దోడుపడి ప్రజంఘుఁ డంగదుం దలఁకించెన్. 713

ఉ. మూఁడుఁ బదాఱునాఱు బదిమూఁడిరుమూఁడుఁ బదేడు నేడు నీ
రేడునిశాతబాణముల నేసి మదించి నంగదుండు దూఁ
గాడియు నీడఁబోవక మహోగ్రమహావృత్తి నగంబువైచి చ
క్కాడెఁ బ్రజంఘునిస్తనుఁ గంపనుమూర్ఛముఁ గ్రేణిసేయఁగన్ 714

వ. అదిగని క్రోధనుండు జంభాంతకపౌత్రుండగు ప్రజంఘాంతకుం దలపడియె, యూ
పాక్షశోణితాక్షులు మైందద్వివిదులను గుంభనికుంభులు సుగ్రీవపవనతనయులను
మకరాక్షుండు పుండరీకాక్షుండగు లక్ష్మణాగ్రజుం దలపడుటయుఁ దక్కినరక్క
సులు నయ్యాయి వనచరులం దాఁకిన. 715

క. కుంభములు పగిలి శోణిత, గుంభితగాత్రములఁ గాలికొండలభంగిన్
గంభీరవేదిపటుచుద, కుంభిసుటులుగూలెఁ బ్రధనకుంభినిఁ దఱచై 716

గీ. అంతమీఱి కంపనాంతకుం డంగదుఁ, డహితమార్గణంబు లన్ని దఱిచి
తోఁక వెడకోఁ జుట్టి దుమ్ముఁ లునఁ గంగఁ, జెండివిసరఁ గ్రోధనుండు గూలె. 717

క. ద్వివిదుండు శోణితాక్షుఁడు, వివిధశరములేయ వాని విరియించి విరో
ధివరూథిని తలఁకఁగవై, చెవనాటాగ్రేసరుండు శిలఁ దలవగులన్. 718

సీ. క్రుద్ధుఁడై యుద్ధసన్నద్ధుఁడై శోణితాక్షునితోడి యాతఁ డిషుదళకంబు
నాటింప వాని ఖండంబులు గాఁజేసి సాలంబుచే వనచరవిభుండు
వెండియు మైందుపై భిండిపాలమ్ములుఁ బరశుముద్గరములుఁ బఱపియూర్వ
ద్వివిదుని సహజుఁ డుద్వృత్తి నశ్వత్థకు ల్వటమహీరుహములు వైచి యేచి
వానిఁ బెనఁచిపట్టి వక్షుంబుఁ బిడికిట, బిట్టుఁబొడిచి కాలమెట్టి విడువ
శోణితము స్రవింపఁ బ్రాణంబు విడిచెయూ, పాక్షుఁ డక్షిగతుల నక్షులలర. 719

చ. పది నిశితాశుగంబులు నృపాలశిఖామణి నేయ రాముఁడుం
బదిశరము ల్నిగిడ్చి పరబాణముల న్విదళింప వెండియున్
గదఁ గొని రక్కసుండు పరగం జనుదెంచిన నించుకేనియుం
బ్రిదులఁగనీక శక్తిఁ గడపె న్మకరాక్షుని శోణితాక్షునిన్. 731

వ. మకరాక్షుం గూల్చుటయుం దక్కినరక్కసులు. 732

క. తఱిమఁగఁ బెరిఁగెడు భీతి, న్వెఱిఁగి పురముఁ జొచ్చి దనుజవిభుఁ గన్గొని యం
దఱు ఘోర లీల్గుట యూతని, కెఱిఁగించిన నుల్కిపడి విహీనస్వాంతుఁడై. 733

వ. అగ్రభాగవర్తియగు నగ్రనందనుం గనుంగొని. 734

చ. తనయ మహేంద్రుఁ గెల్చి విదితంబుగ నొందినవాఁడ వింద్రజి
ద్ఘనతరనామధేయము జగంబున నీవ మగండ వట్టి నీ
వనయముఁ జేచ్చి శత్రునివహంబుల నోర్చి కరంబుఁ దండ్రి నె
మ్మనమునఁ బుట్టినట్టి వగ మాన్పవు నీకిది వీరధర్మమే. 735

క. విస్ఫారంబు లజాండ ప్రకిస్ఫోటన మాచరింప రిపుల హరింపం
బ్రస్ఫురితధనుర్ధర బాహాస్ఫాలన మాచరించి యరుగు మనవుడున్. 736

ఉ. తామసవృత్తి దోఁపఁ దనతండ్రి వచించిన నింద్రజిత్తు సం
గ్రామ మొనర్చువేడ్క బలగర్వితుఁ డెంతయు నేకతంబునన్
హోమ మొనర్చి యందు దనయు మొందిన కృత్తి సహాయ మొప్పఁగా
నామున దాడివెట్టెఁ జతురంగసమేతముగా నుదగ్రతన్. 737

వ. ఉత్తరద్వారంబున దండు వెడలి శర్కరాసహితంబులై దారుణంబుగా నెదుర్కొను మారుతంబులను శివారుతంబులకుఁ దలఁకక నడిచి వనచరబలంబుం గనుంగొని నిజబలంబునకుఁ జేయివీచుటయు. 738

క. పూనికఁ దనుశరకోటులు, నూనముగా విసరికొనుచు యుద్ధము సేయ
న్వానరతతుస్సేనా, కానసములు రక్తవర్షకలితము లయ్యెన్. 739

క. అంతట నధికాగ్రహుఁడై, యంతకనిభుఁ డింద్రజిత్తుఁ డన్యభటగతో
న్మత్తగ్రాహుఁడై సభ, మంత్రియుఁ గానయయి మిగులనొప్పులు సెలఁగన్. 740

చ. వితతగుణధ్వనిస్తనిత వీరఘనుం డిలు మిన్నుఁ బ్రాఁకి ఘో
రతమిగ మావహించి సమరస్థలమం బకవృష్టి భూతస
మ్మతరుధిరప్రవాహమున మానక ముంపఁ దరింపలేక దు
ష్థితిఁ దపకూప్ప వుమ్ముటయుఁ దీరక వానరులార్తనాదులై. 741

క. ఫల్లనఁడి చూచుచుండ ర్రణోల్లాసము మెఱయ వఱియు నగ్రాస్త్రములం
జెల్లాచెదరై పోవఁగ, నెల్లయెడలఁ దాన యై కపీంద్రుల నేయన్. 742

చ. దనుజుల కుబ్బుమీఱఁగ శతక్రతుజిత్ప్రథితాంబకంబుల
న్మునిఁగిన సేనఁ గాంచి రఘుముఖ్యుఁ డధిజ్యశరాసనుం డమో
ఘనిశితసాయకాఘ ములుకం బఱఁగించి విరోధిబాణఖం
డన మొనరించె ఖండనమునం బిశితాశుల రూపుమాపుచున్. 743

గీ. రఘుకులశిఖామణి భయంకర ప్రచండ, దనుజశరకోటి కపికోటిఁ దాఁకకుండ
నురుశరంబుల మరలించుచుండె నింతె, కాని దానవుఁ డున్నెడఁ గానఁడయ్యె. 744

మ. దనుజుం డున్నెడ గానకున్నెడఁ బయోదస్ఫూర్తి నాకాశమె
ల్లను నీరంధ్రము గాఁగ నెంతయు రణోల్లాసంబు మీఱన్ దశా
ననపుత్రాగ్రణి వెండియుం బెరిఁగి నానాఘోరఘోరాస్త్రసం
క్తిని గుప్ప రఘునాయకుండు కనలం గెంజాయ రంజిల్లఁగన్. 745

చ. గుమిపడి సుప్రయోగవిశిఖుం డితఁ డంచు సుర ల్నుతింప దే
వములు కనొంద నద్దశరథక్షితిభృత్తనయాగ్రజుండు బ్రా
హ్మ్య మిసుమడింప భీకరమహాస్త్రము వాంగిరసప్రశస్తము
న్కృక్కు మెఱయ వారిఁ గూర్చి రిపుఁ గూర్చి కడుం దెగలాగి యేయుఁడున్. 746

క. దిగ్ధము మొనరించె నధికవి,దగ్ధముగా నక్కడం బడమానము పేర్మన్
స్నిగ్ధాయణసాంద్రతరా, స్పృగ్ధారాపిహితమూర్తిఁ జెన్నఁటి కృత్తిన్. 747

క. కృత్తియపు డివ్విధంబున, మిత్తిగొనిన శాంబరీతమిస్ర మడఁగుడన్
మత్తుఁ డగు నింద్రజిత్తుఁడు, చిత్తమెఱియఁ దోఁచెఁ గపులవిత్తములలరన్. 748

క. మరుదుపకారపరాయణ, మరుదాదేశమున రామమహీకాంతుం డాం
గిరసాస్త్ర మేసి కృత్తిఁ, బరిమార్చ నంత బలులు పడియు వెలుగమిన్. 749

చ. తదరథ మెందు నప్రతిహతంబయి వర్తిలుచుండ వాలినం
దనరవిపుత్రమారుతసుతద్వివిదుఖాత్మభవాత్మభూకుమా
రసలసుషేణముఖ్యులు ధరాధరభూమిరుహాశ్మజాలము
ల్పరగున నింపఁ బిండిగ రజంబుగఁ జూర్ణముగాఁగ నేయుచున్. 750

క. ఉన్ముఖుఁ డుగాక యాహవ, మన్ముఖ్యుల నేపడించి మాయాప్రౌఢిం
గన్మొఱఁగి యింద్రజిత్తుఁడ, సన్మాన్యుఁడు తొలఁగి చనియె సమరంబునకున్. 751

వ. చని కుహనోపాయుండై. 752

ఉ. పాతకవృత్తితోడ ననపాయత హోమము సెల్ల శాంబరీ
సీతనమర్చి సంగరము చెంతకు వేకొనివచ్చి వానర
వ్రాతము చూచుచుండఁ దల వ్రక్కలు సేసె నిశాతహేతి దుగ
ఖాతిరయంబున న్రఘువరాయని యేడ్చుచు నేలవ్రాలఁగన్. 753

క. మాయాసీతం గపటో,పాయంబున నిట్లు చంపి ప్లవగబలము లా
హోయని వగ నొందఁగ నస,హాయుఁ డయి నికుంభిలకు రయంబున నరిగెన్. 754

వ. అరిగి స్థండిలాసీనుండై. 755

క. రిపువంశభయంకరము, స్స్వపక్షశుభద మగు నాభిచారికహోమం
బపరిమితక్రోధహృదయుఁ, డుపక్రమించి యతఁ డమ్మహోత్సాహమునన్. 756

క. మధురమధూన మదిరాస సర్షప విశేషాస్సృగ్మాంసోమాంసంబులవలనను దధ్యాజ్య
తైలాద్యాహుతిబహుళంబు వలనను దేవముఖు సుముఖుం గావించుచుండునంతఁ గల
హాముఖంబున. 757

ఉ. ఆ మ్మసుత నిశ్చయంబుగ నిశాచరశాతకృపాణిధారవీ
తాసుత నొందె నింకఁ గలహం బొనరింపఁగ నేటికంచుఁ దా
రాసుతముఖ్యు లున్నయెడ రాఘవులం గని విన్నవించె ఘో
రాసురకృత్య మంతఁ బవనాత్మజుఁ డాత్మ విచార మందుచున్. 758

క. అశ్రుకలితాననయు దై,న్యాశ్రయహృదయయునునై ధరాత్మభవ విశే
షశ్రమమున నేడ్వ నసం,ప్రశ్రితుఁ డదయుఁ డయి చంపి పడవైచె ననన్. 759

క. విని వినిహతమతులై యి,ట్లని రని పని దీఱెఁ గటకటా విధిచెయిదిం
దనతను వభివినుతసతీ, జనజనకజ త్రుంగెనే నిశాచరుచేతన్. 760

గీ. అనుచు వఱిసియు నద్ధరాత్మజఁ దలపోసి, వసరి వసరి యొకట వసుధకొరగి
రధికవాతవిపతితాశ్వకర్ణకయుగ, భంగి గాఁగఁ బ్లవగబలము లడల. 761

వ. మృతులచందమున మూర్ఛితులయి మహీతలంబునం బడి రంత గొంతవడికిఁ దెలిసి
రామచంద్రుండు ప్రేమాతిరేకంబునం బ్రేయసిం బేర్కొని. 762

చ. విధిఁ బతిఁబాసి శోకమున వేఁగియు నెన్నఁటికైన భర్తస
న్నిధిఁ బడయంగఁ గాంతునొకో నేనని ప్రాణముఁ జిక్కఁబట్టి వా
ర్నిధి నసురాధివాసమున నింద్యచరిత్రవు గాకయున్న దో
షధనుఁడు నిన్వధించెనె సుజాత ప్రభాత కజాతలోచనా. 763

క. నను మాయలేడిఁ గొనితె, మ్మని పనిచిననాఁటఁ గోలె నతివ భవద్ద
ర్శనమెన్నఁ డగునొకో నా, కని తలఁచెద నత్తలంపు వ్యర్థంబయ్యెన్. 764

వ. నాకు నీతోడిద లోకం బగుంగాక యన్యథా న్వాం బగునే యని నిజచరణసమీపం బునం బలవించుచున్న సుమిత్రానందనుం గనుంగొనుచు దుఃఖాతిరేకంబున నడలు చుండ నఖిలవానరులు బాష్పాకులలోచనులై చిత్రరూపంబులఁ జిత్రరూపంబులై చేష్టలు దక్కియుండి రంత నేతెంచి. 765

ఉ. భీతివిదూరచిత్తుఁడు విభీషణుఁ డెంతయు భక్తివశ్యుఁడై
చేతులు మోడ్చి యిట్లని వచించె మహీధవ భ్రాతధారిణీ
జాతకుఁ జావు గల్గుట మృషాస్థితి దుఃఖము దక్కు మాఖలుం
డీతెఱఁ గాచరించెఁ గపటేచ్ఛుఁడు నెమ్మది వేగఁ బెట్టఁగన్. 766

వ. అంతియకాని నిశ్చయంబుగ జానకి వధింపఁబడలేదని సమ్మంబలికి వెండియు నసుర కులవిభూషణుండగు విభీషణుం డిట్లనియె. 777

క. ఉద్ధామభయద మగునే, తద్ధోమము పూర్ణ మగుడుఁ దజ్జనితమహా
యుద్ధోపకరణధరుఁడై, సిద్ధమతం డనికి వెడలి చెనకి జయించున్. 768

ఉ. చెప్పెడిదేమి బ్రహ్మకు నజేయుఁడు వాని నెదిర్చి చంపఁగా
నిప్పుడ లక్ష్మణుంబనుపు మీవన రాముఁడు సంతసించి నీ
వప్పని నిర్వహింపు మనఁ బాయన భక్తి నమస్కరించి వెం
పొప్పెడు దీవన ల్వడసి యుగ్రధనుశ్శరచాపహస్తుఁడై. 769

క. పవనజవతిరస్కరణముఁ, బవనజరథ మదయశిఖరి భానుపగిది నె
క్కి విభీషణుండు ముంగలఁ, గవిభీషణవృత్తి వెడలెఁ గలహంబునకున్. 770

క. కనకాచలనిభతనులఁ, జనపస్వ్రసదృశకర్కశశరీరులు గా
లనిబిడజీమూతతులిత, ఘనదేహులు కీశభల్లుకకులాధీశుల్. 771

ఉ. తారమరాద్రిఁ బాదములఁ దన్ని పగుల్పఁగ నోపువారు దు
ర్వారరయంబునం బలసి రా రఘువంశవరేణ్యుఁ డెంతయున్
దూరము వోయి దైత్యపరిదుష్టవిహారమున న్నికుంభిలా
ద్వారముఁ జేరి శాత్రవభిదాచణచిత్తుని శక్రజిత్తునిన్. 772

చ. కని రిపుహోమకర్మము విఘాతము సేయఁదలంచి వానిని
ల్పిన చతురంగసైన్యములు పీనుఁగుపెంటలుగాఁగ నుజ్జ్వల
త్స్వనిశితసాయకాలి నృపసూనుఁడు దా నిగిడించెఁ గ్రవ్యభు
గ్వరహరిద్విక్షుభాణవిశితమధర్వగణాద్భుతార్భటిన్. 773

ఉ. అంతికమున్న వానరబలాంబుధి వాలతరంగకోటితో
నెంతయుఁ బొంగి దానవబలోద్ధహరేణువు గిట్టు ముంచి బ

ల్వింతరణంబు మీఱ నతివేలపరాక్రమవృత్తి నొందుచుం
దంతము గాంచి ఘోరబడబానలతుల్యమహారథస్థుఁడై. 774

క. యుక్తాభిచారహోమ,వ్యక్తుం డగుచుం బంక్తిముఖసుతశ్రేష్ఠుండా
రక్తనయనుండుఁ గలహో,ద్యుక్తుండై యిల్లు వెడలి హుంకారమునన్. 775

వ. మెఱుంగు మెఱసిన చందంబునం గొఱవి గిరగిరం ద్రిప్పినప్రకారంబున ఝుంఝుమారుతంబు మూర్తీభవించిన తెఱంగున దశదిశలం దానయై కడంగి. 776

శా. చాపం బింద్రధనుస్సుగా నెసఁగు పర్జన్యుండు గాఁ దాను ద
చ్చాపోద్యత్ప్రదరము ల్దటిత్సమితిగా జ్యానాద సంభ్రధ్వని
వ్యాపారంబుగ వారణస్థలవనాటారణ్యముల్ముంచె భీ
మాపాద్యంబకవృష్టి శోణితము కల్యాగ్రక్రియం దాల్పఁగన్. 777

క. లెక్కయిడరాని ప్లవగుల, నొక్కొక్కని గణితాంబకోత్కరములచే
నుక్కఱ మెఱయఁ బ్రుక్కించుచు, నక్కజమయ్యెం దివౌకసావలి కంతన్. 778

చ. కొగడుపడంగ నిట్లు ప్రతివీరుల నెల్లఁ గలంచి యాడి శ
క్తిగరిమ లక్ష్మణుం బ్రచురతీవ్రశరంబుల నొవ్వ నేసి గం
ధగజముభంగిఁ బంక్తిముఖనందనుఁ డేతయు వంచనామతి
న్మగుడఁగ నేగె హోమము సమాప్తముగా నొనవేర్చువానికన్. 779

క. చని హోమంబు సమాప్తం, బొనరింపఁదలంచి యాతఁడున్న సుమిత్రా
తనయునకు విభీషణుఁ డిట్లనియెం గార్యదశ దెలియునట్లు నిపుణతన్. 780

క. అవశిష్టహోమకర్మము, నవనిశ ఘటించి మగుడ నరుదెంచిన దు
ర్వ్యవసాయుఁ బీనిఁ జంపఁగ, నవశమగుం బోదమ యిదియ యవసరమనుడున్. 781

క. క్రమ్మన కోపమ్మున నా,ద్యమ్ములగు శరమ్ముల నిశితమ్ములు పఱపెన్
సమ్మెటపేటులటంచు న,దమ్మదపాతమ్ములనుచు రావణి నొవ్వన్. 782

వ. వెండియుం జండకాండంబు లొండొండ దండోపతండంబులుగా నిగిడింప నింద్రజిత్తు మండిపడి. 783

క. అపగతహోమకలాపుఁడు, వ్యపగతనిజసైన్యభీకరాలాపుఁడు న
త్యపగతకోపుఁడునై బిట్టుపగతుఁడై నేగు నాతఁడు మహోగ్రుండై 784

వ. విభీషణుండు దృగ్గోచరుం డగుటయు సహింపని రోషాతిరేకంబున. 785

క. కన్నకొడుకు వట్టిఁడ నా,కన్నకొడుకు వీఁ డటన్న కరుణామతి లే
కన్న ననుఁ జంపఁబో నీ,కన్నను వేఱ పగతుండు గలఁడే నాకున్. 786

గీ. సరణిఁజేరి బంధునాశంబునకు నోడి, గట్టి దయయు నీతి గట్టిపెట్టి
నాఁడ పట్టినీవు నాకు నెక్కుడిపిన, తండ్రి వనుఁడు నతఁడు తక్షణంబ. 787

సీ. నవ్విభీషణప్రవృత్తి నవ్విభీషణుఁ డిట్లు పల్కు దురాత్మ నీబాంధవంబు
చాలు పానికి నోర్వఁజాలక బలవద్విరోధంబు వలదని రూఢభంగి
నీకు నీతండ్రికి నేనెంత యుక్తిచెప్పిన నీడుఁగొల్వఁగఁ బ్రియములేక
యభియాతిరీతి నాకభిభూతి యొనరించినందున మిమ్ముఁ బాయంగవలసె
నదియుఁగాక దుష్టమైనబంధుశక్తి విసర్జనీయమంత్రు సజ్జనులకు
నాఁటిమాటలాడ నేటికి నేఁటికి, మృత్యువశుఁడ వైతి ప్రపతిహేతి. 788

చ. అనవుఁడుఁ గోపమెక్కి నరులా కలహంబున నజ్జయించు వా
రని వెసఁ జాపమెక్కిడి జయానకము ల్మొరయంగఁ ప్రవ్యభు
గ్జనుఁడు త్రొక్కఁద్రొక్కిన భుజంగమపుంగవుచంద మొందినన్
దనుజులు పోక నిక్కి ప్రమదంబున మార్కొని రస్త్రసైన్యమున్. 789

క. మార్కొనుటయుఁ గపిబలము న్నెదుర్కొన నమ్మోనలు రెండు దుర మొనరించెం
బేర్కొని నెత్తురు పుడమిం, జేర్కొన భూమిచరఖచరభీకరము గాఁగన్. 790

వ. తత్సమయంబున విభిన్నరథాంగంబును విశీర్ణపుండరీకంబును వినష్టహరిప్రతాపంబును విజృంభమాణరాక్షససంచారఘోరంబును విస్పష్టమానస్వస్తికప్రకాశంబును నై సంధ్యాసమయంబునుంబోలె. 791

గీ. వరమరుత్సుతభుజపీఠి మరుదపార్య, శిఖావిస్ఫురితంబగు సింహమనఁగఁ
బొల్చు సౌమిత్రి శరవృష్టిఁ బొడిచెఁ బంక్తి, కంధరసుతుండు కంధరక్రమము గాఁగ. 792

గీ. పొడివి చిక్కి తెందుఁ బోయెదు నిలుమని, చులుకుమాటలాడి కలఁకుటమ్మ
లాలునాలు వైవ నన్నిబాణంబులఁ, ద్రుంచె వాని నృపసుతుండు కనలి. 793

ఉ. త్రుంచి దురాత్మ నీశిరముఁ ద్రుంచెదఁ ద్రేలకు మంచు దైత్యు ల
క్షించి ప్రమత్తశత్రువినికృత్తవరంబు శరంబు పింజ సం
ధించి బలంబునం దిగిచి తెంపున వానిమహోదరంబు భే
దించిన మృత్యుసంగతుఁ గతిన్ మహి నాతఁడు వ్రాలెఁ జెచ్చెరన్. 794

క. తెలిసి నరాదుఁడు పులిపై, బలిసిన మృగభంగిఁ బోవుభంగిఁ జనుటయుం
దెలిసి నరేంద్రుఁడు వానిం, బలిసిన రక్కసులు వెఱగుపడి పఱవంగన్. 795

శా. విక్రాంతాక్షిసుతుండు రఘువుఁడు దోర్వీర్యంబు నిండారఁ జం
డక్రోధంబున వైరిభీకరధనుష్టంకార మేపార శా

శక్రారాస్త్ర మొకండు దీవ్రగతి నద్దైతేయునేయ స్వభయో
ష్ట్రక్రాంతాత్ముఁడు గాక దానవుఁడు శుంభద్ధైర్యసంరంభుఁడై. 796

క. దుర్జయగతి నురగాస్త్రముఁ, బూర్ణక్రోధమున నేయఁ బొడవడఁచె గరయో
ర్జితగతి లక్ష్మణుం డా, కర్ణాంతము గాఁగఁ దిగిచి గరుడాస్త్రమునన్. 797

క. గరుడాస్త్రనిపాతంబై, యురగాస్త్రము పడిన వెచ్చనూర్చుచు దశకం
ధరనందనుండు దశరథ,వరనందను నేసె నలుక బ్రహ్మాస్త్రమునన్. 798

ఉ. ఏసిన నించుకేనియుఁ జలింపనిచిత్తముతో సుమిత్రసుం
జేసి తదస్త్రరాజ మవిశేషధృతిం బఱగింప భాస్వద
బ్జాసనబాణయుగ్మము రయంబునఁ బోరొనరించె దేవతా
త్రాసమొనర్చి యంత వసుధాస్థలిఁ గూలెఁ బరస్పరాహతిన్. 799

క. అవ్యాహతరీతి న్వా, యవ్యాద్యస్త్రములు దానవాధపుఁ డేయ
న్నవ్యాపసవ్యగతిఁ బ్రతి, దివ్యాస్త్రంబుల మరల్చె ధృతి నరపతియున్. 800

వ. ఇవ్విధంబున నన్యోన్యబాణవిదారణంబునుం బరస్పరశరచ్ఛేదనంబును మిథఃకోదండఖండనంబును గావించుచు. 801

క. సారిఁ బోరి హరిహరి గిరిగిరి, కరికరి కంఠీరవంబుఁ గంఠీరవమున్
బేరసి కలహించుగతి న్నరవర దనుజవరు లని యొఱ్ఱర్చిరి కడిమిన్. 802

గీ. కార్ముకాస్యులు ఖేటకకతివరసను, గస్త్రరదనులుఁ బ్రత్యేశనాసమాన
భూరికరరుహు లసురన్ప్రపుంగవసుతు, లలుకఁ బోరిరి జంటబెబ్బులులకరణి 803

వ. అద్దశకంధరనందనులు వశానిమిత్తము తదంతావళయుగళంబుచందంబున మాంసపరిగ్రహార్థకృద్ధక్రవ్యాదయుగ్మంబు విధంబునం బూర్వాపరసంధ్యాసముదయోదయాస్తమయాచలంబులం బ్రకాశించు మండి రంత లక్ష్మణుండు మండలీకృతకోదండుండై పరివేషమధ్యస్థుం డగు మధ్యందిన తిగ్మభానుండునుంబోలె శరకిరణసహస్రంబుల వేఁడిమిం జూపుచుండఁ జలింపని ధైర్యాతిరేకంబున నింద్రజిత్తు భండనంబు దొడఁగతిఁ నాచరించుచుండె నయ్యెడ. 804

గీ. అసురమారుత ప్రభవతులంబు వసుమతీశ, నందనమహోగ్ర గాహతి డిందుపడుట
దనుజబాణాగ్ని దాశరథిపుత్రశరవృష్టి, నాశిపోవుట గని పొంగి రమరవరులు. 805

క. సారథిసౌమిత్రి శరా, సారంబున కృంగఁ దానసారథి యగుచుం
దేరు మరలించి రాజకు,మారకుఁ గుమారనిభుఁ బొదివె మార్గణవహ్నిన్. 806

వ. మఱియును ముంబ్రాలివోని విక్రమమునం బొదివి యారావణి. 807

గీ. గంధవహునికుమారు వక్షంబు నాఁటుచు, నైదునారాచముల నేసి యాపుటయును
సమరలంపటుఁ డహితురథ్యముల నేలఁ, గూలఁగా నేసె మెఱుఁగారు కోలఁ జేసి

వ. లక్ష్మణుండు తోడన వాని కోదండంబుఁ దుండెంబులు గావించుటయు నింద్రజిత్తు.

మ. విరథుండు న్విశిక్తచాపుఁడును నిర్విణ్ణాంతరంగుండునై
సురసంఘంబులు పిచ్చలింపఁగ మహోష్ణస్తోమము ల్నించె భా
స్వత్కోదండ మొకండు పుచ్చికొని తచ్చాపంబు ఖండించిన
స్వరయం బారఁగ నొండు విల్లుగొనిసం జక్కాడె నద్ధ్వయమున్. 810

ఆ. వింటినెల్ల యెక్కువెట్టిన విఱుగుడు, నున్నఁగాచి దైత్యుఁ డుక్కుదక్కి
యధికదుఃఖమగ్నుఁడై యిట్లని తలంచె, హృదయమునఁ బ్రమత్తుఁ డింద్రజిత్తు. 811

తే. శరభసదృశంబు లస్మత్కులంబములు గలఁబముల పోలె నాటవు లక్ష్మణునకు
శంబసదృశంబు లగుచుఁ దదంబకములు, తనువు నొప్పించు నెంతయుఁ దనువులయ్య.

ఉ. ఇంద్రు జయించి తద్విభవ మెల్ల హరించి విరించిచేత ము
న్నింద్రజినాహ్వయంబు జగ మెల్ల నెఱుంగఁగ గొన్నయట్టి దై
త్యేంద్రుఁడ న్నరేంద్రుని జయించుట దుర్లభ మయ్యెఁ బ్రీతిన
య్యింద్రుని బ్రోచు వేలుక నుపేంద్రుఁడు మానవమూర్తి యయ్యెనో. 813

క. అని తగచి మతియుఁ దన యే, సిన శక్తి ప్రముఖములు నశించిన లజ్జా
వనతాననుఁడై లక్ష్మణు, నని బాహాబాహిఁ బెనఁగ నాలోచించెన్. 814

క. ఈరీతిఁ దలఁచి రణముఁ జను, కోఱలు వెలిచిన మహోరగునికైవడి వి
స్తారాయత్తంబునఁ బ్రతి, వీరు నెదుర్చుటయు నాఁ డవిరళోగ్రహుఁడై. 815

చ. అపుడుగ శక్రదత్తమగు నస్త్రము వారి నమర్చి పేర్చి సు
స్థిరభుజశక్తి లక్ష్మణుఁడు శ్రీఘనతిం బరఁగింప గుండల
స్ఫురితము దైత్యమూర్ధము వసుంధరఁ ద్రెళ్లె మహోగ్రగావాతో
ద్ధురమరుదుర్విభృచ్ఛిఖరితో యమున న్మహి సంచలింపఁగన్. 816

క. తలఁకుడుగ నింద్రజిత్తుని, తల కుండలకర్ణశోభితం బగుచు మహీ
తలము దిగఁద్రుంగ నమ్మెను, తిలపడిసం గపుల కతిమదం బొనరించెన్. 817

వ. తత్సమయంబున. 818

శా. ఆసారంబులు నిర్మలోదకములై కన్పట్టె లోకంబు శో
భాసారం బయి తేల్పెఁ దాల్చె దిశలు న్భాసిల్లె నెంతేనియు
న్నాసాగ్రథఫలీకృతార్థకముఁ గంధస్ఫారమందార సూ
నాసారంబులు పెల్లుగ్గలై సురవేశ్యాలాస్యముల్మీఱఁగన్. 819

క. సురదుందుభిరవములు వా,నరుల జయజయధ్వనులు వినంబడ ధరణీ
శరుఁ డబ్ధి నీఁది పారము, వెఱవుఁ గైకొన్నవాని విధమున నలరెన్. 820

వ. మహానందంబున నిజయోధవీరపరివృతుండై నికుంభిలాద్వారంబు వెడలి వచ్చునవస
రంబున. 821

సీ. మలయమహీధరోజ్జ్వలహరిచందనపృథ్వీసువాసనలతోఁ బెనఁగులాడి
గంభీరతరవిశాలాంభోనిధితరంగశీకరంబులతోడఁ జెలిమిచేసి
మల్లికాజాతిచంపకకురవకసుమాపవనంబులను బూలబంతులాడి
భాస్వదభ్రధునీవికస్వరకార్తస్వరాంబుజాతముల నుయ్యాలలూఁగి
నందనంబున మందయానంబు నేర్చి, చైత్రరథమునఁ జైత్రుతో సరసమాడి
నట్టియుదయకరము హర్షమావహించె, భాసితులకు మరుత్సుమిత్రాసుతులకు. 822

వ. పిదప నమ్మహావీరుం డగులక్ష్మణకుమారుండు విజయవార్తాశ్రవణకుతూహలాయత్త
చిత్తుండగు రామచంద్రున కనతిదూరంబునఁ గపిరథావతీర్ణుండై. 823

క. రూఢధృతి నేగి వినయో,దూఢత నగ్రజుని చరణతోయజముల కా
రూఢప్రౌఢిమ మ్రొక్కిన, గాఢాదరతత్పరమునఁ గౌఁగిటఁ జేర్చెన్. 824

క. స్నేహ మిగురొత్తఁగా నను,రాగానసౌఖ్యంబు నొంది కొనియాడె మహా
సాహసు దానవవీరు ఘు,వాహవమునఁ జంపినాఁడ వనుచు నతిరుచిన్. 825

క. దేవాసురవరు లాకఖ్యాతిఁ, గైవచ్చినఁ జిక్కఁ డమ్మహామాయికుని
న్నీవు వధించిన నస్మ,ద్భావం బానందపూర్ణమగ్నం బయ్యెన్. 826

వ. అని వెండియు ననేక మధురవచనముల నగ్గించుచు దారుణవిపక్షబాణక్షతశతం బగు
సహోదరుదేహంబు నిమురుచు నిట్లనియె. 827

క. నీ వింద్రజిత్తుఁ గూల్చితి, కావున నే నెల్లభంగి ఖండింతు దశ
గ్రీవుని దురమున మన సు,గ్రీవాదులు చూచి మిగులఁ గీర్తింపంగన్. 828

వ. అని తదనంతరంబున. 829

ఉ. సన్నుతి లొప్ప మారుతిఁ బ్రశంస యొనర్చి విభీషణుం గడు
న్మన్ననమాటలం దనిపి మర్కటకోటి బహూకరించి త్రై
లోక్యనుతి రావణుం దునుమ నున్న యెడం దదనీక మెంతయుం
జెన్ను వహించెఁ బున్నమ నిశిన్ శశిఁ గన్న పయోధితోయమై. 830

క. అట దశముఖుండు భయదో,త్కటసంగరమున సుతుండు గడతేఱుట నె
త్తుటఁ దేలుట హతశేషవిముఖ,భటులవలనఁ దెలిసి వివశభావుం డగుచున్. 831

క. శరదంబుదములకై వడి, నరసంబులు మిన్ను ముట్టి యురుగతిఁ నడిచెన్
ద్విరదంబులు మహిఁ దడుపుచు, శరదంబులభంగి మదరసస్రావములై. 853

క. సురరిపుతురగఖురాహత, ధరారజఃపాతమున గదా గంగాభా
స్వత్కార్తస్వరజలజము, లురుపంకజములుఁ బరాగయుతములు నయ్యెన్. 854

వ. బహుబాణప్రదీప్తంబు గావున వనరాశిచందంబున సారస్యందనంబు గావున వనరాశికై వడి భయంకరాంతరంబైన యయ్యుభయబల వలాహకపటలంబు నిబిడంబై శరాసారంబున ముంచుటయుఁ బెచ్చు పెరిఁగి యవ్వనచరసేనాసస్యంబును దలమీఱి కవిసె. 855

క. వ్యూహములు రెండు నమితో, త్సాహమునఁ దలాతలింగ చాకచి బాహా
బాహి నఖానఖి సన్మర్దాహవ మొనరించె ఖచరు లచ్చెరుపడఁగన్. 856

చ. అమృతనిమిత్తపూర్వగీర్వాణబుధాయరసంఘములట్లు చండవి
క్రమమున దైత్యభూరుహచరప్రకరంబులు పోరొనర్చి సం
గ్రమమున నేలవాలె రుధిరంబది సంకులకాననాంతర
స్థమగు ప్రశోణగైరికవిశాలరసాలలితప్రవాహమై 857

క. పలువురు బలియురు లొకనిపై, నలయుక మార్కొని పెనఁగునట్టి యెడలు న
ప్పలువురు బలియుర నొకఁడుఁగ, నలి మార్కొని చలమునం బెనఁగెడునెడలున్.

సీ. పాషాణములు పిండిభంగి రాలెడుచోట్లఁ బాషాణములఁ దలల్వగులుచోట్లు
విచ్చుకత్తులు పట్టి విఱిచెడునెడలును విచ్చుకత్తుల కొడలిచ్చునెడలు
భూరుహంబులు చూర్ణముగఁ జేయుపట్లును భూరుహంబుల మృతిఁ బొందుపట్లు
బాణజాలంబులఁ బాఱఁద్రోలెడునిక్కు లమితబాణంబుల నడఁగునిక్కు
లేనుఁగుల గుద్దులఁ బడనేయుతావు, లేనుఁగులు గుద్దులచేత నీల్గుతావు
లారలు తలములు నొరగింప నున్నతలము, లయ్యె వనచరదైత్యసైన్యద్వయమున.

వ. అయ్యుభయవాహినీయోధనాథు లాయోధనమున లోహాటింపక యోహారిసాహారిం బెనంగులాడునప్పుడు కేలువడినం బెఱకేలఁ బరాక్రమించువారును దలలువడినను లత్యంబులం బడనేయువారును జిక్కువడియు నుక్కుదక్కనివారును వ్రేవులు వ్రేలాడినం బేరువాఁడిం బోరాడువారును బ్రాణంబులు విడిచియుం గృపాణంబులు విడువనివారును రుధిరంబునం దడిసియుఁ జలింపనివారును జచ్చియు ముఖంబులఁ గ్రోధంబు డింపనివారును విచ్చియుం బెచ్చు పెరిఁగి కచ్చుకొనువారును గాలుసేతులు దునిసియుఁ గఱవ నప్పళించువారును బడియునుం బోవపోకు మనువారును సహాయులు మన్నిగొనినను బన్నినివారును నై రయ్యవసరమ్మున. 860

క. తుల్యశకలసైకతములు, శల్యతటంబులుఁ గబంధశవమీనంబుల్
కాల్యాన్నవాజ్యము లస్ఱ,క్కుల్యాశతములును సమరకుంభిని వెడలెన్. 861

గీ. ఘోరవిజయశంఖభేరీరవంబుల, హుంకృతులును జాపటంకృతులును
జిత్తభేదకరణి సింహనాదంబుల, సంగరంబు ఘోరభంగి యయ్యె. 862

క. అసురశరాగ్నిప్రఘనక్రోధసమీరోద్రేక మగుచుఁ దఱిమికొని వనా
కసవహ్న్యాహము సేయుచు నయమున రాఘవుఁడు మహోగ్రుం డగుచున్. 863

క. కనదబ్జేక్షణములఁ గ్రోధనదీక్షణము లొనరించి కపు లలరఁగ న
జ్జనకులనాథుఁడు పలభోజనకులనాశన మొనర్చు సంరంభమునన్. 864

క. ప్రత్యాలీఢస్థుఁడు శత, ధృత్యండస్ఫోటనరణధికాత్కృతరం
కృత్యనుపమచాపధరుఁడు, ధృత్యతిరిక్తుఁ డయి యేచెఁ దీవ్రాంబకముల్. 865

వ. ఎకుచుటుము నద్దివ్యశరంబున ననేకఘోరసాయకంబులు భూనభోంతరాళంబు నిర
వకాశంబుగా నుద్భవించి. 866

సీ. కఠినదానవఫాలఖండంబులను జేర్చి పొడవైన యెముకలు పాదుముచేసి
మేదురమదహస్తిమేదము ల్దరఁగించి కమనీయతరభటాంగములు తఱిగి
తఱఁదరావయవములు చిక్కువలు గావించి సాంద్రశోణితరక్తజలముఁ జేర్చి
యుత్తమయోధులచిత్తంబు లుడికించి కంఖాణఘోణాప్రకరము గాల్చి
ప్రకటఘోరకపాలపాత్రికలు గూర్చి, కూరటింపులు చేసె భూతావళులకు
రణమహానసమున దశరథమహీశ,తనయుశరములు చిత్రసూదజనులట్లు. 867

సీ. మానవాధీశ్వరమార్గణావళు లేచి యమరవిరోధికంఠములు వెదకు
భూమీశ్వరునిశరంబులు మట్టుమీఱుచుఁ గట్టిడిదనుజుల బిట్టు నుంచుఁ
బార్థివాధ్యక్షునిపత్రులు బారులై రాక్షసశత్రుకోటరములు దూఱు
క్ష్మానాయకుశిలీముఖంబు లలిరేఁగి పలభోజనముఖాబ్జములు ద్రావు
క్షత్రియోత్తముభయదాశుగములు మీఱి, ఖలనిశాచరకఠినాంగములు స్పృశించు
నద్భుతావహము లగుచు నార రామ,చంద్రుసాయకజాలము లన్వర్థకములు. 868

క. చచ్చినవారల నంటఁగ, వచ్చునె యని రాముబాణవర్గ మసురులన్
గ్రుచ్చికొని యొడల నుండక, యుచ్చిపడన్ రక్త మంటకుండఁగ వేగన్. 869

క. గుడుసుపడు వింట శరములు, దొడుగుట తెవాపుటయును దోఁపదు పలపైఁ
బడుటయును దనుజు లవనిం, బడుటయు నొక్కటను దోఁచు నొక్కభంగిన యెప్పుడున్.

వ. వెండియు శ్రీరామచంద్రుండు. 871

సీ. పటుగుర సూర్యార బాణరజ్జువులచే గుదిగ్రుచ్చు నొకవేళఁ గోపి యగుచు
మంత్రించి పడఁద్రోయు మాడ్కి నేనుంగులఁ బడ నేయు నొకవేళ భయదుఁ డగుచు
భూరికదంబము లుంఖానుపుంఖము ల్పిగిడించు నొకవేళ నిపుణుఁ డగుచు
దానవోత్పాక్రుతతతి మార్గణాగ్ని కాహుతిసేయు నొకవేళ నుగ్రుఁ డగుచు
దనుజశత్రుకవాటపాటన మొనర్చు, ధారుణీనాథుఁ డొకవేళఁ గ్రూరుఁ డగుచుఁ
దాళఫలముల పోలికిఁ దలలు రాల్చు, భూదయితుఁ డొకవేళ సన్నోదుఁ డగుచు. 872

ప్రస్ఫురిత శ్యామమై కీశసైన్యంబు రేకెత్త సంగ్రామభూమీధరాగ్రస్థమై శస్త్రవ
ర్షామితప్రౌఢి దైత్యాటవి న్ముంచె శ్రీరామరాజన్యధారాధరం బీక్రియన్. 873

వ. అద్ధనుర్విద్యాపారంగతుండు దోర్గరిమణపాండిత్యంబుఁ జూపుటయుం జతురంగం
బగు నమ్మూలబలంబు శల్యసంకీర్ణ కంటకక్షితిజాతం బగు దుర్గమారణ్యంబునుం బోలె
నందుఁ గపాలంబులు పిఠాలంబు లగువారును ప్రభ్రష్టకంబులు ప్రభ్రష్టకంబు లగు
వారును గండంబులు కుండితంబు లగువారును ఖండంబు లగు వేదండతుండంబులును
జీర్ణంబులు నగునశ్వాంగంబులును విరూపంబు లగు రూపంబులును రజంబు లగుధ్వ
జంబులును భూతంబు లగుభూతంబులును గల్గి పుండరీకపుండరీకంబును శిలీముఖ
శిలీముఖంబును రథాంగరథాంగంబును బరాగపరాగంబును భంగభంగంబును రక్తో
త్పలరక్తోత్పలంబును వాలశైవాలంబు నగుసంగరసరోవరంబు రౌద్రబీభత్సాద్భుత
భయానకంబులకుఁ దానకం బై యొప్పె. 874

క. ఛాయకరికుంభకుచరక్తోరుఘుసృణమూలబలపయోజవదన తాఁ
జేరం జాలదు రాముస్ఫారపురుషనాయకు వ్రజోవతి యగుటన్. 875

తే. లపనములు పిండి యైన విలపను లగుట, చరణములు నఱుకయిన విచరణు లగుట
హస్తములు దెగిపడిన విహస్తు లగుట, నద్భుతావహ మయ్యె నయ్యాహవంబు. 876

క. మూలబలమహోద్యోన్మూలము రామాశుగప్రమూల మని మహీ
పాలు నెదిరించె రక్షఃపాలుఁ డలుకమీఱ సైన్యపాలుర మెచ్చన్. 877

వ. నిజకాంతిపరిహాసచంద్రికావికాసం బగు చంద్రహాసభయు బాట్టహాసభాసురుఁ డై రామ
చంద్రుపై రావణుం డురవడించుటయుం దనుజభటపరివృతుం డై. 878

క. ఎత్తిచని విరూపాక్షోన్మత్తులును సుపార్శ్వుఁడును వనచరబలము న
వ్వేత్తుగఁ దలఁపడిపోరెను, నత్తఱి భండనము గడు భయంకర మయ్యెన్. 879

క. ప్రేవులప్రోవులు పాఁడవగు, దీవులుగా నెమ్మె లిసుకతిన్నెలుగా బా
ణావలి తరగలుగా రక్తావిలకీలాలసంగరాంబుధి మెఱసెన్. 880

క. ఆతఱినతఁడున వచ్చి విరూపాక్షోన్మత్తుల మహోద్వాయత్తుల యయు
ద్ధక్షోణికి బలిగాఁ దద్వక్షంబులు భానుసుతుఁడు వ్రక్కలు సేసెన్. 881

దోధకము. అంగదుఁ డంతట నంగము పొంగం, దుంగరసాలము తూర్ణము గాఁగన్
బ్రుంగఁగ దానవపుంగవు సేయన్, భంగము నొంది సుపార్శ్వుఁడు వ్రాలెన్. 882

వ. నిజపార్శ్వవర్తులును మత్తులు నగు సుపార్శ్వవిరూపాక్షోన్మత్తుల మృత్తిఁగొనుటం
గనుంగొని రోషాతిరేకంబునఁ. 883

క. దశకంధరుండు కార్ముక, దశకంధరుఁ డగు మఱి కపితతి నెంతయు దు
ర్దశనొందింతు ననుచు నిజ, దశనంబులు గీఁటుచును రథంబు మెఱయఁగన్. 884

గీ. వాన గురిసినకైవడి వడిగ నిసుము, చల్లినట్టులు విద్యుల్లతాలుభంగిఁ
దెఱపిలేకుండఁ దొరఁగించె దివ్యబాణ, పటలి నొక్కట విపినాటభటులమీఁద 885

వ. సంవర్తసమయసంవర్తింబోలె విజృంభించి. 886

మహాస్రగ్ధర. పదిచండాస్త్రంబులు న్ముప్పదిపనిశితరోపంబులు న్నాల్గుశాత
ప్రదరంబుల్ వైచి శౌరిం బవనతనయునిం బాకభిత్పుత్రు నొంప
న్మదులై యమ్మువ్వురుం దన్మకుటము లదర న్మావుల న్నొంప నాదు
గ్రహృదయుం డాజ్యాహుతిం బేర్చినహుతవహుఁడో యీతఁ డంచుం దలంకన్.

లలితపదము. చెఱఁగి దివౌకసభీతము గాఁగం, దయచరవంశవితానము నెల్లన్
శరబహుళాగ్ని జ్వాలల పేర్మిం, దరికొని కాల్చె హుతాశనమూర్తిన్. 888

వ. దశకంఠుం గనుంగొని రాముండు సయిరింపక. 889

లయవిభాతి.

రభసత నెదిర్చి భుజగభ నదముఁ గార్ముకముఁ బ్రభమిగులఁ దాల్చి నరవిభుఁ డభయవృత్తిన్
శుభగుభయనస్తుతము నభమువిరియ నన్మద దిగిభములాగి మూర్ఛగొన బుభుతతికి నెంతే
విభవమొసఁగం ద్రిదివసభ వొగడ మీటుచును శుభభరితదృష్టిఁ బ్లవగభటతతివార్ష
ప్రభవ మగుచుండ రవినిభశరముల న్విసరెఁ గుభృదధిపుమీఁద నెగుచుభిదుగమట్లున్.

కవిరాజవిరాజితము.

తనపయి నిట్లుమితం బగుబాణవితానము వైచినఁ దా నలుకన్
దనుజవిభుండు నుదాత్తశరంబులఁ దక్షణమాత్రన దాశరథిం
జొనపిన నిర్వురుఁ జూడఁగ నొప్పిరి శోణితగాత్రులు కింశుకయుగ్మం
బనయముఁ బుష్పితమై నటియించె నటంచుఁ దలంపఁగ నట్టియెడన్. 891

స్రగ్ధర. రౌద్రాస్త్రం బుగ్రలీల న్రఘువరునిపయి న్రావణుం డేయఁ గ్రోధో
న్నిద్రుం డారాముఁడుం దన్నిశిచరపతి నాగ్నేయమహాసాయకం బ

త్యక్తసేకసూత్రమై నేయఁడు శరయుగళం బుద్ధతిం బోరి కూల
ద్రద్రద్వంద్వంబు నా నిర్వురు నిజవిజయార్థు ల్మహాఘోరవృత్తిన్. 892

వనమయూరము.

పెండియు నిశాచరులు వృక్షచరవర్యు, ల్మెండితము మెచ్చ రజనీచరవరుండుం
జండకిరణాన్వయుఁడు శాతశరకోటిన్, దండిమగ లిప్పగిదిఁ దార్కొని పెనంగన్.

క్రౌంచపదము.

దిక్కులఁ జీఁక ట్లెక్కువ యయ్యెన్, దినకరరుచి యలఁతిగఁ గనవచ్చెం
జుక్కలు ధాత్రిం బెక్కులు రాలెన్, నృగలు మనములను సొలసిరి భీతిన్
నిక్కక కంధు ల్మిక్కిలి యుంకెన్, నిగమనిగతి యవని నొరిగిపడియెన్
నిక్కము గాఁగ నృక్కలు రాలెన్, బిడతరగిరివినికరములందున్. 894

తరళ. అపుడు రావణుఁ డార్చి పేర్చి శితాస్త్రపంచక మొక్కటన్
నృపతిసింహుని వ్రేయ నమ్మహనీయకార్ముకుఁ డెంతయుం
గుపితుఁ డై పలలాదువక్షము ఘోరదివ్యశరాహతి
న్నిపుణుఁ డై పగిలింప మూర్ఛమునింగె వానరు లార్వఁగన్. 895

శుద్ధవిరాటి. అంత నమ్మూర్ఛితు నద్దశాననుం, జెంతం జేరక చిత్రరూపులై
భ్రాంతిం జెంది యుపాయహీనతం, జింతం బొంది కృశించి రాశరుల్. 896

మత్తకోకిల. తేరిమీఁద న మూర్ఛదేఱి యధిజ్యకార్ముకుఁ డై సమి
ద్ఘోరవృత్తి నృపు న్వధింపఁగఁ గోరివచ్చు దశాస్యుఁ గం
ఠీరవంబు గజంబు డీకొను రీతి మార్కొనియె న్మహా
వీరవర్యుఁడు లక్ష్మణుండు వివృద్ధవిక్రమసంపదన్. 897

క. అన్నకుఁ గన్నాకై యి, ట్లన్నరభోజను నెదిర్చి యాతనిధనువు
ల్మన్న విఱిగించి పిడము, న్మిన్నం నొగసి యున్న దాని మేదినిఁ గూల్చెన్. 898

ఉ. అట్టియెడన్ గదాకలితహస్తయుగుండు విభీషణుండు తోఁ
బుట్టువు రథ్యసారథుఁ బొంక మడంగఁగ మోఁదె యార్చినం
దొట్టిన చింత నట్లు విరథుండు నహాస్త్రశరాసనుండు నై
కట్టలుక న్విభీషణునిఁ గాంచి బొమ ల్ముడి వెట్టి యిట్లనున్. 899

ఉ. బుద్ధులు చెప్ప వద్దనిఁ బోయి నరాధము నాశ్రయించి ద
ర్పోద్ధతిఁ దద్ధితంబుగ మదోత్కటు న న్నెదిరించి బంటు వై
యుద్ధము సేయవచ్చితి మహోగ్రమృగేంద్రము సారమేయ మే
పద్ధతి మార్కొనంగల దుపాయ మెఱుంగ వహో సహోదరా. 900

చ. కనుఁగొని చేరి యుల్లము గలంగఁగఁ గంపితగాత్రుఁ డాన్నపుం
డును బెనుమూర్ఛ నొంది యతనుశ్రమఁ గొండొకసేపు తేఱి ధూళిలో
మునిఁగిన తన్ముఖాబ్జమున మోమిడి యశ్రులు వెల్లిగొల్పుచున్
జనకసుతావరుండు కపిసైన్యము దైన్యము నొంద నార్తుఁడై. 912

వ. సహోదరుం జేర్కొని. 913

క. తూలమ్ముఁ జిమ్ము పటువా,తూలమ్మన రిపుబలమ్ముఁ దూలించిన నీ
వాలమ్మున నొరగితివె ని, ట్టాలమ్మునఁ గడునలుకపటుల మలమికొనన్. 914

తే. అధికమదలీలఁ బటుకలహప్రసిద్ధ, విపినభూమి నిరంకుశవృత్తిఁ దిరిగి
శత్రుకిసలంబు శేతి నామిత్రనామ,మత్తకరి పంక్తిముఖపంకమగ్నమైతె. 915

క. భరమయ్యెనె నీ బ్రదుకి, ద్ధరణికిని ధరాధురాధురంధరవరసు
స్థిరుఁడగు నహీనమూర్తి క, సురహితుచేఁ బడఁగవలసెఁ జోద్యము గాదే. 916

క. పుడమిని బంధుల గురులం, బుడమినిసువు విడిచి విపినభూమిఁ దిరుగున
ప్పుడు నినుఁ గని ప్రాణంబులు, విడువక నిల్పుదు విడుతు నిన్ను విడిచినకతనన్ 917

సీ. కూరిమి నిద్రింపఁ గోరినయప్పుడు పల్లవచారుతల్పం బొనర్తు
వధికనిద్రాసక్తి నందియుండినయప్డు చేరి యల్లనఁ బదసేవసేయు
దాఁకలిగొని పారణాసక్తి నొందినఁ దీయనిఫలములు దెచ్చి యిత్తు
వవనీజఁ దలపోసి యలఁత నొందినవేళ నుచితంపుమాటల నూఱడింతు
వట్టి నీ విట్టిచో ననుఁబెట్టి నిదుర, పోక తగునయ్య యదియును గాక చింత
నెంతయుడలిన నూరార్చ వేట్రిధర్మ, మలుకనొందితె పిలిచినఁ బలుక వనుజ 918

క. తమ్ముఁడ నీపడుటకుఁ జి, త్తమ్ము శశసహస్రశకలితము గామినిమి
త్తమ్ము పృథుకఠినవజ్రకృ,తమ్మగుటం గాదె నిశ్చితం బూహింపన్. 919

చ. నిను విడనాడి ప్రాణముల నిల్పఁగనోపితినేని రావణుం
దునుమఁగనేర నొక్కగతి దున్మఁగనేర్చితినేని వీటికిం
జనుటకుఁ జాల నట్లు చనఁజాలితినేని సుమిత్ర నత్తమం
గనుఁగొనఁజాలఁ గాన నిటఁ గాలవశస్థుఁడు నొందు టొప్పగున్. 920

గీ. ఒంటినున్నయపుడు సౌఖ్యమొందునప్పుడు, నాఁడునప్పుడు బంధులఁ గూడునపుడు
మఱపురాక సహోదరమరణశల్య, మెమ్ములను గీఱుచున్నె నూఱేండ్లకైన. 921

ఉ. భండనభూమి నీపడినభంగిఁ గనుంగొని వానరుల్ భయా
ఖండితరాత్రి నేడ్చుటయ కాదు విహంగసమండపస్థులా

ఖండలముఖ్యులం దెలుపి గాననిమూర్ఛ మునింగి రింద్రజి
త్ఖండనుఁ డీల్గెనం చెటులు గాంతును వారము దుఃఖవార్ధికిన్. 922

ఉ. ఏటికిఁ జీవులడ్డముగ నేగి భయంపడునట్లు నీధను
ష్కోటికి నగ్గమై వెలుపుగూరెకు దానవకోటి యెంతయు
న్నేటికి మీఱెను నీవు ధరణిం బడఁగా నని చింతనొందు నిం
కేటికిఁ బ్రాణ మేటికి మహీసుత నాకని మాటిమాటికిన్. 923

వ. అనేకవిధవిలాపంబుల వగచుచు ధూళిధూసరితం బగు సహోదరుశరీరంబు నిము
రుచుఁ గౌఁగిటం జేర్చికొని మానవమాత్రుండునుం బోలె నిశ్చేతనుం డై కొంతతడ
వూరకుండి దీనాననం బెగయించి. 924

క. మిగులం దవకంబె వగలం, బొగులు కపిబలంబునెల్ల బొడగని కరుణాం
బుగ వారి కిట్లనియెఁ బెల్లుగ నొదవెను గద్గదికస్వనుఁ డగు రాలుపడన్. 925

ఉ. కాననవృత్తికంటె జనకక్షితినాథతనూజ రాక్షసా
ధీనత నొందినం గలుగు దీనతకంటె సహోదరుండు ప్రా
ణానకుఁ బాసినం గను ఘనవ్యథకంటె సుమిత్రపుత్రశో
కాననమైనఁ జూచుట భయం బగుఁగాన మృతుండ నయ్యెదన్. 926

క. అనుటయు బాష్పములలోచను లవ్వనచరులు రామచంద్రు నధికశో
కనిమగ్నమానసుం గన్గొని దుఃఖించిరి రణంబు ఘోరము గాఁగన్. 927

గీ. అధికశోకమగ్నులై హనుమన్ముఖ్యు, లున్నయెడ సుషేణుఁడు చిత్రభంగి
డాయఁ బోయి మూర్ఛవోయిన లక్ష్మణు, నంగకంబులెల్ల నరసి చూచి. 928

క. హృదయము బెదరుట, ధాతువు లదరుట మహనీయకాంతి నమరియుండుట నె
మ్మది నరసిచూచి రాముం, గదిసి సుషేణుండు నిభృతగతి నిట్లనియెన్. 929

మ. అవనీభారధురంధరప్రవర ధైర్యస్థైర్యచిత్తాబ్జ నీ
వవివేకింబలెఁ జింతనొందకుము మూర్ఛాయత్తుఁ డై లక్ష్మణుం
డవశత్వంబున వ్రాలెఁ గాక మృతదేహం బిట్లు నిద్రావికా
రవపుప్రక్రియ నొప్పునే యితఁడు సప్రాణుండు నిక్కంబుగన్. 930

వ. అని నమ్మం బలికి. 931

ఉత్సాహ. జీవశతసహస్రశేముషీవిశేషలక్ష్మణుక్
జీవయుక్తుఁ గాఁ దలంపు చిత్తమం దితండు ని
ర్జీవుఁడేని దేహ మిట్లు చెన్నుమీఱ దింకను
జీవనీమహౌషధంబుచేతఁ దెల్వి నొందెడున్. 932

ఉ. నీవు కృతప్రతిజ్ఞుఁడవు నీతలపోసినదాని కంతరా
యావలి యెన్నఁడుం గలుగ దర్కకులాగ్రణి పద్మినీశనో
ద్భావితుఁ డయ్యునం దుదయపర్వత మెక్కఁగరాక యున్న సం
జీవనిఁ జేసి లక్ష్మణు సజీవుని జేయుట చాల మేలగున్. 933

క. అని హనుమంతు న్విపులప్రజ్ఞుని వాక్పతిఫణిపతికాంతు స్వామిప్రియకా
ర్యనిరూఢబుద్ధిమంతు న్సదనుపమధైర్యహిమవంతు నతిబలవంతున్. 934

ఉ. శ్రీరమణీశభూధరశరీరుని ధీరుని నీళసైనికా
ధారుని నిర్వికారుని సదాగతినందనుమారునిం గడుం
గూరిమితోడఁ గన్గొని కపిప్రియదాకువచందనాయుమా
నోపయశంబు గైకొనఁగ జూక్తుఁడ వయ్యెదు రమ్ము చెచ్చెరన్. 935

వ. అని ససంభ్రమంబును సప్రేమంబును సస్నేహంబును సగౌరవంబును సబహు
మానంబునుగాఁ జేఁబిలిచి కార్యగతనిరూపణంబుగా నిట్లనియె. 936

గీ. ద్రోణధాత్రీధరము కడుదూరమందు, గలుగు సంధానసౌవర్ణకరణులును వి
శల్యసంజీవకరణులు సవములుగ, రాత్రు లయ్యోషధీనికరము వెలుంగు. 937

వ. సర్వసేనామూర్ఛాసమయంబున జాంబవంతుం డెఱింగించినచందంబున దూరంబును
మార్గంబును లక్షణంబును నీ వెఱుంగుదువు. 938

సీ. ఈవల నావల కీనుమాఱు సముద్రము దాఁటనోపుదు పయోపధికడంక
సమిత వేగంబగు సర్కని తేరిగుఱ్ఱంబులతోడఁ బాఱంగనేర్తు
భూనభోవలయంబు పూర్ణంబుగా మేనుఁ బెరిఁగింపఁ గడునేర్తు బిగువుగాను
బాలలీలాప్రౌఢి భానుబింబము నైనఁ బట్టి చూడఁగ నేర్తు ఫలముభంగిఁ
దెత్తు వేసీమలోనిప్రవృత్తి నైన, నట్టి నీకెన్ని యంతరాయములు గల్గె
నేని వారించి సంజీవనీనగంబు, నిమిషమాత్రంబులోనఁ దేనేర్తు వనఘ. 939

గీ. అనుడు ముదమంది యతఁ డమ్మహౌషధీవిశేష మారసి తేఁదలఁచినఁ దదీయ
ముఖవికాసము గాంచి రాముఁడు ప్రహర్షమగ్నుఁడై యిట్లనియె హనుమంతుతోడ.

శా. చంద్రద్రోణధరాధరాగ్రవిలసత్సంజీవని న్శాంబరీ
సాంద్రద్రోహాల విఘ్నమేమఱక కీశశ్రేణి యగ్గింపఁ బ
క్షీంద్రుం డచ్యుతపృతం బజయ్యుఁ డగుచున్ హేలాగతిం దెచ్చిన
ట్లింద్రారాతుల గెల్చి తెచ్చి యిపు డిమ్మౌ దాన వినాతమ్మునిన్. 940

క. భూవిదితము లాశుగసుమనోవేగము లాశుగసుమనోభవ యెట్లు
న్నీవె సకుఁ జాలునదగ, దేవరవు నైనఁ దీర్పు మిక్కార్యంబున్. 941

క. అనుటయు మేరువుఁగతి మే, నును నిగిడ్చి నరేశ్వరుం గనుంగొని సంజీ
వని దెచ్చెద నరుణోదయ, మునకు న్మనుగాఁగ వగల మునుఁగకు మింకన్. 942

వ. అని యనుజ్ఞ వడసి. 943

క. ఆక్షణమునఁ గపులక్ష్మీ, రక్షణులై విజయలక్షణంబులఁ బొగడం
బక్షీంద్రుపగిది నిజవా, లక్షేప మొనర్చి దాఁటె లవణపయోధిన్. 944

వ. దాఁటి యెగసి మిన్నుముట్టి యుత్తరాభిముఖుండై. 945

క. ప్రకటలవణాంబునిధిఁ బ్రి, చ్చుకగుంటువిధంబు గాఁగఁ జూపట్ట నగ
ప్రకరంబులు దనకుం దోం, తికడవలై కనఁబడఁగ నతిత్వరితగతిన్. 946

సీ. బహుదూర మాద్రోణపర్వతం బేక్రియఁ జనువాఁడనో యను సంశయంబు
యక్షరక్షఃప్రభయంబు మార్గం బొక్కయుండ నెట్లొకో యనుగుండెదిగులు
నాలస్యమునకు నట్టి యంతరాయంబులు తోఁచునో యనెడు నాలోచనంబు
నమ్మహౌషధుల రయంబున నెవ్విధిఁ గనుఁగొందునో నిసి ననతలఁపు
నించుకయును లేక నిజరయాహీనరణము, బ్రహ్మలోకంబువారికి భయముగూర్పఁ
బూతసంజీవనీసమానీతబుద్ధి, నరుగుఁ బవమానసుతుని లోకైకనుతుని. 947

క. పోరిఁ బోరి సురలగ్గించుచు, విరులు గురిసి రమరదుందుభిధ్వానంబు
ల్గరము మ్రోఁగె శైత్యసమా, కరుఁడై సుతు నెదురుకొనియెఁ గరువలికరుణన్. 948

వ. అంత నయ్యాంజనేయుం డనిరంకుశద్వీపంబు కుశద్వీపంబు గడచి యెడనెడ వినోదంబు లగు నదీనదంబులను హిమానీపిహితచ్ఛదంబులై పాలసముద్రంబునుం బోని యభినవంబు లగు వనంబులను విశేషంబు లగుఘోషంబులను మహోత్తుంగంబు లగుమహీధరశృంగంబులను గతమునిజనతాశ్రమంబు లగు నాశ్రమంబులను జూచుచు నేకనిశ్చయంబునం జనునవసరంబున. 949

గీ. పంక్తికంధరుండు పనిచెఁ గంధరఁ, బంక్తి వానికృతకబహుళమైన
కానఁ గూర్చి యందుఁ గాలనేమి జపంబు, సలిపె నిక్కపుంజటిలునిభంగి. 950

సీ. మకరందరసతుందమధుకరనికరఝంకారశుభకరశాఖ్మగుహంబు
సహకారకిసలభక్షణపృథుక్షణప్రతిక్షణకుహూకారపికవ్రజంబు
లంబబింబారుణలపనాలింబభాషాకమనీయశౌకాకరంబు
సమబాలతృణకిశుద్ధస్థలచంక్రమణసుమనోహరహరిణపృథుకంబు
గావన మొనర్చి యచ్చోటఁ గపటవేషధారియై దనుజాధమాధముఁడు కాల
నేమి తప మొనరించెడు నెలవు గాంచి, యంతరంగంబునం బవనాత్మజుండు. 951

క. మును సంజీవనిఁ దెచ్చి, యిఁకతఁడె నిక్కముఁ గాన నే మార్గమున
దెచ్చినవాఁడనొ యిమ్మనికత, మునఁ దెలియుమనుచు డాసి ప్రమొక్కెన్ నీతిన్. 952

క. ఇక్ష్వాకుకులంబున భీమ, ప్రత్యేకపనుఁ దహితవశపవనాంబురఘో
రత్వేశధారి లయాసమ, యాత్మేశగళుండు రాముఁ డనుగవయులకున్. 953

క. అతనితమ్ముఁడు లక్ష్మణుఁ, డాతతమూర్ఛాన్వితాత్ముఁ డగుటయుఁ దెలుపన్
నూతన నగుట సంజీవని, దేతెమ్మని పనుప వచ్చితి నమ్మని నాథా. 954

వ. అని తదీయ సమయప్రకారంబు సవిస్తరంబుగా నెఱింగించి వెండియు. 955

క. వచ్చితి మార్గము దప్పితి, నిచ్చట నినుఁ గంటిఁ ద్రోవ యెఱిఁగించి దయం
బుచ్చు మదిగాక కొలఁదొక, డిచ్చేరువ నున్నఁ జెప్పవే దగఁ గొంటిన్. 956

చ. అనుటయు సంతసించి దనుజాధముఁ డంతయు దివ్యదృష్టిచేఁ
గనుఁగొను వానిపోలికి మొగం బొకయించుక యెత్తి చూచి పా
వనిఁ గని సత్యముం దెలియవచ్చెను మామక దివ్యబోధచే
నినకులతేజు లబ్ధశరశేఖరుతనూజుల కింక మేలగున్. 957

గీ. వారు పితృవాజ్ఞ చెల్లింప వచ్చినారు, వచ్చి ఘోరాటవిని జరింపఁ జొచ్చినారు
తాటకాత్మజపంక్తికంధరులు ఖలులు, హెచ్చి వారి నచట మోసపుచ్చినారు. 958

వ. వంచించి సీతాపహరణంబు గావించుటయు వనచరసహాయులై సేతుమార్గంబున లంకాపురంబుపై విడిసి. 959

క. ఉద్ధతవిస్ఫారంబు హ్రాదిద్ధస్త్రిశుతిశ్రుతుబధిరీభూతగతిన్
యుద్ధ మొనరించి పిదప స, మిద్ధతఁ దైదై లక్ష్మణుండు మృతునివడ వునన్. 960

ఉ. రావణుశక్తిఁ గూల సుకరంబుగ నాతనిఁ దెల్పవేడ్క సం
జీవనిఁ దేర నీవిటకుఁ జెచ్చెర వచ్చె నిఁకుంగుడుం దదీ
యావసరంబు లేదు విమలౌషధరాజము లేనొసంగుదుం
ద్రావుము నీరు నీ వతిమదంబున నిక్కమలాకరంబునన్. 961

వ. అని పలికి తదీయాంతరంబున మకరంబు మెలంగుట దా నెఱుంగుం గావున. 962

క. అకలంకున కామాయికుఁ, డు కరాంగుళిఁ జూపె నటు మదవుకొక్కండు
న్మకరాకరతుల్యమును హి, మకరాతపఫేన మగ్రమకరాకరమున్. 963

క. చూపుడు రంభాకారం, భీషణసక్రమకతీంభాగం బగున
వ్యాపఁ గనుంగొని యఘ్రుక్ప్రతాపోజ్జ్వలబుద్ధి డిగ్గి ఋషి నేసడిగెన్. 964

క. కడఁగి కొలనఁ గాల్సేతులు, గడిగికొనఁ దలంచి మించి కరువలికొమరుం
డడుగిడు డిగ శాపమ్ముతి, నడిగెడుగతి మకరి యాతని యడుగుం బట్టెన్. 965

ఉ. నక్ర మనక్రవిక్రమమునం జరణంబులు పట్టిన న్బవేగా
షక్రమవృత్తి గాక యొకపట్టున దాని విదిర్చి వారిపా
నక్రియ నుత్సహించిన ఘనక్రమ మొప్ప మరుత్కుమారపా
దాక్రమణంబొనర్చి సరయంబున నమ్మకరంబు వేఁడియున్. 966

వ. ఘోరంబుగా శోకంబునకు మౌనంబు గాలంబు చందంబునం బొదువుటయు. 967

క. తూలంకషమకరంబు తలాంఛూళను వెస ద్రిప్పిత్రిప్పి కొట్టినుఁ గోలాం
గూలోత్తముండు కడిఁదియై జాలక ఘుర్మకణబింబుజాలకుఁ డగుచున్. 968

క. గ్రాహంబుం బాదపరిగ్రాహంబుం బ్రాణి సురవగాహంబు ఘన
గ్రాహానిభదీర్ఘభుజుఁ డుగ్రాహావనిపుణుఁడు విదుర్చ నాలోచించెన్. 969

వ. ఆలోచించి. 670

క. కుప్పించి యుఱికి ఖచరుల, మెప్పించియుఁ దోఁక దాని మెడఁ జుట్టి కడు
న్నొప్పించియు నమ్మకరముఁ, దప్పించుకొనంగ లేక తరుచరుఁ డాత్మన్. 971

ఉ. లక్ష్మణునుఁడు సంగరతలంబున రావణుఘోరశక్తిచే
నక్కటి మూర్ఛనొందఁ గని యోమధులం గొన నిందు వచ్చి యోఁ
జిక్కితి నక్కటా మకరిచే నుదకంబులఁ గ్రోలఁబోయి యె
ట్లోక్క నివారణం బుదయ మొందినఁ గర్జము దప్ప నెంతయున్. 972

క. అని కగచుఁ గాని మకరము, దనుఁ బట్టుట కించుకయును దలఁకఁడు హృదయం
బున ధైర్య నిశ్చిత హనుమంతుని బట్టగ నేలఁ దొరకు దోసఁగులు గలవే. 973

వ. అని చింతించి ధైర్యాతిరేకంబున 974

క. అభ్రకనిభంగి సూక్ష్మ, విరాట్భవశరీరుఁ డగుచు విబుధులు మెచ్చ
న్నిభ్రగహార్గంబునఁ డద్గర్భము వెసఁ జొచ్చె విశ్రుతకంఠబిలగతిన్. 975

చ. తరుణశను స్తమత్వమునఁ దజ్జఠరాంతరసీమఁ జొచ్చి సు
స్థిరమతి నాడికావళులు చీల్చుచుఁ బ్రేవులు ద్రోవుఁ ద్రుంచుచు
న్నరములు ద్రెంచుచుం బవనవందనరూపమహావిషంబు గ
గ్భరుజ యొనర్చ నోడి మకరంబు కరంబు భరంబు నొందుచున్. 976

క. నరుఁడు విషాన్నము గుడిచిన, పగునుఁ గను నావదిన్న పసరము భంగిం
దిరము చెడి మకర మల్లనఁ, దిరుగఁ దొరఁగ మడువు పొరుగు తిరుగుడవడఁగన్. 971

వ. జలచరంబులు సుడివడ జలజంబులు చిక్కువడం బరిభ్రమించు నెడ. 978

క. బుడిబుడి మునుఁగక కను వెన్నెలకు నెత్తుటఁ దొప్పదోఁగి లేఖాద్భుతమై
ఘుమఘుమధ్వని సంజకడఁ గెం, పసరిన యంకుపీథికరణి వాసమయమునన్. 989

క. అలసత వాఁ డెఱచుడుఁ దృష్ణిలముఖుఁడుఁ గూర్మిఁ గ్రితిమి రుచితమగు మడుఁ
జలములు రాఁ గుత్తుకఁ ద్రే, వుల ద్రోవు బవనజుఁడు దవుల్వాఁ డనఁ జేయున్. 980

సీ. వనగజంబుల గ్రసించిన దానఁ గావరే యనుభంగిఁ బద్మనద్యంబు పొచ్చ
నెలనెలనిచుఁగొల్తు నెలకొన్న కృపఁ జూడఁ డనెల యనుభంగిని నింగిఁ జూచు
ధ దుండు పదయుఁడై నను దాఁచె నను మాడ్కి నుత్తరాశ మునింగ నొదిఁగియుండు
జలచరం బలుకొంది స్థలచరం బయ్యెనో యనునట్లు లోనికి నరిగి నిలుచు
రామకార్యంబునకు నంతరాయకారి, నైతిని పాకనిగ్రహ్న్యై పోల్కిఁ
భ్రాగలూ ధిగులఁగ వెడవెడ బురదఁ జొచ్చు, మొనసియూపిరి వెడలక ముసలి మొసలి

వ. మఱియు ననేకవిధంబులం బరితాపంబు నొందుచుం బరిభ్రమింపం జొచ్చెఁ దత్సమయం బర్ధరాత్రం బయ్యె రక్తఘృమ్కారంబుకతంబునను గుముదకుముదంబులనను జక్రప్రబోధకారణంబునను భాస్కరోదయావసరంబునుం బోలె 981

క. వనచరుఁడే నేను మకరము, వనచర మటు గాన దుఃఖవననిధితీరం
బునఁ జేర్పఁగలదె యనుతీ, రునఁ బవనసుతుండు దాని రోధముఁ జేర్చెన్. 982

ఆ. వె. ఇట్టు గట్టుఁ బెట్టి దిట్టవగుచుసుడి, గొట్టుపట్టి దానికొట్టుఁ బట్టి
బిట్టు చించి రక్తపిహితశరీరుఁడై, వెడలె నినుఁడు మబ్బువెడలుకరణి. 983

వ. ఉపాయంబున వెడలుటయు నయ్యపగతుణంబున. 984

సీ. తాటంకరుచిభగద్గగితంబులగు చెక్కుటద్దములుత్కరికా వ్యాప్తములుగ
ముఖసరోజంబున మూఁగెడు భ్రమరకంబులమాడ్కి భ్రమరకంబులు నటింప
వలిపంపుఁ బట్టుకంచెలఁ బిక్కటిలఁ జేయుతోరంపు హీరుఁ జందోయి గులుకఁ
గమికొన్న కామాంధకారంబు వెన్నంటు కైవడి నూగారు దలకట్టు దనరఁ
దోవల మకరందబిందుసందోహ యుగలు, కరణిసంతోషబాష్పములు గ్రమ్మికొన్న
కన్నులమరంగ నన్నుల మిన్న యనఁగ, సౌష్ఠవసుపక్వబింబాధరోష్ఠ మెప్ప.

క. కాసారలక్ష్మి భువనోల్లాస నొసర్చితివి దుర్జలచరము చావం
జేసి యని వటునిఁ గన వచ్చె సేనఁగ మకరియొక్క చేడియ యగుచున్. 985

ఆ. వె. ఎదుర నిలిచి మ్రొక్కె యేధాన్యమాలిని, నొక్క మౌని కోపయుక్తిఁ జేసి
మకరియాపుఁ దాల్చి మడువున నుండితి, నిపుడు నన్ను యేని యెండ్లఁ బట్టి 986

వ. అని తనయుం బూర్వసంచిత మునిశాపం బెఱింగింపం దలంచి దిర్యై. 987

క. అస్ఖలితాగమవిదునకు, నస్ఖలితావావునకు నన్మహాంవునకు శు
ద్ధాస్ఖాలితోక్తికిన, య్యస్ఖలితబ్రహ్మచారికి నస్వరస యనున్. 988

క. చండకిరణసంకాశుఁడు, చండక్రోధుఁడు తపోవిచారుఁడు కౌండి
ల్యుం డనుపేరిటి మునినాథుం డొకతతి నన్నుఁ గని పృథుసుమశరహతిన్. 991

గీ. మనము గలఁగ ధాన్యమాలినీప్రముఖపుష్ప, మాలినీ తపఃబు మాలి నీకుఁ
జిక్కువడితి నింకఁ జిక్కులువెట్టకు, తీయవిల్తుకాని కీయకుమని. 992

వ. చిడిముడిపాటునం దమకించిన యద్ధరణీదేవతాసత్తమునకు నుత్తమంబును సంప్రా
ర్థనంబును సవినయంబునుం దేటపడునట్టి హితవచనోపన్యాసంబునం జిత్తంబు
మెత్తపడమి యెఱింగి. 993

క. ఏను రజస్వల నన్నన్, భూమతగుణ యెవ్విధమునఁ బొరసెను స్నానం
బైనఁ జనుదెంతుఁగ, వయ్యు, నానట్టులు చేయుమని యనఘుఁ డతఁ డనుగన్. 994

సీ. ఏగాన మిందిరాహృదయేశహృదయంబు గరఁచి విమానంబు గలుగఁజేసె
నేగాన మద్భుతం బెసఁగ ఱాల్గరఁగించి పట్టిఁ బ్రామఁకుల నవల్పట్టఁజేయు
నేగానము భవాబ్ధి నీఁద నూహించు మౌనీంద్రులకైన మోహింపఁజేయు
గంధర్వకామినీగణముల నేగాన మించుకేనియుఁ దలపోయ నీవు
దట్టిసంగీత మొకసమయమున గంధ, మాదనంబునఁ దగుతాళమానముగను
విస్తరింపంగ నచటికి వేడ్కవచ్చె, రావణుండను త్రిలోకరావణుండు. 995

క. వచ్చి నను మెచ్చి వలదని, యచ్చుపడం దెలుప వినక యనిలహతలతా
వచ్చలిత నన్నుఁ గైకొని, యచ్చపలుఁడు దేలియాడె నభిమతిగతులన్. 996

క. అతనికతన నాకడుపున, నతిబలుఁ డతికాయుఁ డనెడునతఁడు వొడమినన్
సుతుఁగొని యప్పటితుఁ డసుర,పతి సనియెన్ నైజయోధపరివృతుఁ డగుచున్. 997

గీ. అంత నాలకనాఁడు నీరాడి వలిప, తెలిమడుగుఁ దెలిప్రాఁతయుఁ దెలియలరులు
నలర నేనున్న కౌండిల్యుఁ డనియెడి జడ,దారి చనుదెంచె నలపున్కదారి యనఁగ.

వ. వచ్చి నిజతపోమహానుభావంబున నాదుండగం బెఱింగికొనినవాఁడు గావున నపరిమిత
క్రోధదుర్నిరీక్షుండై. 998

క. ఇంతుల పాపమునకుఁ గుదురు, లింతుల యనృతప్రవచన లింతుల కరల
య్యింతు లొకనికిం గూర్తురె, యింతుల నమ్మంగఁ దగునె సుమేధునకైనన్. 999

వ. అని నన్నుం గనుంగొని. 1000

మ. మతి నన్వంచన చేసి రావణు నసుత్కన్య స్మరప్రీతిఁ దే
ల్చితి వీ విట్ట్యపరాధహేతువున గాసిం బొంది నక్రంబు నా
కృతి దుఃఖస్థితి ఘోరమూర్తి వగుచుం గ్రీడింపఁ బొమ్మంచు శా
పితఁ జేసె న్ననుఁ గీశవంశకలశాబ్ధిప్రోజ్జ్వలేందూదయా. 1001

వ. తదనంతరంబున. 1002

క. మదమునఁ దెలియకనిన్నున్, మ్మదధీన ప్రావణుఁడు సుమశర క్రీడం
గదియుట సుతహితయుతుఁడై, యొదుఁగుచు సంఘాతమరణ మొందు నరులచేన్.

వ. అని యివ్విధంబున. 1005

క. కాంఁడు కోపించఁగుచుఁ బటు, శాప మొసఁగిపోఁ దలంచు సమయంబునఁ జిం
తాపరతంత్ర నగుచు న,త్తాపసిపదములను భక్తి తాశ్ర్వ్యముఁ౯. 1006

చ. కరములఁ బట్టి నన్నకఁటగాఁగ శపించెదె యెందుఁ గామిను
ల్గన మఃనీశ లిట్లగుటఁ గాదె బుధుండ ప్రతీపదర్శనీ
పరిసరవర్తి గాక యనపాయతపోమహిమానుభావ ను
స్థిరమతి నిత్యసౌఖ్యమును జెంది సుఖించుమానుండు నెప్పుడుఁ౯. 1007

వ. యతివరా శాంతుండవు గమ్ము తపఃఫలభంగంబగు. ననన్యాంగనాసంగ మసంగుండ
వయ్యును దానినచేయు మహాక్రోధంబున కేలవశగతిం బొందెదవని ప్రార్థించుటయు.

క అవనీసురవయహృదయము, నవనీతము పల్కు దారుణబిడౌజమహా
స్త్రనిరుద్ధము గావున న, న్నవలోకించి కరుణారసార్ద్రహృదయుండై. 1009

క. వ్యర్థ మగునె మద్వాక్యము, సార్థ మగుంగాక ఘోరశాపప్రతిమో
క్షార్థిని వినురాఘవకా,ర్యార్థి త్రిలోకహితకారి యనిజ్ఞఁ డిటులన్. 1010

క. వచ్చు మొనసి నీయుదరము, ప్రచ్చు నతనికతనఁ బాపరాశిఁ దొలఁగి పో
వచ్చు దివంబున కనిసెఁ, వచ్చుపడ నొసఁగి చనియె నదినిజమున్యున్. 1011

వ. మహాత్మా భవదీయచరణారవిందదర్శనస్పర్శనంబులు శాపమోక్షంబు గావించుట
వింతయే. 1012

మ. కపివంశోత్తమ కాలనేమి యను రక్షఃశ్రేష్ఠుఁ డీరీతి ని
కృష్టమానింపలేఁ ద్వత్ప్రయత్నమునకు విఘ్నప్రక్రియాలోలుఁడై
తపస్విమిచ్ఛోట మ్మహాస్థితిం బ్రకపటాస్థం జేయు వీనిం బరం
తప ఖండింపుము పొమ్ము కన్గొనుము చంద్రద్రోణశైలాంతమున్. 1013

క. కృతకార్యసిద్ధుఁడవు నిమ్మ,హ్నామ్నాతాభిష్టుతుఁడ వగుము కీశోత్తమ దు
ష్కృతమునను న్నన్న బహిష్కృతఁ జేసితి వాత్మ సంతసించితి ననుచున్. 1014

క. తన యుపకృతిఁ గావించి, దనుజుం దనతోడ సురపథమునకుఁ గొనిపో
మనమునఁ దలంచియో వానినిఁ జంపన్ ధాన్యమాలిని పనుచు టరయన్. 1015

వ. పనిచి యద్దురాత్ము కాపట్యంబును మహామధీరధురసంధానసంధానకరణార్థ
ద్యవధసంధానక్రమంబును సవిస్తరంబుగా నెఱింగించి యమ్మహామహాలు వల

గొని యద్భుతాకార శిల యగుచు నద్ధాన్యమాలిని యంతర్ధానంబు నొందుటయుం బరమాద్భుతక్రోధసంభరితహృదయుం డగుచు నాంజనేయుండు కల్మషక్రియానిత్యు దైత్యుం గనుంగొనుటయు నెఱుంగమి భావించుచు నతం డతనితో నిట్లనియె.

క. తడసితివి మిగుల నెత్తుటఁ, దడిసితి విడి యేమి మంత్రతంత్రౌషధము
ల్వడచెదవే గురుదక్షిణఁ, బడసెదవే రమ్ము నాఁగఁ బావని కినుకన్. 1017

క. గురుదక్షిణ యొసఁగెద నని, గురుదక్షిణభుజము సాఁచి గ్రుద్దిన నతఁడున్
గురుదక్షిణ నెసరగ నిరు, గురుఁ దక్షిణమునఁ జలంబు గొని పోయెనెడన్. 1018

ఉ. వెక్కసమయ్యె నంతఁ గను వింత శరీరము రూప మారి యొ
మ్మొక్కలి రక్కసుండు కపిమూర్ధము శాతనఖాలిఁ జీరినన్
నుక్కుపగిల్చి యెక్కలను ముక్కలు చేసిన ధంబునిండఁ బే
రుక్కున నక్కపీంద్రుఁడు మహోద్ధతుఁ డార్చెఁ గాలనేమియున్. 1019

క. సింహప్రక్రియ వానర, సింహంబున కడ్డ మేగి స్థిరధృతి ననుహృ
త్సంహారణకరణఖరనఖ, సంహతుల నొప్పింపఁ బవనసంభవుఁడు వడిన్. 1020

ఉ. పాటవ మొప్ప వాలమునఁ బట్టి నదీసు సటాచ్ఛటానము
త్పాటన మాచరించి వెస దంష్ట్రిలు దుల్చిన దుష్టచిత్తుఁ డ
త్తాటక మన్మఁ డప్పటివిధంబు దొఱంగి దినేంద్రసూనుఁడై
గాటపువైరి మెప్ప సముఖంబునకుం జనుదెంచి యిట్లనున్. 1021

క. అశ్రముఁడై బాహుబలప, రిశ్రముఁ డగు లక్ష్మణుం డరిప్రకరముదై
వ్యాశ్రయముగఁ గనఁ దేఱె వ్యథాశ్రమ పోనేల యౌషధకుధరమునకున్. 1022

క. సౌమిత్రి మూర్ఛ దెలిసెన, సామీరిం దోడి తెమ్ము చయ్యన ననుచున్
రామాజ్ఞ వచ్చి యియ్యా, రామంబునఁ గంటి మఱలి రమ్మా వనినన్. 1023

ఉ. ఇంచుక సంశయించి మొగ మెత్తి కడుం బరికించి పోల నూ
హించి దినేంద్రసూనుఁ డిటు కేమిటికిం జనుదెంచు వీఁడన
న్వంచన చేసి యీకరణి వానరమూర్తి వహించె వీని ఖం
డించెద నంచు నెంతయుఁ గడింది మగంటిమి యుల్లసిల్లఁగన్. 1024

క. లేలెమ్ము దురాత్మ యనుచుఁ, గోలెమ్ము విటీగెడునట్లు గ్రుద్దిన నతఁ డీ
కీ లెమ్మయిఁ దెలిసె ననుచుఁ, గోలె మ్మన నోరు దెఱచికొని వివశగతిన్. 1025

క. పడి యదె దనుజాధముఁడు గీ, ద్వడి శతశృంగుఁ డయి వేఁగ వానరపతిపైఁ
బడినఖరాయుధములఁ గద్మవడి నొప్పించుటయుఁ గొంతవడి కద్దనుజుండై. 1026

మత్తకోకిల. కాలపాశముఁ గాలపాశము బాహుదండము దండముం
గాలయాంతకుఁ డీతఁడో యనఁ గాలనేమి మృషాకృతిం
గూలఁ ద్రోచిన పిండి దైత్యుఁడు ఘోరమాయపురూపముల్
చాలఁ దాలిచి వాయునూనుఁడు సంహరించుచు వచ్చినన్. 1027

క. ఉక్కటి మారీచసుతుఁడు, టక్కరితన మడిగి సుడివడం గపికోలపుం
జక్కరవతి వానెత్తురు, జక్కర పెడలంగఁ బట్టి చంపె మగఁటిమిన్. 1028

వ. ఇట్లు నిజరూపధరుం డగు కాలనేమిని రణంబునఁ గాలనేమీరణంబు వినం బుచ్చు
టయుఁ దదీయ మాయాజాలంబుతోన కాననం బదృశ్యం బగుటయు విస్మయాంత
రంగుం డగు నబ్బల్లిదుండు. 1029

చ. పృథురయ మొప్ప నేగి కనియెన్ హనుమంతుఁడు ద్రోణశైలమున్
గ్రథితమహౌషధీద్ధలతికాచ్ఛవిభాకరదీపజాలమున్
బ్రథితగుహావిశాల విచరత్సురకిన్నరకామినీమణీ
మధురసుధారసప్రచురమానితగానవినోదమూలమున్. 1030

వ. అమ్మహాబలవంతుఁడు మహోపలాహకంబు ద్రోణధాత్రీధృచ్ఛిఖరస్థితం బగుటయుఁ
దశవిధచతుర్విధప్రకటౌషధీలతావితానం బంతర్ధానం బందుటయుఁ గనుంగొని. 1031

గీ. పరమధార్మికుఁడును జగద్బాంధవశ్వవర్యుఁ డగు రామునాజ్ఞఁ బ్రాపి వచ్చినాఁడ
నేఁజగత్ప్రాణతనయుండ నీవును జగతీభరసహిష్ణుఁడవు మందుతీఁగలిమ్ము. 1032

వ. అని హనుమంతుఁడు సంప్రార్థన మొనరించుటయు ద్రోణధాత్రీధర మా
తని పరకుగొనము పయసపుఁబ్రదనమున నీరీతియేక బా రాపూపుల్. 1033

వ. పెండియు నప్పవమాననమాణవకుండు. 1034

ఉ. జన్యములోన రావణుని శక్తి యురంబున నాఁటి రామరా
జన్యుని మద్దు సేయు ననుజన్ముఁడు లక్ష్మణదేవుఁ డిప్డు కా
శిఖ్యప్రమూర్ఛ వొందిన వడి న్విమలౌషధసంగ్రహార్థ మ
ధ్వాశ్యమహోచ్ఛశప్రదరయంబున వచ్చితి నిన్నుఁ గాంచితిన్. 1035

క. రహిఘనతరులకు నెలవగు, మహిభృద్వరపాదకటకమండన నాకున్
బహుశోషధధనముం గరినవహ్నాదయుఁ డవుగాక యొసఁగినన్ జగమెలు గన్,

వ. ఏను కృతార్థుండ నగుదు నీవును మహోన్నతుండ వయ్యెదు నాకుం గరుణింపవే య
నిప్రస్తుతించి. 1037

క. లక్షింపని ద్రోణము నుపలక్షించి పెనసన్నహోపలక్షేపము గా
లక్షగజబలుఁడు సురలు వి,లక్షులగుచుఁ జూడఁ గడుబలంబున నార్చెన్. 1038

దీర్ఘవాలవల్లార్చి కన్నుఁగవను సప్తార్చికణములు గ్రమ్మఁదేఱఁ
ఁ జుట్టి పృథుగతిఁ బెనిచి బలిమిఁ, బెఱికి దంతావళము తూఁడు వెఱికినట్లు
పోవుండై చటచ్చటాశబ్దభూర్వకంబుగా మహామహీభృత్సముత్పాటనం
బి యవ్వటుశిఖామణి శిఖామణిం బోలె నిజమూర్ధంబున ధరియించుటయు
క. 1040

ం ద్రోణనామకపర్వతముం గాచియున్న బల్లిను లసమా
ను లసంఖ్యలు గంధర్వులు పోకు మని తత్పథం బాఁగి రుషన్. 1041
నేమఱించి భూమిభ్రమము నుఱిపొమ్మధీయుతుఁ గొనిపోవన్
నైన కీశకులాధమ నిలు నిలు మనుచుఁ గడు సదల్పలు సెలఁగన్. 1042
సల విసర మెసఁగ, న్వేసరి ముసరి కసరికొనుచు విసువక వెసఁబెం
సఁగి కనిమసఁగ నసమసమసమరవిస్ఫురబలుఁడు మసల కసముసన్ 1043
పెళ క్రియుక్తిఁ బవనాత్మజుఁ డప్పుడు మత్తనాగమో
బటువాలతుండము వియచ్చరసంచయమ్మాత్సరోజముల్
గఁ ద్రిప్పి దంతములఁ జీల్చి నఖంబులఁ జీఱి పాదతా
ముష్టి ఘట్టనములం బరిపోవఁగ మోఁది వెండియున్. 1044
చ్ఛాయ కృష్ణవర్త్మయును దీర్ఘవాఁకీలాకరాళంబు వాయుపుత్ర
దంతట రోమవాతమునఁ జేర్చి, కాల్చె నీరసగంధర్వ కాననంబు. 1045
వాదిగంధర్వసేన పటుకృపాణములతోన విడిచెను ప్రాణవాంఛ
కరవాలజర్జరితాంగ మగుచు, శ్రోణములతోన విడిచెను ద్రోణవాంఛ. 1046
ద్రిప్రియు నాకపిహారణు సుధర్మగతు రిపుబలాంతకు జిష్ణున్
రిభేదిం గల్పకశరసుమములఁ గప్పి రతిముదంబున విబుధుల్. 1047
యుండై మహాముదంబున మిన్నుముట్టి మరుత్కుమారుండు మనోవేగంబున.
స మింతలేక జలదంబు విధంబున సత్పథంబునన్
ధరంబు వేడ్కఁ గొనిపోయెడు నాభయదత్రిధామ శ్రీ 1048
మ లక్ష్మణుండు సమస్థలిఁ దైవపల్లపుతాంగుడై
మేది పంకపరిదిగ్ధుఁడుఁ గాఁ గలఁ గాంచి భీతుఁడై. 1049
ద్రోత్రుఁడు భరతుఁడు, భాస్వద్గోత్రుఁడు భరతుఁడు బంధుసహితుఁడై
ష్టదోషపరిప్రాప్తికష్వప్నలఁ దలఁచి క్రుముక్కు నవసరమందున్. 1060
ద్భుతాకరముగాఁ గిరిఁగొని సంతసము మిగుల గిఱికొనఁగా నం
నెం బఱతెంచెను, గురుబలునిం గాంచి దుర్మదున మనుబుద్ధిన్. 1051

ఉ. అక్కట రామలక్ష్మణుల కాపద వొందెనొ భూమిజాత కే
దిక్కు ఘటిల్లెనో మిగులఁ జెట్టలఁ గనుఁగొంటి వానరుం
డొక్కఁడు గట్టుఁ బట్టి పుయిలోడక వే కొనిపోవఁ జొచ్చెడు
న్నిక్కము ఘోరరూపరజనీచరభూతము గాఁగ నోపెడున్. 1052

క. పసువాలుగు నబ్దాబులుఁ, దుదిముట్టఁగ వచ్చె నిపుడు దుశ్శకునం బి
ట్లొదవునె రామున కేమ్యాపద వచ్చెనొ యనుచు వగచి పదపడి కినుకన్. 1053

శా. కైకాపుత్రుఁడు భూమిభృద్వరధరన్ క్ష్మారుహ్వయం గాంచి ఘో
రాకారం బిది కూల్తునంచు ద్విడభేద్యక్రూరనారాచ మ
స్తోకక్షిప్రత నేయఁ జూచుడుఁ బరిత్యుణ్ణంబు లయ్యెన్ దిశా
ద్దూకంబు ల్గలఁగెం బయోనిధులు గట్టుల్ మ్రొగ్గె నుల్కల్ వడెన్. 1054

వ. ఆయవసరంబున. 1055

ఉ. అంబరవాణి యోదశరథాంగతనూభవ చూడు వీఁడు నీ
కుం బెఱవాఁడు గాఁడు కపికుంజరుఁ డారఘురాము దూత నీ
విం బరిమార్పఁ జూచుటవునే విడురోప యటంచుఁ దెల్పవ
య్యంబరరత్నవంశ్యుఁడు భయాద్భుతసంభ్రమసమ్మదాత్ముఁడై. 1056

క. కోపముతో హృదయుపరి, తాపముతో నహితహృదయ దారుణరణకృ
చ్చాపముతోఁ దోనయుగళము, కోపము విడనాడి యారఘుప్రభుఁ డంతన్. 1057

ఉ. పాయక రామమూర్తికి శుభప్రతిపాదక దేవతార్చనల్
చేయుచునుండె నట్లు కపిసింహుఁడు వేచని కాంచెఁ దుంగభం
గాయతదోఃప్రగాఢపరిఘాత్యుపగూహనలబ్ధజాహ్నవీ
ప్రాయికలోహితాంబుజపరాగలసద్ఘుసృణప్రవాహమున్. 1058

క. వనచరకులానుకూలము, వననిధికూలమ్ముఁ గాంచి వనచరుఁడు భవాం
బునిధి దరించు పగిది నం, బునిధి న్వెస సంక్రమించి పోకుడ నెడలన్. 1059

క. హనుమంతుఁ గూల్చి ద్రోణము, నదధిని వైచి రాననాగ్ర్యఘ్రాణన్
దనుజవిభుఁడు దశకంఠుఁడు, పనిచె న్మతిమంతు మాల్యవంతు న్మంతున్. 1060

వ. పనుచుటయు నయ్యామినీచరవరుండు. 1061

క. పోనఁగినపస నణువదిగో, ట్లసమబలాఢ్యు లసురులు సహాయులుగా స
త్రసమృద్ధి వేగి యాఁగ, న్వెస ద్రోణముఁ గొంచుఁ బోవు వీరశ్రేష్ఠున్. 1062

క. ఇట్లాఁగి ద్రోణ మేటికిఁ, బోట్లాడక విడిచి బ్రదికిపొమ్మని నెడలన్
జెట్లాంగ విశితాశన, కోట్లానిఁ జుట్టుముట్టి కో యని తాఁకన్. 1063

చ. పవనసుతుండు మూర్ధధృతపర్వతుఁ డుండఁగ కన్నిరూఢుఁడై
జవ మొసఁగం బదాహతుల జర్జరితాంగులఁ జేసి కొందఱం
బ్రవిమలదంతకుంతనఖరక్షురికాతతిఁ జేసి కొందఱన్
రవినిభుఁ డుగ్రదైర్ఘ్యకకరంబులఁ గొందఱ బిట్టు చంపుచున్. 1064

క. రంహఃప్రక్రియ నసుహృ, త్సంహతి సంహారణాలసదశనికైనడి వీ
తాంహుఁడు వాలముఁ ద్రిప్పుచు, సింహధ్వని చేసె దిశలు చెవుడుపడంగన్. 1065

వ. భైరవారావుండై యసురజీవితకాలక్షేపంబుగా వాలక్షేపంబు గావించి. 1066

క. గాలి వసుడాసుపసువుం, దూలించినభంగి నగ్గి దూదితునుకలం
గాలిచినపోల్కి సోఁచుల, గాలిసుతుఁడు ద్రేసె వేఁడ్క గ్రాలెడుమదితోన్. 1067

గీ. ఇట్టు లొకనినైఁ నిట్టట్టు పోనీక, చంపి జలధిలోనఁ జల్లు టరయ
వనచరుండు గాన వనచరంబులకెల్ల, సెరలు వెటె ననఁగ నెసఁగె నంత. 1068

మ. అరిమద్దాంతుఁడు మాల్యవంతుఁడు మహాహంకారఘోరాకృతి
స్ఫురితుండై గగనాధ్వ నప్పవనసంభూతుం దలంకింప స
త్వరుఁడై యుద్ధము వోయి పోరు మనుడు న్వాతూలబాలుండు ను
ద్ధురసత్త్వాతిశయంబు మీఱఁ గవిసెన్ దోర్దర్ప మేపారఁగన్. 1069

చ. మొదలఁ బదద్వయుఁడన్ దనుజుమూర్ధము దన్నిన మాల్యవంతుఁడుం
గదలక మాల్యవంత మనఁగా నచలస్థితి నిల్చియుండుట గాం
చఁదగ మహీధ్రభృత్పవనసంభవు డొక్కట నెత్తిఁ బెట్టి దు
ర్మదుఁ డగుపంక్తికంధరు సమక్షముఁ జేర్పఁ దలంచెనో యనన్. 1070

క. తదనంతరమున భయద, ప్రదరద్రుఘణాసి ముసలపరశుగదా దు
ర్మదశక్తిప్రముఖంబులఁ, బొదివెఁ బయోధరము ధరముఁ బొదివినయట్లన్. 1071

చ. పొదివివ నింమకేని వెఱఁ బొందని డెందముతోడ నాగముం
గదిసిన పింగదృష్టి యనఁగాఁ బవనప్రియనందనుండు త
ద్వదనబిలంబునన్ రుధిరధారలు గ్రమ్మఁగ బిట్టురంబు వె
ట్టిదముగఁ దన్ని దౌడలు కడిందిబలంబున నూడఁబీకుడున్. 1072

వ. తొల్లి గరుడవాహనుండును జక్రధరుండును నగు విష్ణువుతోడం గడంగి పెనంగి యో
హటింపని యమ్మాల్యవంతుండు వివిధమాయాజాలంబులు ప్రయోగించి నిష్ఫలం
బగుటకుఁ జింతించుచు నుగ్రశక్తి విసరి యదియునుం బొల్లువోయిన నిర్వాణంగోఁడి
యుండఁ బవననందనుండు నద్దురాత్ము నిజవామపాశంబున నతికి గిరగిరం ద్రిప్పి వైచిన

ద్రోణంబు దాఁకునఁ బ్రాణంబులు వదలి తోడిదానవులఁ దోడుచేసికొనం బోవు
చండంబగు నంబునిధి మునింగె. 1073

క. హెచ్చి పవమానతనయుఁడు, తెచ్చెడువిధులాంచితౌషధీశుభరసము
ద్వ్యచ్ఛాయలోహితరుచిస,ముచ్చయముం గాంచి రాముఁ డురుచకితుండై. 1074

వ. అరుణోదయంబనుతలంపున 1075

మ. అసుహృద్ద్వేష్యమున స్సహోదరుఁడు మూర్ఛాయత్తుఁడై యుండఁగా
నసుహృద్దుఃఖభరంబునన్ నృపతిసింహం బిట్లు చింతించె నో
యి సుమిత్రాసుత సంగరాంగణమునం దీరీతి నిల్గడించిపో
యిసుమిత్రాదిక బంధుకోటి కేమై యేనెట్లు జీవించెదన్. 1076

క. ఏనిన్నుఁ గూడవచ్చెదఁ, గాని బ్రదుకనోపఁ దినకరుఁ డుదయింపం
గానున్నవాఁడు మారుతిసూనుం డరుదేక మున్న సుకరుం డగుచున్. 1077

తే. ప్రథితసంజీవనీరసౌషధములఁ జేసి, వెలయ లక్ష్మణుప్రాణము ల్దెలియుచుండఁ
గ్రాలఁజొచ్చెనినుఁడు వంశకర్తయయ్యుఁ, దల్లి పిల్లఁ దిననేమి తగవుగలదు. 1078

వ. భగ్నప్రతిజ్ఞుండనైతి నని కపులంగలయఁగనుంగొనిన వారలు నవిరళబాష్పధారాపూ
రితలోచనులై రందుఁగొందఱుచితవచనంబుల నాశ్వాసించినం గుఱుఱ వడని డెం
దంబున దినకరునుద్దేశించి కలుషించి. 1079

తే. హరితపనుఁ డుగ్రమూర్తి మాయావినోది, పద్మినీకాముకుఁడు సత్ప్రభావనోది
లోకహితవర్తి కువలయక్షోభకారి, తపనె యీతని లోకబాంధవుఁ డనంగ. 1080

ఉ. మిత్రుఁడుగాఁడు నాకితఁ డమిత్రుఁడు నన్నుఁగరంబు భూమి భృ
న్మాత్రునిఁగాఁ దలంచె నతిమాత్రమదీయ శరాగ్నిహోత్ర మి
ద్ధాత్రివడఁక నిప్పుడ పతంగముఁ బోలెఁ బతంగు నేర్చి లో
కత్రితయంబుఁ జీకటులుగమ్మఁగఁ జేయదె యద్భుతాకృతిన్ 1081

క. అనిరౌద్ర మెసఁగ రౌద్రా,స్త్రనిరూఢప్రహతిఁ దరణి ధరణింబడనే
యనిరూపించెడు రాముఁ, గనుఁగొని యిట్లనిరి భల్లుకప్రభుముఖ్యుల్. 1082

మ. నృపచూడామణి వాయునందన సమానీతప్రశస్తౌషధీ
విపరీతచ్ఛవిగాక భాస్కరకరావేశంబుగాఁ దోఁప దీ
పపలాపింపకుఁ డెల్లవారె ననని ధైర్యస్థైర్యచిత్తుండ వై
విపరీక్షింపుము మూఁడుయామములు వర్తించున్నిజంబింతకున్. 1083

క. భూమీశ యిప్పుడపల్లవభాను ప్రవేశించె నుదయసమయం బగునే
నీమేఁయిఁ దారక లలరునె, కోమలభూమిరుహకోటిఁ గూయవె పులుఁగుల్. 1084

క. వ్రచ్చు నెదిరించు దనుజులఁ, దెచ్చును సంజీవనీ లతికలిప్పుడు నీ
కిచ్చునొమ్మదము మరల, న్వచ్చు న్మహీనాథలక్ష్మణప్రాణంబుల్. 1085

క. మనమార న్మనమారుతి, వినుమానికమునను మున్న వినుమావచ్చు
న్మనుమానవపతి లక్ష్మణుఁ, డనుమానము మాను మాత్మ నణుమాత్రంబున్. 1086

క. అంబరమణి సంశ్రితులకు, నంబరమణి కొలఁతు గాని యాతనిఁబడనే
యం బరికింతువె డింపుచ,లం బెమురుగఁ బనుపు కపిబలము మారుతికిన్. 1087

ఉ. సందియమేల యొక్క నిమిషంబునకుం జనుదెంచు నమ్మరు
న్నందనుఁ డౌషధంబులు ఘనంబుగఁ జేకొని వాపు న్మహా
నందము నొంది రామనరనాథుఁడు కీశుల భల్లుకేశులం
గ్రందుగ వానరేంద్రు నెదు రన్నియమించె ననేకకోటులన్. 1088

వ. అయ్యుత్తరక్షణంబున. 1089

సీ. ద్రోణధాత్రీధరద్రుమసంచలనపక్షిసంచయము లాచారలాజములు గాఁగ
విపులకర్కశఘోరరిపుభయంకరదీర్ఘతరవాలయష్టి కైదండ గాఁగ
సదమలమణివిభాచ్ఛాదిసంజీవనీక్షోణీధరము వెలిగొడుగు గాఁగ
దగ నెదుర్కొనవచ్చి తనచుట్టు నడిచెడి తరుచరపతులు కింకరులు గాఁగ
నిజరయప్రజనితమహోన్నిద్రభూరి, పవనసంచారములు బరాబరులు గాఁగ
ప్రకటసంజీవనీధవరాశిఁ గొనుచు, క్షిప్రగతి మీఱ వచ్చెఁ గపిప్రభుండు. 1090

వ. వచ్చి యమ్మహామహీధరంబును యథోచితస్థానసుస్థితంబుగా డించి. 1091

క. తివిరి కపు లభినుతింపఁగఁ, బవనసుతుఁడు మోడ్పుఁ గేలు ఫాలతలమునం
దవిలిచి సరభసగతి రా,ఘవునింగని యిట్టు లనియెఁ గడు ముద మొదవన్. 1092

ఉ. విఘ్నము లెన్నియేని ప్రభవించినఁ ద్వద్దయ వాని మామకో
పఘ్నముఁ జేసనీక యొకభంగిగ మందులు దెచ్చినాఁడ శ
త్రుఘ్నవనౌకసావలికిఁ, దుష్టి కడున్ జనియింప నింక శ
త్రుఘ్నుని తోడఁబుట్టువున దూర్ణము తెల్పెద మేల గా నిలన్. 1093

మ. అనినం బెన్నిధిగన్న పేదక్రియ నయ్యర్కాన్వయాధ్యక్షుఁ డా
హనుమంతున్ బిగియారఁ గౌఁగిటికి దీయం బొంగి మిన్నందె నా
ఘనుఁ డావేళ సుషేణుఁ డోషధులఁ జక్కంజాచి తా నేర్చితె
చ్చిన సౌమిత్రి ససంజ్ఞుఁడై తెలిసె నక్షీణప్రభాపూర్ణతన్. 1094

క. పృథునిద్రితుఁడు మేల్కను,విధమునఁ దెలివిగని రామవిభు లసదంఘ్రి
గ్రథితశిరస్కుఁ డగుడు భూ,మ్యధినాథుఁడు కౌతుకమున నాలింగనమున్. 1095

వ. కావించె నయ్యవనీపతిం గనుంగొని వనచరులు నపరిమితహర్షోత్కర్షు లైరంత హనుమం
తుంగని యనుగ్రహాతిశయంబున లక్ష్మణాగ్రజుం డిట్లనియె. 1096

గీ. తొల్లి ఖగనాథుఁ డమరుల గ్రుళ్ళడంచి, తల్లి వినతను గుణవతీమతల్లి సంత
తమ్ము ముద మొంద నమృతమ్ముఁ దెచ్చె,కరణిఁ దెచ్చితి సంజీవకరణి వత్స.

చ. వనచరవర్య నీవబలవంతుఁడవు న్నగవాఁడ వెల్లచోఁ
గనుఁగొనిరమ్మ సీత ననఁ గాలిచివచ్చితి పంక్తికంఠుప
త్తన మిపు డౌషధంబులు ముదంబునఁ దెమ్మనఁ గొండఁదెచ్చి తె
ట్లు నతి యొనర్పఁ జేరుదు వటుప్రవరా నిను నీగుణంబులన్. 1097

క. మారుతి యేగతి నీఁగుదు, నీఋణ మస్మత్కులంబు నిలిపితివి సమి
ద్ఘోరస్థలిమూర్ఛవడిన, యీరాజకుమారు నెత్తి యెంతయుఁ గరుణన్. 1098

వ. రెండవలోకేశుండవై లక్ష్మణప్రాణంబులు సృజియించితివన్న యని కొనియాడు
చుండె, నవ్వు డపుడు లమృతరసాస్వాదనంబునం బరితృప్తి నొందిన ద్రోణసానుమ
త్సానుప్రదేశంబుల ఫలరసమధురమధురసానుభవంబునం బ్లవంగపుంగవులునుం బ్ర
మోదమగ్నమానసు లైరి. 1099

మిత్రసుపుత్రసుమిత్రాపుత్రాదులు నిజరయంబుఁ బొడఁగని ప్రాగ్దక్
ధాత్రీపతియానతి నా,ధాత్రీధర ముంచివచ్చెఁ దగ నెప్పటిచోన్. 1100

. జంఘాలుండగు నమ్మరున్నందనుండు స్థూలజంఘులగు స్థూలజంఘాదు లనేకులు
పొదివినం జిక్కువడక యొక్కమొగిఁ జిక్కువఱిచి యుక్కడంచి యమ్మహా
మహీమహీధరంబు నాస్థానస్థాపితంబు గావించి వచ్చినంతట. 1101

క. తన కెంతేవాసి మిగులఁ, దనయంతేవాసి ద్రోణధాత్రీధరముం
గొనితెచ్చి వైచివచ్చుట, విని కనుఁగొన వచ్చెనన రవి యుదయమయ్యెన్. 1102

ఇట్లు భానూదయంబైన నెల్లకపులు, నల్లసంబున రాఘవయుక్తు లగుచుఁ
గయ్యమునకు నాయత్తులై కాలు ద్రవ్వ, చుట్టు చారులచేతను వింటఁ జేసి 1103

. విషాదవేదనాయత్తుండును బశ్చాత్తప్తుండునునగు దశకంఠుండు. 1104

క. విక్రాంతత్వముడిగి వైరక్రమము దొఱంచి విగతరాక్షసుఁడై ని
ర్వ్యగ్ర స్వచికితక్రమన్, శక్రం గని యిట్టు లనియె శోకితుఁ డగుచున్. 1105

చ. గురువర రామ తోడఁ బగఁగొంటి సహోదరుఁ గుంభకర్ణు సు
స్థిరబలశౌర్యపూర్ణు బలజిజ్జితు నాత్మసుతుం బ్రహస్తు భీ
కరతరహస్తు సైనికనికాయపతిం గడతేర్చుకొంటి నీ
తిరతు నిక్షిపణం బడపితి న్వను తోఁటిభూమి నెల్లనే. 1106

క. అతికాయమహాకాయా, ద్యతిలోకపరాక్రములు లయంబందిరి నా
గతి నీవ యింక నేనే, గతి నహితులఁ గూల్చి హితులగతి నంపింతున్. 1107

క. శుంభనిశుంభసదృక్షులు, కుంభనికుంభు లనిలోనఁ గూలి రహితదో
స్తంభనిగృహీతు లగుచున్, దంభముగా నెట్లు వారిఁ దలఁపగవచ్చున్. 1108

క. హితసుతసోదరబంధున, హితులహితులచేత దితిజు లీల్గిరి పోరో
హిత యిష్ట నీకుఁ బ్రసమీ, హిత మిది యని తెలుపు మార్య భృగుకులవర్యా. 1109

క. పత్తనమును గాలిచి రప్పిత్తముచే ఘోరగతిఁ గపిప్రకరము లా
పత్తున మిత్తికిఁ జిక్కితి, నిత్తటిఁ జే పట్టకున్న నెవ్విధిఁ బోదున్. 1110

వ. అని నరవానరాక్రమణంబును నిజపరాజయంబునుం జెప్పి. 1111

క. స్రగ్విభవము విప్రవ్రతు, భుగ్వనితాకృతము సుంతపొలుపఱుపండెన్
దిగ్విజయము త్వనసగ్రహా, ద్విగ్విశతతగాదె మున్న తేజము నొందెన్. 1112

ఉ. కావున భూమినుత్సురనికాయసమాశ్రితు లన్నరాధము
ల్లావు దొఱంగి సిగ్గఱి చలంబు మహీసుతలోన డించి నా
పోవుచుఁ బోవునట్లు భృగుపుంగవ యెట్లు లనుగ్రహించెదో
నావుడుఁ బంక్తికంఠవదనంబులు గన్గొని కావ్యుఁ డెంతయున్. 1113

క. బోధించి బుద్ధి చెప్పినఁ, గ్రోధించినయట్టి సురవిరోధిం బ్రమనో
వ్యాధినిరోధిం బంక్తిశిరోధిం గని నవ్వుచున్ గురుం డిట్లనియెన్. 1114

క. దిక్ప్రభులు దలంకఁగ హుత, భుక్ప్రియమగు హోమకర్మము నొకఁడు మాంసా
సృక్ప్రకటిత మొనరిచి యుస, కృత్ప్రబలుఁడ వౌదు వింక దివిజులకైనన్. 1115

ఉ. తూర్ణముగాఁగ వేల్మి యుదూపితమై విధివంతమై సుసం
పూర్ణము నొంద నందసురపుంగవ వర్మశరోరుచాపని
స్తీర్ణరథంబు పుట్టు నది చేకొని వైరులఁ దాడి వెట్టినం
జీర్ణపలాశము ల్పవనుచేతఁ బలెంగడు నోహటింపరే. 1116

క. నరు లెంతటివారి వా, నరు లెంతటివార రక్షణయుచని వైశ్వా
నరుఁ బూజింపుము హాలఁ గి, న్నరులు పొగలు మిగులఁ బొగుల నరతరసాసీ. 1117

క. నిర్విఘ్నకృతిగాక వేల్మి యు, నిర్విఘ్నం బగు నేని రిపుల నేఁచెదు నమమ
న్విఘ్నము గల్గిన శమనో, పఘ్నమునకుఁ బోదు విది నిబద్ధి తెలియుమా. 1118

వ. అని తన్మంత్రంబును దదాహుతిప్రమాణంబును దత్పశుప్రకారంబును దన్నిధానంబును దద్విధానంబును యథోచితంబుగా నెఱింగించి సమధిగతకాలచక్రుం డగు శుక్రుం డంతర్ధానంబు నొందుటయు 11

శా. ఉగ్రాంశుప్రతిమానతేజుఁ డగు నయ్యుర్వీసురాగ్రేసర
వ్యగ్రాదేశముఁ జాలనమ్మి నిజధైర్యస్ఫూర్తిఁ బోఁద్రోఁచి నీ
లగ్రీవుం బరమేశు నీశ్వరుఁ గడున్ లక్ష్యంబు గావించి పం
క్తిగ్రీవుం డపు డగ్నికార్యకరణాంగీకారచిత్తాబ్జుఁడై.

క. పెద్దయుఁ బ్రొద్దు చింతించి యేకనిశ్చయుండై.

మ. శుభానోత్కంఠుఁడు పంక్తికంఠుఁ డసదృక్షోణీభృదంచద్గుహా
కుహరం బొక్కఁడు చొచ్చి యందు హుతభుక్కుండంబుఁ గల్పించి దై
త్యహితుం డెల్లెడఁ గాపుపెట్టి పలలక్తద్రోణికల్గూర్చి ని
ష్ఠ హుతాశి న్సముకొల్పి వేల్వఁదొడఁగె న్సద్యోగ్నివిధానంబునన్.

వ. దారుణహోమకర్మతుండును రక్తగంధమాల్యాంబరధరుండును మౌనవ్రతుండునై కుక్కుటమార్జాలాదిఖగమృగనివహంబులు సంగ్రహించి.

క. దుర్భగశస్త్రాస్త్రంబులు, దర్భలుగా రక్తమాంసదధ్యాజ్యముల
న్నిర్భీతి శ్మశానమహీ,గర్భాభీలాగ్ని వేల్వఁగాఁ దొడఁగుటయున్.

క. గ్రహరాజపరిగ్రహణా,గ్రహమున వెల్వడు తమఃప్రకారమున భయా
వహ మగుచు నెల్లయెడ హుత,వహనిర్గతమైన ధూమవర్గము వెడలెన్.

సీ. వనచరులమ్మకలంటు మసలంకఁ గాల్చుచున్నారేమొ యని దైత్యనారు లుఱుల
ఖచరకాంతలు దశకంఠుఁడు పంపిన కాలిసంకెలలంచుఁ గడల కొదుఁగ
బిలములలో నున్న యెలుకలగతి నద్రిగుహలఁ గిన్నరుల ముక్కులు బిగింప
నమరాధము మహోపకుశి మిన్ను మూర్తీభవించి రోదసి నాక్రమించె ననఁగ
హోమధూమంబు వెలువడి యుగ్రమగుచుఁ, గపులు నివ్వెఱపడిగి తత్కారణంబు
గలనుపడఁగ విభీషణువలనఁ దెలిసి, జన్యరిపుమూర్తి రామరాజన్యమూర్తి

శా. తద్ధోమప్రవిఘాతసంఘటనబద్ధస్పర్ధుఁడై పంచెనం
చద్ధాత్రీధరభూరిసారుల మహోచ్చక్ష్మారుహాగారులం
బద్ధాశ్యంబుధరావళీమిళితాపస్పర్ధనిర్ధోషశా
వ్యద్దిగ్భ్రమదబ్జసంభవహయవ్యాపారవిస్తారులన్.

మ. నలనీలాంగదవాయునందనసుషేణక్రోధనాథుల్మహా
బలసంకాశులు కీశులాత్మగణమున్నానాదిక్పరిస్ఫోటనో
పలవిక్షేపులు కామరూపులు దృఢప్రాకారదుర్దాంతమున్
ఖలరక్షఃకరదుర్గమంతము నృపుఁ డలంకాపట్టణప్రాంగణమున్.

క. వడిఁ జేరి యాహవంబుల, గడిదేఱిన వారి నూరికావలివారిం
గడతేఱిచి ప్లవగులు పడి, బడిఁ దేరుల నద్రిసన్నిభముల నిభములన్. 1129

గీ. విఱిచి ప్రోవులు వెట్టుచు విసరికొనుచుఁ, గోప మొదవంగ ఘోట్టాణకోటిఁ జదిపి
యంగడులు రచ్చకొట్టయు లవనిఁ గలిపి, లంక సకలంక నిట్లు కలంచి యాడి. 1130

క. వెండియు వెండియుఁ బైఁడియు, నిండఁగ నుండెడు నిశాచరవిలస
ద్భాండాగారము లసవ్య, త్భాండాగారములు నీఱుగావించి వడిన్. 1131

వ. గృహారామసీమాయనోవాగ్రప్రదేశంబులు, గలంచి యాయాయుస్థలంబులఁ ద్రిమ్మరి
యెంతయును దారుణరావణహోమస్థానంబు గనుంగొనలేక తొట్రుపడుచున్నంత.

క. రావణుఁ డీమెడ వేలిమి, గావించెడు ననుచు సరమ కడుగొనములవెం
దీని విభీషణు పట్టపు, దేవి యుపాంశుగతిఁ దమకుఁ దెల్పి చనుటయున్. 1132

క. బిలముఖమునఁ గిశులు బిల, బిలఁ జని యొకచోట నైలబిలగర్వాహరున్
జ్వలనసమర్పణధృతచరు, కలితకరు న్వింశతికరు ఘటితపరికరున్. 1133

క. కని జెట్టి, జీమలుచుట్టినభంగిం బ్లవగు లురవడిం గవిసి చలం
బున నెన్నియేని బాధలు, పొనరిచినఁ జలింప కసుగపుఁగవుఁడు ధృతిన్. 1134

శా. నిర్విఘ్నంబుగ హోమకార్య మనుసంధింపన్మహాక్రోధు ల
య్యుర్వీశుట్సుగనాథమోఘులు పురస్థాపాకృతస్థాలి కా
దర్వీస్రుక్స్రువసమిద్దర్భపాత్రాదికా
పూర్వప్రాకటహోమవస్తువితతిం బోకార్చి వెల్లార్చిరన్. 1135

క. వదలని మౌనంబున దశవదనుఁడు నిష్ఠమెయి హవ్యవాహుఁ గృశానుం
బదిలుఁడయి పూజసేయుచుఁ, గదలక యుంటఁ గని రోషకలితాత్మకులై. 1136

క. కనకాద్రి నినుపసమ్మెటలను గొట్టినమాడ్కిఁ గడుఁ జలంబునఁ గపుల
ద్దనుబాధము దృఢదేహము, ఘనముష్టిప్రహతి నొంచి కదలక యున్నన్. 1137

వ. హోమవిఘ్నమునకై యడిచియుం బొడిచియుం గఱచియు నిద్దనుబాధము నొందించు
కయుం సంచలనంబు గానక కాననచరులు నివ్వెఱఁగంది కంది కుంది రయ్యెడ.

క. శుద్ధాంతఃకరణుఁ డగుచు, శుద్ధాంతము సొచ్చి వాలినూనుఁడు నయసం
వృద్ధాసుర వృద్ధదయుఁ, శుద్ధాంతముఁ బంక్తికంఠు శుద్ధాంతంబున్. 1138

తే. చేరి తత్సుందరీపరిచారికాస, హస్రసమగ్రప్రపూర్ణ నేత్రాంత మగుచు
నొదుఁగ మందోదరి కబరి నొడిసిపట్టె, భయదయమపాశసదృశోగ్రవాలుఁ డగుచు.

వ. మందారకుసుమదామసంబంధం బగు మందోదరీచికురబంధంబు వామకరంబునం
బట్టి రక్షోరాజ్యలక్ష్మిం దిగిచినచందంబున మణిమయోన్నతాసనంబు దిగం బడఁ

గ్రొచ్చి బొమ్మబిందుసందోహంబు కంఠహారముక్తాఫలయుక్తంబై నేలరాల భద్ర
దంతావళంబు మృణాళనాళంబునుంబోలె నీడ్చికొని పోయి దశకంఠు సముఖం
బునం బెట్టి నిర్దయుండై. 1142

క. ఆజ్ఞ దెలిసి దశముఖు నీ, పజ్జనుఁ గులకాంతఁ దెచ్చి పఱచుచునుండన్
లజ్జించి వెనుకఁ జూడక, యొజ్జల బుద్ధి విని చనునె హోమము సేయన్. 1139

శా. ఫుల్లాంభోజముఖీవిదీన సుమచాపున్ ఘోరచాపుం గృపా
కల్లోలిన్యధినాథు రాఘవు నయుంగా నాత్మనూహించి సం
పల్లాభంబులు పొందెదెల్లు కపటోపాయంబుఁ జింతించి ము
న్మల్లోకంబులమాత సీతఁ గడుమరోగ్రహంబునం దెత్తురే. 1140

వ. అని కఠినోక్తు లాడుచు నవనిం బడఁద్రోసిన నమ్మరుతనయు. 1141

క. వలఁ గట్టువడిన పులిఁ గన, సిలుఁగు మిగుల దైవమునిషేధించుచుఁ దా
వలిగట్టుఁ గదలక రిపు, నలుగకయున్నధవుఁ గాంచి యడలుచుననియెన్. 1142

క. పతి డాఁగురించి సీతాపతి దెచ్చితి చోరవృత్తిఁ జచ్చింప భవ
త్సతి మందోదరి దీనతఁ, బతిసన్నిధిని కపిచేత భంగముగుడిచెన్. 1143

ఉ. వాలికుమారుఁ డాలి బలవంతముగాఁ దలపట్టి యీడ్చెదే
వాలిఁ దలంకఁ జేయు ద్రవిణాధ్యుఁ డితం డని పెంపునొందఁగాఁ
జాలినవాఁడవయ్యు మునిచాడ్పున నూరక చూడఁగాదు నీ
వేలిమి బూదిగాను బడవేయుము మత్పరితాపకారణన్. 1144

క. అని పదరి యింద్రజిత్తుం, దనమదిలోఁ దలఁచి పుత్రుఁడా నీవున్న
న్నను దేటి చూడఁగా వచ్చునె మర్కటభటులికనుచు శోకించునెడన్. 1145

వ. పరిత్యక్తనిజహోమకర్మకలాపుండై 1146

ఉ. ఆయతరోమలోహితదశాననుఁడైన దశాననుండు క్రా
క్షేయుక ముగ్రభంగిగమకించుచుఁ గేల నమర్చి యుద్ధతన్
వ్రేయుఁడు నంగదుండు పిరివీడిన తాలిమి వీడె నాసురీ
స్వాఘు దనర్ఘసత్త్రగనుబంధముఁ దత్సతి కేశబంధమున్. 1147

క. భీమము విచకితఖేచర,భూమము సంపిహిత ఘన నభోవలయ మహా
ధూమము నిజసంకల్పిత,హోమము విఘ్నంబగుడు మహోగ్రుం డగుచున్. 1148

క. హుమ్మని డాసి దశముఖుఁడు, సమ్మూర్ఛితు నంగదు న్నివారింపఁ బ్రబు
ద్ధ మ్మెకరింప నెఱేఁగి త్వరితమ్మున నెదసాచి మారుతసుతుఁ డగల్చెన్. 1149

ఉ. ఈకరణిం గడంగిన కపీంద్రుఁ డిరంబుగఁ జూచి దానవుం
డాఁకలి గొన్న మృత్యువుక్రియం బదిరుత్తుకలెత్తి వానితో
నాకుల మెల్ల నీరుగ నొనర్చితి వక్షయపుత్రుఁ జంపి నీ
వేకతినుండ వెల్లకపివీరులలోన మదం బడంచెదన్. 1150

వ. అని మిట్టి పడి యవ్వాలినట్టుపట్టిం దొట్టి చెట్టుమనికిపట్టు దిట్ట తిట్టులం గట్టిసెలకట్టి యలం గొట్టిన నజ్జట్టులున్ దట్టముగఁ జలపట్టి చుట్టుముట్టి మెట్టులమెట్టియు నెట్టన మొట్టియు బెట్టుఁ దిట్టియు నిప్పట్టున వెట్టపుట్టం గుట్టు మట్టు వెట్టి. 1151

క. పగతు న్నిష్ఠాధైర్యాపగతుం గావించి ప్లవగభల్లుకముఖ్యుల్
విగళితమూర్ఛాపరవశగుణులఁ, దగ వాలిసుతుండు తమకు నగ్రేసరుఁడై. 1152

గీ. కడఁగ నడుమ నున్న కావలివారలఁ, దఱిమి తాయువగులఁ దన్ని చొచ్చి
నట్టి బిలముఖమున నందఱు వడివడి, న్వెలి రామధరణివిభునిఁ గాంచి. 1153

వ. తాము పోయివచ్చినకార్యం బెఱిఁగించి తదీయసంభావనాతిశయంబునం బ్రమోదంబునొందిరి. అధికత్రపావనతవదనయై నిజాంతఃపురంబు సొచ్చి

క. దరిగడచిన సిబ్బితి సుందరి గంధగజేంద్రయానతగుచానఁ గృశో
దరి కమలనేత్ర మందోదరి కన్గొని శోకగద్గదస్వరయగుచున్. 1154

ఉ. మన్ననఁ గల్పితాప్తులఁ గుమారులఁ బ్రేయసిభంగిపాటు నీ
కన్నులనిండఁ జూచి గతగర్వతనొందితి మున్న శత్రుద
ర్పోన్నతిఁ గాంచిశీకతయునొందితి వేఱిచలంబు శౌర్యసం
పన్నవరేంద్రు రాముఁగని భక్తి మహీసుతనిచ్చి మ్రొక్కినన్. 1155

క. నినుఁ బ్రాణయుక్తుఁ గావ్వా, రని కృపరతుణమొనర్చి రక్షోరాజ్యం
బున నీతమ్ముఁ విభీషణుల, దనరఁ బ్రతిష్ఠించి చనుఁ గృతక్రియుఁ డగుచున్. 1156

ఆ. వె. సీతఁ దెచ్చి తప్పచేసితిఁ గరుణింపు, మనుచు రామభద్రు నంఘ్రియుగముఁ
బట్టుమింకఁ జలముఁ బట్టఁగ నేటికి, వినుము నాదుపలుకు దనుజనాథ. 1157

క. మానవు గద చలము రిపు, న్మానవుఁగఁ దలఁచుటయసుమానవుఁ బోటు
న్మానమున కసువులకు నను, మానము నూన మగు ననుపమానవిచారా. 1158

వ. అనిన నిజవల్లభకు దనుజవల్లభుఁ డను. 1159

క. కాయంబులు బహుళసుఖని, కాయంబులు వివిధధననికాయంబు లభి
ప్రాయంబులు ప్రాయంబులు, ప్రాయంబులు సతి తృణాంబరప్రాయంబుల్. 1160

వ. కావున. 1161

క. ఆశల జయించుటుడిగి దు,రాశలన జయించి జనకజాత్మాధీశున్
బాశార్హప్రతినిధి న,ద్దాశరథిం దొడరి పోరఁ దగు నాకిట్లున్. 1162
క. తరణీతచ్ఛరధారా,పరిధారాప్రకటితాత్మ పండుఁడనై సు
స్థిరపుణ్యలోకసంప్రా,ప్తి రహింపం దలంపుచేసితి న్మదిలోనన్. 1163
వ. అని కృతనిశ్చయుండై. 1164
క. ముడితచెయివట్టి మెల్లన, మది తల్లడమడుగునట్టి మాటలు పొసఁగిం
చిదశాస్యుఁ డెట్టకేలకుఁ, దదనజ్ఞాతుఁడయి కదల తాత్పర్యమునన్. 1165
సీ. బ్రహ్మాండభాండంబు పగిలి బీఁటలువాఱ ద్రుతగతి విజయదుందుభులు మొరయఁ
గల్పాంతబహుళప్రకారఘోరాకార యములనాఖడ్గరోమాదు లరుగ
జలములపై నోడ చలన మందెడుగతిఁ జతురంగబలగతి జగతిఁగదలఁ
బటుహరిద్దరికర్ణపుటభేదన సమర్థ కలితశంఖారవంబులు సెలంగ
శంబశతకోటి సదృశంబు శాతఘోర,చంద్రహాసంబుచే నిజాంసంబు దనర
రథమధిష్ఠించె లోకవిద్రావణుండు, రావణుండు మదాహతైరావణుండు. 1166
సీ. సలలితకళ్యాణశరపరిపూర్ణమై షాణ్మాతురోద్భవస్థానమనఁగ
ఘనరాహుముఖకేతుకలితాంబరం బయి మహనీయతారకామార్గ మనఁగ
నధికసారాక్షుబాణాసనకలితమై కఠినకాంతారభాగం బనంగ
వరసువర్ణసహస్రహారిపరిస్ఫురితమై నవచండభానుమండల మనంగ
నగణితమణిప్రభాధగద్ధగిత మగుచు, సదమలోత్తుంగరోహణాచలమనంగ
నొప్పునరదంబు రక్తగంధోత్తరీయ,మాల్యదైగంధమెసఁగ నమ్మాద్రి నెక్కె. 1167
చ. అనుపమశక్తి షోడశరథాంగపరిస్ఫుట నేమి ఘట్టన
ధ్వనియును ఘంటికాపృథురవంబును నొక్కట విస్తరిల్లఁ బె
ల్చన నరదంబుఁ జిత్రగతులం దనసారథి కాలకేతుఁ డ
య్యనఁ గడపం దదశ్వప్రాపయంబున కెంతయు నాత్మ మెచ్చుచున్. 1168
క. శకునాపసవ్యగతిదు,శ్శకునంబని యాత్మ వృద్ధశిరుఁడొకయిం
చుకయేని సంశయము నొం,దక వడితో వెడలి యోధతతిప్రక్కొనఁగన్. 1169
వ. అనర్గళవీరస్వర్గాపవర్గమార్గ సర్గనిసర్గులరై పెనఁగుఁడని చేయువీచి. 1170
క. రాముం జంపెదఁ జచ్చెద, రామునిచే నింతెకాని రణరంగమునన్
దీమసమేది చలంబఱి,యే మగిడి పురంబుఁ జొత్తునే యెబ్బంగిన్. 1171
వ. అని బరవసంబుగావించె. 1172

క. కపిసేనావార్నిధిపై,విపరీతాసురబలాబ్ధి వెల్లి విరిసెనా
నుపమాతీతమగుచుఁ బొంగి పయింబడనదియును నిశ్చలితగతి మొనయన్. 1178

క. హృద్యమమతిఁ బూర్వమరుద్విద్విషలోకంబు వారి వెగడుగుడుపఁగా
నద్వయ మగుసంగరము బ,లద్వయమునకయ్యె సంకులబహులమగుచున్ 1179

క. రజనీచరచతురంగ,ధ్వజినీవృక్షుచరఘోరవాహిన్యంఘ్రి
వ్రజనిహతభూతధాత్రీ,రజోనికరజలద మంబరంబున ఘనమై. 1190

క. శరవర్షము విపులోపల, కరకాయుత మగుచు బలయుగవనద్వయి ను
ద్ధరసింహనాదగర్జా,స్ఫురితం బై కురిసె రక్తము నదులు గాఁగన్. 1191

ఉ. హాత్తినకొన్న వత్తతి రాదనయోధులు గండగొడ్డళు
ల్గత్తులు డొంకెనల్గుదెలుఁ గట్టెలుఁ గోలలు బారటీఁటెలు
నొక్కత్తముగాఁగ వాసరచమూనివహంబులపై విదుర్చుచుం
గుత్తుకబంటి నెత్తురులు గ్రోలుచుఁ బోరొనరించి రార్చుచున్. 1191

శా. మధ్వాపానప్రభతుణ వదోన్మాదంబునం బేర్చి సిం
హధ్వానంబున భోధ్వనీచయభీమాపాదిగా నెంతయుం
బృథ్వీభృత్ప్రతినిధ్యభంగఘనకుంభీస్యంద నారోహులై
పృథ్వశ్వంబుల నెక్కి దైత్యులరిమూర్తిస్ఫూర్తిఁ బోరాడఁగన్. 1192

క. రిణానుకంపులై పా,పాణాసారమున సుభటసామజరథఘో
ట్టాణాశ్వకరథికనికర,ఘోణాపుటములనలంగఁగొట్టుచుఁ గపులున్. 1168

ఉ. దుర్దమభంగి శాత్రవవిధూననకేళియొనర్చి ట్టి స
మ్మర్దపుటాహవంబున విమర్దితమైనని శాచరావళిన్
దుర్దశనొందనీక మునిదూషితనాముఁడు విద్దరోముఁ డ
స్వర్దయుఁ డేచి బీరమున నిర్జరయోధులు పిచ్చలింపఁగన్. 1194

చ. వెడలి దురంబొనర్పఁగని వృశ్చికరోముఁడు సర్పరోముఁడుం
గడకొని మార్గణానలశిఖానిచయంబుల వానరావళిన్
బడలువడంగఁ బేర్చి ప్రసభంబున వేఁడిమి నన్యసైన్యముల్
సుడివడ నెంతయు న్సమరసుస్థిరులై విహరించిరయ్యెడన్. 1195

క. బెడిదములగు నడిదమ్ముల,జడిదమ్ముల నొంచు శైలచరయోధులు దం
డడి మూర్ఛఁ జేర్చి రను సం,దడి కయ్యంబు గ్రమమయ్యెఁ దత్సమయమునన్. 1196

సీ. పరిపంథిదారణప్రణిపాతవారణ మృదువసావసనసమితిధరించి
ప్రేవునొడ్డాణము ల్పిరియఁగట్టులగూర్చి కత్తుకచిమ్మ గ్రోవులూని

తే. అంతఁ దత్పూర్వుఁ డింకొక యరద మాయు,ధస్ఫూర్తిగా నించి తెచ్చిన దానినెక్కి
మఱియు వింటులు పూని రామమహీకాంతు, నెమకఁ గదనమువిస్మయాస్పదమొనర్చె 1243
వ. ఆదశవదనుండు.
క. పదివిండ్లెక్కిడి శరములు, పదిపదుంబదిగిడ్చి యేర్వఁ బవపడి శరము
ల్పదినాలు లెక్కలించుచు, బదియుండైనను రామభద్రుఁడు మఱియున్. 1244
క. మునుకొను నైశ్చమునఁ గ్రమ్ముచు, మున సాయకంబులే మునుమైచిన య
మ్మున మవెమక వైచినశరంబు మహాంకె మనోక్కలి నిమిషముఁ జిట్టులుగన్. 1245
ఉ. పూర్ణధృతి న్నరేశ్వరుఁ డపూర్వశరంబులు నాఁటఁ గూర్చుచు
ద్దూర్ణముగాఁగ నేయుటలఁ దూణములోని శరాళిఁ గొంటలు
న్నిర్ణయమొప్పఁ దోఁప నొకనేర్పున దక్షిణహస్త మొప్పఁగం
గర్ణముఁ బాయకుంట కనఁగానరుఁ దక్కఁగలావువంబునన్. 1246
సీ. పావపంబులు కంకపత్రమయములయ్యె నుపవనంబులు బాణమయములయ్యె
నంబరంబెల్ల ఖగాకీర్ణమయ్యెను శరమయంబయ్యె సాగరము కరము
నాళుఁగపరిపూర్ణ మయ్యె రోదసి యయ్యె మందిరంబులు కాండమందిరములు
కోశపూర్ణములయ్యె గుములశాభవనము లతికదంబనూర్ఘుర్తులయ్యె గిరులు
రామ రాజన్యమాన్యధారాధరంబు, పృథుధనుర్గుణగర్జాప్రవీణ మగుచు
సాంద్రనీరంధ్రశాయకాసారమునను, మొనసి రావణకుధరంబు ముంచుటయును. 1247
గీ. ఆదరించి మఘవుఁ డరదంబుఁ బంపిరఁ, దద్ధయాయుధ కెండ దవులనీరుఁ
గూడదనుచు మీఁదఁ గూఁడుగట్టినభంగిఁ, బఱపె నంబకములు పార్థివుండు 1248
క. వడిచెదక పొలసుకెండియు, నడివోవని తాల్మిఁ గల్మి నొప్పు చిలుకుల
పృథు పుడమితోఁ గొంచిక, నడమోముకుల గతి దాయుణక్షణమునులై. 1249
వ. ఇరువురు నన్యోన్యవిజయకాంక్షాపరాయత్తులై క్రుద్ధసమిద్ధహస్తియుగంబుచందంబు
నఁ బరివేషాంతర్విభాసికభాస్వద్బింబద్వంద్వంబు చందంబున కిరణంబులు నెఱపుచు
మండలీకృతకోదండదండులై మండలాదిస్థానపంచకంబులు నొఱయుం బరస్పరగ్రస్త
పరిషిక్తనానాముఖాయుధంబులు మహోదధితరంగంబులకుం బ్రవాళలతావితాన
ప్రకారంబు గానింప నుద్దవిడి నద్దనుజమనుజవల్లభులు పోరాడుచున్న సమయంబున.
గీ. ధర్మగుణయుక్తిఁ బాసి వక్రమున విమతు, చిలుకు రావణు చిలుకులు చేరి రామ
చంద్రుఁగాఁడి యథోగతిఁ జెందవన్నె, యసఁగ నృపుమాని పాతాళమంటఁజొచ్చె.
గీ. శరధిజన్మించి సద్గుణస్పర్శఁ గొంది, యధికదైత్యారి పాణిగ్రహణ మొనర్చి
నట్టిసాయకలక్ష్మి వెల్లడగాటయును, గలఁగె దానవఘోషంబు కాపు - బ్రిధ 1252

క. నిర్ఘాతపాతవిప్రలఘ్వ,నిర్ఘోషము నివ్వటిల్ల నూఱుశరంబుల్
దుర్ఘటవేగం బొప్పఁగ, దీర్ఘభుజాబలుఁడు రామదేవుఁడు వైచెన్. 1252

సీ. పార్థివుం డేచి సర్పముఖాంబకం బేయ గరుడాస్త్రనిహతి రాక్షసుఁ డడంచు
నాగ్నేయసాయక మసురేంద్రుఁ డేసిన వరుణాస్త్రనిహతి భూవరుఁ డడంచు
సర్వంసహాభర్త పర్వతాశుగ మేయ వజ్రబాణహతి రావణుఁ డడంచుఁ
దివిరి దశాస్యుండు తిమిరాస్త్ర మేసిన భాస్కరాస్త్రహతి భూపతి యడంచు
సింధురశరంబు మానవసింహుఁ డేయ, సింహశరమున దానవసింహుఁ డడఁచు
నివ్విధంబున వడి నితరేతరాస్త్ర,ఖండన మొనర్చుచుండిరి భండనమున. 1253

క. కంధరపృషత్కమునం దశ,కంధరుఁడు నిగుడ్చ నృపతికంఠీరవుఁడున్
గంధవహాశుగమున పర,గంధఫణిం గూల్ప నలిగి గంధాంధుండై. 1255

క. శూలధరుఁ డోయితం డన, శూలము రాఘవుని యురముఁ జూచి విసరుడున్
భూలోక మెల్ల వహ్ని,జ్వాలాజాలములఁ గప్పి వచ్చెడు నెడలన్. 1256

గీ. పిచ్చలించుచు ఖచరులు విచ్చి చనిరి, యచ్చెరువు నొంది కపులు హాహారవంబు
లిచ్చి రసురలు రావణు మెచ్చుకొనిరి, చచ్చెఁబో దీన శ్రీరామచంద్రుఁ డనుచు.

తోటకవృత్తము. మాతలి మెచ్చ నమానవతేజో, రీతి నరేంద్రవరేణ్యుఁడు కీశ
ప్రీతికరంబుగఁ బిండి యొనర్చె, న్యాతదివస్పతి సంచితశక్తిన్. 1258

క. ఈలీల నద్రిచరవరు, లాలోకింపఁగ భీకరాలోకుండై
శూలము సురలోకహృదయ, శూలము బ్రజలోష్ణపటుకసూలముఁ గూల్చెన్. 1259

మత్తకోకిల. శక్తిచే నిజశూలశక్తి కృశత్వ మొందిన నాహవో
ద్వృత్తుఁ డద్దశకంధరుండు మహోగ్రసాయకముం జయా
సక్తి నుద్ధతిఁ బూన్చి తన్నృపచంద్రు తేరిసిడంబు సం
సక్తవానరసంచయంబు విషాద మందఁగఁ గూల్చినన్. 2601

క. సాధ్వసముగ నిజదివ్య ర,థధ్వజము దశాననప్రదరభీకరధూ
మధ్వజమునఁ బడినఁ బ్లవఁగ,ధ్వజనీనాథుఁ డలికి కనుంగొన నలుకన్. 1261

క. రామక్ష్మానాథుఁడు విశ్వామిత్రుఁ డొసఁగినట్టిసాయకములలో
మాహేంద్రాపతిత త్వర మొఘశరంబు లేయ నసురనికాయున్. 1261

గీ. సకలఖేచరులును విస్మయము నొందఁగ రవము కలవరనుఁ దగడ పునిండ
భూనభోంతరమంబరస్ఫురణ నిండఁ, జేర్చి రావణుఁడుం బోరొనర్చుచుండ. 1262

గీ. పటులవణవార్ధిఁ బుడిసిలింపంగనైనఁ, గడఁగి వింధ్యంబు నణఁగఁ ద్రొక్కంగనైనఁ
జాలువాఁ డనుదెంచె నచ్చటికిఁ గుంభసంభవుండు శుగాత్రులాసంభవుండు. 1263

ఉ. వచ్చి నరేశ్వరుల్ జయ శుభవశ్యము నీ కగు నంచుఁ దెల్పుచున్
గ్రుచ్చి కవుంగిలించుకొని ఘోరవిరోధిశరాళి నెంతయు
నొచ్చిన కాయము న్నిజసరోరుహహస్తముచే స్పృశించి పెం
పచ్చుపడంగ నిట్లనియె నమ్మహితాత్ముఁడు భక్తి యెక్కఁగన్. 1264

క. దశకంఠు శ్రమంబున, విశసింపఁగ నొప్పునట్టి వెరవు దెలిపెదన్
దశరథరాజసుతా విను, దశరథరాజాని వినుము దాని దెలియంగన్.

సీ. హరిజగద్బంధుఁ డమోపహారి సహస్రపాదు సత్యాధారుఁ బరమపురుషుఁ
గమలాకరూలుఁ జక్రప్రియుఁ బుణ్యజన ఫలప్రదానుఁ దూర్ణఖగయాను
నమితప్రతాపు నిగ్రహారాధ్య నాలంబు శుభవిభావస్వభిఖ్యాచునోష్ణు
ననఘు దేవోత్తము ఘనవిగ్రహు పుష్పగాంక మిత్రు విశ్వాత్ము విచిత్రచరితు
నితరవాచాధ్యసంచారు నిర్వికారుఁ, బ్రాకటనుశీలుఁ బీతాంబరరుచిజాలు
నచ్యుతు ననంతుఁ బుణ్యాధిరాగ్రగణ్యుఁ, బ్రస్తుతించినవారికిఁ బ్రాఁ తెజయము 1266

భుజంగప్రయాతము.

త్రిమూర్తి స్వరూపు న్సుధీపాపదీపున్, భ్రమాశోకసంతాప రాశీనిరూపు
న్ననూచీనభక్తిప్రజాతాంరక్తిప్రమోదంబునం గొల్వ భద్రంబు గల్గున్. 1267

క. కస్తి దొలఁగు నుపకలహా, స్వస్తి యగుం గాన ఖరగభస్తిం దురితా
పాస్తమతిఁ గొల్వ మనుచు న,గస్తి తెలిపి చనిన సమధిక కుతూహలుఁడై. 1268

క. భాస్కరు నాశ్రిత సుశ్రేయస్కరుని సహస్రకరు నహస్కరు విపులో
రస్కుఁడు రాముఁడు భక్తిపురస్కరుఁడై నను మెసఁగఁ బ్రణుతులొనర్చెన్.

వ. అనంతరం బయ్యనంతరత్నకంశరత్నాకరాభినవసుధాకరుండు ప్రభాకరుంగూర్చి
దివిజవిరోధి దశశిరోధిశరధారా పరిత్రస్తాంతుండును దివ్యదధచిత్రాసస్థుండును
ధర్మాభిరతుండునై సూర్యుం దర్యముండు భగుం డనునివి యాదియగు నష్టోత్తర శత
మహానామోచ్చారణంబు గావించి మిత్రరవిసూర్యభాను ఖగపూషహిరణ్యగర్భమరీ
చ్యాదిత్యదితదీయ ద్వాదశనామోపన్యాసంబు నడిపి సౌరసూక్తంబులు పఠించి
యగస్త్యోపదేశప్రకారంబున. 1270

తే. హృదయా పలరంగ నాదిత్యహృదయపఠ, మాచరించి తదీయదయాసమృద్ధి
నధికతరతరుఁ డగుచు నయ్యధిపవరుఁడు, గట్టిగిలఁ దాల్చి దశకంఠు దిట్టఁ జొచ్చె. 1271

శా. మారీచాధము దుస్సహోద్యమున ఛద్మస్ఫూర్తివై యున్న య
న్నారీరత్నము దొంగిలించితివి కానం గాన నస్మద్ధనుః
స్ఫారామోఘశిలీముఖప్రహతులన్ ఖండంబు లొందింతు నో
రోరీ రావణ మర్మ రాంధ యిఁక మా యోహాయ యుక్తుల్ చెల్లునే. 1272

క. నారీమణి సీత మఱున్నారీమణిపూత నిచ్చినం దనుజులు మ
న్నారిబ్రదికెదరు,న్నారీవేళ నటుగాక నను మార్కొనఁగన్. 1273

వ. అని కఱకుగూరకలనఱకులం బోని యులుకుఁబలుకుల నెమ్మొఱకు నెఱకులు గాఁడ
నాడి యంత నిలువక. 1874

మ. ఉదితధ్వానధనుర్ధరుండు ప్రధనోద్యోగుండు కాయత్ప్రభుఁ డి
ర్వ్యదభీష్మప్రవరంబు లేదుట యు నిష్వ్యాకుం దశగ్రీవుఁ డి
ర్వ్యదభీమాస్త్రము లేసి యొక్కమొగిఁ బైపై యుగ్రప్రాస దు
ర్మదశక్తి ప్రఘణామలుం బఱప కుంభద్ద్వైశసంరంభుఁడై 1275

గీ. శిఖిశిఖాముఖ మగ్రవిశిఖ మసురశిఖామణి యురంబు గాఁడఁగ రాముఁ డేయ
విగతధర్ముఁ డశాంతుఁడు నగుచుఁ జావు,వోనియూర్పు మునింగె దశాననుండు. 1276

ఉ. చచ్చె దశాననుం డని విషాదము నొందిరి రాక్షసాధముల్
ముచ్చట లాడుచున్ ఖచరముఖ్యులు సమ్మదమున్ దిరెల్లభూ
భృచ్ఛరులిచ్చ మెచ్చుచు నభిస్తుతి చేసిరి రామునిక్రమం
బచ్చొటు వాపె నుద్భటరథాంగశతాంగముఁ గాలకేతుఁడున్. 1277

క. కొంతవడికి దశముఖుఁ డొక్కింత తెలిసి యెల్లెడ న్నీక్షించి సమి
ద్రాంతి నరదంబు ద్రిప్పితి, సుంత కడిమిలేక యనుచు సూతుఁ గినియుచున్. 1278

వ. తదీయప్రతివచనరచనానుకూలుండై. 1279

క. ముఖము లెగయించి కటహాస్యముఖుఁడై దశముఖుఁడు దేవముఖభయదశిలీ
ముఖుఁడై నిజసారథి కభిముఖుఁడై యునరథము నరప్రముఖరాంతకుపై. 1280

వ. అని పలికి యాతం డట్లు చేయ. 1281

గీ. మలయు కీలాలధారలు మదము గాఁగఁ, గరధనుఃకరవిశిఖశీకరనికరము
కరము దనరార దైత్యకుంజరము పేర్చి, తీవ్రగతి నన్నృపతి పింగదృష్టి దాఁకె. 1282

ఉ. నిక్కపుబంటు పోలె రజనీచరయోధులు నవ్వఁ గొంచప్రన్
ద్రుక్కడి మూఁక నేర్చి కడు మోదము నొందెదు నీకు నీవ పే
రుక్కగలాని రావణు మదోద్ధతు మార్కొని వంటు యిల్లు మ
త్తెక్కి శశంబు చొచ్చుగతి నెల్లిద మైతివి మానవాధమా. 1283

క. కాయలు నాకులుఁ గూడుఁగ, మేయుచుఁ దను జరించు ట్టి మైత్రివి నీవుం
గాయలు నాకులుఁ గూడుఁగ, మేయుచును జరించి కొమ్మమెకములు బంటుల్.

తే. తాటకాదులఁగూల్చి వనాటపతుల,చేఁ బనుల్గొని వార్నిధి శిలలు నిలిపి
మచ్చరించెదు నీవొకమాయమనుజుఁడవు, గాని నిక్కపురుషుఁడవే నరేంద్ర 1285

క. మానాభిమానములు నవ,మానంబును నీకు లేవు మానిసి వోలెం
బూని విహరించెదవు గుణ,హీనుండవు నిన్నెఱుంగనే సత్త్వనిధీ. 1286

చ. చలమున నన్నె దుర్చుటకుఁ జాలక సంద్రముఁ జొచ్చితేనియుం
బలమఱ మోచితేనియును బద్దలుగా మహిఁ వ్రక్కలించి యు
మ్ముల బవళించితేనియును క్రోడమునం బ ట్టిగిలించితేనియుం
దెలియక పాలువాఁడ వయి తేనియుఁ జంపక పోవనిత్తునే. 1287

క. అని కార్ముకదళకగుణ,ధ్వనిగర్జాయుతుఁడు నాయుధతటిద్వ్రాతుఁడుక్
ఘనుఁ డసురుఁడు శరధారల, మునిఁగించె రామశైలముఁ గపులు వడఁకన్. 1288

క. క్ష్వేడాభీముండై ప్రక్ష్వేడన విసరములు విసరి వెఁడియు నిషువుల్
తోడన రోదసి నిండఁగ, వాఁడి మిగుల వైచునత్యావసరముఁ గదుకన్. 1289

మ. క్షుతనిర్యద్రుధిరప్రవర్షుఁ డురుమేఘశ్యాముఁ డారాముఁ డు
న్నతకోదండమహేంద్రచాప మమర న్నక్తంచరాధీశప
ర్వతరాజంబు జగద్భయంకరశుభాస్వత్సాయకైరమ్మదా
వృతముం జేసె ఘనారవస్తనిత మూర్వీభాగభీమంబుగన్. 290

క. ఉగ్రాంశు నిశాచరవరశగ్రామణు లగ్రబలులు సంగ్రామమహో
దగ్రులు భూనాయకపు,త్రసుగ్రీవులు పోరు టధిక కీర్తిమయ్యెన్. 1290

క. అస్థిశకలముల నతిరుణ,పస్థానంబులను మాంసభక్షణచణభూ
తస్థిరసత్త్వముఁగల,వాస్థిరి భయదవ్యవస్థితావస్థకమై. 1291

వ. జగద్భయంకరంబు గాపించె నప్పుడు. 1292

క. ప్రౌఢి వెలయఁగఁ దా నవ,గాఢశరావళులు పంక్తికంఠుపయి జయా
రూఢి నిగిడించి ప్రత్యాలీఢాంఘ్రియుఁ డగుచు మాతలిప్రేరితుఁడై. 1292

క. పదిశిరములు వేఁడియు నర్వదిశరములు వైచి భూమిమీఁదఁ గూల్చెం
బదిశిరములు రావణు ని,ర్వదికరములు నొక్కకట్టు వానికి నక్కన్. 1293

గీ. ఒక్క పడఁ గోసి యొక్కటి యట్లు మొలచి, యున్నకరశిరములు చూచి యుగ్రవృత్తి
వెండి పడఁ గేసి మొలచిన వేఁడి గూల్చి, వెండి మొలచిన సురవడి వెండి గూల్చి.

క. పదపడి యోధవితానిఁ, బదిలుండై కూల్చి యిట్లు బహువారంబుల్
పొదలినఁ గూల్చుచుఁ జిత్రా,స్పదహృదయాంబుజుఁ డధిజ్యచాపుఁడు కడఁకన్.

క. త్రెంచుం గరశిరములు మొల,త్రెంచుం గ్రమ్మఱఁగ నవి వధించు స్మృతి యే
తెంచు నవి ద్రుంచు వెసవి,త్రెంచు రణమున రణం బతిస్ఫుటభంగిన్. 1296

క. త్వరతోరణము మిగుల వి,స్ఫురితోరస్కుఁడు కదంబములు నిగిడింపం
గరతోరణ శిరతోరణ, శరతోరణపంక్తి నాకసము దివి నిండెన్. 1297

క. పుడమిఁ బడి పొరలుతలలుం, బుడమిం బడుతలలుఁ బుడమిఁ బొందనితలల
ప్పుడు తెగినతలలుఁ దెసతల, లుడుగక వెడలు తలలయ్యె నుగ్రరణమునన్. 1298

క. లలి నెన్నిమార్లు దునిమిన, మొలతుము నీవేటి కష్టముం బొందెదవు
చెలఁగవ్వ నవ్వఁగతి శూలలఁ గ్రక్కుడు పంక్తిలపములపనము లొప్పెన్. 1299

గీ. భరితవిపులచతుర్ధిశాపరిసరములు, భయదవేతాళఖేలనపరికరములుఁ
బరమశోణీకృతోరుసాగరశిరములు, కరముఁ దనరారె దశశిరు కరశిరములు.

గీ. కృష్ణవర్త్మని భాయని కీలలనఁగ, శరధి యుడుగక వెడలెడు తరగలనఁగ
భానుబింబంబుఁ దోఁచఁగని భానులనఁగఁ, దలలు వఁబకములు నృపు తరకసమున.

గీ. సంగరసరోవరము రామసామజపతి, ఘనసిరంబు శవర్తనఁ గలఁగుచుండఁ
గామ లూడిన నెత్తమ్మిగము లనంగ, నపొల్లనుఁ బిండి మొగములు నొప్పెనచట.

శా. భూభృచ్ఛాతశిలీముఖాగ్రయుగపద్భగ్నోజ్జ్వలన్మద్రికా
శోభాభాసురదీర్ఘబాహుపరిఘాస్తోమంబునం దత్సమి
ద్భూభాగంబు మణిప్రభావిభవదీప్యద్వజ్రసన్మహాభోగనా
నాభోగాన్వితభోగిసంకులలసన్నాగేంద్రలోకశ్రీయున్. 13

వ. ఒప్పె నయ్యమోఘశిలీముఖకదంబకాండరాశికిం దిప్పలుకప్పలై మహోత్పాతపతిత
గండోపలతాళఫలోపమానంబులైన శిరంబులుం గనుంగొని తద్వీయసమృద్ధిఁ గరం
బు నివ్వెఱఁగంది కందిన డెందంబున. 1304

క. పరశక్తియొ పైతామహ,పరశక్తియొ కాక పంక్తివదనువదనముల్
కరములు నూడి పోవు నూడిన,కరణిం బ్రభవించు నొక్కొ యిట నిరతమునన్. 1305

క. అని కరములు విదిలించుచు, వినివాతమతి నని శరములు విడిచి పకత
జ్జననాథుఁ డున్నఁ జేరం,జనుదెంచి వినీతిభరితసన్మతి యగుచున్. 1306

గీ. ఇద్దనుజువాభిఁ గుండలాకృతి రహించి, యమృతము న్నది పీఁయ శోర్ధి దాని
నివురఁజేయక రావణు పొవరడఁగక, వెలుఁకరలపనంబులు మొలచుచున్న.

చ. అనుచుఁ దదంగజాతవిపులాద్భుతకృత్య మెఱుంగ నావిభీ
షణుఁడు ధరాత్మజాహృదయసారసహేళికి రామవాళికి
న్వినయ మెలర్పఁ దెల్ప బృథివీభృదధీశుఁడు గూర్చియేసె నొ
క్కనిముసమాత్ర వేనిపురఁగా నపు డద్దశకాంధ్రు లగ్ని చేన్. 1808

వ. ఇవ్విధంబునం దనూనపాచ్ఛిలీముఖశిఖానివహంబులం దవియు నాభిస్థాపంస్థిత నవసు
ధాబిందుసందోహంబు డిందుపఱిచి యద్దశస్యందనుండు వెండియు నవోత్త
రశతవారంబులు శిరఃకరవారంబు లుత్తరించి నూటపదియవమాఱు మాఱులేని విక్ర
మంబునఁ గ్రమక్రమంబునఁ గరయుగంబు నొక్కొక్క శిరంబుఁ దెగవ్రేయుచు
వచ్చి నమ్మాయనయుంబుల నవబ్రహ్మ లేకీభవించినచందంబున, నష్టవసువు లొ
క్కటి యైనవిధంబున సప్తవ్యవనకులు మూర్తీభవించినపగిది మఱియు సప్తమా
తంబులు ప్రోవునమునప్పున మణిమ్మఖవాక్పతిఁ బంచాననప్రకారంబునఁ జతురా
స్యునమువఁ ద్రిమస్తకు నందంబున ద్విశిరస్కైవడిం బోలిచె నిట్లు దశముఖుం డేకము
ఖుండై యుండియుం బొలివోని మగంటిమిం బేర్చి యార్చుచు. 1809

క. మిగిలిన బాహాయుగంబునఁ, బొగలెసఁగెడు కార్ముకంబుఁ బూని రేగ్రుం
దగిలి శరంబులు నొంచిన, మిగిలిన నిజబాహుబలసమృద్ధి న్నృపతి గుణన్. 1810

క. అశవాయాసంపీడిత, దశవాగారి యన రోమదశవాహాతిన
య్యశనాంతేవాసి వ్యాళశరీరయుఁ బొదువుటయుఁ గలంగినమదితోన్. 1811

క. మర్మములు గీఱి తొడిగిన, వర్మమ్ము చినింగి యంపవాన తఱమనం
గార్ముకము విఱుగ నాదు న్నృక్కుఁడు చేయునది లేక గతమతి యయ్యెన్. 1812

మ. అసహాయుం డపమూర్ధబాహుఁడు ననాహంకారఘోషుం డపా
స్తనుహృద్ఘుఁ డపేతదివ్యకవచస్థైర్యుం డధైర్యుం డహ
స్యసుగంధుం డపహ్నృత్కలంబుఁడు నతీతామోఘుఁ డమ్యుచ్యన్
ముసలాసిక్షురికాదిసాధనముల న్మంచె న్మహీనాయకున్. 1813

క. హీనాత్ముఁ డివ్విధమున మ,హీనాయకు నేసి యునియు వృథగా దంష్ట్రా
హీనాతి దీర్ఘవిపులా,హీనాకృతి నొందు జీవితేచ్ఛ విడిచియున్. 1814

వ. కీలాలధారాధరుండై కులనగంబుచందంబునఁ గాడపరిపూర్ణతుండై కదలివిధంబున
దుర్నిరీక్ష్యుండై ప్రభాకరుకరణి సగంధుండై కరుచలిగ్రియ భూమిహితుండై మృత్యుం
జయువిధానంబున నసహాయుండై మహాశూరుసిచాడ్పున ధైర్యగాంభీర్యతేజోధ
తోగ్రవిక్రాంతులు మెఱయ నప్పాపాత్ముండు మాయికుండై మహాకాయుం
డగు నమ్మహీనాథునకుం బొదువం దలంచె. 1815

క. ఆహవ మివ్విధమున నస్త్రాహోరాత్రంబు లుగ్రమై చెల్లె జగ
ద్ద్రోహి వధియింపు మింక సందేహింపకు మనెడి సారథివచనరచనన్. 1316

శా. స్వస్త్రీభ్రూణవిభేదనక్షమపటుధ్వానాతిరిక్తంబు ర
క్షస్త్రాణ్యాదవదావఘోరవిపులాకారంబుఁ బ్రస్విన్నప
చ్ఛస్త్రాజీవనజీవనానిలఫణిట్ప్రాశ్యంబు సామ్యంబు బ్ర
హ్మాస్త్రం బుద్ధతి నారిఁ గూర్చి ప్రబలాహంకారహుంకారుఁడై. 1317

చ. క్రతుభుగభీష్ట మింక నగుఁగా కని డీకొని దృష్టిముష్టిసు
స్థితి వెలయ న్సమంత్రకముఁ జేసి సరోరుహసంభవాస్త్రము
న్బ్రతిహతవిక్రమక్రమధురంధరు రావణుఁ గూర్చి పంపె నీ
క్షితి నతివిస్ఫులింగములు చిమ్మఁ జలమ్ము బమ్ము క్రమ్మఁగన్. 1318

క. నృపతీంద్రకరోద్గతవజ్రపటిష్ఠోద్ధత్య మైన బ్రహ్మాస్త్రము వై
రిపలాదన తనుగిరిశిఖరపరిమితంబైన తచ్ఛిరం బిలఁ గూల్చెన్. 1319

శా. ధాత్రా మోఘశిలీముఖాగ్రనిజమూర్ధవ్యస్తమై యెంతయున్
ధాత్రీభాగము గ్రుంగ రావణకబంధం బప్రసంసిక్తమై
చిత్రస్ఫూర్తిని గూలఁ బ్రొప్పె శిఖరచ్ఛిన్నాతిధాతుస్ఫుర
ద్ధాత్రీభృద్వనమో యనంగ విబుధాత్యద్భుతాపాదియై. 1320

ఉ. అంతకమున్న యద్భుతతరాత్మసముద్భవహవ్యభుక్ఛిఖా
క్రాంతి నరాతిసూతతురగధ్వజసంయుతమైన తేరునిం
తింతలు చెక్కులై పడఁగ నేర్చి మహోగ్రగతి న్రసాతలో
పాంతముఁ జేరి మీఁటి పొదియం దిమిడె న్నృపహితాంబకం బొగిన్. 1321

సీ. పర్వతాగ్రము లైనఁ బడఁద్రోయు దీనిశిర మెవరే యని చెప్పుటనఁగ
సీతాపహారి నిర్జించితి వగవకు మనుమ ధాత్రికిఁ దెల్పఁ జనియె ననఁగ
దానవరక్తసిక్తతఁ బాప భోగవతీసరిత్స్నానంబు చేసె ననఁగ
బ్రహ్మహత్యాలిరసవార్ధ మర్థించి వచ్చి రామునుతులఁ గుఁ జొచ్చె ననఁగ
రావణుని తల గోసి ధరాతలంబు, దూసి పాతాళలోకంబు డాసి రయము
వాసి నృపతినిషంగసంవాసి యయ్యె, సత్వరంబుగ విశ్వసృట్సృష్టరంబు. 1322

క. హర్షించిరి నరులు విబుధులు, వర్షించిరి సురలు పూలవానలు ముదమునా
కర్షించిరి ఖేచరు లుత్కర్షించిరి జమునిఁ బన్నికర్షించి రహిన్

సీ. అమృతపాన మొనర్చినట్లయ్యె సురలకు మునులు బ్రహ్మానందమునఁ బొదలిరి
ఖచరులకెల్ల నెక్కుళ్లు వచ్చినట్లయ్యె భయమేఱి పవమాను బయలు మెఱసె

గ్రహనాయకుఁ డక్రగతినొంది మిన్నందె ధారణి యంతయును సుస్థిరతఁ బొలిచె
గొలఁకులు కమలానుకూలతఁ గొమరారెఁ గడుఁ గిన్నరులకు రాగములు బలిసెఁ
దిశలు విశదంబులై యొప్పె దేవదుందుభిధ్వనులు నప్సరోవరప్రభృతుల తాండ
వంబులును జెల్లె నారదుఁ డంబరమున, నాఁడె రావణు పడుటకు నాత్మఁ బొంగి.

క. మందారకుసుమయోగా,నందసురభి యగుచు మలయనుహితం బగుచు
మ్మందానిల మయ్యాశ్రిత,మందారుని సమ్ముఖమున మలసె శిశిరతన్. 1325

క. శౌరియు సౌమిత్రియు సా,మీరియును విభీషణుండు మృదువచనములం
జేరి కపినికరయుతులై, బోరన వినుతించి రాస్యములు వికసింపన్. 1326

క. కంధరములఁ దునుమాడిన, గంధవహాశిమాడ్కిఁ బంక్తికంధరుని లస
త్కంధరములు చిదిమి మహా,గంధవహుం డగుచు నృపతి కడు నొప్పారెన్. 1327

గీ. అంధకార మడంచిన యర్కుఁ డనఁగ, నంధకాసురుఁ దునిమిన యభవుఁ డన మ
దాంధు రావణుఁ బరిమార్చి యప్పుడొప్పె, సాంద్రవిక్రముఁడగు రామచంద్రవిభుఁడు.

చ. భృశబలు లంజనాసుతవిభీషణముఖ్యులు హర్షకృత్యముల్
విశదముగా నొనర్ప రణవేదిక నంబకవహ్ని విద్విష
త్పశువిసరం బసృక్ప్రఘృతస్రుక్స్రువణం దగ వేల్చి యిట్టిత
ద్దశరథసూతి యాజ్యవభృథం బదిసెల్లె మహాసుదంబుధిన్. 1329

వ. అంత నమ్మహీనాయకాగ్రేసరుండు. 1330

గీ. సంతసమునఁ జెఱకువిల్వసంతుచేతి, కొప్పగించిన మదనునియొప్పు గాంచె
నెక్కుడుముదంబుతోడ విల్లెక్కుడించి, లక్ష్మణునిచేత నిడి కృతలక్షణుండు. 1331

ఉ. రాఘవఘోరకేసరి శరస్ఫుటదీర్ఘవిశాలభీకరా
మోఘనఖాహతిం బ్రబలయుద్ధముం గను రావణభద్రదంతి వీ
తాఘుఁడు తత్సహోదరుఁ డహంకృతిదూరుఁడు మాన్యసజ్జన
శ్లాఘి విభీషణుం డురువిషాదమునం జని కాంచి దీనుఁడై. 1332

క. పుట్టిననాఁటంగోలెను, దిట్టతనము గట్టి పట్టి దిగ్జాధిపులన్
బిట్టలుకఁ బెట్టు నీకుం, గట్టా కట్టాఁగవలసెఁ గట్టెఁ డివగుటన్. 1333

క. ఘటకర్ణుఁడు సోదరుఁ డఁట, భటులు నిపుణుఁ డింద్రజిత్తు కొడుకఁట తా ను
త్కటబలుఁడు రావణుండఁట, యిటు కటకట పుడమిఁ గూలునే విధిచెయిదిన్.

క. బలవద్విరోధ మేటికి, వల దని నిన్నెత్తి చెప్పి వారింపఁగలే
నిలఘుత్వబుద్ధినగున్యా,య లభింపదె బంధుమరణఘోరార్తిఁ బడన్. 1335

క. అని మఱియుఁ గుంభకర్ణుని, దనుజవరుం దలఁచి తలఁచి తదనుజుఁడు విషా
దనితాంతహృదయుఁ డగుచుం, దను బ్లవగులు దేర్పఁ దెలిసెఁ దదవసరమునన్. 1385

సీ. సమికొన్న శోకాంధకారంబు వెనుకొన్న జాడఁ గొప్పులు విరివీడి యూడ
నిట్లనాథలఁ జేసితే ధాత యని దూఱు నత్తెఱంగున గరోద్వృత్తి దనర
సరసిజావలి మంచు దొఱఁగెడుగతి నయనంబుల నశ్రుజలంబు లురల
నగములపై జలదాళి కడుందూలుభంగిఁ గుచాగ్రములఁ బైఁట వీడ
గొంతు లెండఁ బదంబులు గుదివడంగ, దానవాంతఃపురస్త్రీవితాన మేడ్పు
లంబరమునిండఁ జని కాంచె సమితభీమ, భూతభూమి జగద్భయాఘాతభూమి. 1386

క. కని యల్లల్లఁ జేరం, జని రక్తము దోఁగి యున్న స్వజనాంగకము
ల్గని యుడుకు మిగులఁ గుములుచు, బోఁగననేడిచి రొక్కపెట్ట నంబరమ్రుకన్. 1387

వ. వెండియు సద్దశకంధరసుందరీసందోహంబు విపులాత్రిం గూరుసప్పటి యవస్థ
మాంసకబళనాగ్రసమాగమమహాభూతబేతాళవ్రాతంబులకు జాలిఁ బుట్టించు
నట్టిదయ్యె నందు మందోదరి సుందరుం జేరొక్కని. 1388

సీ. నిర్జరాంగన దగునిల్వటద్దము చూప మనుజకన్యక యాకుమడుపు లొసఁగఁ
గిన్నరీకాంత సంగీతంబు వినిపింప గరుడసుందరి యడిగము లొసర్ప
యక్షకంజాతాక్షి యక్షకర్దమ మీయ దనుజభామిని కయిదండ యొసఁగ
సిద్ధవిద్యాధరస్త్రీలు సేవలు పూనఁ జిల్వచెల్వలు కలాచిక వహింప
దైత్యపద్మాస్య పదవిసుద్ధవ మొనర్పఁ, దరలి గంధర్వసతి పూవుఁబంతి యొసఁగ
నిన్నుఁ గూడి సుఖించు నన్నేలఁ దడవు, మాలె నేమని దూఱుదు మాయవిధిని.

మ. సకలాశాపతిచిత్తశల్యభయదాచారానుకూలాత్మ నిం
దుకళామౌళి పదద్వయీఘటితమస్తుక్ రౌశ్యభూమీధ్రకం
దుకలీలాలసితోగ్రబాహు పరిఘాస్తోముం బరుల్గూల్చిరెం
దుకు నా వేటికిఁ బౌరుషంబు విధి యెందుండున్ జయం బందగన్. 1340

క. తను నెల్లవనితలకు ముఖ్యునుగా మన్నించు భర్త గడతేఱినచో
ననుగమనము చేయుఁ దలఁపనికష్ట యటంచు నాకు మార్పలుక వయో. 1341

లలితపదవృత్తము. అమరవిరోధి దశానన నిన్నుగ్రమగురణంబున రాముఁ డెగువఁగా
నమరచమూపతి యాగ్రహుఁడై క్రౌంచమునఁ గూల్చినచందము దోఁచెన్. 1342

క. తమ్ముని వాక్యమ్ములు విని, తమ్ముఁడ దేఁబోయి వక్క తమ్మునఁ బడితే
తమ్ములతోఁ దనయులతో, తమ్మితో బాంధవాయుతమ్ములతోడన్. 1343

గీ. మయతనూజాత యింద్రజిన్మాత విశ్రవోవధూమణి కుంభశ్రవోవధునికి
దేవకంటకు పట్టపుదేవి యనఁద, యయ్యె భరమేమి బలవంతమైనవిధికి. 1344

క. అని వతి నుఁ బెక్కుతెఱఁగుల, దనుజవిభుం దలఁచి వనిచి తద్వల్లభశో
కనిమగ్న యగుచు నటఁ గనుఁ,గొనియె న్నిజపుత్రమిత్రకోటిశవంబుల్. 1245

వ. కని సహింపని దుఃఖాతిరేకంబున. 1346

సీ. పరిపంథికాండాగ్ని పరిపీత మయ్యెనే యయ్యనేఁ డింద్రజిదంబురాశి
విద్విషత్పటుశరవృష్టిన యారెనయారె నేల ఘటకర్ణానలంబు
అరికుమారకశక్తి హతిఁ జేసి మాయనమ్మా యణఁగునె యతికాయశిఖరి
యభియాతిఘోరాశుగాహతిఁ జెల్లఁబో చెల్లఁబోలుఁ బ్రహస్తసితఘనంబు
దస్యుకోపదవానలదగ్ధమయ్యెఁ, గ్రూరకటకటా నిశాటభటాటవిప్ర
దేశ మని భీమభూతనివేశ మగుచుఁ గనుఁగొనఁగలేక మూర్ఛ మునుంగటయును.

క. వనచరులు దెలుపఁ దెలిసొం,దినయట్టి విభీషణుండు ధీరోక్తుల న
వ్వనితకడఁ జేరి తేటిచె, ననయానునయనయసవినయాలాపములన్. 1348

వ. తదనంతరంబున. 1349

సీ. అస్రవాహినులనోలాడుభూతములు నెమ్ములు చవిచూచెడు భూతములును
బొట్టల నాఁద్రెను బిల్చుభూతములుఁ బ్రేవులు గబళించెడుభూతములును
మెదడు దేర్చికొని తిని మదమెక్కు భూతము లొప్పులు వెట్టెడుభూతములను
పీనుఁగులను ద్రొక్కి పీనుభూతంబులుఁ బొగరుఁ ద్రేఁచెడు భూతములును
ఆడుభూతములును బాడుభూతంబులు, నాఁడుభూతములును బాడుభూత
ములుఁ జెలఁగుభూతములు నవ్వుభూతసు, లతిమభూతసంచయమును గలిగి. 1350

వ. భూతభయంకరంబు గాకుండియు భూతభయంకరంబై కీలాలపరిషిక్తంబు గాకుండియుఁ గీలాలపరిషిక్తంబై హరిశిలీముఖచక్రపుండరీకబహులఘనరసాకరంబు గాకుండియు హరిశిలీముఖచక్రపుండరీక ఘనరసాకరంబై కబంధప్రసారితంబు గాకుండియుఁ గబంధప్రసారితంబై యొప్పు నప్పొలికలను నెట్టుకేలకు వెలువరించి. 1351

చ. ధృతి మృతబంధుకోటికి విధిఁ దగుసాధనయుక్తి వహ్నిసం
స్కృతి పొనరించి యెల్లర కకిల్బిషతం బరలోకసత్క్రియా
ద్రుతి నెగడొంది యొప్పిన సుధీనుతు శావ్యదశౌచు వానర
ప్రతతియుతు న్విభీషణుని రాముఁడు గన్గొని సాదరంబుగన్. 1352

వ. సౌమిత్రిం జూచి. 1353

క. రావణుచేఁ బాలితమగు,దివి కిక విభీషణుం బ్రతిష్ఠింపుము రా
జై వెలయఁగాత నీతం, డాధునగిరిజలధితారకార్కముగాఁగన్. 1354

వ. అని సత్యసంధుండును గరుణాసింధుండును దీనజనబంధుండును బ్రతిజ్ఞాబద్ధుండును నగు రామభద్రుండు దాశరథి వ్యాటయును మహాప్రసాదంబని సువర్ణస్వర్ణమహార్ణవార్ణఃపరిపూర్ణభద్రకలశహస్తులగు వనచరప్రశస్తులసహాయంబున నమితవైభవాస్పదం బగులంకాపురంబుఁ బ్రవేశించి యుచితసమయజ్ఞుండై. 1355

క. పుణ్యసతులు సేసలిడఁగఁ, బుణ్యమతులు సన్నుతింపఁ బుణ్యదినమునం
బుణ్యజనసమ్మతమ్ముగఁ, బుణ్యాత్మ నాసీనుఁ జేసి పుణ్యవిధి దగన్. 1356

క. లంకాపుటభేదన మకలంకధృతి విభీషణునకు లక్ష్మణుఁడు గుణా
లంకారుఁ డించుకేళిఁ గలంకగొనక యభిషేకలక్ష్మిం గూర్చెన్. 1357

క. పరమాప్తహితు విభీషణు, బరమాప్తహితుం డఖిలనిశాటపదవికిం
గరుణారససేచనభా,సురతరపట్టాభిషేకశోభితుఁ జేయున్. 1358

చ. అమరులలోన నింద్రుఁడు హిమాద్రికులాద్రులలోనఁ దారకా
సముదయమండలంబున నిశాపతి భూమిరుహాకోటిఁ గల్పక
క్రమమున నవ్విభీషణుఁడు రాక్షసరాజికిఁ దా నధీశుఁడై
యమరవిరోధివర్గలసదంతరము న్వెలిఁగించె నెంతయున్. 1359

క. ఈచందంబున సకలని,శాచరరాజ్యాభిషేకసామ్రాజ్యయుతుం
జూచి విభీషణుఁ బొగడిరి, భూచరభూమిరుహచరనభోరాత్రిచరుల్. 1360

వ. అంతం దు నిఖిలరాక్షసరాజ్యలక్ష్మీవిరాజమానుండై మండోదరీప్రభృత్యంతఃపురకాంతాసందోహంబానందించు వర్తనంబునఁ బ్రసిద్ధుండై. 1361

క. పదిమోములయ్య తమ్ముఁడు, పదితేరుల జియ్యకొడుకు పజ్జకుఁ జనితాఁ
బదివేల్జేజే లొరిం,పఁదివిరి జేజేలు చేని పయి విరివానల్. 1362

తే. కురిసి రచ్చరలాడిరి మొరసె దేవ, దుందుభులు మింట నతితమస్సూర్యచక్రుఁ
డతి పవిత్రుఁడు మిత్రవంశాబ్ధిసుధ, మిత్రుఁ డాతని మిత్రతమిాఱఁ జూచి 1363

వ. అభినందించెఁ దదనంతరంబున. 1364

చ. సరసబహూక్తి నెలవొసంగిన మాతలి తేరుగొంచు వి
స్ఫురితగతిన్ దిశల్వెలుఁగ సూర్యసుతేశ్వర బాహుసాహస
స్థిరధృతి విక్రమాదులు నుతించుచు సత్ప్రతిలీల దేవతా
వరులును నబ్బుమిాఱఁ ద్రిదివంబున కేగె ననంతరంబునన్. 1365

సీ. వరవియోగాతపభరకర్శితయై ఘనోదయముఁ గోరెడులతాతన్వి యనఁగ
నినకరస్పర్శనాపేక్షమై దోషాచరనిబద్ధయైనపద్మిని యనంగ

గంధగజయానమేనున గంధ మలఁది, పద్మకామిత మృదులీలఁ, బాదుకొల్పి
యశ్వారోహానేక విమానాధిరోహ, జేసి రాముని సన్నిధి సేసిరపుడు.

క. తడయక జేజేపూజడిఁ, దడియుచు సరమాపతియు సదాగతిసుతుడుఁ గా
జడియక మంగళసందడి, జడియుచు రా సీతఁ దెచ్చి సమ్మతి నిలుపన్. 1874

క. ప్రీత స్స్మితమృగీవి, స్ఫీత దృగబ్జాత రాత్రిసీతను పేతన్
భూతలసంభూతం బరి, పూతం గని సురలు ముదముఁ బొందిరి మిగులన్. 1875

ఉ. మాన్యచరిత్ర కజ్జనకమానవనాయకపుత్రి కప్పురా
జన్యునిఁ జూచువేడ్క మహిజానికి జానకిఁ జూచువేడ్కసా
మాన్యము గాక యుల్లముల మల్లడి సేయఁగ దద్వధూకరా
న్యోన్యసుఖావలోకన మహాముద మొక్కట నిల్చెఁ బెల్లుగన్. 1876

క. చిరకాలవిరహదుర్భర, తరచింతానిధులు భూసుతాదాశరథుల్
గరుపారెను మేనుల నొం, డొరులం జూచికొని పొంగి రుల్లములఁ గడున్.

క, నిధిసన్నిధి యగు నధనుల, విధమున జలరాశి నీఁదు వెడలిన భంగిం
బృథివీతనయారాములు, మిథస్సవిధులగుచుఁ గరము మెఱసిన యంతన్. 1878

క. పావనిముఖ్యులు లక్ష్మణ, దేవునితోఁ గూడి యపుడధికహర్షమునం
బావనిఁ బుణ్యసతీసం, భావినిఁ గని నెమ్మనములఁ బ్రబలిరి మిగులన్. 1879

సీ. బ్రహ్మాదిదేవతాపటలంబు సనుదెంచి సుమనోభిరామ రక్షోవిరామ
జితపరశ్వధరామ వితతసద్గుణ ధామ సాత్మారామ రామఁ బొగడి
విపులశుచిప్రవేశపరమశుచిరుచిరుచి మహీకన్యఁ బ్రస్తుతించి
సారకల్పకసుమాసారపూర్వకముగా నప్పతివ్రతఁ బతికొప్పగించి
యతని మతి వొంగ నప్పుడా యతులరణమృ, తులఁ బ్లవంగపతుల నమృతలలితప్ర
వృష్టిఁ బ్రదికించి వెండియు వివిధగతులఁ, బొగడిరి నరేంద్రు రవివంశపూర్ణచంద్రు.

రగడ. జయజయపూతనుసంతతతతిభూషణ, జయజయరావణ జలదైరావణ
సుజనవిధాయక సుఖసంధాయక, సృజితవికర్తన వేదవికర్తన
సరసనిబంధన సాగరబంధన, భరితసలాంగద బాహుబలాంగద
అరిచయమారక యాజిసమారక, సురనివహావన సూరినుహావన
శుకసమవర్తన శోకనివర్తన, సకలవిదూషణ సాధితదూషణ
ప్రసన్న సుదారక సంశయదారక, యసదసనోదన హర్షవినోదన
జనకసుతావర శక్రహితావర, వినుతమహాబల విపుల మహాబల
ఖలరఘువధీవర కమ్రేందీవర, కలితసులోచన కార్యాలోచన

పృథుభవతారక హితభృంగారక, ప్రధననిశాచర పద్మనిశాచర
సమితవిభీషణ నాస్తికభీషణ, విమల యశోధన విద్యాశోధన
వపుజిత నారద వందితనారద, విపులనిరూపక విశ్వసురూపక
నతశశిశేఖర నరపతిశేఖర, శ్రితవరదాంకిత సిద్ధపదాంకిత
భయహారివారణ ప్రధనావారణ, భయదశిలీముఖ భక్తశిలీముఖ
నిహతశిరోరుహ నేత్రసరోరుహ, బహునుతబాడబ భవవనబాడబ
స్మయఖగనాశన మదపవనాశన నయగుణవర్ధన నరభుగ్వర్ధన
మునిపరిపాలన మూర్ఖవిఫాలన, యనఘనికేతన యహిరిపుకేతన
వశచతురాగమ భక్తవరాగమ, భృశబలవిక్రమ భీమత్రివిక్రమ
వలిముఖరంజన వరద నిరంజన, సలలితతారక సన్నుతతారక
కైశికకంధర కంబుసుకంధర, వీశసువాహన విబుధావాహన
అనయకదంబక హాననకదంబక, కనకకృతాంబర కాంతివృతాంబర
పాలితగోగణ పావనగోగణ, కాలనిరూపణ కార్యారోపణ
సకలసభాజన సమ్మదభాజన, ప్రకటనమజ్జన పంకనిమజ్జన
కుమ వీరుల నెఱుంగము నీకంటెను, మఱుఁ బ్రోచిన ధర్మము నీకంటెను
దీనులకొఱకె త్తితి వవతారము, మానుగ నీనామము భవతారము
చెదరక నిన్ను భజించెడువారికిఁ, గదలఁగ నేటికి గంగావారికి
కృతకృత్యుఁడవై కీర్తి వహించితి, నతిశయమీశ్రమ మంత సహించితి
నీవగువారము నీదేభారము, ఏదియు నేరమిఁ కెంచకు నేరము. 1881

సర్వతఃప్రాససీసము.

నిస్తులదురిత నిరస్త సదాభయహస్త విశామ్య ద్విహస్త విపుల
విస్తీర్ణసంసార దుస్తరాంభోనిధి విస్తారక బుధేష్ట వస్తుదాయి
ప్రస్తుతసుజన సమస్త మునీశ్వర ప్రస్తుత విద్విషాపాస్తగంధ
శస్త్రప్రదశర యశస్తోమ తీక్ష్ణగభస్తి వంశాబ్ధిప్రశస్తసోమ
విస్తరామ్నాయ సువిచార నాస్తికహార, హాస్తిరిపుకోటి శౌర్యవిధ్వస్త చార్య
త్రస్తలోకోద్ధరణ ఘనోపాస్తికరణ, స్వస్తిపదరామ భక్తవిన్యస్తకామ. 1882

ముక్తపదగ్రస్తకందము.

స్మరసుందర దరసంహార, హారవందిత దితమహారిహారివిభవభా
సురసురపూజిత జితఖర, ఖరశరశరకీర్తినికర కరపదపద్మా. 1883

ఖడ్గబంధోత్సాహవృత్తము. రామనామ సోమధామ రాజరాజపూజకా
కామితార్థ దాయకా సుక్షైక సద్విధాయకా
కామినీ సితాబ్జసాయకా మనోజ్ఞనాయకా
కామశోక మోహలోభ ఖండనాదికారకా. 1384

చక్రబంధ శార్దూలము.

జన్యాలక్షితరాతుసోత్కర దయాసామర్థ్య శౌర్యక్రమా
మన్యూత్సర్జన మత్తపామరవిరామా ధ్వస్త శోకక్రియా
యన్యాయాపహ నాగభాస్వరశయానా వంద్య భూభ్రమా
మాన్య శ్రీజనకామ నిర్భయద రామా శ్రీదయాద్యుత్తమా. 1385

పాదాదిపాదాంత ముక్తపదగ్రస్త సింహావలోకన ద్విప్రాస నిరోష్ఠ్యకందము.

శరధీడిత కీశరధీ శరధీహితకీర్తి నిరత చలితాశరధీ
శరధీద్ధగతేశరధీ, శరధీరార్తిహతసునూన చయదాశరధీ. 1386

గోమూత్రికాబంధకందము.

సరసీజాతు రమాభా, సుసీతాకామ దాసశోకవిరామా
సురపూజా వరశోభా, భరపూతారామవాసపైకపరామా. 1387

క. అని మిసిలేని విధంబున, నిమిషు లిట్లభినుతించి యందఱకును ద
జ్జననాథుఁడు సెలవొసఁగినఁ, జని పొందిరభీష్టలీల స్వస్థానంబుల్. 1388

వ. అయ్యవసరంబున దశస్యందనుండును నందన సందర్శన సంస్పర్శన సంభాషణ సంభా
వనంబుల నమందానందకందళిత హృదయారవిందుండై 1389

క. మీ కొఱఁగొడ్డములాడిన, నాకొఱగాములు సహించి నాకొఱకు మదిన్
శ్రీకొఱకు లెక్కసేయని, మీకొరయలు సమానులే సమిద్ధ్యసులారా. 1390

చ. అని పదివేలచందముల నాత్మజులం దడవాడి క్రోవలిం
గనుఁగొని రాముఁ జూచి జనకక్షితినాథతనూజ సాధ్వసౌ
ఖ్యనిహతి కాత్మనోర్చి యనఘస్థితి లోకము కెక్కఁ జేసె నే
మని పలుకంగ వచ్చునని యాడి కడుం గొనియాడి వేడుకన్. 1391

క. తనయుఁ దగుభంగి మ్రొక్కిన, తనయుల దీవించి దశరథవిభుఁడు మునువ
చ్చిన సురవిమానరాజ, మ్మునఁ గ్రమ్మఱఁ జనియె దివిజముఖ్యసహితుఁడై. 1392

చ. హరిపదబంధురంబుఁ గనలానుగుణం బరుణప్రభాఢ్యమున్
గరుడ సహస్రము వేగ ఘనఘుం బతిరిక్త విశాలకిన్నరా

మ. చని కాంచెన్ ఘననీలుఁ బింగళజటాజాలు న్సలీలున్మహీ
తనయాలోలు నలోలు మోక్షపదవిద్యాజాలుఁ బుణ్యాలవా
లు నిరాభీలు సమస్తలోకపరిశీలు న్సంగరోత్క్వేలు కా
లు నవాచాలు ఁసన్నిటాలు సుకృపాళు న్రామభూపాలునిన్. 1405

క. కని మోడ్పుఁగేలు ఫాలమ్మునఁ జేరిచి భరతభూవిభుఁడు మహీతనయా
వరజాత ముఖిలతమ్ముల, తనయాన్వితుఁడు నృపతిపదంబులఁ బ్రాలెన్. 1406

క. వ్రాలి సుదశ్రుఝరీప్రక్షాళిత పదకములఁ జేయఁ గని రామమహీ
పాలుఁడు సోదరముఖ్యు దృఢాలింగితుఁ జేసి మూర్ధ మాఘ్రాణించెన్. 1407

శా. ఆశీర్వాదపురస్సరం బయిన మూర్ధాఘ్రాణముం జేసి ధా
త్రీశుం డల్లను పల్లవింపఁ బ్రియవక్తృత్వంబు దీపింప శో
భాశాల్యాత్మకరాంబుజాతపరిస్పృష్టస్వానుజేద్ధాంగక
ప్రాశస్త్యుండయి సేమమే భరత శుంభద్దైవసత్యవ్రతా 1408

క. అని యాడి పిన్నతమ్మునకును మువ్వురు దల్లులకును గురువరులకును బురం
బునఁగలవారలకు నఖిల, జనపదవాసులకుఁ గడుఁ గుశలమే యనినన్. 1409

వ. భరతుండు మహానందభరితుండై. 1410

చ. స్మితరుచికౌముదీపటు సముద్ధ విశద్ధితలోచనోత్పల
చ్యుత మకరంద రూప విభవోజ్జ్వల సమ్మదబాష్పసత్సుధా
ప్లుత విలసత్కపోల పరిపూర్ణ భవన్ముఖచంద్రమండల
ద్యుతిఁ గని యెంతయుం గుశల మొందవె యాశ్రితదృక్చకోరముల్. 1411

తే. అట్టి నీదర్శనమున మా యట్టివారి, కెల్ల సేమంబు గల్గుటకేమి వింత
యాడవి నీవున్న పదునాల్గుహాయనమ్ము, లారయఁ జతుర్దశయుగంబు లయ్యె నాకు.

కుశలము నీసహోదరుల కమ్మగురువర్గులకు న్మదీయంబు భూ
పశుభము పౌర జానపద బాంధవకోటికి సమ్మదంబు ని
త్యకుశలకీర్తి ధీపతి కహర్పతివంశపయోధిచంద్ర నీ
కుశలము సర్వభూతములకుం గుశలంబు తలంచి చూడఁగన్ 1413

క. తలిదండ్రుల మదికోరికి, దెలిసి యడవికరిగి కొండదిమ్మరిప్రోవుల్
[illegible]లుపుగొని పీఁకసోఁకుం, గోల మఱచిన నీకు సరియగుదురే సాముల్. 1414

క. అని మఱియుఁ బెక్కుభంగులఁ, దనుఁ బొగడుచునున్న యట్టి తమ్ముని భరతు
న్మనమున హర్షించి పునః, పున రాలింగనములవిభుం డొనరించెన్. 1415

వ. తదనంతరంబున వసుంధరానందనానుందగపదారవిందంబులకు మ్రొక్కిన యక్కోమలి నెయ్యమెక్కుడు గుణంబు లగ్గించి మిక్కిలి దీవనలు పడసి సమస్తంబు కుశలంబ యని యడుగుడు. 1416

క. ఆతఁ డతఁడైన విధమునఁ, గౌతూహల ముప్పతిల్ల గాఢస్నేహో
పేతమతిఁ గౌఁగిలించిరి, ఖ్యాతిసుమిత్రాసుతుండుఁ గైకాసుతుఁడున్. 1417

తే. అచట శత్రుఘ్నుచే రాఘవాగమనము, విని వసిష్ఠుఁడు ముదమంది విన్నుముట్టి
దశరథాంగనలును దోనఁ దగినయూన, పంక్తితోఁ జనుదెంచఁగ బయలుదేఱె. 1418

క. పరమోత్సవం బయోధ్యా, పురమునఁ గావింపఁ బంచి భూరిద్యుతివి
స్ఫురితాంబరపుష్పకమును, దను భరద్వాజనియమిధన్యాశ్రమమున్. 1419

ఉ. చేరి వనాటరాత్రిచరసేవితు నాతఁడు భ్రాతృయుక్తు ధా
త్రీరమణీసుతాయుతుని శ్రీరఘురామమునీంద్ర వంద్యుఁగ
న్నారఁగఁ జూచి జన్మము కృతార్థత నొందె నటంచుఁ దన్నమ
స్కారము లర్ఘ్యపాద్యములుఁ గైకొని కైకొని యాదరంబునన్. 1420

వ. ఆశీర్వదించి యభినందించి. 1421

క. దశకంఠుని బాధల దుర్దశఁ గంటకులైన ప్రజల దివిజుల
న్విశదగతిఁ బ్రోచు మతిమను,జశరీరం బూనినట్టి శార్ఙ్గివి సుమ్మా 1422

త్రిమూర్త్యాత్మక స్తవకందకము. శివవిప్రవినుత యమ్యాత, భవభయమోచన శశిప్రభాకరరాజీ
వవిలోచన దేవముఖవి, భవభాషానాథవంద్య భవ్యనిధానా. 1428

వ. అని యనేక విధంబుల నతని వివిధవాసకథాసేతువిధానుకథావిక ప్రయోజనం
బు లుగ్గడించి సౌమిత్రి యుచితవర్తనంబుఁ గీర్తించి జానకి యుత్తమగుణంబులెత్తి
పొగడి యానందించుటయు. 1424

క. అంతకుమున్న సుమిత్రా, సంతత్యవరజనితుండు శత్రుఘ్నుఁడు ఫా
లాంతాంజలిపుటుఁడు సకృ,త్సంతోషయుతుండు రామచంద్రుపదములన్. 1425

క. తనవయనచకోరంబులు, దనివోవఁగ నూఁదియున్న తమ్ముని శత్రు
ఘ్నుని నప్పుడు గాఢాలిం,గన మొనరిచి శిరంబుఁ గడుమూర్కొనుచున్. 1426

క. దీపించుచుఁ దమ్ముని సం,భావించుచు నివ్విధమునఁ బరిరంభణసౌ
ఖ్యావహమున మేను మఱచి, భూవిభుఁ డసకృత్ప్రమోదమున మునుఁగుటయున్.

వ. లక్ష్మణానుజుండునుం బొంగియుండె నంత రాముండు ననుజసమేతుండై. 1428

క. మొగిచిన చేతులు ఫాల, మ్మొగిఁ జేరిచి నిభృతినారఘూత్తమమణి వే
ముగురమ్మలఁ బోలిన యా,ముగురమ్మల పాదపద్మములకున్ మ్రొక్కెన్. 1429

ఉ. మ్రొక్కిన రామలక్ష్మణుల మోముల మోములు చేర్చి చేర్చి యా
యక్కలు నక్కుమారకుల యక్కుల నక్కులు మోపి మోపి చ
న్మక్కుల దుగ్ధబిందువులు మోముల సమ్మదబాష్పపూరముల్
గ్రక్కుచుఁ బారవశ్యమును గాంచి మునింగిరి సమ్మదాంబుధిన్. 1430

క. బుడుతలు తమకు నమ్రములఁ, బుడుకుచు మ్రొక్కఁగ శిరములు మూర్కొని మేనుల్
పుడుకుచు మువ్వురమ్మలు నప్పుడు గాల్చిరి చింతలనెడు పుడుకల నెల్లన్. 1431

వ. వెండియు నపరిమితానంద భరితలగుచుఁ గుమారుల ముహుర్ముహుర్నమస్కారంబు
లకుం బునఃపునరాశీర్వచనంబు లొసంగుచుఁ దదీయవనవాసాదిక్లేశంబు లుగ్గడించి
కన్నీరు నించుచుం బ్రత్యేకకుశలప్రశ్నంబు సేయుచు. 1432

తే. కటకట కటిక క్రొగ్గంటి తుటుముతోడ, నొడల బ్రేలెడు నిడుద కెంజడలతోడ
మురువు దఱిగిన మెట్టుఁదామరలతోడ, వచ్చి కన్నులఁ బడినార వత్సలార. 1432

వ. అని యిట్టి ప్రేముడి పలుకులం బాలకులం బోదివికొనియుండి రట్టి యెడ సీత య
త్తలకు మ్రొక్కుటయును. 1433

ఉ. గ్రుచ్చి కవుంగిలించుకొని కోడలి దీవనలిచ్చి మచ్చిక
ల్వెచ్చఁ బెరుంగ నాపె గుణబృందము లెంతయు నచ్చి మెచ్చి వా
పుచ్చి పతివ్రతామణివొ భూసుత పుట్టిన యిల్లు వేడ్కమైఁ
జొచ్చిన యిల్లుఁ గీర్తులకుఁ జొన్పితి నిన్వినుతింప నేర్తుమే. 1434

క. దాసీనివహం బెల్లను, దాసీనివహంబు గాఁగఁ దలఁచి సుఖములం
బాసి మది విసువవైతి స్వాసిక నినుఁ బోలునట్టి పడఁతులు గలరే. 1436

క. కొంగెడు గతి నలవాణియు, మంగళదేవతయు సర్వమంగళయును గా
కంగనలు నీకుఁ బురుడే, మంగళదేవతవు సర్వమంగళవాణీ. 1437

సీ. కౌశికసంవ్యాప్త కౌశికపరిపూర్ణవనములు క్రీడోపవనములనుచుఁ
బటుపలాశపలాశ భయద కంటకలతా భవనము లేళీభవనము లనుచు
వ్యాళసంవేష్టిత వ్యాళమహాద్రిగుహలు విలాసాంతర్గృహంబు లనుచుఁ
గ్రవ్యాదపంచక క్రవ్యాద సంకలితాద్రులంచత్కృతకాద్రు లనుచుఁ
గఠినకాసరధూసరాగాధగర్త, రీకదంబంబు దీర్ఘికానేక మనుచుఁ
[illegible]చ్చి యొదఁదాల్చి నెఱకొల్పి ధవుని పిఱుఁద, విపినములఁ దిరిగి వచ్చితివి గదమ్మ.

క. నినుఁ గోడలవని మన్నిం,చిన శతమున మాకులము ప్రసిద్ధి వహించెన్
నినుఁ బుత్రిగాఁగ మహిఁ బడ,సిన జనకుని భాగ్యమహిమ చెప్పన్వశమే. 1439

వ. అని సీతం బొగడి కన్నులం గప్పికొని పురుషార్థ చతుష్టయంబుంబోని పుత్రచతుష్ట
యంబుం గని ప్రమదం బావహింపం దమమనంబుల. 1440

క. వసురాశిఁ గనిన చక్రము, లసకృత్స్వసురాశిఁ గనిన యాధనులుఁ గడుసం
తసమందు రీతిఁ బుత్రుల, వసునిభులం గాంచి యుత్సవము నొందునెడన్. 1441

వ. భరతుండును భృత్యామాత్య పురోహితాది సముచితపరివార బంధుసమేతంబుగా
యుక్తక్రమంబున భరద్వాజ సందర్శనంబు నడిపి పవనతనయాదుల సాహాసోపకార
ప్రకారంబు లగ్గడించె నపుడు. 1442

క. జాను మెఱయ రాఘవుఁ డాజానుభుజుఁడు రాముఁ డుల్లసను మీఱ మహీ
జానుజులతో భరద్వాజానుమతిం బడసి కపిచయం బగ్గి పన్. 1443

సీ. కువలయానందమై గురుశైత్యకరమయి నవసూత్న చంద్రమండల మనంగ
నమితచంద్రామోద మైసద్విభూతిమై పరమేశ్వరుని జటాభాగమనఁగ
నవిరళ నీలమై భువ ప్రశస్తమై యుచితప్రావృడ్జలముచమనంగ
గంధోత్తమయుమయి కలితావదాతమై మేరుకైలాసప్రకారమనఁగ
గారిసార ప్రవాళ విస్తార మగుచుఁ, బ్రకట హరిపూర్ణతరవనరాశి యనఁగ
నై దనరారు పుష్పకారూఢుఁడగుచు, రాముఁడు సమస్తజగదభిరాముఁడగుచు.
గీ హరికోటి రయమునఁ, జని నందిగ్రామము న్విశాల మశేషపా
నందిగ్రామము నెమరం, గని భూమివిభుండు పుష్పకముఁ దగ డిగియెన్. 1445

క. సుధామరులమణియభిన, వసుధామయవాజ్ఞితతుఁడు భరతుఁడు భక్తి
న్వసుధారాజ్యభరముతో, నొసఁగిన పాదుకలు దోడి మహోజ్జ్వలభంగిన్. 1446

వ. నందిగ్రామంబున కపూర్వవిలాసం బావహింప భరతావాసంబునకుం జని. 1447

సీ. కోటిబాంధవవృక్ష్యకోరంబులకు మందహాసచంద్రిక సుఖుల్లాస మొసఁగి
సన్మునీశ్వరసాధుసహకారబృందంబు విపులదయామృతవృష్టిఁ దనిపి
కలిముఖధ్వజినీకువలయమండముఁ గటాక్షాంశు యోగంబున నలరఁ జేసి
పౌరజానపదస్తోమసస్యము వాక్సుధాంబు పూరమున దైన్యంబు వాపి
సగరభరతాదిసోదర సమ్మదాంబు, రాశి నిజరాక మహిమగఁ జేసి రామ 1448
చంద్రభూజాని భూలోకచక్రముఁ బోని, కాంతినొప్పారె పరివారకలితుఁ డగుచు,
అఖండాఖండల వైభవాధికుఁడై సమస్త బంధుపరివారంబుఁ బరివేష్టింప సుఖోపవి
ష్టుండై యిష్టగోష్ఠి సంతుష్టాంతరంగుం డగు రాముండు నిజపాదుకామూల భరితమ
హీపాలకృతవిశాలమహీపాలనసౌష్ఠవం బభివర్ణించు పౌరజానపదలోకాలోకనంబు
నం గుతూహలుండై. 1349

క. బహుమాన పూర్వకముగా, గుహునిం బోఁబనిచి యారఘుప్రభుఁడు మహా
మహుఁడ ప్రుడు సోదరత్రయ, సహితుండై పటు జటావిసరము దీర్చెన్. 1450

చ. ఇటులు జటోత్కటంబు బపనయించి పృథుస్తనయిత్నుమండలో
ద్భట పటలంబుఁ ద్రోఁచిన సుధానిధిచందము నొంది సద్భటా
ర్భటు లలియంగ నంత రఘుభర్త మహార్తము నిశ్చయించె ని
స్ఫుట పటుశోభనంబులను జొన్పెడు దాని నయోధ్య చేరఁగన్. 1451

క. కడుకొని నినుఁ దలఁచిన యప్పుడు వస్తువుగాని కదలి పొమ్మని పూజ
ల్గను నొనరించి కుబేరుని, కడ కనిచె న్నృపుఁడు పుష్పకము సాదరుఁడై. 1452

వ. తదనంతరంబున.

శా. స్వామిద్భక్తితరు ల్సహోదరవరు ల్పార్శ్వంబులం గొల్వఁ బా
దూయుగ్మోచ్ఛ మహోత్తమాంగుఁడు మరుత్పుత్రుండు మున్నగ దై
తేయస్వామి విభీషణుండు గపిభర్తిం జేరి రా నప్డు యా
త్రాయత్తంబగు చిత్తవృత్తి రఘువంశ్యస్వామి యుత్సాహుఁడై

క. కుండల దీప్తిక్షాళిత, గండస్థలుఁ డగుచు రథముఁ గైకొని యొప్పెం
జండకిరణుండు పొడుపుం, గొండ పయిన్వెలుఁగు గతి రఘూద్భవుం డంతన్. 1354

శా. చక్రాన~~ంద ఘనా~~ప్రభానురుచిరోచ్చస్యందనారూఢిప
చ్చక్రాళి న్వెలయింపఁ జేయుచు మనోజ్ఞ ప్రక్రియాలోలుఁడై
శక్రాద్యష్ట దిగీశభావిత యశోజాలప్రతీతుండునై
శక్రాశ్మప్రభాసత్తనుండు వెడలె న్సాకేతవీక్షార్థియై. 1455

వ. తదవసరంబునం గౌసల్యయు సపత్నీద్వయసహితంబుగాఁ బుణ్యాంగనానికరంబుల
యుతంబగు జనకనందన కర్ణీరథంబు ననుసరించి సముచిత యానంబున వెడలె నంత.

మ. హితవృత్తిం జని రాఘవుండు గనియెన్ హేమప్రభాజాలని
ర్జిత పక్షద్వయచక్రవాక మిథునాక్షేపప్రచారంబుఁ జా
రుతరంగోద్గతవాతకంపితమహీరుట్శాఖికాడోలికా
స్థితకీరంబు లసన్మనోజ్ఞ సరయూతీరంబు దూరంబునన్. 1457

క. కని తత్సమీపమునకుఁ, జనుఁ నప్పుడు కుముద కమలసౌరభము వెసం
గొనిన మలయానిలమున, న్మనిఁగిన రామునకు లక్ష్మణుం డిట్లనియెన్. 1458

సీ. కలిత రక్తోత్పల కళికా విశేష నీరాజిత దీపకళికా ప్రతతులతోడ
సధిక వారికేళీ సమాయాత భద్రేభపటుకుంభ భద్రకుంభములతోడ

శైవాలసంగతచరమాంగ చక్రవాకమనోజ్ఞ బిసకలశములతోడ
హంసపక్షచ్ఛదాచ్ఛాదిత విశాలసైకతవేదికాచయముతోడ
గండకాచార లాజాప్రకరముతోడఁ, గమఠ సౌవర్ణచారుపీఠములతోడ
భావిపట్టాభిషేక సంభారములఁ బ్రోవఁ బచ్చనది వోలె నున్న దిన్నదిని గంటె.

క. అని లక్ష్మణుఁడు నతుఁడై వచనముల నగ్గింప భరతశత్రుఘ్నులు మె
ల్పునఁ గీర్తింపఁగ రాముఁడు, చని కాంచె నయోధ్య నహితజనతాసాధ్యన్.

వ. కాంచి యపార కపివార పరివార సహితుండై తూర్యనాదంబులు విప్రాశీర్వాద
లు మిన్నుముట్ట వరాగమనంబునం బొంగుకులాంగనయుం బోలె వివిధాలంకార
భితయై వసంతసమయోద్యానంబునుం బోలెఁ గుసుమ ప వి ర విస్ఫురద్విశాల
లంబై హిమకరోదయావసర ఘూర్ణమానమహార్ణవంబునుం బోలె ధవళ తురంగ
గంబై శారదాముఖంబునుం బోలె సంగీతవిద్యానిలయంబై వెలయు నయ్యయోధ్యా
రాజధానీప్రవేశంబు వృత్రజయంబునం బొదలు మహేంద్రుండు సురాచార్యా
తుండై త్రిదశాలయప్రవేశంబు గావించు చందంబున దశకంఠహంతయగు రా
డు వసిష్ఠాన్వితుండై యాచరించె నంత.

తే. గీ. ఉపవనంబులఁ దూఱి పయోజవనవి, హారమొనరించి ధారాగృహములయల సి
గంధగజగామినీకుచకలితగంధ, గంధవహావృత్తి నెదిరించె గంధవహుఁడు.

క. సుందరగతి రాముఁడు పౌరందరవిభవమునఁ దత్పురం బేగనువా
నందజుపౌరులు ముదమునఁ, బొంది రమ్యతమాను నవ్విబుధులవిధమునన్.

చ. ఇభఘటలున్ మహాశ్వముల కీవుల వాజుల నేగ మౌక్తిక
ప్రభలు వెలుంగ ఛత్రములు పట్టు సమస్తమునంగకాళిం
త్యభినవభూషణాంశులోలయం బటువేత్రకరుల్ స్తుతింప భూ
విభులు పదారవిందములు వేడ్క భజింపఁగ రాముఁ డాదృతిన్.
ఘంటాపథంబుఁ దరియుం జొచ్చిన న్యాసపదంబున.

క. లాజలు నక్షతలును దూర్వాజాలంబులును బూవులును మౌక్తికముల్
రాజపథసౌధపంక్తి, స్త్రీజనములు చల్లి పుణ్యసేసలు పతిపై.

క. శ్లాఘాతిశయుఁ బవనజను, మాఘాతసముద్రలంఘనాద్యభినుతితో
రాఘవవిరోధివిజయుని, మాఘోషము చెల్లెఁ బురమునం దెల్లెడలన్.

క. హనుమద్భల్లూకపసౌరినలాంగదకుముదకేసరి దధిముఖమహా
పనసగజగంధమాదన, వినతసుషేణగవయద్వివిదముఖ్యవానరుల్.

చ. బహువిధవాహనంబుల నపారవిభూషవిభూషితాంగులై
యహిపరిముక్తకంచుకనిభాంశుకము ల్ధరియించి గంధమా
ల్యహితశరీరులై ఫలరసాదులఁ దృప్తి వహించి యెంతయున్
రహివిహరించిరప్పురవరంబున రాముఁడు సంతసింపఁగన్. 1470

క. తాలిమి శ్రీహనుమత్సీ,తాలక్ష్మణభరతశత్రు వారకశత్రు
ఘ్నాలంబనుఁడై రఘుభూ,పాలుం డత్యాదరమున బట్టక మేగెన్. 147

వ. ఇట్లఖిలజనానందంబుగాఁ బురవిహారంబునం బ్రీతుండై. 1471

క. భూమీసురబాంధవభృ,త్యామాత్యకనాగరకుల నానతిఁ బరిరం
భామితకరుణాదృష్టి,ప్రేమాబహుమాన సుఖపరిప్రశ్నములన్. 1472

ఉ. సంతసమందఁ జేయుచు వసంతుఁడు పుష్పవనంబులోని క
ల్యంతముదంబునం జనిన యట్లు వినూత్నచిరత్నదీపికా
క్రాంతశిరోగృహాంతవిధుకాంతశిలాస్థగితోయవేదికా
భ్యంతరమందిరాంతర మహాద్యుతి తేజుఁడు సొచ్చె వేడుకన్. 1478

వ. అనంతరము భరతుం డభీష్టసుఖావాసంబు లగునివాసంబుల హనుమన్ముఖ్యుల విడియించె నంతసీతాకాంతయుం బుణ్యకాంతాకరాంతలతాంతతాళవృంతానిలాలోలచూర్ణకుంతలయై శుద్ధాంతంబు చొచ్చె నట్లుఖండవిభవంబున నగరుసొచ్చి రాముండుచితవినోదంబుల వీణాదిమనోహరసంగీతనాదంబుల బాంధవామోదవాదంబుల నారేయి సుఖవృత్తిఁ గడపుటయు. 1474

సీ. ఉదయభూభృచ్ఛిఖరోత్తుంగ ఫణిఫణా రమణీయకృదనంతరత్న మనఁగ
విధుమయూఖవృషాల విస్రగసనవిహా యసపరస్సంచార హంసయనఁగ
భువనప్రకాశకబుద్ధి వీక్షితవాయుపక్షిరద్దక్షిణచక్షువనఁగఁ
బంక్తికంఠవిదారి పట్టాభిషేచనార్థసుకల్పిత వసురాశి యనఁగ
రహియజుస్సామఋగ్జతురసమృద్ధి, మూఁడుమూర్తులు మెదిపిన ముద్ద యనఁగ
సదయుఁడయ్యనిమిషుఁడు ప్రాక్తలోదరీము,ఖస్థగితచిత్రరత్నశిఖగతి నగతి. 1476

తే. శ్రీరఘుస్వామి పట్టాభిషేకమునకు, సర్వతీర్థామృతంబులు సంగ్రహించి
ధర్మకలశంబు వేలుపు ల్పంపిరనఁగ, భానుఁ డుదయించె నభినవభానుఁ డపుడు.

సీ. వజ్రసంకల్పితద్వారబంధములకుఁ బొలుపారుకుందుముపూఁతలగుచుఁ
కమనీయబహుచిత్రకాయమానములకు నవకిసాలయతోరణంబు లగుచుఁ
బ్రాతస్సముద్ధిత భామాధరములకుఁ గర్పూరతాంబూలకాంతులగుచు
మేరుగోత్రాధరచారుకూటనిభసౌధతతికి గైరికధాతు లగుచు

నరుణసరసీరుహా సరోవిహారమనుక, రమ్యములకునొప్పు సుమపర్ణాగమ్యములగుచుఁ
బలురథములకు రత్నకంబళములగుచు, నరుణగతి మించెఁ దరుణారుణాతపములు.

చ. అహిమకరోరుభాస్వదుదయమ్మునను న్నను గాఁగ వేడుక
న్నహసహజన్ముఁ డన్న్యపతిచంద్రుఁడు రాముఁడు వందిమాగధ
ప్రహితనుతుల్సెలంగఁగఁ బ్రభాతమునం దగ మేలుకాంచెఁ బూ
ర్ణహిమకరాననాంశుకచి యందొ ఱకందొవలుల్లసింపఁగన్. 1478

వ. మేలుకని కృతకాల్యకరణీయుండును ధృతదివ్యాంబరవిభూషణుండును నతసామంత
మహీపాలకుండును వృతబంధుసహోదరామాత్యుండును భృతమహీదేవతానివహుం
డును నుతపౌరజానపదకవిప్రవరప్రకరుండును స్మితసుందరాధర ముఖాంభోజుండు
ను మితచతురమధుర వాక్యమాజుండును మహాతేజుండునగు రామరాజుం గనుంగొని
సమన్విత వామదేవాది మహామునిశ్రేష్ఠుండగు వసిష్ఠుం డెల్లవారల యుల్లంబులుఁ
బల్లవింప నల్లన నిట్లనియె. 1479

ఉ. చేరుద యప్పు మారుతము శిష్యులఁగూడి మునీంద్రులెల్లరుం
జేరి రయోధ్యజానపదసేనిత యప్పు వరాభిషేకసం
భారములెల్లఁ జొప్పడె సమస్త మహీవలయాధిరాజ్య మిం
పారఁగ రామమూర్తికి సమర్పణసేయుక జాల మేటికిన్. 1480

క. నుతపుణ్యనదీజలములఁ, జతురంభోధ్యుదకములును శైలచయులు స
మ్మతిఁ దెచ్చి రఖిల జనమాన్యతమై పట్టాభిషేకనిలయుం బనుచెన్. 1481

వ. అని పలికి కౌసల్యాగర్భసంభూతభూత ప్రభూతవర్తనం బుగ్గడించి. 1482

క. పదునాలుగునబ్దంబులఁ, బదునాల్గు యుగంబులయ్యె భరతుని కతఁడు
న్మదమంది ధరాభారము, గదలిచి రాఘవులఁ బెట్టఁగా నితిననుమన్. 1483

క. కావున రాఘవు నఖిల మహీవలయముఁ బేర్మి నీ యఱ సేలు విభునిగాఁ
గావింతము యభిషేకమహావిభవం బనుచు ముద్గగానందముగన్. 1484

వ. సమస్తజనానందకరం బగునమ్మహోవాగ్ర దశరథాంగలకలెంగించి తదనుమతంబు
వడసి దేవతాజయజయధ్వానంబులతోన భూదేవతాశీర్వాదంబులును దివ్యదుందుభి
రవంబులతోఁ దూర్యారవంబులును గల్పకప్రసూనాసారంబుతోన పుణ్యకాంతాక
రాక్షతాసారంబులును గంధర్వాప్సరోలాస్యంబులతోన వేశ్యాలాస్యంబులును నొ
క్కటనిం గికిన్ నెలకొం జాలియొప్ప నప్పు డరుంధతీవల్లభుండు సితప్రభాభాసురం
బును ముక్తాఫలవికీర్యమాణంబునునై క్షీరవార్ధిదియనుంబోని సభామండపాభ్యంత

రంబున నుత్తుంగంబై పూర్వశైలసదృశంబగు భద్రాసనంబున రోహిణీపతిపురుండగు
హిమకరుఁబట్టి జానకీసనాథు రామమహీనాథు సుఖాసీనుం జేసె నంత. 1485

క. నవరత్నమయాలంకరణవిశేషము పేర్మిరోహణమహీధ్రమునా
నవనివిభుఁ డొప్పుటయు నప్పుడు వసిష్ఠాదులుగడఁగి కడునెమ్మనమునన్ 1486

మ. ఉపమాతీత యశోధురంధరు గుణాఢ్యు న్సర్వ సర్వంసహా
ధిపతిత్వంబు వహింపు మీ వనుచుఁ బ్రీతిన్ధర్మపట్టంబు స్మృ
త్యుపదిష్టస్థితి మానవేశ్వరలలాటోపాంతమునం గూర్చి ర
చ్చపలఁగప్పం బెనుమబ్బు తీవ మెఱపు న్సంధించుచందంబునన్. 1487

చ. కలిత మనోజ్ఞపల్లవనికాసిత పుణ్యనదీజలోజ్జ్వల
త్కలశము లొప్ప నవ్యకనక జములన్ ధరియించి వారిచం
ద్రులిటులు త్వద్దకారసముఁ జిల్కుము మాపయినంచుఁ దెల్ప న
చ్చెలువున రామచంద్రు నభిషేక మొనర్చిరశేషభూతికిన్. 1488

వ. మహితాత్ముం డగువారెల్ల రాఘవుం బుణ్యతీర్థజలంబుల విధ్యుక్తక్రమంబున నభిషే
కించిరి. 1489

సీ. కుముదబాంధవు పోలెఁ గువలయానందుఁడై యమృతధారాపూరితాత్ముఁ డగుచుఁ
గనకాచలముఁ బోలె ఘనపావకకటుఁడై విబుధనదీజలవిములుఁ డగుచు
నష్టమూర్తిఁ బోలె నాద్యామనూలుఁడై సంగతగంగోత్తమాంగుఁ డగుచు
నీలాంబుదముఁ బోలె శాలివిలాసుఁడై విహితాంబుపూర సంసిహితుఁ డగుచు
గల్పకమునోలె మధురసకలితపాణి, పల్లవుండయి యభినవఫలముఁ డగుచు
సీతతోఁ గూడి పట్టాభిషేకశోభనము వహించెడువేళ రామమహివిభుఁడు. 1490

క. పాటించి రామమూర్తికి, హాటకకలశోదకంబు లభిషేకింపన్
మేటి జలధారలొప్పెం, గాటుకకొండపయి వజ్రకవచము మాడ్కిన్. 1491

వ. ఈరీతి నఖిలభూతధాత్రీవలయాభిషేక సామ్రాజ్యసంశోభితుండై గురుబ్రాహ్మణ
మాతృదేవతావందనంబు లాచరించి సమస్తజనంబుల నభిమతప్రదానంబులం దనిపి సం
తుష్టుండై. 1491

క. ఆవిభుఁడు దనరుఁ గాన్కలు [illegible] భూ
[illegible] 1493

